వాల్మీకి మహర్షి విరచితం

# రామాయణం

ఆరో సంపుటం - యుద్ధకాండ

వాడుక భాషలో
శ్రీ శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి
వచనానువాదం




పబ్లిషర్సు : అద్దేపల్లి అండ్ కో
సరస్వతీ పవర్ ప్రెస్
రాజమహేంద్రవరము

# సూచన

ఈ యుద్ధకాండతో రామాయణం అంతా పూర్తిగా చదివాం మనం.

ఇరవైనాలుగువేల శ్లోకాల గ్రంథం యిది.

ఆరుకాండల మహాకావ్యం యిది.

గాయత్రీమంత్రాత్మకం కావడంతో వేదమే అయిపోయిం దిది.

మహాతపశ్శాలి వాల్మీకి రచన యిది.

అవధు ల్లేని పాండిత్యం అతనిది.

లోకాలోకా లన్నీ గాలించగలిగిన భావన అతనిది.

కలకండను మించిన భాష అతనిది.

మహోన్నతా లయిన భావా లతనివి.

అమృతనిష్యందిని అయిన రచన అతనిది.

కావడంతో అటు పవిత్రతా సంపాదించుకోగలిగాం, ఇటు ఆనందమూ అనుభవించగలిగాం, మనం.

ఇక మననం చేసుకోవాలి మన మిది.

మనస్సుకి పట్టించుకోవాలి.

అప్పుడే మనం రామాయణం చదవడం సఫలం అవుతుంది.

రామాయణం అంతా—బాలకాండ మొదలు ఈయుద్ధకాండ చివరి దాకా — మళ్ళీమళ్ళీ — ఎన్నోమాట్లు చదివి తేనే సిద్ధించే సాఫల్యాం అది.

రామాయణానికి సంబంధించిన యీమననం, కథానాయకు డైన రాముణ్ణి పట్టేకాదు, ప్రతినాయకు డైన రావణుణ్ణి పట్టీన్నీ చేసుకోవాలి మనం.

అటు రాముడూ, యిటు రావణుడూ కూడా, శౌర్యధైర్యపరాక్రమాల్లో ఎవరి కెవరూ తీసిపోనివారే.

అయితే రాముణ్ణి అఖండ తేజస్సుతో పోలిస్తే, రావణుణ్ణి కటికిచీకటితో పోల్చుకోవాలి మనం.

ఆయిద్దరి చరిత్రలూ నిస్సీమాలే; కాని వారి ప్రవృత్తిని పట్టి వచ్చిం దీ తేడా.

రాముడికి సత్యం కావాలి.

రావణుడి కదక్కర్లేకపోడమే కాదు, అసత్యం కావాలి.

రాముడికి ధర్మం కావాలి.

రావణుడి కదక్క లేకపోడమే కాదు, అధర్మం కావాలి.

ఈపాత్రల నిజస్వరూపం యిది.

దక్షిణోత్తరధ్రువా లయిన యీ రెండుపాత్రలనూ పురస్కరించుకుని విశ్వశ్రేయస్సు సాధించడానికి పూనుకున్నాడు వాల్మీకి.

ద్వంద్వభూయిష్ఠ మైన యీలోకంలో, ఈ రెండూమాత్రమే — సత్యమూ ధర్మమున్నూ మాత్రమే జీవితసాఫల్యానికి ప్రధానా లని నిర్ధారణచేసి, పాఠకులను ఉన్నతోన్నతపథాలకు తీసుకు వెళ్ళడానికే వాల్మీకి యీరచన.

అతను, తన యీరచనమూలంగా మన కిచ్చిన సందేశం యిదే.

ఇందుకోసమే మహోజ్వల మైన రామకథ స్వీకరించా డతను.

ఆరామకథకు ఇటు జటిలతా అటు రసవత్తతా సంఘటించగలిగిన ప్రతిపాత్ర రావణుడు.

ఏమంటే?

ఎటు చూసినా, కొట్టవచ్చినట్టు కనపడే వ్యక్తిత్వం రావణుడిది.

చాలాచాలా గొప్పది అతని వంశం.

రాముడిది సూర్యునివంశం అయితే, రావణుడిది బ్రహ్మ వంశం.

ప్రతినాయకుణ్ణి ఎన్నుకోడంలో కూడా వాల్మీకి చూపించిన విశిష్టత యిది.

పోనీ, వంశం మాత్రమే గొప్పదా రావణుడిది?

వేత్త అతను.

మహాతపశ్శాలి.

ఈశ్వరభక్తుడు.

కర్మిష్ఠి.

జగజెట్టి.

గొప్పగొప్ప వరాలున్నూ సంపాదించినవా డతను.

అపార మైన బలగం అతనిది.

మూడులోకాలూ జయించినవాడు కూడా అతను.

మరి, అందరినీ ఎడబాసి — అంతా పోగొట్టుకుని దిక్కుమాలిన చావు చచ్చాడేం చివరి కతను?

ఈజిజ్ఞాస వున్నవాడయితేనే రామాయణపఠితకు ప్రశంస.

అయితే, అపారమైన రావణుడి చరిత్ర అంతా తిరగవెయ్య సక్కరలేదెవరూ.

ఏమంటే ?

పురుషుడి శీలానికి నికషం వొక్క స్త్రీమాత్రమే.

కనకనే వాల్మీకి రావణుడి స్త్రీలౌల్యమే విస్తరించాడు.

ఉన్నదల్లా యేమిటంటే ?

ధర్మంకోసం కట్టుకున్న పెళ్లాన్నే విడిచిపెట్టినవాడు రాముడు.

అధర్మం అని కసింతయినా జంకూ కొంకూ లేకుండా కట్టుకున్న త్రిలోకసుందరి ధర్మపత్ని చాలక, అనేకవేల-లక్షల—ఉత్తమస్త్రీలను చెరపట్టి తెచ్చుకున్నవాడు రావణుడు.

మరో విశేషం యేమిటంటే ?

అంతమంది భోగినులుండినా తృప్తి కాలేదు, రావణుడికి.

ఎప్పటికప్పుడే—ఎక్కడికక్కడే కొత్తస్త్రీలను చెరపడుతూనే వచ్చాడతను.

అమ్మవారిని హరించినప్పుడు మాత్రమే, వాల్మీకి చూపు—మహర్షి చూపు—కవిచూపు అతనిమీద పడింది.

తరవాతనైనా రావణుడి ప్రవృత్తి మారేది కాదు; కాని దాంతోనే అతని పాపం పండింది.

శూర్పణఖ దీనికి నిమిత్తమాత్రం.

రాముడి విషయమై ఆమె చేసిన ప్రయత్నం వేరు.

చివరి కామె తన భంగపాటుకి రావణుడితో చెప్పిన కారణం వేరు.

పురుషుడయినవాడు — వేత్త అయినవాడు — రాజున్నా అయిన వాడు ఆమాట వినిపించుకోగూడదు.

వినిపించుకున్నా, నమ్మగూడదు.

నమ్మినా, అది జ్ఞాపకంవుంచుకోగూడదు.

జ్ఞాపకంవుంచుకున్నా లోలుడు కాగూడదు.

అలాకాకుండా చేసే యోగ్యత లేకపోయింది రావణుడి దగ్గిర.

శూర్పణఖ అసత్యం చెప్పడానికి జంకలేదు, నిజమే.
రావణు డయినా అధర్మం ఆచరించడానికి వెనుదియ్యలేదు.
రావణుడు శుద్ధమూఢుడు, మరి.
అతనికి స్వయంగా తోచదు.
అతను పరమమూర్ఖుడున్నూ.
ఒకరు చెప్పినా విన డతను.
ఒక్క సత్యధర్మాలయెడల మాత్రమే అతని ప్రవృత్తి యిది.
ఆహారనిద్రాదులు ప్రాణికోటికి సామాన్యాలు.
వాటి ప్రసక్తి వచ్చినప్పుడు సామాన్యులు విచక్షణ చూపించలేరు.
ఎంత చదివినా సంస్కారం అంటలేదు రావణుడికి.
అంచేతనే తప్పుదారే తొక్కడం అతనికి పరిపాటి.

ఇష్టంలేని స్త్రీని బలాత్కరిస్తే తనకి కీడుమూడుతుం దని తెలుసు అతనికి.

అప్పటికప్పుడే, తనకి, తల పగిలిపోయి మరణం సంభవిస్తుం దనిన్నీ తెలుసు అతనికి.

కాని, నిబ్బరించుకోలేకపోయా డతను.
అతని బలపరాక్రమాలు తామసలిప్తాలు, మరి.

అంచేతనే, అమ్మవారు, తనని గడ్డిపరకగా చూసినా గుర్తించుకోలేకపోయా డతను.

దీంతో, తన అంతఃపురంలో వైమనస్యాలు పెంచుకున్నా డతను.
తన అనుచరుల్లో వైముఖ్యాలున్నూ పెంచుకున్నా డతను.
అతిలోకరమణీయ మైన తన అశోకవనం ధ్వంసం అయిపోయింది.
అమరావతిని మించిన తన లంకానగరం బుగ్గి అయిపోయింది.
ఒక కోతిగాడు చేశా డీపనులు.
అమ్మవారి నిమిత్తంగానే జరిగా యివి.
అయినా, తన "అహం" చంపుకోలేకపోయా డతను.
దీంతో, అతను తలపెట్టని కుట్ర లేదు.
అతను చెయ్యని పాడుపని లేదు.

అతను దిగిపోని కిందిమెట్టున్నూ లేదు.

అతివిస్తరం అక్కరలేదిక.

తన స్త్రీలౌల్యం చంపుకోలేక తమ్ములను చంపుకున్నాడతను.

తన కొడుకులనే చంపుకుని తన వంశమున్నూ నాశనం చేసుకున్నాడతను.

అంటే, — తన వంశవృక్షానికి తన మరణమే చివరి గొడ్డలిపెట్టు చేసుకున్నాడతను.

ఇదీ రామాయణకథాసారాంశం.

అప్రయత్నంగా — అనుకోకుండా — వాల్మీకిమహర్షి మనకు ప్రసాదించిన మహాకావ్యం యీరామాయణం.

తపస్సమాధిలో ప్రవేశించడానికి, స్నానంచెయ్యడంకోసం తమసా నదికి వెళ్లినవాడు వాల్మీకి.

హఠాత్తుగా అతని జీవితం ఒక కొత్తదారి తొక్కింది.

అంటే, మహర్షిత్వానికి పైమెట్టు కవిత్వం అందుకోగలిగాడతను.

కనకనే, రాముడి సౌజన్యం ఎంత కదిపిందో, రావణుడి దౌర్జన్యమున్నూ అంత స్పందింపజేసింది వాల్మీకి హృదయం.

దీనికే పూర్వరంగం, నిషాదుడు, క్రౌంచమిథునంలో మొగపక్షిని కూల్చిన సన్నివేశం.

అక్కడ ద్రవించింది వాల్మీకి హృదయం మొదట.

ఇక్కడ ప్రవహించిం దది, తరవాత.

ఆప్రవాహమే రామాయణరూపమైన రసఘుని అయింది, చివరికి.

ఆరసఘునే భారతీయతను సంస్కరించి మహోన్నతనాగరకత కాలవాలం చేసింది.

ఇవాళ, మనం బాగా గుర్తించుకోవలసిం దిది.

రాజమండ్రి
1—10—1957

ఇట్లు
శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

# విషయసూచిక

# రా మా య ణ

## యు ద్ధ కాం డ

### రాముడు హనుమంతుణ్ణి కౌగిలించుకోవడం

హనుమంతుడు చెప్పినదంతా విని రాముడు మిక్కిలి ప్రీతుడై "హనుమంతుడు చాలా గొప్పపని చేశాడు. ఇతరు లిది మనస్సులో అయినా చెయ్యలేరు. గరుత్మంతుణ్ణి విడిచి, వాయువును తప్పించి, హనుమంతుణ్ణి కూడా అలా వుంచితే సముద్రం దాటగలవాణ్ణి మరొకణ్ణి చూడం. దేవతలకూ, దానవులకూ, యక్షులకూ, గంధర్వులకూ, నాగులకూ చొరరాని రావణుని లంకలో ప్రవేశించి బతికి యెవ డివతలికి రాగలడూ? ఇవతలికి రావడందాకా అక్కర్లేదు, హనుమంతునితో సమానమైన బలపరాక్రమాలు లేనివాడు లంకలో ప్రవేశించనేలేడు. హనుమంతుడు తన ప్రభువైన సుగ్రీవునకు భృత్యుడు చెయ్యవలసిన పని సరిగా నిర్వహించడమే కాక, తన బలపరాక్రమాల కనుగుణంగా అక్కడ అశోకవన భంగాదికం కూడా చేసివచ్చాడు. ప్రభువు నెరవేర్చమని చెప్పిన కష్టకార్యం భక్తితో యెవడు సరిగా నెరవేరుస్తాడో అతను ఉత్తమపురుషుడు. సమర్థుడై వుండిన్నీ ప్రభువు ఎంత చెబితే అంతమాత్రమే చేసి దానికి సంబంధించిన మరేపనీ చెయ్యని భృత్యుడు మధ్యమపురుషుడు. తాను తగినవాడూ సమర్థుడూ కూడా అయ్యుండిన్నీ స్వామి చెప్పిన పని పూర్తి చెయ్యని భృత్యుడు అధమపురుషుడు. హనుమంతుడు ఉత్తముడు చెయ్యవలసినట్టు చేశాడు. రాక్షసులకు లొంగక అసాధ్యుడని కూడా అనిపించుకున్నాడు. సుగ్రీవుణ్ణి కూడా

సంతోషపెట్టాడు. ఇంతేకాదు: అతను సీతను చూసి రావడంవల్ల, నేనూ మారఘువంశమూ, లక్ష్మణుడూ కూడా బతికిపోయాం. అయితే, నాకింత గొప్ప ప్రియంచేసిన హనుమంతునకు తిరిగి నే నేమీ ప్రియం చెయ్యలేకపోయాను. అసలే దీనుణ్ణయిన నాకిది మాత్రం చాలా పరితాపం కలిగిస్తోంది. అయితే, నేనిప్పు డున్న స్థితిలో, నేను కౌగిలించుకోడమే హనుమంతునకు నాసర్వస్వమూ ఇచ్చినట్టు" అంటూ ప్రీతి హృష్టాంగుడై హనుమంతుణ్ణి కౌగిలించుకున్నాడు.

ఒక్క క్షణం వుండి రాముడు సుగ్రీవుడు వినేటట్టు "సీతను వెతకడంలో అంతా బాగానే జరిగింది; కాని, సముద్రం తలుచుకునేటప్పటికి నామనస్సు మళ్ళీ చెడిపోతోంది. అపార మైన సముద్రం దాటి వానరవీరులు దక్షిణతీరాని కెలా వెడతారూ? సీత సంగతి చెప్పారు సరే, సముద్రం దాటడంవిషయమై వానరవీరు లేమి చెబుతారూ?" అని హనుమంతుణ్ణి అడిగి, మళ్ళీ ఆలోచనలో పడ్డాడు.

## ౨

## సుగ్రీవుడు సేతువు మాటచెప్పటం

ఇలా అని రాముడు మళ్ళీ విచారించగా, సుగ్రీవు డందుకుని యిలా చెప్పాడు.

"వీరాధివీరా! ప్రాకృతునిలాగ నువ్వెందుకు పరితపిస్తావూ? కృతఘ్నుడు స్నేహం విడిచిపెట్టేసేటట్టు నువ్వు దుఃఖం విడిచిపెట్టు. సీత సంగతి తెలిసింది. శత్రునివాసం కూడా దొరికిపోయింది. కనక, నువ్వు శోకించవలసిన అగత్యమే లేదు. నువ్వు బుద్ధిమంతుడవు. సకలశాస్త్రాలూ చదివినవాడవు. ప్రాజ్ఞుడవు. పండితుడవు కూడాను. కృతాత్ము డైన యోగి మోక్షవిఘాతంకలిగించే బుద్ధి విడిచిపెట్టేటట్టు నిరుత్సాహంకలిగించేయీబుద్ధి నువ్వు మానుకో. తిమితిమింగలాలతోనూ సూసూ సూసూ.

మొసళ్ళతోనూ నిండివున్న సముద్రం దాటివెళ్ళి మనం శత్రువును నాశనం చేసివేతాము. నిరుత్సాహపడిపోయి శోకించేవాడికి సమస్తమూ భగ్నం అయిపోతుంది. చివరికి మతికూడాపోతుంది. ఈ వానరవీరులందరూ బహుసమర్థులు. మహాశూరులు. నీకోరికతీర్చడానికి వీరందరూ అగ్గిలో వురకమన్నా వురుకుతారు. వీరి ఉత్సాహాన్ని బట్టి నేనిదివృఢంగా చెప్పగలను. ఈవిషయమై నావూహా యెంతమాత్రమూ వ్యర్థంకాదు. అయితే, నేను రావణుణ్ణి చంపి సీతను తీసుకువచ్చేటట్టు నడిపించవలసిన భారంనీదీ. మనం సముద్రానికి సేతువు కట్టాలి. దానిమీదుగా వెళ్ళి లంకలో ప్రవేశించాలి. ఇదంతా నువ్వు చేయించాలి. మనం త్రికూట శిఖరాన వుండిన ఆలంకాపట్నం చూశామంటే రావణుడు కూలిపోయా డన్నమాటే సందేహంలేదు; కాని సముద్రానికి సేతువు కట్టకుండా మాత్రం దేవతలూ, మహేంద్రుడూ కూడా లంక పట్టుకోడం శక్యం కాదు. మనం సేతువు కట్టి వానరసైన్యం అంతా అక్కడికి తరలించామంటే జయం మన స్వాధీన మైనట్టే నిశ్చయించుకో. కనక, నువ్విక విచారించవద్దు. విచారం సకలశక్తులూ ఉడిగిస్తుంది. సకల కార్యాలూ నాశనంచేస్తుంది. పురుషు డెంతటి శౌర్యవంతు డయినా విచారం అలుముకుందంటే దిగతీసేస్తుంది. నువ్విపుడు ధైర్యసాహసాలవలంబించివుండాలి. ఏది యేమయిపోయినా ప్రాజ్ఞులైన నీవంటి శూరులు శోకించగూడదు. నువ్వు బుద్ధిమంతుల కందరికీ శిరోమణివి. సకలశాస్త్రాలూ తెలిసినవాడవు. నావంటివాళ్ళ సాయంతో నువ్విప్పుడు శత్రువులను నాశనంచెయ్యవలసివుంది. నువ్వు ధనుస్సెక్కుపెట్టావంటే నీయెదట నిలిచివుండగలవాడు ముల్లోకాల్లోనూ లేడు. వానరులమీద మోపిన నీకార్యం లేశమూ చెడదు. సముద్రం దాటి నువ్వు త్వరలోనే సీతను చూడగలవు. కనక, శోకం విడిచిపెట్టి కరుగ్గా వుండు. మందంగా వుంటే క్షత్రియులు చెడిపోతారు. కరుగ్గావుండేవారికి అందరూ జడు

స్తారు. అయితే, మమ్మల్నందరినీ వెంటపెట్టుకువెళ్ళి సముద్రం దాటే వుపాయం మాత్రం చూడు. సముద్రం దాటామా, జయించాం. ఈ వానరులందరూ మహాశూరులు. రాళ్ళూ రప్పలూ వర్షించి వీరు ఎంతెంత లేసి రాక్షసుల నయినా కూల్చెయ్యగలరు. వెయ్యేల? నువ్వు తప్పకుండా జయిస్తావు. ఇందుకు తగ్గశుభసూచనలు చాలా కనపడుతున్నాయి"

## 3

## హనుమంతుడు లంకలో వున్న రక్షణ సంపత్తి వివరించడం

పరమార్థవేత్త అయిన రాముడు హేతుబద్ధంగావున్న సుగ్రీవునిమాట విని, హనుమంతుణ్ణి చూసి "వానరవీరా! నేను తపస్సుచేసో, సేతువు నిర్మించో, నీరంతా యింకించివేసో, యెలాగో వొకలాగ యీసముద్రం దాటే యేర్పాటుచెయ్యగలను, సందేహం లేదు; అయితే, లంకలో కోటలెన్ని వున్నాయో అది చెప్పు. రావణుని సైన్యం యేపాటి? లంక కెన్నిద్వారా లున్నాయి? అక్కడగల యేర్పాటు లెలాంటివి? రాక్షసుల భవనా లెలాంటివి? అక్కడ రక్షణసాధనా లేమి వున్నాయి? నువ్వంతా చూసివచ్చావు. కనక, నాకు కళ్ళకు కట్టేటట్టు వివరంగా చెప్పు" అని అడిగాడు.

దీనిమీద హనుమంతుడు ఇలా ప్రారంభించాడు.

"రామా! లంకాపట్నం చాలా గొప్పది. అందున్న వారందరూ చాలా ఉల్లాసంగా వున్నారు. లంకలో రథాలూ, గుర్రాలూ, యేనుగులూ అసంఖ్యాకంగా వున్నాయి. పట్నం అంతా రాక్షసులతో నిండి పోయివుంది. దానికి నాలుగు ద్వారా లున్నాయి. అన్నీ చాలా దృఢంగా వున్నాయి. వాటి కవాటాలు దుర్భేద్యాలు. వాటి గడియలు చాలా గొప్పవీ దిట్టమైనవీనీ. ద్వారాలు కూడా చాలా విశాల మైనవి. ఆద్వారాలలో రాళ్ళు విసిరేయంత్రాలూ, బాణాలూ

చిమ్మే యంత్రాలూ చాలా వున్నాయి. అవి చాలా గొప్పవీ, చాలా గట్టివి. శత్రుసైన్యం సమీపించిందంటే క్షణంలో నాశనం అయిపోతుంది. ఆద్వారాలలో గొప్ప గొప్ప యినపగుదియలు ధరించి మహావీరులైన రాక్షసవీరులు కాపున్నారు.. ఆగుదియలతో ఒక్కొక్కమాటు వందలకొద్దీ శత్రువులను సంహరించవచ్చు. లంకకు చుట్టూ వున్న ప్రాకారం బంగారంతో నిర్మించారు. దానికి నవరత్నాలూ పొదిగారు. ఎలాంటివాళ్ళు కూడా అదిదాటలేరు. ఆప్రాకారం చుట్టూ గొప్ప అగడ్త వుంది. దానినిండా నీరుంది. ఆనీరు ముట్టుకుంటే చేతులు కొంకర్లుపోయేటంత చల్లగా వుంటుంది. అది చాలా లోతుగా వుంది. దాన్లో చేపలేకాదు, గొప్పగొప్ప మొసళ్ళు లెక్కలేనన్ని వున్నాయి. నాలుగుద్వారాల దగ్గిరా ఆఅగడ్త దాటడానికి దృఢమైన వంతెనలున్నాయి. అగత్యం అయినప్పుడవి వాల్చడానికీ, చిక్కులు వస్తాయంటే యెత్తివెయ్యడానికీ తగిన గొప్ప గొప్ప యంత్రా లున్నాయి. అక్కడ కాపుండే రక్షకభటులకు ఇళ్ళు కూడా అక్కడ చాలా వున్నాయి. ఆయిళ్ళల్లో రకరకాల యంత్రాలు ఎన్నో వున్నాయి.

ఆ లంకాపట్నం త్రికూటపర్వతశిఖరాన వుంది. ఆ పర్వతం నున్నగా చెక్కేశారు. అంచేత దేవతలుకూడా లంకలోకి వెళ్ళలేరు. దీనికిసాయం, అది వొక్క గిరిదుర్గమే కాదు, జలదుర్గమూ వనదుర్గమూ కూడాను. అది దక్షిణసముద్రానికి అవతలివైపున వుంది. అక్కడికి నావలు వెళ్ళవు. ఇక్కడివార్త అక్కడికి తెలియడాని క్కూడా సాధనాలు లేవు. అది పర్వతశిఖరానవున్నా గుర్రాలతోనూ, ఏనుగులతోనూ, రథాలతోనూ నిండి స్వర్గపట్నం మించివుంది. దురాత్ముడైన రావణుని లంకకు యంత్రాలూ, అగడ్తా, అలంకారాలుగా వున్నాయి.

దాని పూర్వద్వారంలో పదివేల రాక్షసు లున్నారు. వాళ్లందరూ యుద్ధరంగంలో ముమ్మొన వుండి యుద్ధంచెయ్యగలవాళ్లు. వాళ్లందరూ

శూలాలూ ఖడ్గాలూ ప్రయోగించడంలో చాలానిపుణులు. వాళ్లని చెనకడం చాలాకష్టం. దక్షిణద్వారంలో లక్షమంది రాక్షసు లున్నారు. అక్కడ చతురంగసైన్యంవుంది. వాళ్ళుకూడా చాలా అసాధ్యులు. పశ్చిమద్వారంలో పదివేలమంది రాక్షసు లున్నారు. వాళ్లందరూ చర్మఖడ్గధారులై వుంటారు. వాళ్లందరూ అస్త్రశస్త్రాలన్నీ బాగా తెలిసినవాళ్ళు. ఉత్తరద్వారంలో నూరుకోట్ల రాక్షసు లున్నారు, వాళ్లందరూ గొప్ప కుటుంబాలకు చెందినవాళ్ళు. మహారథికులూ. గొప్పఆశ్వికులూను. పట్నం అంతటా లక్షలూ కోట్లూ రాక్షస యోధులు వ్యాపించివున్నారు. వారందరూ అసాధ్యులు.

అయితే, నేనావంతెనలన్నీ నాశనంచేశాను. అగడ్త పూడ్చేశాను. ప్రాకారం పడగొట్టాను.—పట్నం అంతా దగ్ధంచేసేశాను. రాక్షస యోధులను కూడా చాలామందిని నాశనంచేశాను. రామా, ఏదో వొక విధంగా మనం సముద్రం దాటామంటే మాత్రం లంక నేల మట్టం అయిపోయిం దన్నమాటే, సంశయంలేదు. అంగదుడూ, ద్వివిదుడూ మైందుడూ, జాంబవంతుడూ, పనసుడూ, నలుడూ, సేనాధిపతి అయిన నీలుడూ వుంటే చాలు తక్కిన వానరసైన్యం మన కగత్యంలేదు. వీళ్ళు ఆకాశమార్గాన యెగిరివెళ్లి ఆ అగడ్తతోనూ, ఆ ప్రాకారంతోనూ, ఆ తోరణాలతోనూ, ఆ భవనాలతోనూ ఆ పర్వతశిఖరంతోనూ ఉన్నదున్నట్టు లంకాపట్నం తెచ్చి నీకాళ్ళదగ్గిర వుంచగలరు. కనక, వాటిని వెంటనే ఆజ్ఞాపించు. క్షణంలో జైత్రయాత్ర బయలుదేరు"

## ౪

## వానరసైన్యంతో రాముడు లంకమీదికి బయలుదేరడం

హనుమంతుడు చెప్పిన దంతా విని రాముడు ఇలా అన్నాడు.

"హనుమా! నువ్వు చెప్పిన లంకాపట్నం అంతా నేను నిమిషంలో

నాశనంచేసేస్తాను, ఇది నిజం. సుగ్రీవా! మన మిప్పుడే బయలుదేరాలి. సూర్యు డిప్పుడు ఆకాశమధ్యగతుడై వున్నాడు. ఇది అభిజిన్ముహూర్తం. ఇది చాలా మంచిసమయం. నేను ఇప్పుడు బయలుదేరానంటే సీతనెత్తుకుపోయిన రావణు డెక్కడికి వెళ్లగలడూ? విషం తాగినవాడు చనిపోతూ చనిపోతూ అమృతం తాగి మళ్ళీ బతికేటట్టు, నేను బయలు దేరిన సంగతి వింటే ఆశపడి సీత మళ్ళీ బతుకుతుంది. సుగ్రీవా! ఇవాళ ఉత్తరఫల్గుని నక్షత్రం. రేపు హస్త వస్తుంది. అది నాకు మంచిది కాదు. కనక, సకలసైన్యమూ తరలించుకుని మన మివాళే బయలుదేరి వెడదాం. ఇవాళ అన్నీ శుభనిమిత్తాలే తోస్తున్నాయి. కనక, మనం రావణుణ్ణి సంహరించి సీతను తీసుకురావడాని కేమీ సందేహం లేదు. నా కన్ను పైభాగం అదురుతోంది. ఇది మన కోరిక త్వరలోనే నెరవేరుతుం దనడానికి బలమైన సూచన.

మహాపరాక్రమవంతులైన లక్షమంది వానరవీరులను వెంటబెట్టుకుని మార్గం సరిచేసుకుంటూ నీలుడు ముందు బయలుదేరాలి. నీలుడా! నువ్వు జాగ్రత్తగా విను. మనం వెళ్ళేమార్గం ఫలాలూ, దుంపలూ దొరికేదిగా వుండాలి. చల్లని నీళ్ళూ, దట్టమైన అడవులూ వుండాలి. మధువుకూడా కావలసినంతా దొరికేట ట్టుండాలి. దుర్మార్గులైన రాక్షసులు దారిలో దుంపలూ, పళ్లూ నాశనంచేస్తారు. జలంలో విషం కలుపుతారు. నువ్విది జాగ్రత్తగా గమనిస్తూ వెళ్ళాలి. పల్లపుప్రదేశాలలోనూ, అడవులలోనూ, నీటిదగ్గిరా శత్రువులు నక్కివుంటారు. కనక, వానరులు మధ్యమధ్య ఆకాశాని కెగిరి శత్రువుల జాడలు బాగా కని పెడుతూ వుండాలి. సామాన్యవీరుల నందరినీ యిక్కడే వుంచెయ్యి. మనం వెళ్ళే పని చాలా పెద్దది? కనక, మనతో మహాపరాక్రమవంతులే వుండాలి. ముమ్ముందు వెళ్ళేవీరులు ఉన్నవాళ్ళలో మెరికలయి వుండాలి. వాళ్ళుకూడా వందలుగానూ వేలుగానూ మహాప్రవాహం

లాగ వెడుతూవుండాలి; గాని పల్చపల్చగా వుండగూడదుసుమా పర్వతంవంటి గజుడూ, మహాబలశాలి అయిన గవయుడూ, గవాక్షుడూ ఆలమందకు ముందు ఆబోతులు నడిచేటట్టు సేనకంతకీ ముందుండాలి. ఋషభుడు పైకెగరడంలో చాలా పేరుపడ్డాడు. అతను వానరసేన కుడివైపు కాపాడుకుంటూ వెళ్ళాలి. మదగజం లాగ దుర్ధర్షుడూ, మహా శూరుడూ అయిన గంధమాదనుడు ఎడమవైపు కాపాడుకుంటూ వెళ్ళాలి. దేవేంద్రుడైరావతం ఆరోహించేటట్టు నేను హనుమంతుని భుజాలమీద కూచుని సేన నంతనూ ప్రోత్సాహపరుస్తూ మధ్యగా వుంటాను. యక్షాధీశ్వరుడైన కుబేరుడు సార్వభౌమం అనే మత్తేభం ఆరోహించేటట్టు కాలాంతకునితో సమానుడైన లక్ష్మణుడు అంగదుని భుజాలమీద కూచుని వస్తాడు. భల్లూకరాజూ, మహాబలశాలీ జాంబవంతుని తమ్ముడూ, జాంబవంతుడూ, వేగదర్శి అయిన సుషేణుడూ— ఈ ముగ్గురూ కుక్షిభాగం రక్షించుకుంటూ వెళ్ళాలి".

రాముడిలా చెప్పగా, మహాసత్వుడైన సుగ్రీవుడు వానరవీరులకు సెలవిచ్చాడు. అప్పుడు వానరులు యుద్ధోత్సాహంతో చెట్లెక్కి గుట్టలెక్కి ఎగిసిపడ్డారు. వెంటనే అందరూ బయలుదేరారు. వారివెంట వందలువందలుగానూ, వేలువేలుగానూ లక్షలూకోట్లూ వానరయోధులు కదిలివెళ్ళారు. ఆ వానరు లందరూ మహాపరాక్రమవంతులు. ఎగురుతూ, దుముకుతూ, పాటలు పాడుకుంటూ, సింహనాదాలుచేస్తూ ఉరుకుతూ పరుగెత్తుతూ వారు మహోత్సాహంతో బయలుదేరారు. వారు దొరికిన పళ్ళన్నీ తిన్నారు. కనపడ్డ పూలగుత్తు లన్నీ తుంచుకున్నారు. కనపడ్డ మహావృక్షాలన్నీ యెక్కారు. కొందరు కొందరి నెత్తుకున్నారు. కొందరు కొందరి నెత్తికుదేశారు. కొందరు కొందరిని మళ్ళీ పడతోశారు. కొందరు విసుక్కున్నారు. రాముని సమీపంగా వున్నవాళ్ళు "మనం రావణుణ్ణి కూలగొట్టాలి. రాక్షసుల నందరినీ

నలిపెయ్యాలి" అంటూ ఉరుముతూ నడిచారు. అందరికీ ముందుగా ఋషభుడూ, నీలుడూ, కుముదుడూ దారి చూసుకుంటూ బయలు దేరారు. అందరికీ మధ్యగా రామలక్ష్మణులూ సుగ్రీవుడూ వున్నారు. వారిచుట్టూ సింహబలులైన వానరులు పరివేష్టించివున్నారు. శతబలి అనే వానరవీరుడు పదివేల వానరసేనకు అధినాథుడై నడిచాడు. కేసరీ, పనసుడూ, గజుడూ, అర్కుడూ, నూరేసికోట్ల వానరవీరుల కధినాథులై ఒక పక్క కాపాడుకుంటూ నడిచారు. సుషేణు , జాం బవంతుడూ గొప్పసైన్యంతో సుగ్రీవుని వెనక నడిచారు. నీలుడు అంద రికీ అధినాథుడై బయలుదేరాడు. మహాపరాక్రమవంతులైన. దరీ ముఖుడూ, ప్రజంఘుడూ, రంభుడూ, రభసుడూ సేన చుట్టూ తిరు గుతూ అందరినీ ప్రోత్సహిస్తూ బయలుదేరారు.

ఇలాగ బయలుదేరివెళ్ళి వెళ్ళి వారు సహ్యాపర్వతందగ్గిరికి వెళ్లారు. ఆ పర్వతంమీద సకలవృక్షజాతులూ వున్నాయి. రకరకాల పూలతీగ లున్నూ వున్నాయి. తామర పువ్వులతో నిండిన సరోవరాలూ, చెరు వులూ కూడా వున్నాయి. ఆసేన మహాసముద్రంలా వుంది. అది చేసే వివిధధ్వానాలు సముద్రఘోషలా వున్నాయి. చూడడానికే అది చాలా భయంకరంగా వుంది; కాని భీమకోపుడైన రాముని ఆజ్ఞ ననుసరించి నగరాలమీదా గ్రామాలమీదా పడకుండా ముందుకి సాగిపోయింది. రాముని పక్కల నడుస్తున్న వానరయోధులు ఉత్తమ జాతి గుర్రాలలాగ ఎగురుతూ దుముకుతూ సాగారు. హనుమంతుని బుజాలెక్కి వున్న రాముడూ, అంగదుని బుజా లెక్కివున్న లక్ష్మ ణుడూ రాహుకేతువులతో కూడిన చంద్రసూర్యుల్లా ప్రకాశించారు. రాముడు ఇలాగ లక్ష్మణునితోనూ సుగ్రీవునితోనూ దక్షిణ దిక్కుకి బయలుదేరి వెళ్లాడు.

సేన ఇలాగ కద లిపోతూనే వుండగా, బుద్ధిమంతుడూ, ప్రతిభావంతుడూ అయిన లక్ష్మణుడు రాముణ్ణి పలకరించి "రావణుణ్ణి సంహరించి, సీతను వెంటబెట్టుకుని, నువ్వు త్వరలోనే సకలసంపత్తులతోనూ నిండివుండిన అయోధ్యచేరతావు. అన్నా! భూమిమీదా, ఆకాశానా నీకు దిగ్విజయం కలుగుతుందన్నందుకు సూచనగా శుభనిమిత్తాలెన్నో కనపడుతున్నాయి. సేన కంతకీ సుఖం కలిగేటట్టు పిల్లవాయువు చల్లగా వీస్తోంది. మృగాలూ, పక్షులూ కమ్మగా ధ్వనిచేస్తున్నాయి. దిక్కులన్నీ తేటగా వున్నాయి—సూర్యుడు నిర్మలంగా తేజరిల్లుతున్నాడు. భృగుపుత్రు డైన శుక్రుడు ప్రసన్నార్చి అయినన్నీ వెనక వున్నాడు. పరిశుద్ధులయిన సప్తమహర్షులూ ధగధగ మెరుస్తూ ధ్రువునకు ప్రదక్షిణంగా తిరుగుతున్నారు. మన పూర్వీకుడైన రాజర్షి త్రిశంకుడు మన పురోహితు డైన వసిష్ఠమహర్షితో ప్రకాశిస్తున్నాడు. మన యిక్ష్వాకు వంశ నక్షత్ర మైన విశాఖ చాలా చక్కగా మెరుస్తోంది. రాక్షసుల నక్షత్ర మైన మూల ధూమకేతువుతో పీడింపబడుతోంది. ఇదంతా రాక్షసవినాశానికే వచ్చింది. కాలంమూడిన వారి నక్షత్రా లిలాగే దుష్టగ్రహపీడితా లవుతాయి. దారిలో ఎక్కడ చూసినా నీరు మిక్కిలీ నిర్మలంగానూ తియ్యగానూ వుంది. అడవు లన్నీ విరగకాసి చక్కగా పండివున్నాయి. వృక్షాలన్నీ ముమ్మరంగా పూసి ఘుమఘుమలాడుతున్నాయి. వ్యూహాలుగా తీరి వున్న యీ వానరసైన్యం తారకాసుర యుద్ధంలో దేవసైన్యంలా వుంది. కనక, ఇవన్నీ గుర్తించి నువ్వు ఉత్సాహంగా వుండు." అంటూ ఊరడించాడు.

ఇలాగ గోళ్ళూ దంతాలూ మాత్రమే ఆయుధాలుగా వున్న వానరభల్లూకసేన భూమి అంతా ఆవరించి ముందుకి సాగిపోయింది. వానరులు చేతులూ కాళ్లూ తగిలి లేచిన ధూళి ఆకాశం మబ్బులు కమ్మేసినట్టు ఆవరించేసింది. నదులు తారసిల్లినప్పుడు వానరవీరు

లందరూ దిగిపోసాగారు. అంచేత ఆనదుల ప్రవాహాలు ఆనకట్టలు కట్టి నట్టు ఆగిపోతూవచ్చాయి; కాని సేన దాటడం పూర్తికాగానే ప్రవాహం విపరీతమైన వేగంతో చాలా ఆమడల దాకా శరవేగంతో ప్రవహించసాగింది. ఆవానరసేన సరస్సులు తటస్థించినప్పుడు వాటిలో దిగి నడిచిపోయింది. చెట్లతో నిండివుండిన పర్వతాలు ఎక్కి వెళ్ళింది. సమప్రదేశాలలో అంతా వ్యాపించి వెళ్ళింది. పళ్ళతో నిండిన అడవులు వచ్చినప్పుడు పళ్ళు కోసుకుంటూ చెట్లకిందుగా నడిచింది.

వాయువేగులైన వానరవీరులు విక్రమోజ్జ్వలులై రామకార్యం సాధించడానికి మిక్కిలీ ఉల్లాసంగా వెళ్లారు. వారు ఒకరికొకరు తమ దర్పమూ, తమ బలపరాక్రమాలూ చూపించుకుంటూ యౌవనోచితాలైన క్రీడలు చేసుకుంటూ వెళ్ళారు. వారిలో కొంద రతివడిగా పరుగులెత్తారు. కొందరు ఎగురుతూ దుముకుతూ వెళ్ళారు. కొందరు కిచకిచలాడుతూ వెళ్ళారు. కొందరు తోకలు జాడించారు. కొందరు కాళ్ళెత్తి వేసుకుంటూ వెళ్ళారు. కొందరు దండలు చరిచి వృక్షాలు పీకేశారు. కొండలు పిండిచేశారు. కొందరు పర్వతశిఖరాలెక్కి సింహనాదాలు చేశారు. కొందరు తీగెలు తెంపి పోగులు పెట్టుకుంటూ వెళ్ళారు.

ఇలాగ రామకార్యార్థం బయలుదేరిన ఆవానరసేన భూమి అంతా నిండిపోయి రాత్రీ పగలూ అనకుండా నడిచిపోయింది. సీతాదేవిని ఎప్పుడు చెరవిడిపిస్తామా అన్న ధ్యాసతో క్షణకాలం అయినా వారెక్కడా నిలవకుండా వెళ్ళారు. వెళ్ళగా వెళ్ళగా వారికి సహ్యపర్వతమూ మలయపర్వతమూ తగిలాయి. అక్కడి అడవులూ, నదులూ, సరోవరాలూ చూస్తూ రాముడు చాలా ఉల్లాసంగా వెళ్ళాడు. చంపక వృక్షాలూ, మామిడి చెట్లూ, అశోకవృక్షాలూ, కరవీరవృక్షాలూ ఊడుగుచెట్లూ, గానుగుచెట్లూ, జువ్విచెట్లూ, మర్రిచెట్లూ, నేరేడు చెట్లూ, ఉసిరిచెట్లూ, కూల్చుకుంటూ వానరులు వెళ్ళారు. అక్కడ

పూలచెట్లు గాలికి కదిలి ఆవానరసేనమీాద పూలవాన కురిశాయి. మకరందంమత్తుతో తుమ్మెదలు మధురఝుంకారాలు చేస్తుండగా మలయ మారుతము చల్లగా వీచింది. ఆపర్వతంమీాద అనేకధాతువు లున్నాయి. ఆధాతువులపరాగం గాలి కెగిరి వానరవీరులను ముంచేసింది.

విరగపూసివున్న మొగిలిడొంకలూ, వావిలిచెట్లూ, గురివెంద తీగెలూ, మల్లెపొదలూ, గానుగుచెట్లూ, ఇప్పచెట్లూ, పొగడచెట్లూ, మామిడిచెట్లూ, పాటల వృక్షాలూ, కోవిదార వృక్షాలూ, మద్ది చెట్లూ, చంద్రచెట్లూ, కొడిశచెట్లూ బూరుగుచెట్లూ, హింతాళాలూ, ఊడుగుచెట్లూ, ఆవానరుల ఔద్ధత్యం భరించలేక గజగజలాడి పోయాయి. అక్కడ యెన్నో సరోవరాలూ చెరువులూ వున్నాయి. వాటినిండా కలవపువ్వులూ, తామరపువ్వులూ, దట్టంగా వున్నాయి. వాటిలో చక్రవాకాలూకారండవాలూ క్రౌంచాలూ హంసలూ, మొదలైన రకరకాల పక్షులు విహరిస్తున్నాయి. అడవిపందులూ, లేళ్ళూ, ఏనుగులూ, పులులూ, సింహాలూ నీరు తాగుతున్నాయి. నల్లతాచులు అటూ యిటూ తిరుగుతున్నాయి. అక్కడి చెట్లమీాద రకరకాల పిట్టలు మనోహరంగా కూస్తున్నాయి. వానరవీరులా సరోవరాలలోనూ చెరువులలోనూ దిగి స్నానంచేశారు. ఈతాలాడారు. కమ్మనినీళ్ళు తాగారు. ఒకరిమీాద ఒకరు నీళ్ళు చల్లుకుంటూ ఆడారు. పర్వతాలెక్కి వారు దుంపలూ పళ్ళూ తిన్నారు. తేనెపట్లు తీసి తాగారు.

వెళ్ళివెళ్ళి రాముడు మహేంద్రపర్వతశిఖరం యెక్కాడు. అక్కడికి తిమితిమింగిలాలతోనూ మొసళ్ళతోనూ, ఇంకా అనేకజలజంతువులతోనూ నిండివున్న సముద్రం కనపడింది. వెంటనే అతను పర్వతం దిగి సుగ్రీవునితోనూ, లక్ష్మణునితోనూ సముద్రం దగ్గిరికి వెళ్ళాడు. వెళ్ళి "సుగ్రీవా! ఇదిగో మనం సముద్రం చేరుకున్నాము. ఎంతమేర చూసినా సముద్రమేకాని అవతలిగట్టు కనపడ్డంలేదు. ఈసముద్రం

దాటడం యెలాగ? ఈ వానరసైన్యం అంతా లంకచేరడ మెలాగ? వానరరాజా! మనసేన అంతా ఇక్కడ విడిసేటట్టు ఆజ్ఞాపించు. ఒక సైనికుడైనా యిక్కణ్ణుంచి కదిలివెళ్ళకూడదు. మన గుట్టు తెలుసుకో డానికి రాక్షసులు సంచరిస్తూ వుంటారు, వాళ్ళని పట్టుకోవాలి" అని చెప్పాడు.

రాము డిలా చెప్పగా, సుగ్రీవుడూ, లక్ష్మణుడూ సైన్యం అంతా రకరకాల చెట్లతో నిండివున్న ఆసముద్రతీరాన విడిసేటట్టు చేశారు. తేనెరంగుతో ఆవానరసేన అక్కడ రెండో సముద్రంలా వుంది. ఆసైనికు లందరూ "అవతలిగట్టుకి వెళ్ళాలి" అనుకుంటూ విశ్రమిం చారు; కాని వారి రణగొణధ్వని ఆసముద్ర ఘోషమింంచిపోయింది. సుగ్రీవపాలిత మైన ఆసేన వానరు లందరూ వొకచోటగానూ, గోలాం గూలవీరు లందరూ వొకచోటగానూ, భల్లూకవీరు లందరూ వొక చోటగానూ — మూడుభాగాలుగా విడిసింది. ఆసముద్రం అవతలిగట్టు కనపడ్డంలేదు. అది రాక్షసులకు బలీయమైన కోటగా వుంది. భయం కరా లైన మొసళ్ళతోనూ, తిమితిమింగలాలతోనూ నిండివుంది. అప్ప టికి సాయంసంధ్యాసమయం కావడంవల్ల కెరటాలతో నృత్యంచేస్తు న్నట్టూ, నురగలతో నవ్వుతున్నట్టూ వుంది. చంద్రోదయం కావడం వల్ల అది మరీవిరిగిపడుతోంది. దానిలో ప్రతీతరంగభంగంలోనూ చంద్రబింబం ప్రతిబింబిస్తూ చాలా సొగసుగా వుంది. ఆసముద్రం నిండా జలజంతువులే కాక అనేకపర్వతాలు కూడా వున్నాయి. ఒక్కొక్క కెరటం విరిగిపడుతూవుంటే దానితో పాటు రకరకాల జలజంతువులు కూడా యెగిసిపడుతున్నాయి. వెన్నెల ప్రసరించడంవల్ల పైకెగిసిపడు తున్న జలబిందువు లన్నీ అగ్నికణాల్లాగ మెరుస్తున్నాయి. అటు ఆకాశాన మిలమిల్లాడుతూ నక్షత్రాలు మెరుస్తున్నాయి. ఇటు సము ద్రంలోనూ నాగా లున్నాయి. అటు ఆకాశానా నాగా లున్నాయి.

సముద్రంలోనూ ఆకాశానా గూడా రాక్షసులున్నారు. సముద్రమూ ఆకాశమూ కూడా గంభీరంగానే వున్నాయి. అంచేత సముద్రం ఆకాశంలాగా, ఆకాశం సముద్రంలాగా వున్నాయి. సముద్రంలో జలం వుంది. ఆకాశానా వుంది. సముద్రంలో రత్నాలున్నాయి. ఆకాశాన రత్నా లున్నాయి. ఆకాశాన మేఘమాలిక లుండగా, సముద్రంలో తరంగ మాలిక లున్నాయి.

సముద్రంలో కెరటాలు ఒకదానిమీద ఒకటి పడడంవల్ల యుద్ధ రంగంలో భేరీలు మోగుతున్నట్టుంది. ఇదంతా చూసి వానరవీరులు ఆశ్చర్యచకితులయిపోయారు.

## ౫

## రాముడు సీతను తలుచుకుని దుఃఖించడం.

నీలుడు సముద్రం ఉత్తరపుగట్టున కట్టుదిట్టా లన్నీ చేసి వానర సేనను విడియించాడు. మైందుడూ ద్వివిదుడూ తరుచు చుట్టూ తిరుగుతూ సైనికులను అదుపాజ్ఞలలో వుంచారు. అప్పుడు రాముడు తన పక్కనే వున్న లక్ష్మణునితో యిలా ప్రారంభించాడు.

“తమ్ముడూ! దినాలు గడిచినకొద్దీ తగ్గిపోవడం శోకానికి సహజం; కాని సీత కనపడకుండా వుండడంవల్ల ఆ శోకం నాకు దినదినమూ ఎక్కువయిపోతోంది. సీత దూరాన వున్నందుకు కాదు నేను దుఃఖించడం. రావణు డామె నెత్తుకుపోయినందుకున్నూ నేను దుఃఖించడం లేదు. ఆమె యౌవనం గడిచిపోతోంది. అందువల్ల నేను దుఃఖిస్తు న్నాను. ఓ వాయువా! నువ్వు సీత వుండినచోటికి వెళ్ళి అక్కడ విహ రించు. ఆమెని తాకి వచ్చి నన్నిక్కడ తాకు. దీనివల్ల నేనామెని తాకినట్టే సంతోషిస్తాను. అదే ఆకాశాన వెలుగుతున్న చంద్రుడు ఆమెని చూసి నన్ను కూడా చూస్తున్నాడు. అంచేత నేను కూడా

ఆమెని చూసినట్టే సంతోషిస్తున్నాను. తనని రావణు డెత్తుకునిపోయా టప్పుడు నా సీత "హానాథా!" అంటూ నన్నే తలుచుకుంది. నా హృదయంలో అంకితం అయిపోయిన ఆ మాట జీర్ణించిన విషంలాగ నన్ను కీలుకీలునా దహించేస్తోంది. సీతావియోగమే కట్టెలుగానూ, ఆమెకోసం నే ననుభవిస్తున్న విచారమే మంటలుగానూ మన్మథాగ్ని రాత్రీపగలూ కూడా నన్ను దహించేస్తోంది. లక్ష్మణా! నిన్ను విడిచి వెళ్ళి నేను సముద్రంలో మునిగి అక్కడే పడుకుంటాను. అలాచేస్తే అగ్ని నన్నంతగా బాధించదు. నేనూ సీతా ఒక్కభూమిమీదే శయనిస్తున్నాము. ఈ వొక్క గొప్పకారణంవల్లనే నేను జీవించివుండగలిగాను. సీత బతికేవుందని విన్నానుగదా? నేను బతికివుండడాని కిదిన్నీ వొక కారణమే. నేను శత్రువుల నెప్పుడు జయించి లక్ష్మివంటి సీత నెప్పుడు చూస్తానో? చక్కని పెదవులతో సుందరమైన ఆమె ముఖ పద్మం కొంచెమెత్తి నే నెప్పు డధరపానం చేస్తానో? ఒకదా న్నొకటి వొరుచుకుంటూ తాళ్ళఫలాల లావున్న సీత స్తనాలు నే నెప్పు డాలింగనంచేసుకుంటానో? నా సీత నేను బతికేవుండగా అనాథలాగ రాక్షసులమధ్య యమయాతన అనుభవిస్తోంది. జనకమహారాజు కూతురూ, దశరథమహారాజు కోడలూ అయిన నా సీత రాక్షసాంగనలమధ్యపడి యెలావుందో? శరత్కాలంలో మేఘాలను తప్పించుకుని వచ్చే చంద్ర రేఖలాగ సీత రాక్షసులను కలతపెట్టి నాదగ్గిర కెప్పుడు వస్తుందీ? సహజంగానే సీత సన్ననిమనిషి. దేశకాలవైపరీత్యంవల్ల శోకం తట స్థించీ, తిండిలేకా యింకా యెంత సన్నంగా అయిపోయిందో? రావణుని వక్షస్థలం నా నిశితబాణాలతో బద్దలుచేసి నా సీతను నే నెప్పుడు తెచ్చుకుంటానో? దేవకన్యలను మించిన నా సీత నన్నెప్పుడు కౌగిలించుకుని ఆనందబాష్పాలు విడుస్తుందో? మాసిపోయిన బట్ట విడిచిపారేసేటట్టు సీతను గురించిన యీ శోకం నే నెప్పుడు విడిచిపెడతానో?"

రాముడిలా శోకిస్తుండగా సాయంకాలం అయింది. లక్ష్మణుడనేక విధాల ఓదార్చగా, రాముడు కమలపత్రాక్షి అయిన సీతను తలుచుకుంటూనే సాయంసంధ్యావందనం చేసుకున్నాడు.

## ౬

## రావణుడు "ఇప్పుడేమి చెయ్యటం" అని మంత్రుల నడగడం

అక్కడ రావణుడు, మహేంద్రునితో సమానుడైన హనుమంతుడు లంకలో చేసిన ఘోరకృత్యం అంతా చూసి సిగ్గుతో మొగం వంచుకుని మంత్రుల నిలా అడిగాడు.

మన లంకాపట్నం యెలాంటివాళ్ళూ కూడా ప్రవేశించడానికి వీలు లేనంత కట్టుదిట్టాలతో వుంది. అయినా వానరుడైన హనుమంతుడు నిరాటంకంగా ప్రవేశించాడు. సీతను చూశాడు. పట్నం అంతా ధ్వంసం చేశాడు. వాడు చైత్యప్రాసాదం కూలగొట్టాడు. మహావీరులైన రాక్షసులను సంహరించాడు. లంక అంతా గగ్గోలుపెట్టేశాడు. ఇప్పు డేమిటీ చెయ్యడం? ఇకముందు మనం యెలా ప్రవర్తిస్తే యేమవుతుంది? మనీషులు విజయం మంత్రమూలం అని చెబుతారు. కనక, రామునివిషయమై మనం అవలంబించవలసిన మార్గం ఆలోచించండి. లోకంలో ఉత్తములు, మధ్యములు, అధములు అని పురుషులు మూడు రకాలు. ఏదయినా పని చెయ్యవలసివచ్చినప్పుడు సర్వసమర్థులైన మంత్రులతో ఆలోచించి తనకు కష్టం కలిగితే దుఃఖించే హితులతోనూ, తనకు ఉన్నతి కలిగితే ఆనందించే బంధువులతోనూ కూడా ఆలోచించి, భారం అంతా దైవంమీద వేసి తన శక్తి వంచన లేకుండా కష్టపడి పని చేసేవా డుత్తముడు. తానొక్కడే ఆలోచించి, ఒక్కడే దైవాన్ని నమ్మి ఒక్కడే పనిచేసేవాడు మధ్యముడు. మంచిచెడ్డలు ఆలోచించకుండా, దైవంలో యేముం దని స్వతంత్రించి తోచినట్లల్లా చేసేవాడు

అధముడు. పురుషులలో ఉత్తములూ, మధ్యములూ, అధములూ యెలా వున్నారో, ఆలోచనలలోకూడా అలాగే ఉత్తమాలూ, మధ్యమాలూ, అధమాలూ వున్నాయి. మంత్రు లందరూ ఐకమత్యంగా వుండి, శాస్త్రరీత్యా చర్చించి నిర్ణయించే ఆలోచన ఉత్తమం. మంత్రు లందరూ ఎవడికి వాడే అయి వాదానికి దిగి కొంసకిమాత్రం ఒక దారికి వచ్చి నిర్ణయించిన ఆలోచన మధ్యమం. మంత్రు లందరూ ఎవరివాదం వారు విడిచిపెట్టక మత్సరబుద్ధితో ఎదటివాళ్ళు చెప్పేది గుర్తించక శఠించి ఎవరికి వారుగా తలోకటీ నిర్ణయిస్తారో అది అధమాలోచన. కనక, బుద్ధిమంతులైన మీరందరూ కలిసి చర్చచేసి ఏకగ్రీవంగా మన మిప్పు డేమి చెయ్యాలో నిశ్చయించండి. వానరసేనలను వెంటబెట్టుకుని రాముడు మనలను జయించడానికి దండెత్తి వస్తున్నాడు. సముద్రం యెండగట్టో, మరోవిధంగా సాధించో సోదరునితో కూడా చాలాకసిగా వస్తున్నాడు. ఇది జరిగే పక్షంలో లంకకు అపాయం కలక్కుండానూ, రాక్షసజాతికి వినాశం రాకుండానూ వుండేటట్టు ఆలోచనచెప్పండి.

## 2

## రాక్షస ప్రముఖులు రావణుని ప్రతాపం పొగడడం

అక్కడ వుండిన రాక్షసప్రముఖు లందరూ సహజంగా తెలివితక్కువ వాళ్ళు. దీనికి సాయం వాళ్ళకి శత్రువుల బలాబలాలు తెలియవు. అయినా, రావణుణ్ణి పొగడడం ప్రారంభించారు.

"రాజేంద్రా! మనసేనలన్నీ పరిఘులూ, శక్తులూ, శూలాలూ, పట్టశాలూ, మొదలైన రకరకాల ఆయుధాలతో చాలా సమర్థం అయివుందిగదా. నీకీ కంగా రెందుకూ? నువ్వు పాతాళంలో వున్న భోగవతీ నగరంమీద దండెత్తి వెళ్ళి నాగులను జయించి వచ్చావు. కైలాసశిఖరాన నివసిస్తూ మహేశ్వరునకు పరమమిత్రు

డయి వుండిన యక్షరాజు కుబేరుణ్ణి కూడా నువ్వు నిర్జించావు. నువ్వు యక్షులను చాలామందిని క్షోభపెట్టావు. ఎంతోమందిని అంగవికలులను చేశావు. మరెంతోమందిని సంహారించేశావు. ఇలాచేసి నువ్వు కైలాసశిఖరాన వుండిన కుబేరుని పుష్పకవిమానం పట్టుకువచ్చావు. దానవేంద్రుడైన మయుడు నీకు జడిసి నీతో స్నేహంగా వుండడమే శ్రేయస్కరం, అని గుర్తించి తన కూతుర్ని నీకిచ్చి పెళ్ళిచేశాడు. నీ చెల్లెలయిన కుంభీనసికి భర్త అయిన మధుడు మహావీరుడు. దురాసదుడు. అతన్ని కూడా జయించి నువ్వులోపు చేసుకున్నావు. పాతాళలోకాని వెళ్ళి నువ్వు నాగులనందరిని జయించడమే కాదు. వారిలో ప్రముఖులైన తక్షకుణ్ణీ, శంకుణ్ణీ, జటినీ లోపుచేసుకున్నావు. కాలకేయులు మరణంలేనివారు. మహాబలపరాక్రమవంతులు. శూరులుబ్రహ్మవల్ల గొప్పవరాలెన్నో పొందివుండినవారు. వాళ్లు కూడా ఒక్క సంవత్సరం నీతో ఘోరాతిఘోరంగా యుద్ధంచేసి చివరికి నీకు లొంగిపోయారు. వాళ్ళవల్ల నువ్వు ఎన్నో మాయలు తెలుసుకున్నావు. శూరులూ, బలవంతులూ అయిన వరుణపుత్రులు చతురంగబల సమేతులయ్యుండిన్నీ నీకు లొంగిపోయారు. మృత్యుదండమే భయంకరమైన మొసలిగానూ, శాల్మలివృక్షా లనే ఆయుధాలే వృక్షాలుగానూ, యమపాశమే తరంగాలుగానూ, యమకింకరులే పాములుగానూ, వుండిన యముని సైన్యం అనే సముద్రంలో ప్రవేశించి నువ్వు మృత్యువును జయించి విజయమున్నా ఆర్జించివున్నావు. కొద్దిపాటి యుద్ధానికే నిన్ను చూసి లోకాలన్నీ గజగజలాడి పోయాయి. అరణ్యంలో గొప్ప గొప్ప వృక్షాలెన్నో వుండేటట్టు భూమండలంలో మహేంద్రునితో సమానులైన క్షత్రియవీరు లెందరో వున్నారు. వారందరూ నీకు లొంగిపోయారు. వారిలో రాముడు ఎవరికీ సాటిరాడు. వాళ్ళనందరినీ జయించేసిన నీకు రాముడంటే యేపాటి? మహారాజా! నువ్వు నిశ్చిం

తగా కూచో, నీకు శ్రమే కాదు, ఆందోళన కూడా అక్కర్లేదు. ఇంద్రజిత్తు వొక్కడే వానరులను నాశనం చేసేస్తాడు. ఇంద్రజిత్తు మహేశ్వరమనే గొప్పయజ్ఞంచేసి పరమదుర్లభాలైన వరాలెన్నో సంపాదించి వున్నాడు. దేవసేన సామాన్యమైనది కాదుగదా? అదొక మహాసముద్రం అనుకుంటే అందులో శక్తితోమరాది ఆయుధాలే చేపలు. పేగులే నాచు. ఏనుగులే తాబేళ్ళు. గుర్రాలే కప్పలు. రుద్రాదిత్యులే మొసళ్ళు. వసువాయువులే మహాసర్పాలు.రథాలూ, గుర్రాలూ, ఏనుగులూ ప్రవాహం. కాల్బంటులే యిసకతిప్పలు. అలాంటి దేవసేనను కలచివేసి ఇంద్రజిత్తు దేవేంద్రుణ్ణి పట్టి బంధించి లంకకి తీసుకువచ్చాడు. అప్పుడు బ్రహ్మ చెప్పగా నువ్వు మహేంద్రుణ్ణి విడిచిపెట్టావు. కనక, ఆయింద్రజిత్తుని పంపు, వానరసైన్యం అంతా నాశనంచేసి నిమిషంలో రాముణ్ణి జయించేస్తాడు. రాజేంద్రా! క్షుద్రుడైన హనుమంతుడు చేసినదానికి ప్రాకృతుడు లాగ ఎందుకు బెంగపెట్టుకుంటావూ? నువ్వు రాముణ్ణి వధించేస్తావు కంగారుపడకు”

## ౭

## రాక్షససేనాపతులు తమ ప్రతాపాలు చెప్పుకోడం.

అప్పుడు మహాశూరుడూ, సేనాధిపతీ అయిన నల్లని ప్రహస్తుడు లేచి చేతులు కట్టుకుని “మహాప్రభూ! దేవతలూ, దానవులూ, గంధర్వులూ, పిశాచులూ, నాగులూ యుద్ధరంగంలో నిన్నెదిరించి నిలవలేరు. ఇక వానరులా నిలిచేవారు? అయితే, మన మందరమూ మనలనెవరూ మెదిరించలేరని నిశ్చయించుకుని, నమ్మి అశ్రద్ధగా వున్నాము. అంచేత హనుమంతునిచేతిలో మనం మోసపోయాము. అంతేగాని, నేను బతికివుండగా నా యెదటపడి ఆ హనుమంతుడు బతికివెళ్ళలేడు. కనక, నాకు సెలవుదయచెయ్యి. సముద్రపర్యంతమైన యీ భూమండ

లంలో అరణ్యాలలోనూ పర్వతాలమీదా కూడా కోతిపురుగయినా లేకుండా చేసివస్తాను. వానరుల బారిపడకుండా లంకానగరానికిన్నీ నేను రక్షణలేర్పాటు చేస్తాను. కనక, నువ్వు చేసిన అపరాధంవల్ల కించిత్తూ దుఃఖం కలగదు ” అని చెప్పాడు.

దీనిమీద, దుర్ముఖు డనే రాక్షసప్రముఖుడు క్రోధపరవశుడై “మహాప్రభూ! మన కిలాంటి అవమానంచేసిన హనుమంతుణ్ణి క్షమించడానికి వీలులేదు. వానరమాత్రుడు వచ్చి చేసిన యీ పని నిజంగా మన పట్నానికీ, మనప్రభువు అంతఃపురానికీ, మనప్రభువుకీ కూడా తీరని అవమానం, సందేహం లేదు. ఆ కోతిమూకలు సముద్రంలో దాగినా, ఆకాశాన నక్కినా, పాతాళంలో ప్రవేశించినా నేనిదేవెళ్ళి నాశనం చేసేస్తాను” అన్నాడు. అప్పుడు మహాబలుడైన వజ్రదంష్ట్రుడు మండిపడుతూ మాంసంతోనూ రక్తంతోనూ నిండివున్న పరిఘ గిరగిరతిప్పి “అటు లక్ష్మణునితోనూ సుగ్రీవునితోనూ కలిసి దుర్ధర్షుడైన రాముడుండగా పిరికిపంద అయిన హనుమంతునితో మీ కేమిపని? నేనిదే వెళ్లి వానరసేన నీ పరిఘతో పచ్చడిచేసి సుగ్రీవుణ్ణి లక్ష్మణుణ్ణీ చివరికి రాముణ్ణీ కూడా నేనొక్కణ్ణే చంపేసివస్తాను. ప్రభూ! నే నింకొకటి కూడా చెబుతాను విను. ఉపాయకౌశలం గలవాడే శత్రువులను జయించగలుగుతాడు. కనక, నేను చెప్పే దేమంటే? మన రాక్షసులలో శూరులూ, భీమదర్శనులూ, క్రూరకర్ములూ అయినవారు తమ కామరూపప్రభావంతో మనుష్యరూపం ధరించి వేలకొద్దీ రాముని దగ్గిరికి వెళ్లి “నీ సోదరుడు భరతుడు మమ్మి పంపాడు. ఆ భరతుడు గొప్ప సేనతో వస్తున్నాడు ” అని చెప్పాలి. దానితో రాముడు మోసపోతాడు. అప్పుడు మేము కూడా వెళ్ళి వాళ్ళనందరినీ నాశనంచేసేస్తాము. ఇలా చేస్తే రామలక్ష్మణులు నశిస్తారు ” అని చెప్పాడు.

ఇదంతా విని కుంభకర్ణుని కొడుకైన నికుంభుడు మిక్కిలీ క్రుద్ధుడై "మీరందరూ మహారాజు సన్నిధానంలో సుఖంగా వుండండి, నేనొక్కణ్ణే రాముణ్ణీ, లక్ష్మణుణ్ణీ సుగ్రీవుణ్ణీ, వానరసేన నంతనీ నాశనంచేసేసివస్తాను" అన్నాడు. దానిమీద వజ్రహనువు అనే రాక్షసుడు పర్వతంలాగ లేచి నోరూరగా నాలుకచప్పరించుకుంటూ "మీరందరూ నిర్భయంగావుండి వినోదాలతో కాలంగడుపుతూ వుండండి. మద్యపానంచేసి ఆనందిస్తూవుండండి. నేనొక్కణ్ణే వెళ్ళి వాళ్ళనందరినీ తినేసి వస్తాను. సుగ్రీవుణ్ణి నేనొక్కణ్ణే సంహరించేస్తాను. లక్ష్మణుణ్ణి కూల్చేస్తాను. అంగదుణ్ణి పాతేస్తాను. హనుమంతుణ్ణి చీరేస్తాను. రణశూరుడైన రాముణ్ణి నేలబెట్టికొట్టేసివస్తాను" అంటూ పరవళ్ళుతొక్కాడు.

౬

## విభీషణుడు, సీత నిచ్చెయ్యమని హితవు చెప్పడం

అప్పుడు మహాపరాక్రమశాలి అయిన నికుంభుడూ, మహాబలిశాలి అయిన సూర్యశత్రువూ, నిద్రలో వున్నవాళ్ళని చంపడంలోనూ, యజ్ఞాలు పాడుచెయ్యడంలోనూ సమర్థుడైన మహాపార్శ్వుడూ, అగ్నికేతువూ, దుర్ధర్షుడైన రశ్మికేతువూ, మహాతేజశ్శాలీ, మహాబలశాలీ, రావణుని కొడుకూ అయిన ఇంద్రజిత్తూ, ప్రహస్తుడూ, విరూపాక్షుడూ, వజ్రదంష్ట్రుడూ, ధూమ్రాక్షుడూ, అతికాయుడూ, దుర్ముఖుడూ పరిఘలూ, పట్టిసాలూ, ప్రాసలూ, శక్తులూ, తోమరాలూ, ధనుస్సులూ, ఖడ్గాలూ, గదలూ పుచ్చుకుని ఉద్వేగంగా లేచి మండిపడుతూ "ఇదే నేనిప్పుడే రాముణ్ణీ, లక్ష్మణుణ్ణీ, సుగ్రీవుణ్ణీ సంహరించేస్తాను. లంకాపట్నం పాడుచేసిన హనుమంతుణ్ణి చీల్చేస్తాను" అంటూ రావణునకు విన్నవించుకున్నారు.

అది చూసి విభీషణుడు వారి నందరినీ మెల్లి గా వారించి, కూచో బెట్టి, రావణునితో చేతులుజోడించుకుని యిలా చెప్పాడు.

"నాయనా! సామంతోనూ, దానంతోనూ, భేదంతోనూ సాధ్యం కాని పనులే దండం అవలంబించి సాధించుకోవా లని పెద్దలు చెబు తారు. ప్రమత్తులై వుండినవారిమీదా, దైవవంచితుల మీదా, శత్రువులను ఎదిరించివున్న వాళ్ళమీదా మాత్రమే దండోపాయం అవ లంబించాలి.అప్పుడయినా ఆ వుపాయం బాగా ఆలోచించి యథావిధిగా ప్రయోగించాలి. రాక్షసవీరులారా! రాము డిప్పు డలాంటి స్థితిలో లేడే? అతను చాలా బలవంతుడై, విజిగీషువున్నూ అయివున్నాడే? రోషం విడిచి కార్యాకార్యాలూ, సాధ్యాసాధ్యాలూ బాగా తెలుసుకో గలిగిన్నీ వున్నాడే? అతనితో కయ్యంపెట్టుకోవా లని యెందుకు చూస్తారు? నదనదీపతీ, ఘోరమూ అయిన సంద్రం దాటివచ్చి హనుమంతు డింతపని చేశాడు. మీరిది ఆలోచించారా? శత్రుబలం చాలా యెక్కువగా వుంది. వాళ్ళల్లో ప్రతీవాడూ చాలా అసాధ్యుడు. కనక, మీరు తొందర పడగూడదు. ఇంతే కాదు, రాముడు జనస్థా నంలో తన కపకారం చేశా డని రావణుడు అతని భార్య నెత్తుకు వచ్చాడు. ఖరుడు చాలాతొందరపడ్డాడు. మీదిమీదికి వచ్చాడు. అంచేతనే రాముడు అతణ్ణి సంహారించాడు. ఆత్మరక్షణ చేసుకోడానికి ప్రతీవాడికీ అధికారం వుంది. పరస్త్రీలను చెరపట్టడం అపకీర్తికరం. అది ఆయువు కుంగదీస్తుంది. చాలా ఘోర మైనది. పాపాలకు పుట్టి నిల్లు. ఇందువల్ల, సీతవల్ల మనకు చాలా ఆపత్తు సంభవిస్తుంది. కనక, ఆమె నిచ్చివెయ్యడం చాలా అగత్యం. వస్తు వెంతమంచి దయినా కలహకారణం అయితే విడిచిపెట్టెయ్యాలి. రాముడు మహాపరాక్రమ శాలి. ధర్మప్రవర్తకుడు. అతనితో వైరం పెట్టుకోడం మనకి మంచిది కాదు. కనక, సీత నిచ్చివెయ్యండి. రాముడు వచ్చి తన బాణాలతో

రథగజాశ్వసంకులమూ, బహురత్న సమాకులమూ అయిన లంకను నాశనంచెయ్యకముందే సీత నిచ్చెయ్యండి. సహించశక్యం కాని వానర సేన ముంచుకువచ్చి లంక ముట్టడించకముందే సీత నిచ్చెయ్యండి. మనమే స్వయంగా సీత నిచ్చెయ్యకపోతే లంక బుగ్గిఅయిపోతుంది. రాక్షసులు మసి అయిపోతారు. మహారాజా! నువ్వు నాకాత్మబంధుడవు. పెద్దవాడవు. నిన్ను వేడుకుంటున్నాను. నామాట విను. నేను చెప్పేది మనకి చాలా శ్రేయస్కరం. కనక, సీతనిచ్చెయ్యి. రాముడు శరత్కాలసూర్యకిరణ సమాలయిన బాణాలతో నిన్ను కొట్టముందే సీతనిచ్చెయ్యి. కోపంవద్దు. అది సుఖమూ ధర్మమూ నాశనంచేస్తుంది. ధర్మం అవలంబించు. అది కీర్తి, సంతోషమూ కలిగిస్తుంది. నువ్వను గ్రహిస్తే మన మందరమూ బతికిపోతాం. కనక, సీతనిచ్చెయ్యి"

విభీషణు డిలా చెప్పగా అంతా విని రావణుడు వారి నందరినీ విడిచి ఇంటోకి చక్కాపోయాడు.

## ౧౦

## విభీషణుడు రావణునకు మళ్ళీ హితోపదేశం చెయ్యడం

మర్నాడు తెల్లవారగానే విభీషణుడు ధర్మాధర్మాలు నిశ్చయం చేసుకుని మళ్ళీ హితోపదేశం చెయ్యడానికి రావణుని యింటికి బయలు దేరాడు.

అది పర్వతశిఖరంలాగ చాలా యెత్తుగానూ, పర్వతశిఖరాల గుంపు గానూ వుంది. అప్పటికప్పుడే మహామాత్యులూ, పౌరప్రముఖులూ అక్కడ చేరివున్నారు. అక్కడిగాలి అంతా మత్తేభాల నిశ్వాసాలతో మిళితం అయివుంది. తూర్యధ్వనులు చెలరేగుతున్నాయి. ఎందరో యువతులు నిండివున్నారు. అది గంధర్వనగరం లాగా స్వర్గపట్నం

లాగా వుంది. అక్కడ వుంచిన రత్నాలకు అంతులేదు. సూర్య డాకా శాన ప్రవేశించేటట్టు విభీషణు డాయింటో ప్రవేశించాడు.

రావణుని విజయం కోరుతూ వేదవేత్తలయిన రాక్షసులు పుణ్యాహవాచనాలు చేస్తున్నారు. కొందరు వేదవేత్తలు మధుపర్కాలు పట్టుకునివున్నారు.

వెళ్ళివెళ్ళి, విభీషణుడు తాను రాక్షసప్రముఖులు చేసే గౌరవాలందుకుంటూ సింహాసనస్థుడై వుండిన రావణుని సన్నిధిని చేరుకుని, సంప్రదాయం అనుసరించి "జయం" అంటూ వొక ఆసనం అధిష్ఠించాడు. తరవాత, అతను, అక్కడ మంత్రులు మాత్రమే వుండేటట్టు ఏర్పాటుచేసుకుని దేశకాలపాత్రలు బాగా యెరిగినవాడు కనక మెల్లిగా యిలా ప్రారంభించాడు. రాక్షసరాజేంద్రా! సీత వచ్చింది మొదలు నీ యీ లంకాపట్నంలో దుర్నిమిత్తా లనేకాలు కనపడుతున్నాయి. సమంత్రకంగా హోమాలు చేస్తూవుండినా అగ్ని స్ఫులింగాలతో ధూమకలుషంగా వుంటోంది గాని చక్కగా ప్రజ్వలించడంలేదు. పొయ్యిలలోనూ, అగ్నిహోత్రగృహాలలోనూ, వేదాధ్యయనస్థలాల లోనూ సరీసృపాలు సంచరిస్తున్నాయి. హవిస్సులలో చీమలు పాకుతున్నాయి. ఆవుల పొదుగులలో పాలు ఎండిపోతున్నాయి. మత్తేభాలు మదహీనా లయిపోతున్నాయి. గుర్రాలు దీనంగా సకిలిస్తున్నాయి. గడ్డిముట్టడం మానేశాయి. గాడిదలూ, లొట్టిపిట్టలూ, కంచరగాడిదలూ ఏడుస్తున్నాయి. ఎన్ని విధాల చికిత్స చేసినా అవి స్వాస్థ్యం పొందకుండా వున్నాయి. కాకు లంతటా గుంపులుగుంపులుగా సంచరిస్తున్నాయి. విమానాలమీద కూడా గుంపులు చేరుతున్నాయి. పట్నంమీద అంతటా గద్దలు బారులుతీరి మొగురుతున్నాయి. ఉభయ సంధ్యల్లోనూ నక్కలు అమంగళంగా ఊళపెడుతున్నాయి. కుక్కలు మొదలైన జంతువులు పురద్వారాలలో చేరి ఉరుముతున్న ట్టరుస్తు

న్నాయి. అందుకు తగ్గట్టు లంకాదహనాదులు జరిగివుండినాయి. దీనికి నాకొక ప్రాయశ్చిత్తం తోస్తోంది. అది రామునకు సీతనిచ్చెయ్యడమే. నీకిది నచ్చుతుం దేమో చూడు. నేనిది తెలివితక్కువవల్లనో, ప్రాణ భీతివల్లనో చెబుతున్నా ననుకుంటే అనుకో. కాని నన్ను తప్పుపట్ట వద్దు. ఈదుర్నిమిత్తాలు పౌరుల కందరికీ తెలుసు. అంతఃపురంలో కూడా తెలుసు. మంత్రులకూ తెలుసు ; కాని వారు నీకు జడిసి చెప్ప డంలేదు. నేనుకూడా చెప్పకుండా వుండడం మంచిదికాదు. అంచేతే నేను చూసిందీ విన్నదీ చెబుతున్నాను. ఇక నువ్వు బాగా ఆలో చించు. ధర్మమార్గాన ప్రవర్తించు ”

దీనిమీద రావణుడు చాలా కోపించి “ నాకెవనివల్లా భయంలేదు. నాస్వాధీనంలో వున్న సీతను రాము డెన్నటికీ పొందలేడు. దేవతల తోనూ దేవేంద్రునితోనూ కలిసివచ్చినా రాముడు యుద్ధంలో తన తమ్మునితో నాయెదట నిలవలేడు ” అని చెప్పి “ఇక నువ్వు వెళ్ళిపో” అని విభీషణుణ్ణి పంపేశాడు.

## ౧౨
## రావణుడు కొలువుతీరడం

ఇటు సీతనుగురించిన విరహం, అటు ఇష్టబంధువుల అనాదరభావం, వీటికితోడు పాపకర్మ. వీటితో రావణుడు చింతాకులు డయిపోయాడు. తరవాత అతను యుద్ధం తప్పదని తెలుసుకుని మంత్రులతో ఆలో చించా లని నిశ్చయించుకున్నాడు. వెంటనే అతను రథం యెక్కి బయలుదేరాడు. రాక్షసవీరు లనేకులు సకలాయుధాలూ ధరించి రావ ణుని ముందు బయలుదేరారు. నానావికృతవేషాలూ, నానాభూష ణాలూ గల మరికొందరు రాక్షసవీరులు వెనకా, పక్కలా వెళ్ళారు. అతిరథు లైన రాక్షసవీరులు కొందరు రథా లెక్కీ, కొంద రేనుగు లెక్కీ, కొందరు గుర్రా లెక్కీ వెంటబయలుదేరారు. మరికొందరు

గదలూ, పరిఘలూ, శక్తితోమరాదులూ అయిన ఆయుదాలు ధరించి వెళ్ళారు. కొలువు తీరడానికి ఇలా బయలుదేరగా తూర్యధ్వనులూ, శంఖధ్వానాలూ దిక్కులు పిక్కటిల్లాయి. చక్రనేమిధ్వనులు దిక్కులు పిక్కటిల్ల రథం రాజమార్గంలో ప్రవేశించింది. పరిచారకులు రావణు నకు పట్టిన శ్వేతచ్ఛత్రం పూర్ణచంద్రబింబంలా ప్రకాశించింది. శుద్ధ స్ఫటికాలలాగ మిక్కిలీ తెల్లనైన వింజామరలు రావణునకు ఉభయ పార్శ్వాలా వెలుగొందుతున్నాయి. రథం రాజమార్గం చేరగానే అక్కడ వుండిన రాక్షసు లందరూ శిరస్సులు వంచి రావణునకు నమ స్కారాలు చేశారు. రాక్షసులిలా జయపెడుతూవుండగా రావణుడు కొలువుకూటం ప్రవేశించాడు.

ఆ కొలువుకూటం విశ్వకర్మ నిర్మించాడు. దాని స్తంభాలు వెండి తోనూ బంగారంతోనూ చేశారు. కింద స్ఫటికశిలలు తాపడంచేశారు. ఆరువందల పిశాచవీరులు దానికి కాపున్నారు. అక్కడ వుండిన సింహా సనం వైడూర్యమణితో చేశారు. దానిమీద మెత్తని దిండ్లు అమ ర్చారు. రావణుడు ఆ సింహాసనంమీద కూచున్నాడు. వెంటనే లఘు పరాక్రములైన దూతలను చూసి "మన కిప్పు డొక గొప్పపని వచ్చింది. మీ సామర్థ్యం యిప్పుడు తెలుస్తుంది. వెంటనే మీరు వెళ్ళి రాక్షసవీరులను తీసుకురండి" అని ఆజ్ఞాపించాడు. వాళ్ళు వెళ్లి ఇళ్ళ ల్లోనూ తోటల్లోనూ విహారశయనాదిసౌఖ్యాలనుభవిస్తున్న ఆ రాక్షస వీరులను ప్రభువు సెలవయిం దని పిలిచారు. వారిలో కొందరు రథా లెక్కి బయలుదేరారు. కొందరు ఏనుగులెక్కి బయలుదేరారు. కొం దరు గుర్రాలెక్కి బయలుదేరారు. కొందరు కాలినడకనే వెళ్ళారు. అప్పుడు లంకాపట్నం రథాలతోనూ గుర్రాలతోనూ ఏనుగులతోనూ పదాతులతోనూ నిండిపోయి రకరకాల పక్షులతో నిండిన ఆకాశంలా వుంది. వారు అందరూ సింహాలు పర్వతగుహాలలో ప్రవేశించేటట్టు

సభాభవనంలో ప్రవేశించారు. వారందరూ రావణుణ్ణి పాదాలంటి మొక్కగా, రావణుడున్నూ వారిని యథోచితంగా గౌరవించాడు. తరవాత వారు కొందరు పీఠాలమీద కూచున్నారు. కొందరు తివాసీల మీద కూచున్నారు. కొందరు నేలమీదే కూచున్నారు.

వారిలో ఆలోచనలు చేసే మంత్రు లున్నారు. రాజకార్యాలు నిర్వర్తించే అమాత్యు లున్నారు. ఒక్కొక్క విషయంలో గొప్పగొప్ప పండితులైనవా రున్నారు. సమస్తమూ తెలిసినవారున్నారు. ఒక్కొక్కరే యెందరెందరో వున్నారు. బంగారపు రంగుతో మెరుస్తున్న ఆ రాజసభలో వారందరూ రత్నాలలా వున్నారు.

విభీషణుడు తరవాత వచ్చాడు. హేమవిచిత్రితమైన గొప్పరథం యెక్కి వచ్చా డతను. అతను తనపేరు చెబుతూ రావణునకు పాదాభివందనంచేశాడు. శుకుడూ, ప్రహస్తుడూ కూడా వచ్చి యథోచితాసనాలమీద కూచున్నారు. రత్నాభరణాలు ధరించి విలవగల బట్టలు కట్టుకున్న ఆ రాక్షసప్రముఖులు గంధాలు పూసుకుని, పూలమాలలు ధరించివుండడంవల్ల ఆ సభ అంతా సువాసనలు గుబాళిస్తున్నాయి. వారందరూ నిశ్శబ్దంగా కూచున్నారు. వారిలో వొక్కడూ అబద్ధమాడేవాడు లేడు. అందరూ కార్యోన్ముఖు లయి ప్రభువు మొగం చూస్తూ కూచున్నారు. ఆ సభలో రావణుడు, సుధర్మలో దేవేంద్రు డున్నట్టున్నాడు.

## ౧౨
## కుంభకర్ణుడు రావణునకు ధైర్యం చెప్పడం

అప్పుడు రావణుడు సేనాధిపతి అయిన ప్రహస్తుణ్ణి పిలిచి "నీచేతిలో సర్వసమర్థులైన చతురంగబలయోధులనేకు లున్నారు. వారిలో సమర్థులైనవారి నందరినీ కూర్చి రక్షణపేర్పాట్లు జాగ్రత్తగా నడిపించు" అని చెప్పాడు. దానిమీద ప్రహస్తుడు రాక్షసయోధులను రాజాంతఃపురం

లోనూ, దుర్గంలోనూ నగరంలో ముఖ్యస్థలాలలో కాపుండేటట్టు ఆజ్ఞా పించి "ప్రభూ! నీయాజ్ఞ నిర్వర్తించాను. ఇక నువ్వు ఏమి తలుచు కున్నావో అది త్వరగా జరిగించు" అని విన్నవించుకున్నాడు.

అందుకు రావణుడు మిక్కిలీ ఆనందించి "రాక్షసప్రముఖులారా! ధర్మకామార్థవిషయాలలో సందేహాలు వచ్చినప్పుడు ఇష్టానిష్టాలూ, సుఖదుఃఖాలూ, లాభాలాభాలూ, మంచిచెడ్డలూ మీరు బాగా ఆలోచించి ఇదమిత్థం అని నిర్ణయించగలరు. మీరు బాగా ఆలోచించి చేసిన పనులలో వొక్కటీ కూడా యెప్పుడూ వ్యర్థం కాలేదు, భగ్న మూకాలేదు. ఇంద్రుడు సూర్యచంద్రాదిగ్రహాలవల్లా, నక్షత్రాలవల్లా, దేవతలవల్లా విజయశ్రీ పొందేటట్టు నేను మీ వల్ల విజయంపొందు తాను. ఇంతవరకూ జరిగిం దంతా నేను మీకు తెలియజెప్పే వున్నాను; కాని ఆరుమాసాల కితమే నిద్రపోయివుండడంవల్ల ఒక్క కుంభకర్ణునకు మాత్రమే చెప్పలేను. సరే, అతను మేలుకుని యిప్పుడు రానేవచ్చాడు. తమ్ముడూ, కుంభకర్ణా! జనకుని కూతురూ రాముని పట్టమహిషీ అయిన సీతను నేను రాక్షసుల విలాసభూమి అయిన దండకారణ్యం నుంచి తీసుకువచ్చాను. మూడులోకాల్లోనూ సీతవంటి సుందరాంగి లేదు; కాని ఆమె నాతో కామక్రీడ లనుభవించడాని కంగీకరించడం లేదు. సీత తనుమధ్య. పృథుశ్రోణి. చంద్రవదన. బంగారుబొమ్మ. ఆమె మయుడు నిర్మించిన మాయలా వుంటుంది. ఆమె పాదాలు సమంగా ఎర్రగా నున్నగా మృదువుగా వున్నాయి. ఆ కాళ్ళగోళ్లు ఎర్రగా చాలా చక్కగా వున్నాయి. అలాంటి ఆమె పాదాలు చూసిన కొద్దీ నాకు మన్మథతాపం హెచ్చిపోతోంది. ఆమె అగ్నిజ్వాల లాగా సూర్య తేజస్సులాగా వుంది. ఆమె మొగం ఉన్నతంగా వుంది. చక్కని కళ్ళతో అది మరీ రమణీయంగా వుంది. ఆ మొగం చూసిన్నీ నేను మదనబాధ అనుభవిస్తున్నాను. క్రోధం రానియ్యి, సంతోషం

రానియ్యి, నాకీ మదనతాపం తప్పడంలేదు. శోకం కలగనీ, సంతాపం రానీ—మదనుడు నన్ను విడిచిపెట్టడంలేదు. ఆమె తనభర్త అయిన రాముడు వస్తాడన్న ఆశతో నన్నొకసంవత్సరం గడువడిగింది. నేను సరే అని వొప్పుకున్నాను. దాంతో నేను దూరప్రయాణంచేసి అలసిపోయిన గుర్రంలాగ శ్రాంతుణ్ణయిపోయాను. రకరకాల భయంకర జలజంతువులతో నిండి అక్షోభ్యంగా వున్న సముద్రం వానరు లెలా దాటతారూ? ఆ రాజపుత్రులు రామలక్ష్మణులు మాత్రం యెలా దాటతారూ? కాని వొక్క వానరుడు వచ్చి అంత యుద్ధంచేసి పోయాడే; కార్యగతులు ఏమి తెలుస్తాయీ? మీ బుద్ధి కేమితోస్తోందీ? మనుష్యునివల్ల నాకేమీ భయంలేదు. అయినా, తరిచిచూడండి. వెనక, దేవాసురయుద్ధం తటస్థించినప్పుడు మీ వల్లనే నాకు విజయం దొరికింది. అప్పటిమీరు ఇప్పటికీ అలాగే వున్నారు.

అక్కడ, రామలక్ష్మణులు సీత వుండిన చోటు తెలుసుకుని సుగ్రీవునితోనూ గొప్ప వానరసేనతోనూ వచ్చి సముద్రం ఉత్తరపుగట్టు విడిసి వున్నారు. సీత నివ్వడానికివీలులేదు. రామలక్ష్మణులను సంహరించాలి. ఇదీ యిప్పుడు మనం నెరవేర్చవలసింది. దీనికిమీరు అపాయంలేని ఉపాయం ఆలోచించండి. వానరుల వెంటబెట్టుకుని సముద్రందాటి యిక్కడి కెవడూ రాలేడు. విజయం నాకే, తప్పదు" అని చెప్పాడు.

కామపరీతుడైన రావణుని యీమాటలు విని కుంభకర్ణుడు చాలా కోపించి యిలా అన్నాడు.

"అన్నా, మొదటే మాతో ఆలోచించి నువ్వు సీతను తీసుకువచ్చి వుండవలసింది. ఇప్పుడీ ఆలోచన గతజలసేతుబంధనం వంటి దయింది. ముందే బాగా ఆలోచించి పనిచేసినరాజు నీలాగ తరవాత పరితాపం పాలుకాడు. మంచిపను లయినా ఉపాయంగా చెయ్యాలి. లేకపోతే అపాత్రునకు అన్నంపెట్టిన ట్టవుతుంది. ఎవడు ముందు చెయ్యవలసిన

పనులు వెనకా, వెనక చెయ్యవలసిన పనులు ముందూ చేస్తాడో వాడికి నీతి యెంతమాత్రమూ తెలియదన్నమాట. చపలుడై బాగా ఆలోచించకుండా పనిచేసేవాడెంతబలవంతుడైనా వాని పొరపాట్లు కనిపెట్టి శత్రువులు పరాభవిస్తారు. క్రౌంచపర్వతం చాలా యెత్తయినదే. అది పక్షులకు మార్గనిరోధకమే. కాని, దానికి కుమారస్వామి చేసిన రంధ్రం వుంది. పిట్టలు ఆమార్గాన వెళ్ళిపోతాయిగదా? ఏమీ ఆలోచించకుండా నువ్వు ఈఅసాధ్యకార్యం చేశావు. నయం, విషం కలిసిన అన్నంలాగ మాకు తెలియకుండా రాముడు నిన్ను చంపలేదు. అయితే, మించిపోయిందిలేదు. నువ్వు చేసింది చెయ్యనే చేశావు. నీ శత్రువును సంహరించి నేను నీకార్యం సమీకరణచేస్తాను. సందేహపడకు. నేను నీశత్రువుల నందరినీ చంపేస్తాను. ఇంద్రుడు వచ్చినా, సూర్యుడువచ్చినా అగ్నివచ్చినా, వాయుదేవుడు వచ్చినా, కుబేరుడూ వరుణుడూ కూడా వచ్చినా నేను వారిని చంపేస్తాను. తీక్ష్ణదంష్ట్రలతో పర్వతంలా వున్న నేను పరిఘ పుచ్చుకుబయలుదేరానంటే దేవేంద్రుడయినా పారిపోతాడు. రాముడు నామీద ఒకబాణంవేసి రెండోబాణం తొడిగే టంతలో నేను వాని రక్తం పీల్చేస్తాను. నేను రాముణ్ణి చంపి నీకుజయం సంపాదించి యిస్తాను. రామలక్ష్మణులనుచంపి నేను వానరు లందరినీ నమిలేస్తాను. కనక, నువ్వు యథేచ్ఛగా క్రీడాపరతంత్రుడవై వుండి స్వేచ్ఛగా మద్యపానం చెయ్యి. నీయిష్టంవచ్చిన పనిచెయ్యి. నేను రాముణ్ణి చంపెయ్యగానే సీత నీకు వశపడిపోతుంది"

## ౧౩

## రావణుడు తనకు బ్రహ్మపెట్టిన శాపంసంగతి చెప్పడం

ఇది విని రావణుడు చాలా క్రోధపరవశు డయినాడు. అది గుర్తించి మహాబలశాలి అయిన మహాపార్శ్వుడు చేతులు జోడించుకుని

"రాక్షసరాజేంద్రా! క్రూరమృగాలతోనూ, మహాసర్పాలతోనూ నిండివున్న అరణ్యంలో ప్రవేశించిన్నీ చేతికందిన తేనె తాగనివాడు వొట్టి మూఢుడు. నువ్వే ఈశ్వరుడువు. నీకిక యీశ్వరు డెవడు? శత్రువులను నాశనంచేసి నువ్వు సీతతో యథేచ్ఛగా క్రీడావిలాసా లనుభవించు. సీతను కోడిలాగ నువ్వు బలాత్కరించి భోగించు. తరవాత యేమి జరుగుతుందో చూసుకుందాం. ఇంద్రుడు వజ్రాయుధం పట్టు కుని దండెత్తివచ్చినా నేనూ, ఇంద్రజిత్తూ, కుంభకర్ణుడూ యెదిరించి నిగ్రహించగలం. సామమూ, దానమూ, భేదమూ ఇవి చేతకానివాళ్ళు అవలంబించే వుపాయాలు. సర్వసమర్థుడవు నువ్వు దండోపాయం అవ లంబించే సకలవాంఛితాలు తీర్చుకో. ఇక్కడ వుండిన మేమందరమూ మాశస్త్రాస్త్రకౌశలంతో నీశత్రువులను అణచివెయ్యగలం" అని సవి నయంగా చెప్పాడు.

ఇది విని రావణుడు శాంతుడై మహాపార్శ్వుణ్ణి ఆదరించి "వీరాధి వీరా! నాకు సంబంధించిన వొక రహస్యంవుంది బాగా విను. పుంజిక స్థల అని వొక అప్సరస. ఆమె నన్ను చూసి భయపడి ఆకాశ మార్గాన బ్రహ్మలోకానికి వెడుతూ అగ్నిజ్వాలలాగ మెరుస్తూ నాకళ్ళబడింది. నేను బలాత్కారంగా ఆమె బట్ట విప్పిపారేసి సంభో గించి విడిచిపెట్టాను. దాంతో నలిగిపోయిన తామరపువ్వులాగ అది బ్రహ్మదగ్గిరికి వెళ్ళిపోయింది. మహాత్ముడైన బ్రహ్మకు నేను చేసింది తెలిసివుంటుంది. వెంటనే అతను చాలా కోపించి నన్నుగురించి "ఇది మొదలు నువ్వు ఏస్త్రీ నయినా బలాత్కారంగా క్రీడిస్తే నీతల వెయ్యి ముక్కలయిపోతుంది" అని కఠినంగా శపించాడు. ఈకారణంవల్లనే నేను సీతను బలాత్కరించకుండా వున్నాను. సముద్రవేగంవంటి నావే గమూ, వాయుగతి వంటి నాగమనమూ రాము డెరగడు. అంచేత నామీదికి వస్తున్నాడు. ఆరాముడు గుహలో నిద్రిస్తున్న సింహాన్ని

లేపుతున్నట్టూ, క్రుద్ధమైన మృత్యువు మేలుకొలుపుతున్నట్టూ నన్నె దిరిస్తున్నాడు. రాముడు మత్తుడై నాబాణాల శక్తి గుర్తించలేకుండా వున్నాడు. అంచేతనే నామీదికి వస్తున్నాడు. కొరకంచులతో మేను గును లాగ నా బాణాలతో రాముణ్ణి కాల్చి పారేస్తాను. సహస్రాం శుడుదయించి నక్షత్రాలను జయించేటట్టు నాఅపార రాక్షసబలంతో రాముని వానరబలం నాశనం చేసేస్తాను. వెయ్యికళ్ళున్న యింద్రుడూ, వరుణుడూ కూడా నన్నెదిరించి నిలవలేకపోయారు. కుబేరుణ్ణి జయించి నేనతని యీలంకాపట్నం ఆక్రమించుకున్నాను. అలాంటి నాయెదట రాము డెంతవాడు?" అన్నాడు.

## ౧3

## విభీషణుడు మళ్ళీ హితోపదేశం చెయ్యడం

రావణుని మాటలూ, కుంభకర్ణుని సింహగర్జనలూ విని విభీషణుడు మళ్ళీ హితోప దేశం ప్రారంభించాడు.

"రాక్షసరాజేంద్రా! నువ్వు సీత నెందుకు కోరుతున్నావూ? ఆమె వక్షస్థలమే పడగ. ఆమె చింతే విషం. ఆమె మందహాసమే కరుకు కోరలు. ఆమె చేతివేళ్ళు అయిదూ అయిదు తలలు. ఇలాగ సీత ఒక గొప్ప సర్పం కాని మానవాంగన కాదు. కోరలూ గోళ్ళూ ఆయుధా లుగా పర్వతశిఖరాలవంటి ఆవానరవీరులు లంకకి రాకముందే సీతను ముని కిచ్చెయ్యి. రాముని బాణాలు వాయువేగాలూ, వజ్రాయు ధానికి సాటి అయినవీని. అవి రాక్షసుల శిరస్సులు ఎగరగొట్టక ముందే సీతను రాముని కిచ్చెయ్యి. ప్రహస్తా! రాముని బాణాలు పిడుగులవంటివి. ప్రాణాంతకాలు. అవి యింకా నీశరీరం చీల్చెయ్య లేదు. అంచేతనే నువ్విలాగ గర్వోక్తు లాడుతున్నావు. యుద్ధరంగంలో రాముని యెదట కుంభకర్ణుడూ, యింద్రజిత్తూ, రావణుడూ, మహాపా

ర్మ్యుడూ, మహోదరుడూ, నికుంభుడూ, కుంభుడూ, అతికాయుడూ కూడా నిలవలేరు. నిన్ను సూర్యుడు రక్షించనీ, దేవతలు నిన్ను కాపాడనీ, నువ్వు మహేంద్రుని వొడిలోకూచో. కాదంటే మృత్యువు వొళ్ళోనే కూచో, ఆకాశాని కెగురు, పాతాళంలో దూరు. ఏమయినా రాముడు నిన్ను విడిచిపెట్టడు"

దీనిమీద ప్రహస్తు డందుకుని "దేవతలవలనా, దానవులవల్లా కూడా మాకు భయంలేదు. యక్షులవల్లా, గంధర్వులవల్లా, నాగులవల్లా, పక్షులవల్లా కూడా మాకు భయంలేదు. ఇలాంటిస్థితిలో ఒక రాజుకొడుకు రామునివల్ల మాకేమి భయమూ?" అన్నాడు. అందుకు విభీషణుడు మళ్ళీ యిలా అన్నాడు.

"ప్రహస్తా! ధర్మదూరుడు స్వర్గానికి వెళ్ళలేడు. అలాగే, రాజేంద్రుడూ, మహోదరుడూ, కుంభకర్ణుడూ, నువ్వూ కూడా రాముని యెడల చేస్తానన్నది వొక్కటీ చెయ్యలేరు. పడవలేనివాడు సముద్రం దాటలేడు. అలాగే నేనూ, నువ్వూ, రాక్షసు లందరూ కూడా రాముణ్ణి వధించలేరు. ఇక్ష్వాకువంశప్రభువు డైన రాముడు ధర్మప్రధానుడు. మహారథుడు. అతని యెదట నిలిస్తే దేవతలు కూడా మూఢులయిపోతారు. కంకపత్రాలు కట్టిన రాముని తీక్ష్ణబాణాలు నీ శరీరం యింకా భేదించలేదు. అంచేతే నువ్విలా దంభాలు పలుకుతున్నావు. రావణుడు గాని, అతిబలశాలి అయిన త్రిశీర్షుడు గాని, కుంభకర్ణుడు గాని, అతని కొడుకైన నికుంభుడు గాని, ఇంద్రజిత్తుగాని ఇంద్రతుల్యుడైన రాముణ్ణి ఎదిరించి యుద్ధంలో ఆగలేరు. మీరే కాదు, దేవాంతకుడూ, నరాంతకుడూ, అతికాయుడూ, అద్రిధీరు డైన అకంపనుడూ కూడా రాముణ్ణి యెదిరించి యుద్ధంలో ఆగలేరు. సహజంగా వ్యసనాలకు అలవాటుపడ్డ యీరాక్షసరాజు మిత్రుల రూపాన శత్రువు లయివున్న మీమాటల కుబ్బిపోయి మంచీచెడ్డా గుర్తించలేక రాక్షసుల కందరికీ వినాశం

తెచ్చిపెడుతున్నాడు. ఇప్పటి కయినా బుద్ధి తెచ్చుకోండి. శ్రీరాము నితో విరోధం అనే మహాసర్పం రావణుణ్ణి చుట్టుకుంది. దానికెన్నో పడగలున్నాయి. వెయ్యితలలున్నాయి. చాలా భయంకరమైనది. అతి బలవంతమైనది. దానిబారి తప్పించి రావణుణ్ణి మీరు రక్షించండి. రాజు దుర్మార్గు డయితే పరిపూర్ణకాములైన స్నేహితులందరూ కలిసి జుట్టుపట్టుకుని యీడ్చి అయినా మంచిదారికి తేవాలి. మన రాజుసర్వ నాశనం కలిగించే లక్ష్మణు డనే సముద్రంలో రాముడనే బడబాగ్ని వాతబడ్డాడు. మీరంతా యిప్పుడేచేయూత యిచ్చి అతణ్ణుద్ధరించాలి. నేను చెప్పే మాటలు లంకాపురానికీ, రాక్షసులకూ, రాజుకీ, స్నేహి తులకూ శ్రేయస్కరమైనవి. ఇప్పు డయినా సీతను రామున కిచ్చేద్దాం పదండి. మంత్రి అయినవాడు శత్రువుల సామర్థ్యమూ తన ప్రభుశక్తీ తెలుసుకోవాలి. శత్రువు అంతరమూ తన రాజు అంతరమూ గుర్తిం చాలి. శత్రువు వృద్ధిక్షయాలూ తనరాజు వృద్ధిక్షయాలూ పరిశీ లించాలి. తన ప్రభువు శ్రేయస్సు కోరాలి. ఏమాట అయినా అప్పుడు చెప్పాలి ”

## ౧౫

## విభీషణుడు ఇంద్రజిత్తుకి బుద్ధిచెప్పడం

బృహస్పతివంటి బుద్ధిశాలి విభీషణు డిలా అనగా రాక్షసయోధులలో అతిముఖ్యుడైన ఇంద్రజిత్తు అందుకుని “ పినతండ్రీ! భయగ్రస్తుడులాగ యెంత అర్థంలేనిమాట చెప్పావయ్యా ? మనవంశంలోనే కాదు, మరే వంశంలో పుట్టినవాడూ గూడా యిలాంటిమాట చెప్పడుగదయ్యా ! మనవంశంలో సత్త్వాలోనూ బలవీర్యపరాక్రమాల్లోనూ, శౌర్యధైర్య సాహసాల్లోనూ, తేజస్సులోనూ హీనుడవు నువ్వొక్కడవే కనపడు తున్నావయ్యా ! ఆరామలక్ష్మణులను మనలో అతిసామాన్యుడు కూడా

సంహారించి వెయ్యగలడు, నీకీ పిరికితనం యేల? త్రిలోకాధిపతీ దేవ తలకు కూడా ప్రభువూ అయిన మహేంద్రుణ్ణి నేను నేలబెట్టిరాసేసి వున్నాను. దేవత లందరూ నాకు భయపడి దిక్కు తెలియకుండా పారి పోయారు. నేను కొట్టిన దెబ్బకి ఐరావతం మొర్రోమంటూ నేలబడి దొర్లిపోయింది. దాని దంతాలు పెరికి వాటితో నేను దేవతల నంద రినీ చావగొట్టాను. ఇలాగ దేవతలగర్వం అణచిన నేను దైత్యులను గూడాపీడిపించగల నేను మనుష్యమాత్రులైన ఆ రాజపుత్రులను సంహా రించలేనూ?'' అని అడిగాడు.

దానిమీాద మళ్ళీ విభీషణుడు అందుకుని “నాయనా! మంత్రాలో చన చెయ్యడానికి నీకు తాహతులేదు. నువ్వింకా పిల్లకాయవు. నీ కింకా వివేకం కలగలేదు. అంచేతనే నువ్వు నీకే అపకారంగా యిలాగ అర్థంలేకుండా మాట్టాడావు. నువ్వు రావణునకు కొడుకువనిపేరు; కాని నిజంగా నువ్వతనికి పరమశత్రుడవు. అంచేతనే రామునిచేతిలో వినా శం తప్పదని తెలిసివుండిన్నీ నువ్వందుకు సమ్మతిస్తున్నావు. నువ్వు దుర్మతివి. వధ్యుడవు. బాలుడవూ, సాహసికుడవూ అయిన నిన్ను ఆలోచనలో పాలుపుచ్చుకోడాని కిక్కడికిపిలిచినవాడు వధ్యుడు. ఇంద్ర జిత్తూ! నువ్వు మూఢుడవూ, మూర్ఖుడవూను. పండితంమన్యుడవు. శిక్ష యెరగనివాడవు. మిక్కిలీ దుర్మతివి. చిన్నతనంవల్ల నువ్విలా మాట్లా డుతున్నావు. రాముని బాణాలు బ్రహ్మదండంతో సమానమైనవి. కాలపాశసమానాలు. యమదండంవంటివి. వాటి నెవడు సహించ గలడూ? రాజా! ఇప్పటి కయినా మించిపోయింది లేదు. ధనధా న్యాలూ, రత్నాలూ, రత్నాభరణాలూ, జాంబూనదాంబరాలూ, చిత్రవిచిత్రాలైన దివ్యమణులూ కానుకగాబెట్టి రామునకు సీతను సమర్పించుకుందాం. మనం మనజన్మభూమిలో నిర్విచారంగా బతుకు దాము'' అని చెప్పాడు.

౧౬

## విభీషణుడు అవమానంపొంది ఆకాశాని కెగరడం

ఇది విని రావణుడు కాలచోదితుడై మిక్కిలీ కోపించి విభీషణుణ్ణి తిరస్కరిస్తూ "ఆగర్భశత్రువుతో కలిసి వుండవచ్చు. క్రుద్ధమైన కాల సర్పంతో కూడా కలిసినివసించవచ్చు. కాని శత్రుపక్షంలో వుండి మిత్రుడులాగ నటించేవాడితో సహవాసం చెయ్యగూడదు. విభీషణా! లోకంలో జ్ఞాతుల స్వభావం యెలాంటిదో నాకు బాగా తెలుసు. జ్ఞాతులైనవాళ్ళు తమజ్ఞాతులకు చిక్కులువస్తే చాలా సంతోషిస్తారు. జ్ఞాతులైనవాళ్ళు, తమ కులంలో నాయకమణి అయినవాణ్ణీ కార్యం సాధించగలవాణ్ణీ పండితుడైనవాణ్ణీ ధర్మశీలుణ్ణీ, శూరుణ్ణీ చూసి వోర్చలేరు. పరాభవం కూడా చేస్తారు. జ్ఞాతులు వట్టివేళల ఆనందం గానే వుంటారు; కాని తమలో యెవరికయినా ఆపదలు వస్తే వారిని రకరకాలుగా అల్లరిచేస్తారు. మనసులో వొకటుంచుకుని పైకి వొకటి మాట్లాడతారు. చాలా ఘోరాలు చేస్తారు. కనక, జ్ఞాతులవిషయమై యెప్పుడూ భయపడుతూనే వుండాలి. వెనకటికి పద్మవనంలో కొన్ని యేనుగులు చదివిన శ్లోకా లున్నాయి. వాటిని పట్టుకోడానికి కొందరు మనుష్యులు తాళ్ళుపట్టుకువచ్చారు. అప్పు డవి యేమన్నాయో తెలుసా? "అగ్నివల్ల మనకు భయంలేదు. అస్త్రశస్త్రాలవల్లనూ మనకు భయంలేదు. తాళ్ళు కూడా మనల్ని యేమీ చెయ్యలేవు. స్వార్థపరులయిన మన జ్ఞాతులే మన కాపదలు తెచ్చిపెడతారు. ఈ మనుష్యులకు మనల్నిపట్టుకోడానికి తగ్గ ఉపాయాలు మనజ్ఞాతులే చెబుతారు. భయా లన్నింటిలోనూ జ్ఞాతులవల్ల కలిగే భయమే చాలా దారుణమైనది. ఆవులలో సంపద వుంది. బ్రాహ్మణులలో దమం వుంది. స్త్రీలలో చాపల్యంవుంది. అలాగే జ్ఞాతులలో భయం కరత్వం వుంది. సౌమ్యుడా! కనకనే, నేను త్రిలోకపూజితు ణ్ణయి

పరమైశ్వర్యవంతు ణ్ణాయి, జ్ఞాతులందరిలోనూ సర్వో త్తము ణ్ణాయి వుండ డం నువ్వు చూడలేకుండా వున్నావు. తామరాకులో పడ్డ నీటిబిందువు లాకదాని కొకటి కలియవు. అలాగే జ్ఞాతుల్లో ఐకమత్యం వుండదు. తుమ్మెద మకరందం పానం చెయ్యడం అయిపోయాక ఒక్క క్షణం అయినా పువ్వుతో కలిసివుండదు. నువ్వు నావల్ల అనేకమైన లాభాలూ ఉపకారాలూ మన్ననలూ పొందావు. కాని నేనంటే నీకుఇష్టంలేదు. ఏనుగు చక్కగా స్నానంచేసి తొండంతో యెత్తి తరవాత తన మీదే దుమ్ము చల్లుకుంటుంది. జ్ఞాతుల మనస్తత్వం కూడా అలాగే వుంటుంది శరదృతువులో మేఘాలు దిమ్మరించేసేటట్టు వురుముతాయి; కాని వొక్కచుక్క అయినా వాన జారిపడదు. జ్ఞాతుల సానుభూతి కూడా యిలాగే వుంటుంది. మరొక డెవడైనా యీమాట లనివుంటె వాడి పుచ్చె యెగిరిపోయివుండును. నిన్ను కనక విడిచిపెట్టాను. ఛీ, కులపాం సనా, పో ” అని గదిమాడు.

ఇది విని న్యాయవాది అయిన విభీషణుడు గదాహస్తుడై నలుగురు రాక్షసులతో కూడా ఆకాశాని కెగిరాడు. అక్కడ నిలిచి మిక్కిలీ క్రోధంతో అతను రావణుణ్ణి చూసి “రాజేంద్రా ! నువ్వు నాకు సోద రుడవు. కనక, నీకు తోచిన ట్లల్లా అను. నువ్వు నాకు జ్యేష్ఠభ్రాతవు; కనక, తండ్రితో సమానుడవు; కాని నువ్వు ధర్మబాహ్యుడవై ఉన్నావు. నామీద దారుణ నింద మోపి కఠినంగా మాట్లాడావు. ఇది మాత్రం నేను క్షమించను. నీహితం కోరి నేను మంచిమాట చెప్పాను; అయితే, కాలవశులైన దురాత్ములు అలాంటివి వినరు. రాజా! ఎప్పుడూ ఇచ్చకాలాడేవారు చాలా సులభంగా దొరుకుతారు. అప్రి యం అయినా సత్యం చెప్పేవాళ్ళూ దొరకరు, వినేవాళ్లూ దొరకరు. సర్వభూతాంతక మైన యమపాశం నీమెడలో తగులుకునివుంది. ఇల్లు తగలబడుతూ వుంటే చూసి వూరుకోలేనట్టు నీవినాశం చూసి సహించ

లేకపోయాను. అగ్నిహోత్రంవంటి రామబాణాలు నిన్ను నాశనం చెయ్యడం నాకిష్టంలేదు. శూరులూ, బలవంతులూ, కృతాస్త్రిలూ కూడా కాలం మూడినప్పుడు ఇసకతో కట్టిన బొమ్మరిళ్ళలాగ కూలిపోతారు, తప్పదు. నువ్వు నాకంటే పెద్దవాడవు కనక నీహితంకోరి నేను చెప్పింది క్షమించు. నామాటకేం, నిన్ను నువ్వు రక్షించుకో. ఈలంకా పట్నం నాశనం కాకుండా చూడు. రాక్షసకులం అంతరించిపోకుండా చూడు. నీకు శుభం కావాలి. నేనిదే వెళ్ళిపోతున్నాను. నేను లేకపోవడంవల్ల నీకు సుఖాలు కలిగితే హాయిగా అనుభవించు ”

## ౧౭
## విభీషణ శరణాగతి

ఇలా అని విభీషణుడు నిమిషంలో రాము డున్నచోటికి వచ్చాడు. మేరుశిఖరంలాగ మెరిసిపోతూ ఆకాశాన నిలిచివుండిన అతణ్ణి భూమిమీద వుండిన వానరు లందరూ చూశారు. విభీషణునితో కూడా వున్న రాక్షసులు అనలుడూ, శరభుడూ, సంపాతీ, ప్రఘసుడూ అనే వాళ్లు. వాళ్ళతో వున్నవిభీషణుణ్ణి చూసి సేనాధిపతి అయిన సుగ్రీవుడు బాగా పరిశీలించి హనుమంతుడు మొదలైన వానరులతో “ఈరాక్షసుడు సకలాయుధాలూ ధరించి నలుగురు రాక్షసులను వెంటపెట్టుకు వచ్చాడు, చూడండి, మనల్ని కొట్టడానికే అయివుంటుంది ”అన్నాడు. దానిమీద కొందరు వానరవీరులు రాళ్లూ రప్పలూ పుచ్చుకుని “రాజేంద్రా ! వీళ్ళని చంపడానికి మాకు సెలవియ్యి. ఈఅల్పులు నిమిషంలో నేలమీద కూలిపోవాలి ” అని ప్రార్థించారు. ఇదంతా వింటూ విభీషణుడు ఉత్తరపుగట్టుమీదే ఆకాశాన నిలిచివుండి ఆవానరయోధులనూ, సుగ్రీవుణ్ణీ పిలిచి గంభీరంగా “దుర్వృత్తను డైన రావణుడు రాక్షసరాజు. నేను అతని సోదరుణ్ణి. నాపేరు విభీషణుడు.

మాఅన్న అయిన రావణుడు జనస్థానంలో జటాయువును చంపి సీత నెత్తుకుపోయాడు. ఆమె యిప్పుడు రాక్షసాంగనలమధ్య దీనఅయి పడి వుంది. నేను మాఅన్నకి "సీతను రామున కిచ్చెయ్యి" అని అనేక విధాల చెప్పాను; కాని చావనున్న వాడు ఔషధం తిరస్కరించేటట్టు అతను నేను చెప్పింది తిరస్కరించేశాడు. పైపెచ్చు, అతను నన్ను చాలా కఠినంగా మందలించాడు. భృత్యుణ్ణి చూసినట్టు చూసి అవమానం కూడా చేశాడు. అంచేత నేను నాభార్యనూ బిడ్డలనూ విడిచి రాముణ్ణి శరణుపొందడానికి వచ్చాను. సర్వలోకశరణ్యుడైన రామునితో నాసంగతి వెంటనే విన్నవించండి" అని ప్రార్థించాడు.

ఇది విని సుగ్రీవుడు లక్ష్మణుడు వింటూవుండగా రామునితో "రావణుని తమ్ముడు విభీషణుడు అనేవాడు నలుగురు రాక్షసులతో నిన్ను శరణుపొందడానికి వచ్చాడు. రామా! ఇటు వానరులూ, అటు రాక్షసులూ చూపించే కార్యాకార్యవిచారణా, సేనావిన్యాసమూ, నీతిప్రయోగమూ, గూఢచారప్రేషణమూ బాగా పరిశీలించవలసివుంది. ఈరాక్షసులు కామరూపులు. మాయావులు. శూరులు కపటతంత్రపారీణులు. వీళ్ళ నెన్నడూ నమ్మగూడదు. ఈవిభీషణుడు రావణుని పక్షంగా వచ్చిన చారుడై వుంటాడు, సందేహం లేదు. వీణ్ణి మనం చేర్చుకున్నామంటే మనలో మనకు కలతలుపెడతాడు తప్పదు. లేదా, బుద్ధిశాలి అయిన యీవిభీషణుడు నమ్మకంగా వున్నట్టే వుండి వీలు చిక్కినప్పుడు తానే మనలను నాశనంచేసేస్తాడు. మిత్రసైన్యమూ, ఆటవికసైన్యమూ, మూలబలమూ, జీతంపుచ్చుకుని పనిచేసే సైన్యమూ కూడా స్వీకరించవచ్చు గాని యెప్పుడూ శత్రుసైన్యం మాత్రం స్వీకరించగూడదు. ఈవిభీషణుడు సాక్షాత్తూ నీపరమశత్రువైన రావణుని తమ్ముడు. రావణుని దగ్గిరనుంచే వచ్చాడు. వీణ్ణెలాగా నమ్మడం? ఈవిభీషణుడు రావణుని గూఢచారు డనే నానమ్మకం. కనక, వీణ్ణి

శిక్షించవలసిందే. మనలో చేరి నువ్వు తనని నమ్మగానే సందుచూసి వీడు మనలను దెబ్బతీస్తాడు తప్పదు. శత్రువులసైన్యంలో మాయగా ప్రవేశించి గుడ్లగూబ కాకులను చంపేటట్టు వాళ్ళని చంపడం శత్రువుల పద్ధతి. ఈవిభీషణుడు రావణుని సోదరుడు కనుక, మంత్రులతో గూడా వీణ్ణి తీవ్రంగా దండించవలసిందే” అని చెప్పి వూరుకున్నాడు.

సుగ్రీవుడిలా చెప్పగా, రాముడు దగ్గిరగా వున్న వానర ప్రముఖులను చూసి “విభీషణుని విషయమై వానరరాజు చెప్పింది మీరు విన్నారు. అది హేతుబద్ధంగా వుంది. భావగంభీరంగానూవుంది. ఒక మిత్రుడు చెప్పిన తరవాత మనకెందుకని మరొకమిత్రు డూరుకో గూడదు. కార్య సంకటం వచ్చినప్పుడు బుద్ధిమంతులైన మిత్రులంతాకూ తమతమ అభిప్రాయాలు స్పష్టంగా చెప్పవలసిందే. అన్నాడు. దాని మీద వారందరూ, “రామా! ముల్లోకాల్లోనూ నీకు తెలియని దేమీ లేదు. స్నేహం వల్ల మమ్మల్ని గౌరవించడానికి మాత్రమే అడుగుతున్నావు. నువ్వు సత్యవ్రతుడవు. శూరుడవు. ధార్మికుడవు. దృఢవిక్రముడవు. ఏపనిచేసినా నువ్వు బాగా పరిశీలించి మరీచేస్తావు. స్నేహపరతంత్రుడవు. అంచేత మతిమంతులూ, సమర్థులూ అయిన నీమంత్రులు సహేతుంగా తమ అభిప్రాయాలు చెప్పాలి”, అన్నారు.

అప్పుడు అంగదు డందుకుని “ఇంద్రుని దగ్గిరనుంచి వచ్చినవాణ్ణయినా మనం అనుమానించవలసిందే కనుక, బాగా ఆలోచించకుండా మనం విభీషణుణ్ణి నమ్మడానికి వీలులేదు. వంచకుడు తమదుర్దేశం తెలియకుండా చాలా జాగ్రత్తగా మసులుకుంటారు. లోటు దొరికిం దంటే వెంటనే దెబ్బతీస్తాడు. అంచేత కష్టసుఖాలూ, లాభనష్టాలూ, ఆలోచించి మనం యేపని అయినా చెయ్యాలి. గుణాలను బట్టి గ్రహించాలి. దోషాలుంటే విడిచిపెట్టెయ్యాలి. విభీషణుని విషయమై కూడా మన కిదే పద్ధతి” అని చెప్పాడు. శరభుడు “రామా! విభీషణుని

సంగతి సందర్భాలు తెలుసుకోడానికి గూఢచారిని నియమించడం మంచిది. దానిమీద యెలా వీలుంటే అలా చెయ్యవచ్చు'' నన్నాడు. జాంబవంతుడు శాస్త్రదృష్ట్యా విచారణచేసి "రామా! రావణుడు నీయెడల బద్ధవిరోధి అయివున్నాడు. సహజంగా వాడు మహాపాపి. ఆరావణుని దగ్గిరనుంచి వచ్చాడు కనక విభీషణుని విషయమై మనం అనుమానపడవలసిందే'' అని చెప్పాడు.

అప్పుడు నీతిశాస్త్రవిశారదు డైన మైందు డందుకొని "రామా! మనవా డొకడు వెళ్లి విభీషణుణ్ణి మెల్లిగా రావణుని మాట యేమిటని అడగాలి. దాంతో విభీషణుని సంగతి తెలుస్తుంది. దానిమీద నువ్వేమి చెయ్యాలో నిశ్చయించవచ్చు'' నని చెప్పాడు. ఇది విని సంస్కారి అయిన హనుమంతు డందుకున్నాడు. "రామా! నువ్వు మిక్కిలీ బుద్ధిమంతుడవు. సమర్థుడవు. మాటకారివి. బృహస్పతి అయినా మాటలలో నిన్ను మించలేడు. నేను నా వాదకౌశలం చూపించదలుచుకోలేదు. చర్చకూడా ప్రారంభించడంలేదు. అందరికంటే అధికుణ్ణని కూడా నే ననుకోడంలేదు. మాట్లాడా లన్న సరదాతో కూడా చెప్పను. ఇక నాకు తోచింది తోచినట్టు చెబుతాను. నువ్వడిగితే చెప్పకుండా వుండలేను గనక చెబుతాను, అంతే. మంచిచెడ్డలు విమర్శించి మంత్రులు చాలాచెప్పారు; కాని అందులో నాకు దోషం కనపడుతోంది. అది జరిగేపనికాదు. పనిచెబితే గాని సామర్థ్యం తెలియదు. సామర్థ్యం తెలియకుండా తొందరపడి పనిలో ప్రవేశపెడితే అపాయం రావచ్చు. మంత్రులలో వొకడు గూఢచారుని పంపి సంగతి సందర్భాలు తెలుసుకోవా లన్నాడు. అది యుక్తంగాలేదు. ఎదట వుండినవానిదగ్గిరికి చారుని పంపడం యెందుకూ; ఈ విభీషణుడు రాకూడనిచోటికి ఆకాలంలో వచ్చా డని వొకడు చెప్పాడు. ఆ విషయమై నాకు వివక్షతవుంది. అది చెబుతావిను. విభీషణుడు సరియైన

చోటికే వచ్చాడు. సరియైన సమయంలోనే వచ్చాడు. విభీషణుడు రావణుణ్ణీ నిన్నూ పరామర్శించి తెలుసుకున్నాడు. అతనికి రావణుని దగ్గిర దుర్మార్గవృత్తి కనపడింది. అందుకు తగ్గట్టు నీదగ్గిర అంతులేని పరాక్రమం కనపడింది. ఈ స్థితిలో అతనిక్కడికి రావడంలో తప్పేమిటీ? ఎరగనివాణ్ణి పంపి తెలుసుకోవాలని వొక మంత్రి చెప్పాడు. ఎవడో వచ్చి యేదో అడిగితే యేమిటిదీ అని అవతలివాడికి అనుమానం కలుగుతుంది. దానివల్ల మంచిఉద్దేశంతో వచ్చినవాడు కూడా మారిపోవచ్చు. సాధారణంగా ఇతరుల అభిప్రాయం తెలుసుకోడం చాలాకష్టం. మాటలను పట్టి చూసినా, ముఖం ప్రసన్నంగా వుండడం చూసినా విభీషణునిదిగ్గిర దుష్టభావం వున్నట్టు నాకనుమానం కలగడంలేదు. కుత్సితభావాలు గలవాడు నిశ్శంకగా రాలేడు. విభీషణుని మాటలు కూడా నిర్దోషంగా వున్నాయి. ముఖంలో వికారం లేకుండా వుండాలని యెంత జాగ్రత్తపడ్డా లాభంలేదు. హృద్గతాభిప్రాయం యెలాగా తెలిసేపోతుంది. దేశకాలపాత్రలను సరిగా గుర్తించి చేసిన ప్రయోగం వెంటనే సఫలం అవుతుంది. ఈ విభీషణుడు నీ దండయాత్ర సంగతి తెలుసుకున్నాడు. రావణుడు దుర్మార్గుడై వుండడం గుర్తించాడు. నువ్వు వాలిని సంహరించడమూ, సుగ్రీవునకు పట్టాభిషేకం చెయ్యడం విన్నాడు. రాజ్యాశ కలిగివుంటుంది. దాంతో బుద్ధిపూర్వకంగా యిక్కడికి వచ్చాడు. ఉన్నదల్లా యిది. కనక, విభీషణుణ్ణి నిశ్శంకగా చేర్చుకోవచ్చు. నాకు తోచిందిదీ. ఇక తరవాత నీయిష్టం" అని నిపుణంగా చెప్పాడు.

## ౧౮
## రాముడు విభీషణునితో స్నేహంచెయ్యడం

మహాపండితుడైన రాముడు హనుమంతుడు చెప్పిందివిని మిక్కిలీ ప్రసన్నుడై "నేను కూడా కొంచెం చెప్పవలసివుంది. మీరందరూ

నా(శేయస్సు కోరేవారు కనక అది బాగా వినాలి. మిత్రభావంతో వచ్చినవాణ్ణి, ఎంత దోషి నైనా నేను విడిచిపెట్టలేను. ఇది సత్పురుషులు చెయ్యతగ్గది కాదు" అన్నాడు. సుగ్రీవు డది విని "ఈ విభీషణుడు దుష్టు డైనా మనకి పనిలేదు. రావణు డిప్పుడు గొప్పవిపత్తులో పడివున్నాడు. అతన్ని విడిచిపెట్టడం విభీషణునకు ధర్మం కాదు. ఇక పీ డెవరిని విడిచిపెట్టకుండా వుంటాడు?" అని అడిగాడు.

రాము డిది విని వానరుల నందరినీ చూసి, లక్ష్మణునిమీద మందహాసంపరిపి "ఇప్పుడు వానర రాజయిన సుగ్రీవుడు చెప్పినది సకల శాస్త్రాలూ చదివి, వృద్ధులను బాగా సేవించినవాడు గాని సామాన్యుడు చెప్పలేడు. రాజు లైనవారి కందరికీ ఇలాంటి సందర్భాలలో స్వీకరించవలసిన సూక్ష్మధర్మం వొకటుంది. అది నాకిప్పుడు జ్ఞాపకం వస్తోంది. జ్ఞాతులూ, ఇరుగుపొరుగు దేశాలవారూ ఆపదలు వచ్చినప్పుడు దెబ్బతీసే శత్రువు లని చెప్పబడ్డారు. ఈ విభీషణుడు తన జ్ఞాతిని విడిచివచ్చాడు. యోగ్యులయిన రాజులు జ్ఞాతులలో తమ కిష్టులయిన వారిని గౌరవిస్తారు; కాని ఆజ్ఞాతి శౌర్యధైర్యసంపన్ను డయితే మాత్రం శంకిస్తూనే వుంటారు. శత్రువును చేర్చుకోగూడ దని నువ్వు చెప్పావే, ఆవిషయమై శాస్త్రీయంగా చెబుతాను విను. మనం రాక్షసులం కాము. అంచేత లంకారాజ్యం కోరము. విభీషణుడు కోరుతున్నాడు. రాక్షసులలో కూడా బాగా ఆలోచించగల గొప్పపండితు, లున్నారు. అంచేత, మనం విభీషణుణ్ణి చేర్చుకోవచ్చు. జ్ఞాతు లైనవాళ్ళెప్పుడూ వొకళ్ళతో వొకళ్ళు కలహించుకుంటూనే వుంటారు; గాని ఇష్టంగా వుండరు. విభీషణుడు, రావణుడు తనని బాధిస్తా డని నిశ్చయించుకున్నాడు. అంచేతే మన దగ్గిరికి వచ్చాడు. కనక, మనం యితణ్ణి చేరదియ్యవచ్చు. సోదరు లందరూ యెప్పుడూ భరతునివంటివారు

కారు. ప్రతీతండ్రికీ నావంటి కొడుకు లుండరు. నీవంటి స్నేహితులు కూడా యెక్కడా వుండరు” అని చెప్పాడు.

ఇది విని సుగ్రీవుడు లేచి రామునకు నమస్కరించి “రామా! విభీషణుణ్ణి రావణుడే పంపాడని యిప్పటి కయినా తెలుసుకో. అతణ్ణి శిక్షించడమే మంచి దని నానమ్మకం. ఈ విభీషణుడు, రావణుడు పంపగా నిన్నూ నన్నూ లక్ష్మణుణ్ణి వీలయినప్పుడు చంపడానికే వచ్చాడు. కనక, మంత్రులనూ విభీషణుణ్ణీ కూడా నువ్వు వధించవలసిందే. నువ్వెన్ని చెప్పినా యీ విభీషణుడు దుష్టబుద్ధి అయిన రావణుని తమ్ముడు” అని చెప్పి వూరుకున్నాడు.

దానిమీద రాము డిలా అన్నాడు. “సుగ్రీవా! ఈ విభీషణుడు మంచివా డయినా చెడ్డవా డయినా నన్నేమీ చెయ్యలేడు. నేను తలుచుకున్నానంటే పిశాచులనూ, దానవులనూ, యక్షులనూ, రాక్షసులనూ కూడా కొనగోటితో సంహరించెయ్యగలను. వెనకటికి, ఒక పావురం తనకి శరణుపొందిన శత్రువును తన మాంసం కోసిపెట్టి పూజించింది, విన్నావా? ఆ పావురమే తన భార్యను హరించిన బోయవానిని రక్షించిందే, ఇక నావంటివాడు ఊరుకోవలసిందేనా! కండుమహాముని కణ్వమహర్షి కొడుకు. అతను గొప్పసత్యవాది. అత నొక కథ చెప్పాడు. అది మిక్కిలీ ధర్మబంధురమైనది. అది విను. క్రౌర్యం దండనార్హమే; కాని అది చేసిన శత్రువు వచ్చి శరణు వేడితే దానికోసం వాణ్ణి దండించగూడదు. శత్రువు వచ్చి కాళ్ళమీద పడితే వాడు పిరికిపంద అయినా, శూరు డయినా, గర్విష్ఠి అయినా రక్షించవలసిందే. అలాంటివాణ్ణి అజ్ఞానంవల్లగాని, భయంవల్లగాని, బుద్ధిపూర్వకంగాగాని, మూర్ఖ్యంవల్లగాని రక్షించకపోవడం చాలా ఘోరమైన పాపం. అది లోకగర్హితం. శరణుపొందినవాణ్ణి రక్షించకపోతే తానదివరకు చేసుకున్న పుణ్యం అంతా వాడు పట్టుకుపోతాడు. శరణాగతులను

రక్షించకపోవడం చాలా దోషం. అపకీర్తికరం. బలవీర్యవినాశకం. కనక, నేను కండుమహర్షి చెప్పినట్టు తప్పకుండా చేస్తాను. దానివల్ల ధర్మమూ, కీర్తీ, చివరికి స్వర్గసౌఖ్యమూ కలుగుతాయి. ఎవడు వచ్చి నన్ను శరణువేడినా వాడికెవరివల్లా ఆపద కలక్కుండా నేను రక్షిస్తాను. ఇది నావ్రతం. కనక, సుగ్రీవా అతన్ని తీసుకురా! విభీషణుడే కాదు, రావణుడు వచ్చి అభయం కోరినా నేనిస్తాను" అని చెప్పాడు.

రాముని మాట విని సుగ్రీవుడు "రామా! నువ్వు ధర్మం తెలిసినవాడవు. లోకనాథుడవు. సర్వభూతాలకూ సుఖప్రదాతవు. సత్త్వవంతుడవు. సన్మార్గవర్తనుడవు. నువ్విలా అనడంలో ఆశ్చర్యం యేమీ లేదు. నేను విభీషణుణ్ణి వధించాలని వాదించినా నా అంతరాత్మ అతను పరిశుద్ధుడని గ్రహించింది. నేననేకవిధాల పరిశీలించి యిది తెలుసుకున్నాను. కనక, విభీషణుడు వెంటనే మా అందరితో సమానుడై నీకు సఖుడు కావాలి" అని చెప్పి విభీషణుణ్ణి తీసుకువచ్చాడు. రాముడూ విభీషణుడూ స్నేహితులైనారు. అది గరుత్మంతుడూ దేవేంద్రుడూ స్నేహం చేసుకున్నట్టుంది.

## ౧౯
## ద ర్భ శ య న ం

ఇలాగ రాముడభయం యివ్వగానే రావణానుజుడైన విభీషణుడు తన యెడల మిక్కిలీ భయభక్తులుగల అనుచరులతో గూడ భూమి మీదికి దిగాడు. వెంటనే అతను రాముని కాళ్ళమీదపడి "నేను రావణుని తమ్ముణ్ణి. అతను నన్నవమానపరిచాడు. సర్వభూతశరణ్యుడవైన నిన్ను శరణుపొందడానికి వచ్చాను. నామిత్రులతోనూ నా సంపదతోనూ నేను లంక విడిచిపెట్టేశాను. నారాజ్యమూ, నాజీవితమూ నాసుఖాలూ నీచేతిలో వున్నాయి" అన్నాడు. దాని మీద రాము

డతనిమీాద కరుణాకటాక్షాలు పరుపుతూ "రాక్షసుల బలాబలా లన్నీ నాకు వివరంగా చెప్పు" అని అడిగాడు. విభీషణుడిలా ప్రారం భించాడు.

"రామా! రావణునకు బ్రహ్మదేవు డొక వరం దయచేశాడు. దానివల్ల గంధర్వుల్గూ, నాగులూ, రాక్షసులూ మొదలైనవా రెవరూ కూడా రావణుణ్ణి చంపలేరు. అతని తరవాతివాడూ నాకంటే పెద్దవాడూ అయిన కుంభకర్ణుడు మహాతేజశ్శాలి. యుద్ధరంగంలోకి వెళ్ళాడంటే అతనికి చాలినవాడు దేవేంద్రు డొక్కడే. రావణుని సేనాధిపతి ప్రహస్తుడు. అతను కైలాసపర్వతంమీాద కుబేరుని సేనాధి పతి అయిన మాణిభద్రుణ్ణి జయించాడు, ఇది నువ్వు వినే వుంటావు. ఇక రావణుని కొడుకు ఇంద్రజిత్తున్నాడు. అతను గోధాంగుళీత్రాణాలు ధరించి, కవచం వేసుకుని, ధనుస్సు చేతబట్టగానే అదృశ్యు డయి పోతాడు. అతను, అటు యుద్ధం జరుగుతూవుండగా యిటు హోమం చేసి అగ్నిహోత్రుణ్ణి తృప్తిపరిచి అంతర్ధానం అయి శత్రువులను నాశనం చేసేస్తాడు. మహోదరుడూ, మహాపార్శ్వుడూ, అకంపనుడూ మొదలైన సేనాధిపతులింకా చాలామంది వున్నారు. వారిని లోకపాల కులు మాత్రమే యెదిరించగలరు. రాక్షసయోధులు లంకలో పది వేలకోట్లున్నారు. వాళ్ళందరూ మాంసం తిని రక్తం తాగుతారు. ఏ రూపం కావా లంటే ఆరూపం పొందగలరు. వాళ్ళనుబెట్టుకుని రావణుడు లోకపాలకుల నందరినీ జయించాడు. దేవతాయోధులూ, లోకపాలకులూ రావణునిచేతిలో ఘోరంగా పరాభవం పొందారు"

ఇది విని రాముడు అంతా బోధపరుచుకని "విభీషణా! నువ్వు చెప్పిన రావణుని శక్తిసామర్థ్యాలూ విలాసచేష్టలూ నాకు బాగా అవగాహన అయినాయి. ఇక నేను చెప్పవలసిం దొక్కటే. నేను ప్రహస్తునితోటీ సకలబంధువులతోనూ దశగ్రీవుడైన రావణుణ్ణి సంహ

రించి లంకారాజ్యం నీకిస్తాను. రావణుడు రసాతలానికి పారిపోనియ్యి. పాతాళంలో దాగుకోనియ్యి. బ్రహ్మదేవుణ్ణి ఆశ్రయించనియ్యి. నేను అతణ్ణి ప్రాణాలతో వుండనియ్యను. సపుత్రబలబాంధవంగా రావణుణ్ణి చంపిగాని నేను అయోధ్యలో అడుగుపెట్టను. ఇది నేనుసోదరులు ముగ్గురిమీదా వొట్టుపెట్టి చెబుతున్నాను" అని శపథంచేసి చెప్పాడు.

ఇదివినివిభీషణుడు రాముణ్ణి శిరసా నమస్కరించి "రామా! లంక పట్టుకోడానికీ, రాక్షసులను సంహరించడానికీ నాప్రాణాలు అయినా విడిచిపెడతాను. ఇదే నీసైన్యంలో చేరి నేను యుద్ధంచేస్తాను" అన్నాడు. అప్పుడు రాముడు లక్ష్మణుణ్ణి పిలిచి "తమ్ముడా! సముద్రజలం తెచ్చి దాంతో యీ విభీషణునకు నాయెదట రాక్షస రాజ్యాధిపత్యం అభిషేకం చెయ్యి" అని ఆజ్ఞాపించాడు. లక్ష్మణుడు ఆ సకలవానరయోధులూ చూస్తుండగా రాముడు చెప్పినట్టు చేశాడు. రాము డలా అనుగ్రహించడం చూసి వానరు లందరూ "సాధుసాధు" అని హర్షధ్వానాలు చేశారు.

తరవాత సుగ్రీవుడూ, హనుమంతుడూ విభీషణుణ్ణి "అంతులేని యీ వానరసైన్యంతో మనం సముద్రం యెలా దాటగలమూ?" అని అడిగారు. దానికి విభీషణుడు "రాముడు సముద్రుణ్ణి శరణు పొందడం మంచిది. ఈ సముద్రం సగరపుత్రులు తవ్వారు. ముదు వారి జ్ఞాతి. కనక, సముద్రుడు అతనికి సాయంచెయ్యవలసివుంది" అని బదులుచెప్పాడు. అది విని సుగ్రీవుడు రాముని దగ్గిరికి వెళ్ళి విభీషణుడు చెప్పింది చెప్పాడు. రామునకున్నూ అలాగే తోచింది. అప్పుడు అతను లక్ష్మణుణ్ణీ, సుగ్రీవుణ్ణీ మందహాసంతో చూసి "విభీషణుడు చెప్పింది బాగుంది. లక్ష్మణా! నీకూ సుగ్రీవునకూ యెలా తోస్తోందో చెప్పండి. సుగ్రీవుడు గొప్పపండితుడు. నువ్వుకూడా ఆలోచనలో దిట్టమైనవాడవు. మీరిద్దరూ ఆలోచించి యేమిచేస్తే బాగుంటుందో

చెప్పండి'' అని అడిగాడు. దానికి వారు "మాకూ విభీషణుడు చెప్పిందే బాగుంది. అంతకంటే సుఖావహమైన ఉపాయంలేదు. సేతువు కడితే మనం సముద్రం దాటి లంకలోకి వెళ్ళలేము. ఇది దేవతలకు కూడా సాధ్యంకాదు. కనక, సూర్యుడైన విభీషణుడు చెప్పిందే చెయ్యడంమంచిది. కాలం మించిపోతోంది. ఈ వానరసైన్యంతో మనం లంకకెలా వెడతామో ఆ సంగతి సముద్రుణ్ణి ప్రార్థించి తెలుసుకో'' అని బదులుచెప్పారు. వెంటనే రాముడు సముద్రం గట్టుమీద దర్భాసనం పరుచుకుని వేదిమీద అగ్నిహోత్రుడు లాగ దానిమీద ఆసీనుడయాడు.

## ౨౦

## రావణుడు సుగ్రీవునిదగ్గిరికి దూతనంపడం

శార్దూలుడనే రాక్షసుడొకడు వచ్చి సముద్రతీరాన విడిచిన సుగ్రీవుని వానరసైన్యం అంతా చూశాడు. వాడు రావణుని గూఢచారి. వాడు అదంతా చూసి వెంటనే లంకకు వెళ్ళి "మహాప్రభూ వానర వీరులతోనూ, భల్లూకవీరులతోనూ నిండివున్న మహాసేన లంకమీదికి వస్తోంది. రెండో సముద్రంలాగ అది అగాధంగానూ అప్రమేయంగానూ వుంది. దశరథకుమారులైన రామలక్ష్మణులు గొప్పగొప్ప ఉత్తమాయుధాలతో సీతకోసం వస్తున్నారు. వారిప్పుడు సముద్ర తీరాన విడిసివున్నారు. వానరసేన ఎటు చూసినా పది ఆమడలమేర భూమి ఆక్రమించివుంది. ఉన్న సంగతియిది. ఇక నువ్వు వివరాలు తెలుసుకోవాలి. ఆలస్యంచెయ్యగూడదు. నువ్వు త్వరగా దూతలను పంపాలి. సామమో దానమో భేదమో అవలంబించి నడుచుకో'' అని చెప్పాడు.

అది విని రావణుడు చెయ్యవలసినది స్థిరనిశ్చయంచేసుకుని శుకుడనే రాక్షసుణ్ణి పిలిచి "నువ్వు వెళ్ళి సుగ్రీవుణ్ణి కలుసుకో. ధైర్యంగా

వుండి నామాటలు మృదువుగా చెప్పు. "సుగ్రీవా! నువ్వు మహారాజ వంశాన పుట్టినవాడవు, గొప్పబలశాలివి. ఋక్షరజుని కుమారుడవు. నువ్వు రామునితో కలిస్తే వచ్చే లాభమూ, కలవకపోతే కలిగే నష్టమూ కూడా ఏమీలేదు. నువ్వు సోదరునితో సమానుడవు. నేను ధీమంతుడైన రాముని భార్యను తీసుకువచ్చాననుకో. దాంతో నీకేమి సంబంధమూ? కనక, వెనక్కి వెళ్ళి కిష్కింధలో సుఖంగా వుండు. ఏవిధంగా ప్రయత్నించినా వానరలు లంకలో ప్రవేశించలేరు. దేవతలూ గంధర్వులూ కూడా ఆపని చెయ్యలేరంటే యిక వానరుల మాట చెప్పేదేముందీ?" అని చెప్పాడు. అది విని శుకుడు వెంటనే ఒక పక్షి అయిపోయి ఆకాశాని కెగిరి వానరసేనను చేరుకుని ఆకాశం లోనేవుండి సుగ్రీవుణ్ణి పిలిచి రావణుడు చెప్పిందంతా చెప్పాడు. ఆమాటలు వినీవినడంతోటే వానరులు కొందరాకాశాని కెగిరి వాణ్ణికొట్టి పట్టుకుని కిందకి తీసుకువచ్చారు. వాడప్పుడు రాముణ్ణిచూసి "రామా! ఎవరూ దూతను చంపరు. ఈ వానరులను నివారించు. స్వామి చెప్పిన మాటలు మాని తన సొంత మాటలు చెప్పే దూతను మాత్రం చంపవచ్చు" అన్నాడు. దానిమీద రాముడు వానరులనువారించాడు. వెంటనే వాడుమళ్ళీ ఆకాశాని కెగిరివెళ్ళి "సుగ్రీవా! నువ్వు సత్తాకలవాడవు. మహాబలపరాక్రమశాలివి. రావణునకు నన్నేమి చెప్పమంటావూ? రావణుడు లోకవిద్రావణుడవని నువ్వెరుగుదువు" అన్నాడు.

దానిమీద సుగ్రీవు డందుకుని "రావణా! నువ్వు నాకు మిత్రుడవు కావు. కనక, నిన్ను నేను కరుణించవలసిన అగత్యంలేదు. నువ్వు నాకేమీ ఉపకారం చెయ్యలేదు. అంచేత ప్రియుడవున్నూ కావు. నువ్వు రామునకు విరోధివి. అతనికి శత్రుడవు కనక నాకున్నూ విరోధివే. వాలినిలాగే నిన్నూ చంపవలసేవుంది. రావణా! నేను పుత్రులతోనూ మిత్రులతోనూ బంధువులతోనూ జ్ఞాతులతోనూ కలిపి నిన్ను

నాశనంచేసేస్తాను. పెద్దసేనతో వచ్చి నేను లంక అంతా భస్మం చేస్తాను. నువ్వు మాయం అయినా, సూర్యమండలంలో దాగుకున్నా, పాతాళంలో ప్రవేశించినా, దేవత లడ్డువచ్చినా రాముడు నిన్ను సంహరించేస్తాడు. విడిచిపెట్టడు. మూడులోకాలలోనూ నిన్ను రక్షించగల ప్రాణియేదీలేదు. నువ్వు జటాయువును చంపానని గర్విస్తున్నావేమో, అతను ముసలివాడు. కాటికి కాళ్ళుచాచుకుని వుండినవాడు. ఇంతెందుకు? రాముడు గాని, లక్ష్మణుడు గాని చూస్తుండగానువ్వు సీతను తీసుకు రాగలిగావా? రాముడు నీప్రాణాలు తీస్తాడు, నువ్వు తెలుసుకోలేకుండా వున్నావు. అతను మహాత్ముడు. మహాబలుడు. దేవతలూ దానవులూ అతణ్ణెదిరించి నిలవలేరు. అని రావణునకు చెప్పు" అన్నాడు.

అప్పు డంగదుడు సుగ్రీవుణ్ణి చూసి "మహారాజా! వీడు గూఢచారి గాని దూత కాడని నాకు తోస్తోంది. వీడిక్కడ వుండి మన బలం యెంతో బాగా లెక్కవేసుకున్నాడు. కనక, వీణ్ణి పట్టి బంధించాలి, లంకకు పోనివ్వగూడదు" అని చెప్పాడు. వెంటనే సుగ్రీవుడాజ్ఞాపించగా కొందరు వానరు లాకాశానికెగిరి వాణ్ణి పట్టుకుని కొట్టి కట్టేశారు. దానిమీద వాడు రాముణ్ణి సంబోధించి "వీళ్ళు నాకళ్ళు పీకేస్తున్నారు. నారెక్కలు విరిచేస్తున్నారు. నన్ను వీళ్ళు చంపేశారంటే నేను దూతను కనక, నేను పుట్టింది మొదలిప్పటిదాకా చేసిన పాపం అంతా నీకు చుట్టుకుంటుంది" అన్నాడు. అదివిని రాముడు "వాణ్ణి విడిచిపెట్టండి" అని వానరుల కాజ్ఞాపించాడు.

## ౨౧

## రాముడు మహోగ్రుడై సముద్రంమీద బాణాలు వెయ్యడం

చెలియలికట్టమీాద దర్భలు పరుచుకుని, తూర్పుగా తిరిగి సముద్రునకు నమస్కరించి, సర్పశరీరంలాగ అతిమృదువయిన తన భుజాన్నే తలగడగా పడుకున్నాడు రాముడు.

మొన్నటిదాకా ఆచేతికి బంగారుభూషణా లెన్నో రకా లుండేవి. కుసుమకోమలులైన యువతు లనేకమంది ఆచేతిని అభిమర్శించేవారు. చందనమూ, అగరూ మొదలైన అంగరాదులతో ఆచెయ్యి యెంతో సుందరంగా వుండేది. రాముడూ సీతా ఏకశయ్యాగతులై వుండే టప్పుడు ఆమె కదే తలగడ. గంగాజలంలో నివసించే తక్షకుని శరీరంలా వుందది. యుద్ధంలో అది కాడిలాగ వుండి, శత్రువులకు శోకం కలిగి స్తుంది. స్నేహితుల కానందం కలిగిస్తుంది. భూమండలాని కంతకీ అది ఆధారం. జ్యాఘాతకిణాంకిత. ఇనపగుదివంటిది. ఆచేతిమీదుగా రాము డనేకవేల గోదానాలు చేశాడు. అలాంటి చేతిని తలగడగా వుంచుకుని రాముడు "నాకిప్పుడు మరణమో సముద్రతరణమో వొక్కటే గతి" అనుకుంటూ పడుకున్నాడు.

అతను చాలా నియమంగా వున్నాడు. అప్రమత్తుడై వున్నాడు. అయినా అలా పడుకుని వుండగానే మూడురాత్రులు గడిచిపోయాయి. అప్పటికీ సముద్రుడు మౌఢ్యంవల్ల సాక్షాత్కరించలేదు. అప్పుడు రాముడు కళ్ళెర్రజేసి లక్ష్మణునితో "తమ్ముడూ సముద్రుడు చాలా పొగరెక్కివున్నాడు. అంచేతనే కనపడకపోవడం. గుణహీనులదగ్గిర శాంతమూ, ఓర్పూ, ఋజుభావమూ, మెత్తగా మాట్లాడడమూ పనికిరావు. లోకం, ఆత్మ ప్రశంసచేసుకునేవాణ్ణీ, దుష్టుణ్ణీ, వంచకుణ్ణీ, అందరినీ భయపెట్టేవాణ్ణీ, అందరినీ దండించేవాణ్ణీ పూజిస్తుంది. మెత్త మెత్తగా వుంటే కీర్తి రాదు. మెత్తమెత్తగా వుంటే యశస్సు రాదు. మెత్తమెత్తగావుంటే యుద్ధంలో జయమున్నూ రాదు. ఇదే నాబాణా లతో తెగిపోయిన మొసళ్ళతో సముద్రం నిండిపోతుంది. చూడు సర్పాల శరీరాలు తెగిపోతాయి. ఏనుగులను మించివుండే చేపలు ముక్కలుముక్కలయిపోతాయి. ముత్యపుచిప్పలతోనూ శంఖాలతోనూ చేపలతోనూ, మొసళ్ళతోనూ నిండివుండిన యీసముద్రం అంతా

యింకించేస్తాను చూడు. నా వోర్పు చూసి యీ సముద్రుడు నేను చేత గానివాణ్ణనుకుంటున్నాడు. ఛీ ! ఇలాంటి వాళ్ళదగ్గిరా శాంతం ? ఇలా మెత్తగా వున్నంత కాలమూ సముద్రుడు నా యెదటికి రాడు. కనక, ధనుస్సు తీసుకురా, నా బాణాలతో సముద్రం యెండగొట్టేస్తాను, వానర వీరులు నడిచే వెళ్ళవచ్చు" అని చెప్పి ఘోరబాణాలువిడిచాడు.

అవి భగభగమండుతూ వెళ్ళి సముద్రంలో ప్రవేశించాయి. దాంతో పెద్ద పెద్ద కెరటాలు లేచాయి. శంఖాలూ, ముత్యపుచిప్పలూ తేలిపోయాయి. పొగలులేచాయి. సర్పాలన్నీ వ్యధితాలయి పోయాయి. పాతాళంలో నివసించే రాక్షసులంతా పీడితులయి పోయారు. చేపలతోనూ మొసళ్ళతోనూ వింధ్యమందరపర్వతాలంత లేసి కెరటాలు లేచి విరిగిపడ్డాయి. అదంతా చూసి, లక్ష్మణుడు, ఊర్ధ్వశ్వాసతో రాముడు మరో బాణం తీసుగుతూ వుండగా వద్దు వద్దంటూ వెళ్ళి ఆధనుస్సు పట్టుకున్నాడు.

## ౨౨

## సముద్రుడు నలునిచేత సేతువు కట్టించుకోమని చెప్పడం

అప్పుడు రాముడు సముద్రుణ్ణి చూసి "సముద్రుడా ! పాతాళం దాకా నిన్నిప్పు డెండగొట్టేస్తాను. నా బాణాలతో నీయందున్న జలం అంతా యింకిపోవడమే కాకుండా దుమ్మూధూళీ బయలుదేరుతుంది. నా శరవర్షంవల్ల యిలాగ దారియేర్పడి యీ వానరసేన అంతా నడిచే లంకకు వెళ్ళిపోతుంది. నువ్వు దానవులకు నివాసస్థానానివి. అంచేత నా పౌరుషమూ, నా పరాక్రమమూ, నా వల్ల నీకు కలిగే దుఃఖమూ, తెలిసికోలేకుండా వున్నావు" అని చెప్పి వసిష్ఠుని బ్రహ్మదండంతో సమానమైన బ్రహ్మాస్త్రం తీసి ధనుస్సులో తొడిగాడు.

దాంతో భూమి బద్దలయిపోయినట్టయింది. ఆకాశం ముఖరితం అయింది. పర్వతాలు ఊగిపోయాయి. లోకం అంతా పొగతో నిండిపోయి దిక్కులు తెలియకుండా అయిపోయాయి. సరస్సులూ, నదులూ కలగిపోయాయి. చంద్రసూర్యులూ నక్షత్రాలూ గతితప్పాయి. ఆకాశం అంతా పొగ ఆవరించివుండడంవల్ల సూర్యకిరణాలు ఉల్కల్లా వున్నాయి. పిడుగులు పడ్డాయి. ఆకాశం అంతా మహావాయువుతో బూరటిల్లిపోయింది. గొప్పగొప్ప వృక్షాలు కూలిపోయాయి. పర్వతశిఖరాలు కదిలిపోయాయి. మేఘాలు పిడుగులు విడిచాయి. ప్రాణికోటి అరపులు పిడుగుల్లా వినపడ్డాయి. అదృశ్యాలైనమహాభూతాల ధ్వని అస్పష్టంగానూ, మహాభయంకరంగానూ, వినిపించింది.

సముద్రం కూడా జలజంతువులతో అల్లకల్లోలం అయిపోయింది. చెలియలికట్టదాటి ఒక ఆమడవరకూ పొంగింది. అది పారిపోతున్నట్టుండడంవల్ల రాముడా బాణం విడిచిపెట్టలేదు. అప్పుడు సముద్రమధ్యము నుంచి సముద్రుడు రూపొంది స్వయంగా బయలుదేరివచ్చాడు. అది మేరుపర్వతశిఖరంనుంచి సూర్యుడు వస్తున్నట్టుంది. అతని శరీరం వైడూర్యవర్ణంగా వుంది. రత్నాలు పొదిగిన అనేక సువర్ణాభరణాలు ధరించాడు. ఎర్రని బట్టలు కట్టుకున్నాడు. కౌస్తుభమణితో పుట్టిన మహారత్నం మెడలో మెరిసిపోతోంది. " రామా ! నేను సముద్రుణ్ణి. ఇదే నమస్కరిస్తున్నా " నంటూ వచ్చాడతను.

వచ్చి వినయవిధేయతలతో " రామా ! భూమీ, వాయువూ, ఆకాశమూ ; జలమూ, తేజస్సూ — వీటి స్వభావాలు శాశ్వతాలు. అనగా భూమి స్వభావం కాఠిన్యం. వాయువు స్వభావం అడ్డంగా వెళ్లడం. ఆకాశం స్వభావం అవకాశం యివ్వడం. జలం స్వభావం లోతుగా వుండడం. తేజస్సు స్వభావం మంటలు పైకిలేవడం. ఈ స్వభావాలు శాశ్వతాలు. ఇవి మారవు. అంచేత, లోతుగా వుండడమూ, దాట

డానికి శక్యంకాకుండా వుండడమూ నా స్వభావం. లోతుగా వుండక పోవడం నాకు విరుద్ధధర్మం. ఇదీ వున్న రహస్యం. ఇచ్ఛాపూర్వ కంగా గానీ, లోభంవల్లగానీ, భయంవల్లగానీ మొసళ్లతోనూ, తిమి తిమింగలాలతోనూ నిండివుండిన నా జలం స్తంభింపచెయ్యడానికి వీలు లేదు. కనక, రామా! ఎలాగో వొకలాగ అంటే నీ వానరసేన అవత లికి వెళ్లేదాకా. మొసళ్లూ మొదలైనవి వారినేమీ చెయ్యకుండా వుండే టట్టు చూస్తాను. వానరసేన దాటడానికి చక్కనిమార్గం ఏర్పడేటట్టు మాత్రం చేస్తాను'' అని విన్నవించాడు. దానిమీద రాముడు “సము ద్రుడా! తీరా నేను బాణం సంధించానే? ఇది అమోఘం. వ్యర్థం కావడానికి వీలులేదు. దీన్ని ఎక్కడ ప్రయోగించమంటావూ?'' అని అడిగాడు. అందుకు సముద్రుడు “రామా! ఇక్కడి కుత్తరాన, సమీపంగానే నీలాగే లోకవిఖ్యాతి గల ద్రుమకుల్యం అనే స్థలంవుంది. అక్కడ అనేకదస్యులుచేరి నా జలం తాగుతూ చాల ఘోరకృత్యాలు చేస్తున్నారు. ఆ పాపులు నన్ను ముట్టుకుంటే నేను సహించలేకుండా వున్నాను. అమోఘమైన నీ బాణం వాళ్లమీద ప్రయోగించు'' అని బదులు చెప్పాడు.

రాముడు వెంటనే అక్కడ పడేటట్టు బాణం విడిచాడు. అది మొదలు ఆద్రుమకల్యం మరుకాంతారం అని ప్రసిద్ధిపొందింది. ఆ బాణాఘాతం సహించలేక భూమి ఆర్తనాదంచేసింది. ఆరంధ్రంలో నుంచి రసాతలజలం పైకెగసింది. అప్పణ్ణుంచీ అది వ్రణకూపం అని పిలవబడుతోంది. దానిలోనుంచి వచ్చే జలం సముద్రజలం లాగే వుం టుంది. బాణావేగంతో అక్కడ భూమి బద్దలయేటప్పుడు చాలా గొప్పధ్వని అయింది. ఆబాణంతో ఆదస్యులు ముట్టుకున్న జలం యింకిపోయింది. ఇలాగ, రాముడు సముద్రకుక్షినుంచి ఆపాపాత్ము లన్నీ నశింపచేసి “ఈ మరుకాంతారంలో పశువులకు కావలసిన రక

రకాల గడ్డి యెప్పుడూ ఎక్కువగా వుంటుంది. ఇక్కడ రోగాలుండవు. పళ్లూ దుంపలూ రసాయనాలూ పుష్కలంగా వుంటాయి. పాడిపంటలు సమృద్ధిగా వుంటాయి.” అని వరం యిచ్చాడు. ఈకారణంవల్ల ఆమరుకాంతారం చాలా చక్కగా వుంటుంది.

ఇదయాక సముద్రుడు రామునితో “రామా! వానరవీరులలో ప్రముఖుడైన యీనళుడు విశ్వకర్మ కొడుకు. తండ్రి యితనికి గొప్ప వరం యిచ్చివున్నాడు. అంచేత యితను శిల్పవిద్యలో తండ్రికి సమానుడు. ఇతను తండ్రి అంతటివాడు కనక, యితన్ను నామీద సేతువు నిర్మించేది. నేనా సేతువు మునిగిపోకుండా పట్టుకునివుంటాను” అని చెప్పి అంతర్ధానం అయిపోయాడు.

## ౨౩

## నళుడు సేతువు నిర్మించడం

అప్పుడు నళుడు ముందుకు వచ్చి “రామా! విశాలమైన యీసముద్రంమీద నేను సేతువు నిర్మిస్తాను. సముద్రుడు చెప్పింది సత్యం. ఎలాంటివాని విషయమయిన్నీ దండోపాయమే మంచి దని నా అభిప్రాయం. కృతజ్ఞులు కానివారియెడల సామమూ దానమూ, భేదమూ కూడా నిరుపయోగాలయిపోతాయి. భయంకరుడైన ఈ సముద్రుడు దండభయంవల్లనే సేతువునిర్మించడాని కవకాశం యిచ్చాడు. విశ్వకర్మ మందరపర్వతంమీద నాతల్లికి వరం యిచ్చాడు. అంచేత విశ్వకర్మకు నేను ఔరసపుత్రుణ్ణి. అతనితో సాటిఅయినవాణ్ణిన్నీ. ఎవరూ అడగకుండా నాశక్తిసామర్థ్యాలు నే నెవరికీ చెప్పగూడ దని నా తండ్రి నాకు ఆనపెట్టాడు. నిజంగా నేను విశాలమైన యీ సంముద్రంమీద సేతువు నిర్మించగలను. సముద్రుడు ఉన్నదున్నట్టు చెప్పి నాకు జ్ఞాప

కంకూడా చేశాడు. వానరవీరులారా! మీరందరూ యిప్పుడే సేతువు నిర్మించండి'' అని చెప్పాడు.

రాముడు సెల విచ్చాగా పర్వతాలవంటి వానరవీరులు వేలూ లక్షలూ వెళ్ళి మద్దిచెట్లూ, తాడిచెట్లూ, బొట్టుగుచెట్లూ, మారేడుచెట్లూ, సప్తపర్ణాలూ, కర్ణికారాలూ, ఇప్పచెట్లూ, కొడిశచెట్లూ, మామిడిచెట్లూ, అశోకంచెట్లూ, మొదలైన రకరకాల వృక్షాలు తెచ్చి సముద్రంలో పడేశారు. తానిచెట్లూ, కొబ్బరిచెట్లూ, పొగడచెట్లూ, చంద్రచెట్లూ, వేపచెట్లూ కూడా తెచ్చిపడేశారు. తరవాత పర్వతాలు బద్దలుకొట్టి యేనుగులంతేసి బండరాళ్లు యంత్రాలతో తెచ్చి వాటిమీద పడేశారు. అవి వేసినప్పుడల్లా సముద్రజలం ఆకాశం అంటేటట్టు ఎగిసింది. కొందరు ఎచ్చుతక్కువలూ, వంకరటింకరలూ రాకుండావుండేటట్టు సూత్రాలుపట్టారు. కొందరు కొలతకర్రలు పుచ్చుకున్నారు. చివరికి ఆ నళుడు పదిఆమడల వెడల్పున నూరామడల సేతువు నిర్మించాడు. బండరాళ్లు మోసుకుని పరుగెత్తుతూ వుంటే ఆ వానరులు ఏనుగుల్లా వున్నారు. వారు సముద్రంలో రాళ్లు వేసినప్పుడు పెద్దపెద్ద ధ్వనులు పుట్టాయి. నళుడు మొదటినాడు పద్నాలుగామడల సేతువు నిర్మించాడు. మూడోనాడు ఇరవైవొక్క ఆమడల సేతువు నిర్మించాడు. నాలుగోనాడు ఇరవైరెండామడల సేతువు నిర్మించాడు. అయిదోనాడు వానరులను తొందరపెట్టి ఇరవైమూడామడల సేతువు నిర్మించాడు.

సముద్రంలో నళుడు నిర్మించిన ఆసేతువు ఆకాశాన స్వాతీవీధిలా వుంది. తరవాత, దేవతలూ, గంధర్వులూ సిద్ధులూ, పరమర్షులూ, వచ్చి ఆకాశం అంతా నిండిపోయి నూరామడల పొడుగూ పదిఆమడల వెడల్పూ గల ఆసేతువు చూసి చాలా ఆశ్చర్యపడి, ఆనందించి నళుణ్ణి చాలా మెచ్చుకున్నారు. వానరులు ఆసేతువుమీద ఎగురుతూ దుముకుతూ చాలా ఆనందకోలాహలంగావున్నారు. ఆ సేతువు

సముద్రంలో పాపిడిలా వుంది. కోట్లకొద్దీ వానరులు ఆసేతువుమీద వెళ్లి అవతలిగట్టు చేరుకున్నారు. సేతువుచివర, విభీషణుడు గదాపాణిఅయి అడ్డువచ్చినవారిని సంహరించడానికి మహామేరువులాగ నుంచున్నాడు.

అప్పుడు సుగ్రీవుడు వచ్చి "రామా! నువ్వు హనుమంతుని భుజాలమీద కూచో. లక్ష్మణుణ్ణి అంగదుని భుజాలమీద కూచోమను. ఈసముద్రం చాలా వెడల్పుగా వుంది వానరులు మిమ్మల్ని ఆకాశాన తీసుకువెడతారు." అని చెప్పాడు. సుగ్రీవుడు చెప్పినట్టుగానే ధనుష్పాణులయి రామలక్ష్మణులు ముందు బయలుదేరారు. కొందరు వానరులు మధ్యగా వెళ్లారు. కొందరు పక్కపక్కగా వెళ్ళారు. కొందరు దారిదొరకక సముద్రంలో పడిపోతూవచ్చారు. కొందరు ఈ తొక్కుళ్లాట యెందు కని యెగిరివెళ్లారు. బ్రహ్మాండమైన ఆవానర సేన దాటడంలో కలిగిన రొద సముద్రఘోషను మించిపోయింది.

ఇలాగ, ఆ వానరసేన నళనిర్మిత మైన సేతువుమీదుగా దాటగా సుగ్రీవుడు ఫలాలూ దుంపలూ జలమూ పుష్కలంగా వున్నచోట విడియించాడు. దేవతలూ సిద్ధులూ చారణులూ అదంతాచూసి రాముణ్ణి వేరువేరుగా పుణ్యోదకాలతో అభిషేకించారు. "రామా! శత్రువులను నాశనంచెయ్యి. సముద్రపర్యంతం అయిన భూమండలం అంతా చిరకాలం పాలించు" అని అతనికి వారు ఆశీర్వాదాలున్నూ చేశారు.

## రాముడు వానరసేనతో లంకాభిముఖంగా నడవడం

శుభాశుభనిమిత్తాల లక్షణాలూ ఫలాలూ బాగా తెలిసి రాముడు అప్పుడు కొన్ని నిమిత్తాలు చూసి లక్ష్మణుణ్ణి కౌగిలించుకుని లక్ష్మణా! జలమూ కందమూలాలూ గలచోటు చూసి ఈవానర సేనను గరుడవ్యూహంగా తీర్చుకుని ఉందాము. అయితే వానరవీరు

లకూ, భల్లూకవీరులకూ రాక్షసవీరులకున్నూ గూడా లోకక్షయ కరమైన మహాభయం తటస్థించినట్లు కనపడుతోంది. వాయువు కలుషంగా వీచుతోంది. భూమి వడవడ వొణికిపోతోంది. పర్వతశిఖరాలు ఊగిపోతున్నాయి. చెట్లు కూలిపోతున్నాయి. మేఘాలు గద్దల్లాగా డేగల్లాగా అరుస్తూ రక్తబిందువులు కురుస్తున్నాయి. సంధ్య రక్తచందనంలాగ చాలా భయంకరంగా వుంది. సూర్యమండలంలో నుంచి భగభగ మండుతూ అగ్నిమండలం కింది కురుకుతోంది. మృగాలూ పక్షులూ సూర్యునికేసి తిరిగి దీనంగా అరుస్తూ భయం పుట్టిస్తున్నాయి. చంద్రుడు కాంతిహీనుడై సంతాపం కలిగిస్తున్నాడు. సూర్యునిచుట్టూ నలుపూ ఎరుపూ చారలతో లోకక్షయం సూచించే పరివేషం ఏర్పడివుంది. విమలమైన సూర్యబింబంలో నల్లని మచ్చ కనపడుతోంది. ధూళిధూసరితా లయిపోయి నక్షత్రాలు ప్రళయం సూచిస్తున్నాయి. కాకులూ, గద్దలూ అశుభంగా కూస్తూ కిందుగా తిరుగుతున్నాయి. వానరవీరులూ, రాక్షసవీరులూ విడిచిన శూలాల తోనూ, రాళ్లతోనూ, ఖడ్గాలతోనూ భూమి అంతా రక్తమాంసమయం అయిపోతుంది. ఇంకెందుకూ? రావణపాలితమైన లంక మీాదికి వానరవీరులతో యిప్పుడే దండెత్తివెడదాం అన్నాడు.

ఇలా అని ధనుష్పాణి అయి రాముడు ముందుగాలంకకేసి బయలుదేరాడు. అతనివెనక విభీషణుడూ సుగ్రీవుడూ వానరవీరులూ బయలుదేరారు. వానరవీరుల ఆనందకోలాహలం చూసి రాముడు మిక్కిలీ ఉత్సాహభరితుడైనాడు.

౨౭

## రాముడు లంకమీదికి వచ్చాడని శుకుడు రావణునితో చెప్పడం

శరత్కాలపౌర్ణమినాడు చంద్రునితో కూడిన నక్షత్రసమూహంలాగ రాముని చుట్టూఉండిన వానరసేన చాలా చక్కగా వుంది. మహా

సముద్రం లాగ అంతులేని ఆవానరసైన్యంవల్ల భూమి గజగజలాడి పోయింది. అప్పుడు వానరసైన్యానికి లంకలోనుంచి భేరీమృదంగధ్వని చెవులు చిల్లులుపడేటట్టు వినిపించింది. దాంతో వానరులకు శరీరాలు పులకరించాయి. దాంతో మహోత్సాహభరితులై వారు అంతకంటే యెక్కువగా సింహనాదాలు చేశారు. ఆసింహనాదాలు రాక్షసులకు మేఘాల ఉరుము లని తోచాయి. చిత్రధ్వజపతాకలతో అలంకృతమైవుండిన లంకానగరంచూసి రాముడు మిక్కిలీ దుఃఖిస్తూ సీతను తలుచుకున్నాడు. "హరిణనేత్ర అయిన సీత యీలంక లోనే కుజునివల్ల రోహిణిలాగ రావణునివల్ల నిరోధించబడు తోంది" అనుకుని అతను పెద్దనిట్టూర్పు విడిచి, లక్ష్మణునితో "లక్ష్మణా! సంకల్పమాత్రాన నిర్మితమైనట్టున్న యీ లంక పర్వతశిఖరాన ఆకాశం రాసుకుంటోంది చూడు. ఇది విశ్వకర్మ నిర్మించినది. ఇది అనేకవిమానాలతో తెల్లని మేఘాలతో నిండివున్న ఆకాశంలాగ చాలా చక్కగా వుంది. ఈలంకనిండా చైత్రరథంవంటి ఉద్యానవనా లెన్నో వున్నాయి. అవన్నీ పూలతోనూ పళ్ళతోనూ నిండి చాలా మనోహరంగా వున్నాయి. పళ్ళు తిని పిట్టలు మదించి వున్నాయి. మధుపానంచేసి తుమ్మెదలు మత్తెక్కివున్నాయి. చిగురు టాకులు మెక్కి కోకిలలు మిక్కిలీ ఉల్లాసంగా వున్నాయి. పిల్లగాలి చక్కగా వీస్తోంది చూడూ" అని చెప్పాడు.

మరిన్నీ అతను వానరవీరులను చూసి "దుర్జయుడైన అంగదుడు నీలునితో కలిసి సైన్యం అంతకీ వక్షస్థలభాగంలో వుండేది. వాన రోత్తముడైన ఋషభుడు సైన్యం దక్షిణపార్శ్వం రక్షిస్తూ వుండేది. గంధహస్తి వంటి గంధమాదనుడు ఎడమభాగాన వుండేది. శిరో భాగంలో నేనూ లక్ష్మణుడూ వుంటాము. జాంబవంతుడూ, సుషే ణుడూ, వేగదర్శీ కుక్షిభాగంలో వుండేది. తేజస్సుతో ఆవరించి వరు

ణుడు పశ్చిమదిక్కున వుండేటట్టు వానరరాజయిన సుగ్రీవుడు వెనకాల వుండేది" అని ఆజ్ఞాపించాడు.

ఇలాగ ఆవానరసేన గరుడవ్యూహంతో ఆకాశం అంతా మేఘాలు నిండివుండేటట్టు భూమి ఆవరించివుంది. వానరవీరులు పర్వతశిఖరాలూ పెద్దపెద్ద వృక్షాలూ పుచ్చుకుని రాక్షసులమీద పడడానికి సిద్ధంగా వున్నారు. "లంకానగరం అంతా యీపర్వతశిఖరాలతోనూ యీ వృక్షాలతోనూ దుమ్మూధూళీచేసేస్తాం" అంటూ వారు సింహనాదాలు కూడా చెయ్యసాగారు. అప్పుడు రాముడు సుగ్రీవునితో "చక్కగా విభక్తం అయి సేన అంతా సర్వసిద్ధంగా వుంది. ఇక శుకుణ్ణి విడిచిపెట్టించు" అన్నాడు. సుగ్రీవుడు వెంటనే వాణ్ణి విడిచేశాడు. శుకుడు రావణుని దగ్గిరికి వెళ్ళాడు. రావణుడు నవ్వుతూ "నీరెక్కలు వాళ్ళు తెగకొట్టారా? నువ్వు వాళ్ళకి దొరికిపోయినట్టుందే?" అని అడిగాడు. దానిమీద శుకుడు "సముద్రం ఉత్తరపు గట్టుకి వెళ్ళి నువ్వు చెప్పిన మాట చాలా మృదువుగా చెప్పాను. కాని నన్ను చూడగానే వానరులు ఆకాశాని కెగిరివచ్చి పట్టుకుని కొట్టి, పొడిచి, గుద్దులుగుద్ది బాధించారు. ఆవానరులు నామాటే వినిపించుకోలేదు. వానరులకు కోపం మిక్కిలీ యెక్కువ. విరాధుణ్ణీ, కబంధుణ్ణీ, ఖరుణ్ణీ సంహరించిన రాముడు సుగ్రీవునితో కలిసి సీతకోసం లంకకు వచ్చాడు. రాముడు సేతువుకట్టి లవణసముద్రం దాటి యిదే రాక్షసులను తృణీకరిస్తూ ధనుష్పాణిఅయి నిలిచివున్నాడు. భల్లూకవీరులూ వానరవీరులూ మేఘాల్లాగా, పర్వతాల్లాగా వున్నారు. అపారంగా వున్న ఆ సేనతో భూమి అంతా నిండిపోయివుంది. వానరసైనికులకూ రాక్షససైనికులకూ దేవదానవసైనికులకు లాగే సంధి అనేది కుదరదు. ఇదే వానరులు లంకాప్రాకారం ఆక్రమించడానికి వస్తు

న్నారు. సీతను రామున కయినా యిచ్చెయ్యి. దృఢంగా నిలిచి యుద్ధం అయినా చెయ్యి" అని చెప్పాడు.

ఇది విని రావణుడు మండిపడి "దేవతలూ దానవులూ, గంధర్వులూ దండెత్తివచ్చినా, లోకం అంతా తిరగబడి నన్ను భయపెట్టినా సీతను నేను రామున కివ్వను. విరగబూసిన చెట్టుమీద తుమ్మెదలు వెళ్ళిపడేటట్టు నానిశితబాణాలు రామునిమీద పడతాయి చూసుకో. నాఅమ్ములపొదిలోనుంచి గుప్పెడేసి బాణాలు తీసి కొరవులతో ఏనుగును పీడించేట్టు రాముణ్ణి చీకాకుపరిచేస్తాను చూసుకో. సూర్యుడుదయించి చంద్రనక్షత్రాదుల కాంతిహరించేటట్టు ధనుష్పాణినై వెళ్ళి నేను వానరసేన అంతా నాశనంచేసేస్తాను చూసుకో. నావేగం సముద్రవేగం వంటిది. ఈసంగతి రామునకు తెలియదు. అంచేతే నామీదికి వచ్చాడు. నా అమ్ములపొదిలోవున్న బాణాలు క్రూరసర్పాలవంటివని రాము డెరగడు. అంచేతనే నామీదికి వచ్చాడు. యుద్ధంచేసేటప్పుడెప్పుడూ రాముడు నన్ను చూసివుండడు. అంచేతే నామీదికి వచ్చాడు. నాధనుర్వీణ పుచ్చుకుని యుద్ధరంగంలో నేను దారుణంగా వాయించేస్తాను చూసుకో. సహస్రాక్షుడైన ఇంద్రుడు నన్నేమీ చెయ్యలేకపోయాడు. వరుణుడు నాయెదటనిలవలేకపోయాడు. యముడూ కుబేరుడూ కూడా నన్ను తేరిచూడలేకపోయారు" అన్నాడు.

## ౨౫

## శుకసారణులు వానరసైన్యం వివరాలు రావణునకు చెప్పడం

దశరథాత్మజుడైన రాముడు వానరబలంతో కూడా సముద్రం దాటి వచ్చాడని తెలిశాక రావణుడు శుకుడు సారణుడు అనే మంత్రులను పిలిచి "దుస్తరమైన సాగరం దాటి అపారమైన వానరసైన్యం వచ్చింది:

రాముడు మునుపు ఎన్నడూ కనీ వినీ యెరగని సేతువు బధించాడు. సముద్రంమీద సేతువు కట్టా రంటే నాకు లక్ష్యంలేదు. ఆవానర బలం యెంతవుందో అది నాకు తెలియాలి. కనక, మీరిద్దరూ ప్రచ్ఛన్నంగా వెళ్ళి వానరబలంలో ప్రవేశించి "అది యేపాటిదో, దాని బలపరాక్రమా లేపాటివో, వానరవీరులలో ప్రధానులైనవా రెవరో రాముని మంత్రులెవరో, సుగ్రీవునకు నమ్మినబంట్లెవరో, వానరవీరులలో యుద్ధరంగాన అగ్రేసరులై వుండేవా రెవరో, సముద్రంమీద సేతువు ఎలా నిర్మించారో, ఆవానరసైన్యం యెక్కడెక్కడ విడిసివుందో, రాముని ప్రయత్నం యెంత దృఢమైనదో, అతని పరాక్రమం యెంతటిదో, అతని ఆయుధాలేమిటో, లక్ష్మణుని బలపరాక్రమాలున్నూ యేపాటివో మీరు తెలుసుకురావాలి. మహా పరాక్రమవంతులైన వానరులకు సేనాధిపతు లెవరో తెలుసుకోవాలి. వెళ్ళి వెంటనే తెలుసుకురండి" అని చెప్పి పంపాడు.

వెంటనే వాళ్లు బయలుదేరివెళ్ళి వానరరూపం ధరించి వానర సైన్యంలో ప్రవేశించారు; గాని అది యెంతవుందో లెక్కపెట్టనూ లేకపోయారు, తెలిసికోనూలేకపోయారు. ఆవానరసేన పర్వతాగ్రాల మీద వుంది. చరియలలో వుంది. గుహల్లో వుంది. సముద్రతీరాన వుంది. తోటల్లో వుంది. దాటింది దాటగా కొంత యింకా దాటుతూనే వుంది. దాటవలసింది కూడా యింకా చాలావుంది. కొంత విడిసింది. కొంత విడిది చూసుకుంటోంది. ఇలాగ అక్షోభ్యం అయిన వానరబలం చూస్తూవుండగా విభీషణుడు వాళ్ళని గుర్తించేశాడు. వాళ్ళని పట్టుకుని రామునియెదట నిలబెట్టి "వీళ్ళు రావణుని చారులు. పేరు ఒకడు శుకుడూ, మరొకడు సారణుడూను. లంకనుంచి వచ్చారు" అని చెప్పాడు. దానిమీద వాళ్ళిద్దరూ ప్రాణాలమీద నిరాశ చేసుకుని భయభక్తులతో చేతులు జోడించుకుని "రామా! మేము రావ

ణుడు పంపగా వచ్చిన చారులమే. నీబలం అంతా తెలుసుకోడానికి వచ్చాము '' అని విన్నవించారు.

దానిమీద రాముడు సర్వభూతకాంతుడు కనక, నవ్వుతూ "మాబలం అంతా చూడ్డం అయిందా? మాసంగతి బాగా తెలుసుకున్నారా? మీప్రభువు చెప్పిన పని పూర్తి అయితే యిక స్వేచ్ఛగా లంకకి వెళ్ళిపొండి. చూడని దేమయినా వుంటే మాత్రం అది సక్రమంగా చూసే వెళ్లండి. మీకు చేతకాకపోతే విభీషణుడు స్వయంగా వచ్చి మీకు చూపిస్తాడు. మీరిప్పుడు మాకు దొరికిపోయినందుకు బెంగపెట్టుకోకండి. మీకు ప్రాణభయం సుతరామూ లేదు. దూతలు కత్తులు కిందపడవేసినా దొరికిపోయినా చంపగూడదు. విభీషణా! వీళ్లు శత్రుపక్షంవాళ్ళే గాని విడిచిపెట్టెయ్యి. ఓ రాక్షసదూతలారా! మీరు లంకకు వెళ్ళి రావణునితో నామాటలుగా "నువ్వే బలం చూసుకుని నాభార్యను హరించి తెచ్చావో ఆబలం చూపించు. నీసైన్యంతోనూ నీబంధువులతోనూ వచ్చి చూపించు. రేపు ఉదయమే లంకా పట్నమూ, నీసైన్యమూ నేను నాశనం చేసేస్తాను చూసుకో. మహేంద్రుడు దానవులమీద వజ్రాయుధం విడిచేటట్టు రేపు నీసేన అంతటితో పాటు నీమీద నాక్రోధం విడిచిపెడతాను చూసుకో'' అని చెప్పండి, అని చెప్పాడు.

అప్పుడు శుకసారణులు రామునకు జేజేలు కొట్టి లంకకు వెళ్ళి ఇదంతా విన్నవించి చివరికి "రాక్షసేశ్వరా! మేము విభీషణునకు దొరికిపోయాం; కాని రాముడు దయతలచి మమ్మల్ని విడిచిపెట్టాడు. రాముడూ లక్ష్మణుడూ విభీషణుడూ సుగ్రీవుడూ ఒక్కచోట వుండి మాకు లోకపాలకుల్లాగ కనపడ్డారు. వానరసేనతో అగత్యం లేకుండా యీనలుగురే లంకను తవ్వి సముద్రంలో కలిపెయ్యగలరు. రాముని ఆకృతీ, ఆయుధాలూ చూడగా, వారు ముగ్గురూ కూడా అక్కర్లేదు,

రాము డొక్కడే లంక అంతా నాశనం చెయ్యగలడు. రామలక్ష్మణుల అధీనంలో వున్న ఆవానరసేన దేవతలూ మహేంద్రుడూ కూడా తేరి చూడలేరు. మేము సేతువు చూశాం. అది పదిఆమడల వెడలుపూ నూరామడల పొడుగూ వుంది. వానరసేన అంతా దానిమీదుగా దాటివచ్చింది. రాముడు ఆసేనతో సముద్రం దక్షిణపుగట్టున విడిసి వున్నాడు. ఇంకా కొంత సైన్యం సముద్రం దాటుతోంది. దాటవల సింది కూడా చాలావుంది. మొత్తానికి వానరసైన్యం అంతు దొరకడం లేదు. ఆవానరవీరు లందరూ ఎప్పుడు యుద్ధంచేస్తామా అని ఉవ్విళ్ళూరిపోతున్నారు. కనక, మహాప్రభూ! మనకు రామునితో విరోధం వద్దు. సీతను రామున కిచ్చెయ్యి" అని చెప్పారు.

౨౬

## సారణుడు వానరసేనాధిపతుల సంగతి వేరువేరుగా చెప్పడం

సారణు డిలా చెప్పగా రావణు డందుకుని "సారణా! దేవతలూ దానవులూ గంధర్వులూ కలిసి నామీాద దండెత్తివచ్చినా, లోకం అంతా ముంచుకువచ్చి నన్ను భయపెట్టినా నేను సీత నివ్వను. నిన్ను వానరులు తర్జనభర్జనచేశారు. కొట్టారు. అంచేత భయభ్రాంతుడవై సీత నిచ్చెయ్యడం మంచి దని భావిస్తున్నావు. నన్ను యుద్ధంలో జయించగల శత్రువు ఎవ డున్నాడోయ్?" అని అడుగుతూనే అతను మంచుకొండలాగ తెల్లగా వున్న మేడ యెక్కాడు. అది యెన్నో తాళ్ళ యెత్తున వుంది.

శుకసారణులతో ఆమేడ యెక్కేటప్పటికి రావణునకు సముద్రమూ, పర్వతాలూ అడవులూ భూతలమూ అంతా వానరమయమై వుండడం కనపడింది. అది అపారంగానూ అసాధ్యంగానూ వున్నట్టు కూడా కనపడింది. అదంతా చూసి రావణుడు "ఈవానరసేనలో శూరు లెవరు? యుద్ధరంగాన అగ్రేసరులై వుండేవా రెవరు?

సుగ్రీవు డెవరి మాట వింటాడు? సేనాధిపతు లెవరు? వివరంగా చెప్పు” అనడిగాడు. సారణు డిలా ప్రారంభించాడు.

“అదిగో, లంక కేసి తిరిగివుండి వేనవేల సేనాధిపతులతో కలిసి సింహనాదం చేస్తున్నాడే, ఆసింహనాదానికి మన లంకాపట్నం వూగిపోతోందే, అతను నీలుడు. సుగ్రీవుని వానరసైన్యాని కంతకీ అధిపతి. చేతులుపైకెత్తుకుని లంక కేసి వస్తున్నాడు చూడూ, పర్వతశిఖరంలాగ పద్మకింజల్కవర్ణుడై వున్నాడే, మాటిమాటికీ తోక ఝాడిస్తున్నాడే, ఆలాంగూలధ్వనితో దిక్కులుపిక్కటిల్లిపోతున్నాయే, అతను వానర యువరాజు అంగదుడు. అతను తన తండ్రి అయిన వాలితో సమానుడు. అత నంటే సుగ్రీవునకు చాలా ప్రీతి. ఇంద్రునికోసం వరుణుడులాగ, రామునికోసం ఈఅంగదుడు పరాక్రమిస్తున్నాడు. రాముని శ్రేయస్సుకోరి లంకకు వచ్చి హనుమంతుడు సీతను చూశాడే, దాని కంతకీ ఈఅంగదుని ఆలోచనే మూలం. పరాక్రమవంతుడైన ఈఅంగదుడు తన అపారసేనతో నిన్ను జయించడానికి వచ్చాడు.

అంగదుని వెనక వున్నాడు చూడూ, మహావీరు డొకడూ, అతనే నళుడు. సముద్రంమీద సేతువు నిర్మించినవా డతనే. నలుని వెనకాల సింహనాదాలు చేస్తూ వున్న అసంఖ్యాకవానరవీరులు చందనవనవాసులు, వారు మహావీరులు. వారందరూ లంక నాశనంచెయ్యడానికి వచ్చారు. వెండిలాగ తెల్లగా వున్న ఆవానరవీరుడు శ్వేతుడు. అతను మహాపరాక్రమశాలి. బుద్ధిమంతుడు. వానరవీరులలో చాలాగొప్పవాడని త్రిలోకాలలోనూ ప్రఖ్యాతిగన్నవాడు. అతను సుగ్రీవుని దగ్గిరికి వచ్చి మళ్లీ వానరసేనను విభజించుకుంటూ వెడుతున్నాడు.

అల్లదిగో, అతనిపేరు కుముదుడు. గోమతీతీరాన సంకోచనమనే పర్వతంమీద వానరరాజ్యం పాలిస్తున్నవాడు. అతని తోక చాలా పొడుగ్గా వుంది. దాని రోమాలున్నూ చాలా పొడుగ్గావున్నాయి.

అవి యెఱ్ఱగానూ పచ్చగానూ తెల్లగానూ వుండి చాలా రమ్యంగా వుంటాయి. అతను మహాధైర్యశాలి. చండపరాక్రముడు. యుద్ధంఅంటే అతని కెంతో యిష్టం. అతనుకూడా లంకను నాశనంచెయ్యడానికే తన సేనతో కదలివచ్చాడు. అదిగో, సింహంలాగ కపిలవర్ణుడై దీర్ఘనేత్రుడై లంకను భస్మంచేసేటట్టు చూస్తున్నాడు చూడూ, అతని పేరు రంభుడు. అతను వింధ్యపర్వతానా కృష్ణగిరిమీదా, సహ్యపర్వంతమీదా సుదర్శనపర్వతంమీదా వున్న అసంఖ్యాకవానరులకు ప్రభువు. అతను కూడా లంకను నేలమట్టంచెయ్యడానికే తనసేనతో వచ్చాడు. అదిగో, చెవులు రిక్కించుకుంటూ, మాటిమాటికీ ఆవలిస్తున్నాడు చూడూ. అతనిపేరు శరభుడు. అతనికి మృత్యువంటే కూడా భయంలేదు. అతని చేతికింద నలభైలక్షలవానరవీరు లున్నారు. మనమీది కతను వారందరితోటీ వచ్చాడు. అదిగో వానరవీరులమధ్య వొకడు పర్వతంలా నుంచునివున్నాడు. అతను దేవేంద్రుడు లా వున్నాడు. అతని కంఠధ్వని భేరీధ్వనిలా వుంది. అతనిపేరు పనసుడు. గొప్పశూరుడు. అతను పారియాంత్రపర్వతంమీదవుంటాడు.యుద్ధరంగంలోకి వచ్చాడంటే యెలాంటివాళ్లూ కూడా అతన్ని కదపలేరు. అతని చేతిలో యాభైలక్షలవానరప్రముఖు లున్నారు. అదిగో అతనిపేరు వినతుడు. అతను పర్ణాసానదీతీరాన వుంటాడు. అతనిదగ్గిర అరవైలక్షల వానరయోధు లున్నారు. అతను క్రోధుడనే వానరప్రముఖుడు. చాలా బలంగలవాడు. నీమీద పగబూని వచ్చాడు. గైరికవర్ణంతో వానరవీరుల నందరినీ మించి వున్నాడు చూడూ, అతనిపేరు గవయుడు. మహాతేజశ్శాలి, నీమీదికి చాలా కోపంతో వచ్చాడు. అతని దగ్గిర డెబ్భయిలక్షల వానరయోధు లున్నారు. వారందరితోనూ అతను లంకను నాశనంచెయ్యడానికి వచ్చాడు. వారందరూ యుద్ధంలోఅసాధ్యులు. కామరూపులు. ఎలాంటి ఘోరాలైనా చెయ్యగలరు" అనిచెప్పాడు.

## ౨౭

# సారణుడు జాంబవదాదుల సంగతి చెప్పడం

సారణుడు మళ్ళీ ప్రారంభించాడు.

"రాక్షసేంద్రా! ప్రాణాల కైనా తెగించి రామునికోసం యుద్ధం చేసే వానరవీరులు మరికొంద రున్నారు చెబుతా విను. అదిగో, అతను హరు డనే, వానర సేనాధిపతి. ఎఱ్ఱనీ పచ్చనీ నల్లనీ తెల్లనీ పొడుగాటి వెంట్రుకలు గల నిక్కుపైన తోకతో అతను చాలా గంభీరంగా వున్నాడు. అతని తోక వెంట్రుకలు మిలమిల మెరుస్తున్నాయి. అతను మహాఘోరంగా యుద్ధంచేస్తాడు. చెట్లూ చేమలూ పుచ్చుకుని లంకమీాద పడడానికి అతనివెనకాల వేనవేలు సిద్ధంగా వున్నారు. అతను వెయ్యి కోట్ల వానరవీరులతో లంకను నాశనంచెయ్యడానికి వచ్చాడు. రాక్షసప్రభూ! అవే భల్లూకాలు చూశావా? అవి నల్లని మేఘాల్లాగా, కాటుకకొండల్లాగా వున్నాయి చూశావా? యుద్ధంలో వాటి నెదిరించి నిలవడం యెలాంటివారికీ సాధ్యం కాదు. అవి పర్వతాలమీాదా, అడవుల్లోనూ, నదీతీరాలలోనూ వుంటాయి. ఇన్ని అని వాటి సంఖ్య చెప్పడం యెవరికీ సాధ్యం కాదు. అవన్నీ నీమీాదికి సముద్రం విరిగిపడ్డట్టు వస్తున్నాయి. వాటినడుమ మేఘాల మధ్య ఇంద్రు డుండేటట్టు న్నాడు చూడూ, అతనిపేరు ధూమ్రుడు. అతను చాలా భయంకరుడు. అతను నర్మదాజలం తాగుతూ ఋక్షవంతం అనే గిరిమీాద నివసించి వుంటాడు. అతనే ఆభల్లూకవీరులకు సేనాధిపతి. అతని దగ్గిరగా పర్వతంలాగ మరొక భల్లూకవీరు డున్నాడు చూడూ. అతనే జాంబవంతుడు. ధూమ్రునకు అన్న. అన్నదమ్ముల రూపం వొక్కటే. కాని పరాక్రమంలో మాత్రం తమ్మునికంటే చాలాగొప్పవాడు. అతను సేనాధిపతు లందరిలోనూ చాలా గొప్ప

వాడు. మహాపరాక్రమశాలి. పెద్దలను సేవించడం అతనికి చాలా యిష్టం. యుద్ధాలలో అసాధ్యుడు. అసహాయశూరుడు. వెనకటికి, దేవాసురయుద్ధంలో దేవేంద్రునకు చాలా సాయంచేసి యిత నెన్నో వరాలు సంపాదించాడు. అతని అనుచరులు అగ్నిహోత్రం వంటి వారు. రాక్షసులనూ పిశాచులనూ మించినవారు. చావుకి వారు భయ పడరు. పర్వతశిఖరా లెక్కి పెద్దపెద్ద బండరాళ్ళను శత్రువులమీాద విసరడంలో వారు చాలా నిపుణులు.

అదిగో యెగరడానికి సిద్ధంగా వున్నట్టున్నాడే, అతనిపేరు బలుడు. వానరయోధులలో ప్రఖ్యాతి పొందినవాడు. అతనికేసి వానరు లెలా చూస్తున్నారో చూడూ. అతను చాలా బలశాలి. దేవేంద్రున కొక యుద్ధంలో యెంతో సేవచేశాడు. నడిచేటప్పుడతని అడుగు ఆమడ దూరాన పడుతూ వుంటుంది. అతను చాలా పొడగరి, నువ్వు చూస్తూనే వున్నావు. అలాంటి రూపం చతుష్పాత్తులలో అతని కొక్కనికే వుంది. అతను వానరుల పితామహుడు, సన్నాదను డని అతని పేరు. అతనొకసారి దేవేంద్రునితో కలియబడ్డాడు. అప్పుడు దేవేంద్రుడే ఓడిపోయాడు.

అదిగో, అతను క్రోధను డనే వానరసేనాధిపతి. అతను గంధర్వ కన్యకూ అగ్నికీ పుట్టినవాడు. అతను ఇంద్రునికంటే గొప్ప పరాక్రమ శాలి. ఒకమాటు ఇంద్రునకు సాయమున్నూ చేశాడు. నీలన్న అయిన కుబేరుని పాలనంలో వున్న జంబూబహుళ మైన హిమవద్గిరి మీాద ఉంటాడు. అతను పరాజయం అన్నది యెరగడు. పదికోట్ల వానరవీరు లతో అతను లంకను పట్టుకోడానికి వచ్చాడు. అదిగో అక్కడ వొక వానరవీరు డున్నాడు చూడూ. గజాకారంతో శంబసాదను డనే రాక్షసుడు మునులను బాధిస్తూ వుండేవాడు. హనుమంతుని తండ్రి అయిన కేసరి ఆరాక్షసుణ్ణి సంహరించాడు. అప్పుడు వానరులకూ ఏను

గులకూ మహాయుద్ధం జరిగింది. అది మొదలు ప్రమాథి అనే ఆవానరో త్తముడు యేనుగులను అనేకవిధాల సంహారిస్తూవుంటాడు. అతను గంగాసమీపాన, ఉశీరబీజం అనే పర్వతంమీద దేవేంద్రుడులాగ విహా రిస్తూ వుంటాడు. అతనిచేతిలో బలమత్తులైన వానరవీరులు కోట్లున్నారు. అతనూ అతని అనుచరులూ ఎప్పుడు లంకమీాద పడ తామా అని తొందరపడుతున్నారు. అదే వారి పరవళ్ళతో అక్కడ దుమ్ము రేగుతోంది చూడు.

అదిగో గవాక్షునివెంట కోట్లకొద్దీ వానరులు సేతువుమీదుగా వస్తున్నారు. వారందరూ లంకను నాశనం చెయ్యడానికే వస్తున్నారు. అదిగో అతనే కేసరి. అతను మేరుపర్వతంమీద నివసిస్తూవుంటాడు. ఆపర్వతాన సర్వఫలాలూ సర్వపుష్పాలూ ఇచ్చే రకరకాల వృక్షా లున్నాయి. అవి బంగారంలా మెరుస్తూ వుంటాయి. అక్కడి పక్షులూ మృగాలూ కూడా బంగారంలాగే తళతళలాడుతూ వుంటాయి. కాం చనపర్వతాలు అరవైవేలున్నవి. రాక్షసులమధ్య నువ్వున్నట్టే వాటి మధ్య మేరుపర్వతం వుంది. ఆవానరులనుచూశావా? వారిలో కొందరి మొగాలు తెల్లగానూ, కొందరి మొగాలు ఎర్రగానూ, కొందరి మొగాలు కపిలవర్ణంగానూ వున్నాయి. దీర్ఘదంష్ట్రలూ గోళ్ళూ వారి కాయుధాలు. వారు సింహాలలాగా, పులుల్లాగా మిక్కిలీ భయంకరులు. కాలసర్పాల్లాగా, అగ్నిహోత్రంలాగా ఘోరకర్ములు. వారు మత్తే భాల్లా వున్నారు. వారి కళ్ళు పింగళవర్ణంగా వున్నాయి. వారి నాయ కుడు శతవలి. వారందరూ కాంచనపర్వతాలమీద నివసస్తూవుంటారు. వారందరూ లంకకొట్టడానికే వచ్చారు. గజుడూ, గవాక్షుడూ, గవ యుడూ, నళుడూ, నీలుడూ—వీరి కొక్కొక్కరికి పదికోట్ల అనుచరు లున్నారు. వింధ్యపర్వతవాసులైన వానరు లున్నారు. వారి సంఖ్యా చెప్పలేము, బలపరాక్రమాలూ నిర్దేశించలేము. యుద్ధంచెయ్యడంలో

వారికి చాలా నేప్పుంది. ఆయుధాలు వారు చాలా లాఘవంగా ప్రయోగించగలరు. మొత్తానికి, మహారాజా! వానరవీరు లందరూ మహాకాయులు. మహాపరాక్రమవంతులు. వారందరూ క్షణంలో భూమండలం అంతా నాశనం చెయ్యగలవారు."

## ౨౮

## శుకుడు మరికొందరి సంగతి చెప్పడం

సారణు డిలా చెప్పి వూరుకోగా శుకు డందుకుని యిలా చెప్పాడు.

"రాక్షసరాజేంద్రా! మదించిన యేనుగుల్లాగా, గంగాతీరాన వుండిన మర్రిచెట్లలాగా, హిమవత్పర్వతంమీద వుండిన మద్దిచెట్లలాగా బలిసివున్న ఆయోధులను చూడు. వారు దుర్జయులు. మహాబలవంతులు. కామరూపులు. దైత్యులతోనూ దానవులతోనూ సమానులు. యుద్ధరంగం లోకి వెళ్ళారంటే దేవతల్లాగ విక్రమిస్తారు. ఇలాంటివానరవీరులు తొంభై వేలకోట్లు ఒక బాపతు, యాభై వేలకోట్లు ఒక బాపతు, డెబ్బయివేలకోట్లు ఒక బాపతు, [illegible] వేల శంఖా లొక బాపతు, అనేకవేలబృందా లొక బాపతు ఉన్నారు. వారందరూ సుగ్రీవుని నమ్మినబంట్లు. కిష్కింధానివాసులు. దేవతలకూ గంధర్వులకూ పుట్టినవారు. కామరూపులు. అదిగో, ఒకరిపక్క వొకరుగా ఇద్దరు యువకులు కూచున్నారు చూడు. వారు మైందుడూ, ద్వివిదుడూ అనే మహావీరులు. యుద్ధరంగంలో వారితో సమానులు మరి లేరు. ఆమైందద్వివిదులు బ్రహ్మదేవుని అనుగ్రహం సంపాదించుకుని అమృతపానం చేసివున్నారు. వారిద్దరూ లంకను మట్టిలో కలపా లని చూస్తున్నారు. వారికి పక్కగా మరో యిద్దరు యువకులు కూచుని వున్నారు చూడు. పర్వతాలలా వున్న ఆయిద్దరూ మృత్యుదేవత

కొడుకులు. సుముఖుడు దుర్ముఖుడు అని వారిపేళ్లు. వారు పదికోట్ల వానరసేనతో లంకకొట్టడానికి వచ్చారు.

రాక్షసప్రభూ! మదించిన యేనుగుగున్నలా వున్న ఆ వానరయువకుని చూశావా? అతనికి కోపంవచ్చిందంటే సముద్రం అంతా కలిచి పారేస్తాడు. అతనే లంకకు వచ్చి సీతను చూసి సీతతో మాట్లాడిన వాడు. అతను కేసరి ప్రథమపుత్రుడు. వాతాత్మజు డనేది అతని ప్రఖ్యాతనామం. హనుమంతు డతని పేరు. అతనే సముద్రం దాటిన వాడు. అతను కామరూపి. మహాబలపరాక్రమశాలి. అతనికి త్రిలోకాలలోనూ ఎదురులేదు. చిన్నతనంలో ఆకలికాగా ఉదయిస్తున్న సూర్యబింబం చూసి "నాకు ఆకలి తీరడంలేదు. సూర్యుణ్ణి తెచ్చుకుని తినేస్తాను" అంటూ ఆకాశాని కెగిరాడు; కాని ఉదయపర్వతం మీద పడిపోయాడు. అప్పు డతని హనువుకు (దవడకు) చిన్న దెబ్బ తగిలింది. అందుకు గుర్తుగానే అతనికి హనుమంతుడు అనే పేరు వాడుకలోకి వచ్చింది. నాకొక వానరు డీసంగతి చాలా నమ్మకంగా చెప్పాడు. అతని బలమూ, రూపమూ, ప్రభావమూ ఇంత అని చెప్పడాని కెవరికీ శక్యంకాదు. అతను తానొక్కడే లంకను కూల్చెయ్యా లని చూస్తున్నాడు.

అతని కరవాత కూచునివున్నాడే నీలమేఘశ్యాముడు, అతను ఇక్ష్వాకువంశీకులలో అతిరథుడు. మహాశూరుడు. త్రిలోకాలలోనూ ప్రఖ్యాతిపొందిన వీరాధివీరుడు. అతను ధర్మం తప్పనివాడు. అతను సకలవేదవేదాంగాలూ నేర్చి వేదవేత్తలలో సాటిలేనివా డైనాడు. అతను బాణం వేశాడంటే ఆకాశం బద్దలయిపోతుంది. పర్వతం పిండీ గుండా అయిపోతుంది. అతనిక్రోధం మృత్యువు క్రోధంతో సమానం. పరాక్రమం ఇంద్రుని పరాక్రమంతో సమానం. అతని భార్య అయిన

సీతనే జనస్థానంనుంచి నువ్వెత్తుకువచ్చావు. ఆరాముడు నిన్ను కూల్చడానికి వచ్చాడు.

అతని కుడివైపున వున్నాడే బంగారపుఛాయతో విశాలవక్షుడు, అతను రాముని తమ్ముడు లక్ష్మణుడు. అతనంటే రామునకు కుడిభుజమూ బహిఃప్రాణమూను. అతను రాజనీతిలోనూ, యుద్ధవిద్యలోనూ చాలా కుశలుడు. సకలశాస్త్రాలూ క్షుణ్ణంగా చదివినవాడు. పట్టరాని కోపంగలవాడు. దుర్జయుడు. అపజయం అన్నది యెరగనివాడు. విక్రాంతిచెయ్యగలవాడు. బుద్ధిమంతుడు. బలశాలి. అతను రామునికోసం తనజీవితం కూడా విడిచిపెట్టేస్తాడు అతను, తానొక్కడే రాక్షసుల నందరినీ సంహారించాలని వున్నాడు. నలుగురు రాక్షసులతో కలిసి రాముని యెడమవైపున వుండినవాడు విభీషణుడు. రాముడతణ్ణి లంకారాజ్యానికి పట్టాభిషిక్తుణ్ణి చేశాడు. అతను నిన్ను కూలగొట్టాలని చూస్తున్నాడు. రామునకూ విభీషణునకూ మధ్యగా మహాపర్వతంలాగ నుంచునివుండినాడు చూడూ, అతనే సర్వశాఖామృగాధిపతి అయిన సుగ్రీవుడు. పర్వతాల నన్నిటినీ హిమవత్పర్వతంలాగ తేజస్సులోనూ, బుద్ధిలోనూ, యశస్సులోనూ, జ్ఞానంలోనూ, ఆభిజాత్యంలోనూ అతను వానరులందరినీ, మించివున్నాడు. పర్వతదుర్గమైన కిష్కింధ నేలుతున్నవా డతను. అతని మెడలో నూరు తామరపువ్వులు గల బంగారు మాలిక మెరుస్తోంది చూడూ, అది దేవతలకున్నూ దుర్లభం. సకలసంపదా దాన్లో వుంది. అది ధరించినవాడు అపజయం పొందడు. ఆమాలికా కపిరాజ్యమూ రాముడు, వాలిని సంహారించి సుగ్రీవున కిచ్చాడు.

నూరు లక్ష లయితే వొక కోటి. నూరువేల కోట్లు అయితే వొక శంఖం. నూరువేల శంఖాలొక మహాశంఖం. నూరువేల మహాశంఖాలొక బృందం. నూరువేల బృందాలొక మహాబృందం. నూరువేల

మహాబృందాలొక పద్మం. నూరువేల పద్మాలొక మహాపద్మం. నూరువేల మహాపద్మాలొక ఖర్వం. నూరువేల ఖర్వాలొక మహాఖర్వం. నూరువేల మహాఖర్వాలొక సముద్రం. నూరువేల సముద్రాలొక ఓఘం. నూరువేల ఓఘాలొక మహౌఘం. ఇలా వెయ్యికోట్లూ, నూరుశంఖాలూ, వెయ్యి మహాశంఖాలూ, నూరు బృందాలూ, వెయ్యి మహాబృందాలూ, నూరుపద్మాలూ, వెయ్యి మహాపద్మాలూ, నూరు ఖర్వాలూ, నూరు సముద్రాలూ, నూరు మహౌఘాలూ – గల వానరసేనతో, నలుగురు రాక్షసులతో విభీషణుడు తన వెంట వస్తూవుండగా సుగ్రీవుడు లంకమీదికి వచ్చాడు. ఉన్నసంగతి యిది. మహారాజా! ఏమి చేస్తే మనకు జయమూ, శత్రువులకు పరాజయమూ కలుగుతుందో అది చెయ్యి"

౨౯

## రావణుడు మరికొందరు చారులను పంపడం

రావణుడు శుకుడు చెప్పినదంతా విన్నాడు. ఆవానరసేన అంతా చూశాడు. రాముణ్ణీ, అతని దగ్గిరగా వుండిన విభీషణ్ణీ, రామునకు కుడిభుజమూ మహావీరుడూ అయిన లక్ష్మణుణ్ణీ, సర్వవానరప్రభువైన సుగ్రీవుణ్ణీ చూశాడు. దాంతో అతనికి భయం పట్టుకుంది. వెంటనే కోపమున్నూ పొంగుకువచ్చింది. వెంటనే మొగం వంచుకుని వుండిన శుకసారణులమీద మాడిపడుతూ "నిగ్రహానుగ్రహసమర్థుడైన రాజుకి చారులు ఇలాగ అప్రియవార్తలు చెప్పడం తగినపని కాదు. ఇక యుద్ధం ప్రారంభం అవుతుందన్న యిలాంటి సమయాన, మీరిద్దరూ మనమీదికి దండెత్తివచ్చిన శత్రువుల నిలా పొగడ్డం చాలాతప్పు. ఆచార్యులకూ గురువులకూ విప్రులకూ మీరు చేసిన శుశ్రూష అంతా వ్యర్థం. ఏమిటంటే? వారు నూరిపోసిన రాజనీతి మీకేమీ అంటలేదు.

ఆశాస్త్రం మాత్రం మీరు బరువు మోసినట్టు మోస్తున్నారు. ఇలాంటి మూర్ఖులను పెట్టుకుని వున్న నేను అదృష్టంవల్లమాత్రమే బతికివున్నాను. నేను నోరు విప్పినంతమాత్రానే యెదటివారికి శుభమో అశుభమో కలిగిపోతుందే, అలాంటి నాయెదట యిలా మాట్లాడడానికి మీకెందుకు భయంలేదూ? దావానలం అంటుకున్నా అడవిలో చెట్లు బతికివుండవచ్చు గాని రాజాగ్రహానికి పాత్రులైన వాళ్లకి మరి బతుకు లేదు. శత్రుపక్షంవాళ్ల నింతగా ప్రశంసించిన వీళ్లని నేను సంహరించవలసిందే; కాని వీళ్లింతవరకూ గొప్పగొప్ప పనులు చేసివుండడంవల్ల దయతలిచివిడిచిపెడుతున్నాను. పొండి, నాయెదుట్నుంచి వెళ్లిపొండి. మీరుచేసిన ఉపకారాలు స్మరించి మిమ్మల్ని విడిచిపెట్టేశాను వెళ్లిపొండి. మీరు కృతఘ్నులూ, స్నేహపరాఙ్ముఖులూ అని నాకు తెలిసిపోయింది. ఇదే మూకు మరణం" అని చాలా కఠినంగా అన్నాడు. అది విని శుకసారణులు చాలాసిగ్గుపడి మొగాలు వంచుకుని రావణునికి జేజేలు మాత్రం పలికి వెళ్లిపోయారు.

అప్పుడు రావణుడు మహోదరుణ్ణి చూసి "నీతివిశారదులైన మరి కొందరు చారులను రప్పించు" అన్నాడు. అత నలా చెయ్యగా చారులు వచ్చి రావణునకు జయం పలికారు. వాళ్ళు నీతిశాస్త్రం బాగా తెలిసినవాళ్లు. భయభక్తులు గలవాళ్లు. రావణుడు వాళ్ళకి "మీరు వెళ్ళి రాముని ప్రయత్నాలు బాగా తెలుసుకురండి. రాముడెలా నిద్రిస్తాడు? ఎలా మేలుకుంటాడు? ఇప్పు డేమి చేస్తున్నాడు? ఇవన్తా మీరు నేర్పుగా తెలుసుకురావాలి. చారులవల్ల సకలవిషయాలూ తెలుసుకున్నవాడే శత్రువులను యుద్ధంలో సులభంగా జయించగలుగుతాడు" అన్నాడు.

ఆచారులున్నూ సరే అని రావణునకు ప్రదక్షిణనమస్కారాలు చేసి బయలుదేరారు. వారిలో శార్దూలు డనేవాడు నాయకత్వం

వహించాడు. రాముడు సువేలపర్వతం దగ్గిర వుండగా వా రక్కడికి వెళ్ళారు. ప్రచ్ఛన్నంగా వుండి వాళ్లు రాముణ్ణీ లక్ష్మణుణ్ణీ సుగ్రీవుణ్ణీ విభీషణుణ్ణీ నిదానంగానే చూశారు; గాని అపార మైన వానరసేన చూశాటప్పటికి భయభ్రాంతు లయిపోయారు. ఇంతలో వాళ్ళని విభీషణుడు గుర్తించేశాడు. వాళ్ళలో "వీడు మరీపాపాత్ము" డని చెబుతూ అతను శార్దూలుణ్ణి వానరులకు పట్టియిచ్చాడు. వానరు లున్నూ వాళ్ళ ననేకవిధాల పీడించారు; గాని రాముడు కలగజేసు కుని విడిపించేశాడు. దాంతో వాళ్ళు బతుకుజీవుడా అనుకుని లంకకు వెళ్ళిపోయి జరిగిందంతా రావణునకు నివేదించారు.

## 30

## శార్దూలుడు వానరుల సంగతి మఱికొంత చెప్పడం

శార్దూలుడు చెప్పింది విని రావణు డుద్విగ్నుడైనాడు; కాని అంతలో "శార్దూలా! నీ మొగం వెలబడివుంది. దీనంగా కనబడుతున్నావు. శత్రువులు నిన్నేమయినా చేశారా?" అని అడిగాడు. దానికి శార్దూలుడు "రాజేంద్రా! వానరవీరుల సంగతి తెలుసుకోడం యెంతెంతలేసి చారులకూ సాధ్యం కాదు. వాళ్లు చాలా బలవంతులు. మిక్కిలీ పరాక్రమవంతులు. రాముడు వాళ్ళ కండగా వున్నాడు. వాళ్ళతో మాట్లాడడమే కష్టం. యిక ప్రశ్నలు వేసి సంగతులు తెలుసుకోడం యెక్కడిదీ? పర్వతాలవంటి వానరవీరు లన్ని దారులూ కాసివున్నారు. మేము ఆబలంలో ప్రవేశించీ ప్రవేశించడంతోనే దొరికిపోయాము. విభీషణుని అనుచరులు నన్ను పట్టుకుని చాలా బాధించారు. వానరులు కూడా నన్ను మోకాళ్ళతో పొడిచారు. గోళ్ళతో రక్కారు. పళ్ళతో పీకేశారు. అరిచేతులతో చరచారు. పిడికిళ్ళతో గుద్దారు. ఇలా పీడిస్తూ వాళ్ళు నన్ను సేన అంతటా తిప్పారు. అప్పటికి నేను రక్తం

కారి మూర్ఛిల్లే స్థితిలోకి వచ్చేశాను. అప్పుడు వాళ్ళు రామునియెదట పెట్టారు. నేను చేతులు జోడించుకుని ప్రార్థించగా రాముడు నన్ను విడిపించాడు. దాంతో యిలా రాగలిగాను. రాముడు రాళ్ళతో సముద్రం పూడ్పించి వానరసేనతో వచ్చి లంకాద్వారంలో విడిసివున్నాడు. వారు గరుడవ్యూహం పన్నుకుని లంకమీద పడ్డానికి సిద్ధంగావున్నారు. వాళ్లువచ్చి ప్రాకారం ఆక్రమిస్తారు, తప్పదు, కనక సీత నిచ్చెయ్యడమో యుద్ధం చెయ్యడమో యేదోవొకటి నిశ్చయించుకో" అని చెప్పాడు.

రావణు డిదంతా విని బాగా ఆలోచించి "శార్దూలా! దేవతలూ దానవులూ గంధర్వులూ దండెత్తివచ్చినా నేను సీత నివ్వను. లోకం అంతా నామీద దండెత్తివచ్చినా నేను భయపడను. అయితే, నువ్వు వానరసేన అంతా చూశావుగదా, వాళ్ళలో శూరు లెవరు? వాళ్ళె లాంటివాళ్ళు? వాళ్ళ తేజస్సు ఏపాటిది? వాళ్ళలో దుర్జయు లెవరు? వాళ్ళెవరికొడుకులు, ఎవరి మనుమలు? ఇదంతా నువ్వు చెప్పు, వాళ్ల బలాబలాలు నేను నిశ్చయించుకుంటాను. యుద్ధం చెయ్యడానికి ముందు ముఖ్యంగా శత్రుబలం బాగా తెలుసుకోవాలి" అని అడిగాడు. అందుకు శార్దూలుడు ఇలా చెప్పాడు.

"రాక్షసరాజేంద్రా! వానరరాజైన సుగ్రీవుడు ఋక్ష రజుని కొడుకు. జాంబవంతుడు గద్గదుని కొడుకు. ఆగద్గదుని కొడుకే ధూమ్రుడు డని మరొక డున్నాడు. బృహస్పతి కొడుకు కేసరి. మహాపరాక్రమశాలీ, ధర్మాత్ముడూ అయిన సుషేణుడు వరుణుని కొడుకు. దధిముఖుడు చంద్రుని కొడుకు. సుముఖుడు దుర్ముఖుడు వేగదర్శి అని ముగ్గురు వానరు లున్నారు. మృత్యువే వాళ్లరూపంగా పుట్టిం దని చెప్పాలి. బ్రహ్మదేవుడే అలా సృష్టించివుంటాడు. నీలుడు అగ్నిదేవుని కొడుకు. వాడే వానరసర్వసేనాధిపతి. హనుమంతుడు వాయుపుత్రు డని తెలిసిందే గదా? జయించశక్యం కాని అంగదుడు దేవేంద్రుని మనమడు.

మైందుడూ ద్వివిదుడూ అశ్వనీదేవతల కొడుకులు. గజుడు గవాక్షుడు గవయుడు గంధమాదనుడు శరభుడు యముని కొడుకులే. వాళ్ళు అచ్చంగా యములే. మొత్తానికి వానరులు పదికోట్లున్నారు. వాళ్ళంతా మహాశూరులు. ఎప్పు డెప్పు డని యుద్ధంకోసం యెదురుచూస్తున్నారు. వాళ్ళంతా దేవతల కొడుకులే. వాళ్ళ సంగతి చెప్పడం యెవళ్ళకీ శక్యం కాదు. ఇక రాము డున్నాడు. అతను దశరథపుత్రుడు. సింహాలను కూడా అత నవలీలగా చంపగలడు. దూషణుణ్ణీ ఖరుణ్ణీ త్రిశిరుణ్ణీ విరాధుణ్ణీ కబంధుణ్ణీ చంపినవా డతనే. రాముని శక్తియుక్తులు చెప్పడం యెవళ్ళకీ సాధ్యం కాదు. అనేకమంది రాక్షసులను జనస్థానంలో ఒక్కముహూర్తంలో చంపినవీరు డతను. అతని తమ్ముడే లక్ష్మణుడు. అతను మత్తేభాన్ని మించినవాడు. అతని బాణమార్గంలో పడ్డవా డెవడూ బతకడు. శ్వేతుడు జ్యోతిర్ముఖుడు అనేవాళ్లు సూర్యపుత్రులు. హేమకూటు డనేవాడు వరుణుని మరొక కొడుకు. నళుడు విశ్వకర్మ కొడుకు. మహాపరాక్రమశాలీ జయించశక్యం కానివాడూ అయిన దుర్ధరుడు వసుపుత్రుడు. మన రాక్షసులలో గొప్పవా డయిన నీతమ్ముడు విభీషణు డున్నా డక్కడే వున్నాడు. రాము డతనికి లంకారాజ్యం అభిషేకించాడు. అంచేత నీతమ్ముడు రామునకు శ్రేయస్సు కలిగించాలన్న దీక్షతో వున్నాడు. ఆవానరసైన్యం అంతా సువేలపర్వతంమీద వుంది. ఇక తరవాయి నీచేతిలో వుంది"

## ३౧

## రావణుడు రాముని మాయశిరస్సు చూపించి సీతను భయపెట్టడం

ఇదంతా విని రావణుడు మళ్లీ కొంచెం సంభ్రాంతుడై మంత్రులను చూసి "మంత్రుల నందరినీ రప్పించండి. ఇది జాగ్రత్తగా మంత్రాలోచన చెయ్యవలసిన సమయం" అని చెప్పాడు. మంత్రు ల్లందరూ

వచ్చారు. చాలాసేపు ఆలోచనలున్నూ జరిపారు. ఎవరియిళ్లకు వాళ్లని పంపేసి రావణుడు అంతఃపురానికి వెళ్లిపోయాడు.

విద్యుజ్జిహ్వుడనే రాక్షసుడు చాలా బలశాలి. విశేషించి చాలా మాయలమారి. వాణ్ణి పిలిపించి రావణుడు "మనం యిప్పుడు సీతను మోసంచెయ్యాలి. కనక, నువ్వు రాముని మాయశిరస్సు కల్పించి తీసుకురా. అతని ధనుస్సూ బాణాలూ కూడా కల్పించి తీసుకురా" అని ఆజ్ఞాపించాడు. ఒక ఆభరణం కూడా బహూకరించాడు. వెంటనే రావణుడు అశోకవనానికి బయలుదేరాడు. సీత దీనంగా వుంది. మొగం వంచుకుని శోకిస్తోంది. నేలమీద కూచుని రాముణ్ణే ధ్యానిస్తోంది. ఘోరాకారాలు గల రాక్షసాంగనలామెని పీడిస్తూనే వున్నారు. అలాంటప్పుడు వెళ్లి రావణుడు "వెర్రిదానా! నేను చెబితే విన్నావా? ఖరుణ్ణి సంహరించిన నీరాముడు యుద్ధంలో చచ్చి వూరుకున్నాడు. నీఆధారం కొట్టేశాను. నీగర్వం అణిచివేశాను. ఇంకెందుకూ దుఃఖం. నాకు భార్యవయి సుఖపడు. ఇప్పటి కయినా యీమూర్ఖత్వం విడిచిపెట్టు. చచ్చినవాడితో యేంచేస్తావు? నాభార్యల కందరకీ నువ్వు యజమానురాలి వయి సుఖపడు. తెలివితక్కువదానా? నీమొగుడెలా చచ్చిపోయాడో చెబుతా విను. సుగ్రీవుని సైన్యం సాయంతెచ్చుకుని రాముడు నన్ను చంపడానికి సముద్రం దాటివచ్చాడు. సూర్యాస్తమానం కాబోయే సమయాన సముద్ర తీరాన విడిశాడు. మార్గాయాసంతో సేన అంతా గాఢనిద్రలో వుండిన సమయాన అర్ధరాత్రివేళ చారులను పంపి సంగతి అంతా తెలుసుకున్నాను. నేను ప్రహస్తుణ్ణి గొప్పసైన్యంతో పంపాను. ప్రహస్తుడు వానరసైన్యం అంతా నాశనంచేశాడు. రాక్షసవీరులు పట్టసాలూ పరిఘలూ చక్రాలూ దండాలూ ఖడ్గాలూ బాణాలూ శూలాలూ కూటముద్గరాలూ తోమరాలూ రోకళ్లూ మొదలైన

సకలాయుధాలూ విచ్చలవిడిగా ప్రయోగించి వానరవీరుల నందరినీ చిత్రవధ చేసేశారు. ఇదిలా జరుగుతూవుండగా ప్రహస్తుడు వెళ్ళి కత్తి చేతిలోనే వుంచుకుని నిద్రపోతున్న రాముని శిరస్సు నరికేశాడు. ఆకాశాని కెగిరిపోదా మని ప్రయత్నించాడు గాని విభీషణుడు దొరికి పోయాడు. కొందరు వానరులతో లక్ష్మణుడు దిక్కు తెలియకుండా పారిపోయాడు. సుగ్రీవుడు కంఠం తెగిపడివున్నాడు. హనుమంతుడు దవడ పేలిపోయి దీర్ఘనిద్రలో వున్నాడు. జాంబవంతు డెగరబోగా కాళ్లు నరికి రాక్షసులు చంపేశారు. మైందుడూ ద్వివిదుడూ చావు దెబ్బలు తిని, మూల్గుతూ మూలుగుతూ క్షణానికో క్షణానికో చావ డానికి సిద్ధంగా వున్నారు. పనసుడు నేలమీద చచ్చినపాములా పడి వున్నాడు. బాణందెబ్బలు తిని దరీముఖుడు ఒకగుహాలో చచ్చిపడి వున్నాడు. మహావీరు డైన కుముదుడు బాణాలతో వూపిరివిడిచాడు. చాలామంది రాక్షసులు అంగదునిమీద పడి ముక్కా చెక్కా కింద నరికేశారు. ఇలాగ వానరు లందరూ చచ్చారు. కొందరు పారిపో యారు. కొందరు సముద్రంలో వురికారు. కొంద రెగిరిపోయారు. సముద్రతీరం అంతా చచ్చిన వానరకళేబరాలతో నిండిపోయివుంది.

"ఇదిగో, నీ మొగుడి శిరస్సు తెప్పించాను." అని చెబుతూ రావణుడు ఒక రాక్షసాంగనను పిలిచి "నువ్వు వెళ్ళి విద్యుజ్జిహ్వుణ్ణి తీసుకురా. వాడే యుద్ధరంగంలోనుంచి రాముని శిరస్సు తెచ్చినవాడు" అని చెప్పాడు. వెంటనే రాముని శిరస్సూ ధనుర్బాణాలూ పట్టుకువచ్చి విద్యుజ్జిహ్వుడు రావణునకు నమస్కారంచేసి నుంచున్నాడు. దానిమీద రావణుడు. "చూస్తావేం? రాముని శిరస్సు సీతముందు పెట్టు తన మొగుడి చివరిగతి ఆమె చూసుకుంటుంది" అన్నాడు. వాడలాగే చేసి పక్కకి తప్పుకోగా రావణుడు ఆధనుర్బాణాలు పుచ్చుకుని "సీతా! ఇదిగోయిది నీమొగుడి ధనుస్సు. నీమొగుడి శిరస్సూ ఇదీ ప్రహస్తుడు

తీసుకువచ్చాడు. ఇంకెందుకూ? ఇప్పుడైనా నాకు వశంఅయి సుఖపడు'' అన్నాడు.

## 3 9

## రాముని మాయశిరస్సు చూసి సీత దుఃఖించడం

సీత ఆశిరస్సూ ధనుర్బాణాలూ చూసింది. హనుమంతుడు రామునకూ సుగ్రీవునకూ సఖ్యం కుదిరిం దని చెప్పాడు. అది తలుచుకుంది. ఆకళ్లూ, ఆముఖవర్చస్సూ, ఆశిరోజాలూ, ఆశిరోమణీ చూసి అది రాముని శిరస్సే అనుకుంది. దాంతో ఆమె దుఃఖం ముంచుకురాగా ఆడలేడిలాగ దుఃఖించసాగింది.

"కైకా! నీకోరిక తీరింది. వంశానికంతకీ ఆనందం కలిగించేవాడు కిదిగో హతుడైపోయాడు. కలహాశీలురాలవైన నీవల్ల కులం అంతా నాశనం అయిపోయింది. కైకా, రాముణ్ణి నారచీరలు కట్టించి నాతో కూడా అడవులకు పంపావే, రాముడు నీకేమి అపకారం చేశాడు?'' ఇలా అంటూ సీత మొదలునరికిన అరటిచెట్టులాగ నేల మీద పడిపోయింది, కాని త్వరలోనే మళ్లీ ప్రకృతిలోపడి, ఆశిరస్సు మూర్కొని "మహాబాహూ! నేను చచ్చిపోయాను. నేను నీమరణం చూడవలసివచ్చింది. నేను వితంతువు నయిపోయాను. భార్యాభర్తలలో భర్త ముందు చచ్చిపోతే అది భార్య దోషంవల్ల జరిగిం దంటారు. నువ్వు సదాచారసంపన్నుడవు. నేనున్నూ సాధుశీలను. మరి నీకీ మరణం యెలా వచ్చిందీ? దుఃఖంమీద దుఃఖం నన్ను ముంచేసింది. శోకసాగరంలో మునిగిపోయిన నన్ను, నువ్వు మరణించావే, యింకెవ రుద్ధరిస్తారూ? నాఅత్తగారు కౌసల్య నీమరణంవల్ల లేగదూడ చని పోయిన ఆవువంటి దయిపోయిందిగదా? నువ్వు దీర్ఘాయుష్మంతుడ వని చెప్పిన జ్యోతిశ్శాస్త్రజ్ఞులు అసత్యవాక్కు లయిపోయారుగదా?

అలా కాకపోతే, కాలం నీకు విరుద్ధం అయి వుంటుంది. అదే ఆజ్యోతి శ్శాస్త్రజ్ఞులను తప్పుదారిలో పెట్టివుంటుంది. నువ్వు నీతిశాస్త్రవేత్తవు. వ్యసనాలకు తగ్గ ఉపాయా లెరిగినవాడవు. వాటిని తొలగించుకొనే శక్తియుక్త లున్నవాడవు. అలాంటి నువ్వే మృత్యువుపాల యెలా పడ్డావ్రా? రౌద్రమైన కాళరాత్రి నీకూ నాకూ ఎడబంధాలు కలిగించి నిన్ను చంపేసివుంటుంది. నన్ను విడిచిపెట్టి ప్రియురాలిని లాగ భూమినే కౌగిలించుకుని పడుకున్నావా? నేను గంధమాల్యాదులతో అర్చించిన ధనుస్సా యిది? నువ్వు నీకు తండ్రీ నాకు మామా అయిన దశరథునితోనూ తక్కిన నీపూర్వులతోనూ స్వర్గంలో కలుసుకున్నావా? గొప్పకర్మలు చేసిన నీపూర్వులకు ప్రీతిపాత్రమూ పుణ్యమూ అయిన ఇక్ష్వాకురాజర్షి వంశం నువ్వు నక్షత్రం అయి ఆకాశం నుంచి చూస్తున్నావా? నేను చిన్నదానినై వున్నప్పుడే నీచిన్నతనంలోనే నీకు భార్యనూ స్నేహితురాలనూ అయానే, నన్ను చూడవేం? నాతో, మాట్లాడవేం? నువ్వు నాపాణిగ్రహించాటప్పుడు "నాతిచరామి" అని దీక్షపట్టావు కనక, నన్ను కూడా నీదగ్గిరికి తీసుకువెళ్లు. నన్ను విడిచీ, యీలోకం విడిచీ నువ్వెందుకు వెళ్ళిపోయావ్రా? నేను స్రక్చందనాదులతో అలంకరించి కౌగిలించుకునే నీశరీరం క్రవ్యాదులపాలబడిందా? గొప్పగొప్ప దక్షిణ లిచ్చి నువ్వనేకయజ్ఞాలు చేశావే, నీకెందు కగ్నిసంస్కారం లేకుండా పోయిందీ? ప్రవాసానికి వెళ్ళిన ముగ్గురిలోనూ ఒక్క లక్ష్మణుడే యింటికి రావడం చూసి "సీతా రాము లేరీ?"అని అడుగుతుంది కాబోలు! అందుకు లక్ష్మణుడు నీవధ సంగతి చెబుతాడు కాబోలు. నిద్రలో నువ్వు హతుడవు కావడమూ, నేను రాక్షసులచేతిలో పడిపోవడమూ వింటే కౌసల్య గుండెలుపగిలి చచ్చిపోతుంది. నామూలాన మహానుభావుడవైన నువ్వు సముద్రం అంతా దాటి చివరికి గోష్పాదమాత్రంలో ఆపన్నుడ వయిపోయావు

గదా? నేను మృత్యువు నని తెలుసుకోలేక నన్ను పెళ్ళాడావు. నేను గతజన్మలో ఎవరో కన్యాదానం చేస్తూవుంటే విఘాతం కలిగించివుంటాను. అంచేతనే, యీజన్మలో అందరినీ రక్షించగలవాని భార్యనయినీ యిలా దుఃఖిస్తున్నాను. రావణా! నువ్వు చాలా మంచివాడవు. నన్ను రాముని కళేబరంమీద పడవెయ్యి. భార్యనీ భర్తనీ కలిపి పుణ్యంకట్టుకో. నాతల రాముని శిరస్సుతోనూ, నాశరీరం రాముని శరీరంతోనూ కలుపు. నేను నాభర్తతో సహగమనం చేస్తాను" అంటూ సీత అనేకవిధాల గోలపెడుతూ దుఃఖించింది.

సీత యిలా దుఃఖిస్తూ వుండగా ద్వారపాలకుడు వచ్చి "మహారాజుకి జయం" అని జేజేలు కొట్టి "సేనానాయకుడు ప్రహస్తుడు వచ్చి వున్నాడు. అతను అమాత్యు లందరితోనూ కలిసివచ్చాడు. అతను నీదర్శనం కోరి నన్ను పంపాడు. చాలా తొందరపని వచ్చింది. కనక, వారికి దర్శనం అనుగ్రహించు" అని రావణునితో చెప్పాడు. దీనిమీద రావణుడు అశోకవనం విడిచి వెళ్ళిపోయాడు. రామపరాక్రమం తెలుసుకుని మంత్రులతో ఆలోచించి చెయ్యవలసిందికూడా నిశ్చయించుకున్నాడు. రావణు డలా వెళ్ళిపోగానే ఆధనుర్బాణాలూ, ఆరాముని శిరస్సూ మాయం అయిపోయాయి. రావణుడు సేనాధిపతులను చూసి "భేరీ మోగించి సైన్యా లన్నీ రప్పించండి. కారణం మాత్రం వాళ్ళకి చెప్పవద్దు" అని చెప్పాడు. మంత్రు లతను చెప్పినట్టుచేసి ఆసంగతి అతనికి విన్నవించారు.

## 33
## సరమ సీతకు ధైర్యం చెప్పడం

సీత యిలా దుఃఖిస్తూ వుండడం చూసి విభీషణుని భార్య అయిన సరమ తనకు గల స్నేహం పురస్కరించుకుని సీతను ఆశ్వాసింపబూనుకుంది. సీతను కనిపెట్టుకుని వుండమని ఆమెను రావణు డాజ్ఞాపించాడు. సరమ

తక్కిన రాక్షసస్త్రీలలాగ కాక సీతమీద దయతో వుంది. సీతమీద ఆమెకు మిక్కిలీ అనురాగం కూడా కలిగింది. దుఃఖంతో సీత ఆడు గుర్రంలాగ నేలమీద పడి వుంది. ఆమె శరీరం అంతా ధూళిధూస రితం అయిపోయింది.

సరమ యిలా ప్రారంభించింది.

" సీతా! నువ్వూరుకో. మనస్సు కాయాసం తెచ్చుకోకు. నీతో రావణు డేమన్నాడో, అందుకు నువ్వేమి బదులుచెప్పావో అదంతా నేను విన్నాను. నీమీది స్నేహంవల్ల విన్నాను. రావణు డేమి చేసినా సరే అని భయంవిడిచి రహస్యంగా వుండి నేనంతా విన్నాను. నీకోసం నేను ప్రాణాలైనా విడిచిపెట్టేస్తాను. రావణుడు కంగారుపడుతూ వెళ్ళి పోయాడు. దాని కేమి కారణమో అదీ నాకు తెలుసు. రాముడు సమస్తమూ తెలిసినవాడు. నిద్రిస్తూ వున్నప్పుడతన్ని చంపడం యెవ రికీ సాధ్యం కాదు. ఏస్థితిలోనూ అత న్నెవరూ చంపలేరు. వానరులు చెట్లతోనూ చెమలతోనూ యుద్ధంచేస్తారు. పైగా దేవేంద్రుడు దేవ తలను రక్షించేటట్టు రాముడు వాళ్ళనివెయ్యికళ్ళతో కనిపెడుతున్నాడు. వానరులను చంపడం కూడా యెవరికీ అలవికాదు. రాముడు దీర్ఘ వృత్తభుజుడు. మహోరస్కుడు. ప్రతాపశాలి. విలుకాళ్ళలో సాటి లేనివాడు. ధర్మాత్ముడు. విఖ్యాతిపొందినవాడు. అతను విక్రమిస్తే యెవరూ సహించలేరు. అతను తననీ పరులనూ కూడా రక్షించగలడు. లక్ష్మణు డెలాంటి సమయానా కూడా అతన్ని విడిచేవుండడు. పైగా రాముడు రాజనీతి బాగా తెలిసినవాడు. శత్రుబలం యెంతవున్నా అతను విలాసగా సంహరించేస్తాడు. అతని బలమూ పౌరుషమూ యేపాటివో యెవరూ నిర్ధారణచెయ్యలేరు. సీతా! ఎందుకు దుఃఖి స్తావూ? శత్రువులను సంహరించే రాముడు చనిపోలేదు, నమ్ము. దుష్టుడూ సమస్తప్రాణికోటికీ విరోధీ, ఘోరకర్ముడూ, మాయావీ

అయిన రావణుడు నిన్ను భయపెట్టి వంచించడానికి కీమాయప్రయోగం చేశాడు. నీదుఃఖం అంతమయిపోయింది. నీకు సౌభాగ్యం సమీపించింది. నువ్వింక సకలసంపదలూ అనుభవిస్తావు. సంతోషకరమైన ప్రియవార్త చెబుతా విను. రాముడు వానరసేనతో సముద్రం దాటి వచ్చి దక్షిణపుగట్టున విడిసివున్నాడు. పూర్ణకాముడైన రామ్ణ్ణీ లక్ష్మణుణ్ణీ నేను చూశాను. సముద్రతీరాన వానరసైన్యం పరివేష్టించి వుండగా అతను క్షేమంగా వున్నాడు. రావణుడు పంపిన చారులు వచ్చి రాముడు సముద్రం దాటివచ్చారనే చెప్పాడు. అది విని రావణుడు మంత్రులతో దీర్ఘాలోచన చేస్తున్నాడు"

సరమ ఇలా చెబుతూ వుండగా రాక్షసయోధుల భయంకరకలకలం వినపడింది. భేరీధ్వనులు పిక్కటిల్లాయి. అది విని సరమ మళ్ళీ సీతతో "భీరురాలా! ఈభేరీభాంకారం యెందుకో తెలుసా? యుద్ధసన్నాహంకోసం. మదపుటేనుగులను సిద్ధంచేస్తున్నారు. గుర్రాలు పూనుస్తున్నారు. విచ్చుకత్తులతో అశ్వారూఢులైన రాక్షసయోధులు పురం అంతా తిరుగుతున్నారు. కాల్బలాలు అక్కడక్కడ చేరుకుంటున్నాయి. అద్భుతదర్శనులైన సైనికులతో రాజవీధు లన్నీ నిండిపోయాయి. కత్తులూ, డాలులూ, బాణాలూ, యేనుగులూ గుర్రాలూ ఆభరణాలూ రాక్షసుల వీరాలంకారాలూ మెరిసిపోతున్నాయి. వాటి కాంతులతో పురం అంతా తగలబడిపోతూవున్న అడవిలాగ వెలిగిపోతోంది. రాక్షసుల సంరంభం గగుర్పాటు కలిగిస్తోంది. నీకు దుఃఖం పోయి సంపత్తు కలుగుతుంది. రాక్షసులకు భయం మూడింది. కమలపత్రాక్షుడైన రాముడు, మహేంద్రుడు దైత్యులను సంహరించినట్టు రావణుణ్ణీ రాక్షసులనూ సంహరించి నిన్ను కలుసుకుంటాడు. శ్రీమహావిష్ణువు శత్రువులమీద విక్రమించినట్టు రాముడున్నూ లక్ష్మణునితో కలిసి రాక్షసులమీద విక్రమిస్తాడు. నువ్వు రాముని వొడిలో కూచుని

వుండగా నేను త్వరలోనే చూస్తాను. నువ్వు ఆరాముణ్ణి కౌగిలించుకుని అతని వక్షస్థలంమీద ఆనందబాష్పాలు విడుస్తావు, సందేహంలేదు. చిరకాలంనుంచీ నీపిరుదులమీద వేలాడుతూవున్న నీవేణిని రాము డిక త్వరలోనే విప్పుతాడు. పూర్ణచంద్రబింబంవంటి రాముని మొగంచూసి నువ్వు తాచుపాము కూసంవిడిచేటట్టు కన్నీరు విడిచిపెట్టేస్తావు. రాముడు త్వరలోనే రావణుణ్ణి సంహరించి నీతో పూర్ణసుఖం అనుభవిస్తాడు. అతనితో కూడి నువ్వు పచ్చని సస్యంతో కూడివున్న భూదేవిలాగ శోభిస్తావు. కనక, నువ్వు, మేరుపర్వతంచుట్టూ మండలగతితో తిరుగుతున్న సూర్యుణ్ణి శరణుపొందు. అతను జగత్తు కంతకూ పరమ కారణంగదా ? ”

## 3౪

## సరమ రావణుని నిశ్చయం తెలుసుకువచ్చి సీతకు చెప్పడం

ఇలాగ సరమ, ఆకాశం వర్షధారలతో భూదేవి నానందపెట్టేటట్టు శుభవార్తచెప్పి సీతను సంతోషపెట్టింది. మరిన్నీ ఆమె సీత కింకా హితం కలిగించదలచి “ సీతా ! నేను వెళ్ళి నీకుశలవార్త రామునకు చెప్పి రాముని క్షేమవార్త నీకు చెబుదా మని భావిస్తున్నాను. నిరాలంబమైన ఆకాశాన నేను వెడుతూవుంటే గరుత్మంతుడూ వాయుదేవుడూ కూడా నన్నందుకోలేరు ” అంది. దీనిమీద సీత “ సరమా ! నువ్వు ఆకాశానికీ వెళ్ళగలవు, పాతాళానికీ వెళ్ళగలవు. నాకోసం నువ్వు చెయ్యలేనిది లేదు. నాకు తెలుసు. నిజంగా నీకు, నాకు ప్రీతి కలిగించాలనే వుంటే నావిషయమై రావణు డేమి చెయ్యడానికి సిద్ధంగా వున్నాడో అది తెలుసుకురా. మాయాబలుడూ క్రూరుడూ అయిన రావణుడు మద్యం లాగ నాకు చిత్తభ్రమ కలిగిస్తున్నాడు. రాక్షస స్త్రీలను కాపుపెట్టి నన్ను చేష్టలతో మాటలతోనూ కూడా చాలా పీడించేటట్టు చేస్తున్నాడు. నాకు ద్వేగం కలుగుతోంది. ఎప్పటి కప్పుడే

ప్రాణసంశయం కూడా కలుగుతోంది. నామనస్సు స్వస్థంగా లేదు. వాడేమి చెయ్య తలుచుకున్నాడో నాకు చెప్పితివా, అంతకంటే నువ్వు నాకు చెయ్యగల ఉపకారం మరొకటిలేదు ” అని కోరింది.

ప్రియభాషిణి అయిన సరమ యిది విని “ నీకిలాంటి కోరిక వుంటే నేనిప్పుడే ఆసంగతి తెలుసుకువస్తాను ” అని చెప్పి వెంటనే రావణుని దగ్గిరికి వెళ్లి వాడు మంత్రులతో చేసే ఆలోచన అంతావిని వెంటనే అశోకవనంలోకి వచ్చింది. సీత ఆమెని కౌగిలించుకుని కూచో అని తల దగ్గిరగా స్థలం చూపించి వోణికిపోతూ “ ఏమి జరుగుతోంది ? ” అని అడిగింది. దానికి సరమ యిలా చెప్పింది.

“ సీతా ! రావణుని తల్లి కైకసీ, వృద్ధమంత్రి అయిన అవిద్ధుడూ నిన్ను విడిచిపెట్టమని చాలాదూరం చెప్పారు. “ సీతను రాముని కిచ్చెయ్యి. రాముడు జనస్థానంలో చేసింది గుర్తుంచుకో. సముద్రం దాటడమూ, హనుమంతుడు సీతను చూడడమూ, రాక్షసులను సంహారించడమూ — ఇది మనుష్యమాత్రునకు సాధ్యమా ? ఆలోచించుకో ” అని నిదర్శనం చూపించి మరీ చెప్పారు ; కాని లోభి డబ్బు విడిచిపెట్టలేనట్టు రావణుడు నిన్ను విడిచిపెట్టలేకుండా వున్నాడు. “ యుద్ధంలో చస్తే చావాలి గాని సీతను మాత్రం విడవను ” ఇదీ రావణుని నిశ్చయం. తక్కిన మంత్రులు ఈనిశ్చయమే బలపరుస్తున్నారు. రావణునకు ఇలాంటి బుద్ధి చావు మూడడానికే పుట్టింది. తానూ రాక్షసులూ యుద్ధంలో చచ్చేదాకా వాడు నిన్ను వదలడు. బెంగపెట్టుకు, నిశితశరాలతో రావణుణ్ణి సంహరించి రాముడు నిన్ను అయోధ్య తీసుకువెడతాడు.”

సరమ యిలా చెబుతూ వుండగా, వానరవీరుల భేరీధ్వనులూ సింహనాదాలూ భూమిని గజగజలాడించేశాయి. అది విని లంకలో

వున్న రాక్షసు లందరూ రావణుని దుష్టకృత్యాలవల్ల తమకు కీడు మూడిం దని తెలుసుకుని తల్లడిల్లారు.

## ౩౫
## మాల్యవంతుడు రావణునకు హితోపదేశం చెయ్యడం

శంఖారావంతో కలిసిన భేరీభాంకారాలతో రాముడు లంకమీదికి బయలుదేరాడు. అది విని రావణుడు ఒక్క-క్షణకాలం ధ్యానించి మంత్రులకేసి చూశాడు. రావణుడు వారి నందరినీ చూసి "రాముడు సముద్రం దాటివచ్చా డనీ, అతనిబలపరాక్రమాలు అసామాన్యా లనీ సైన్యమున్నూ అపార మనీ మీరు చెప్పారు, నేను విన్నాను. మీరయినా సత్యపరాక్రమవంతులు; కాని రాముని బలపరాక్రమాలు తెలిసిన తరవాత మీరు తూష్ణీంభావం వహించారు. ఇది నాకు తెలుసు" అని గంభీరంగా అన్నాడు. దానిమీద రావణుని తల్లికి పినతండ్రి అయిన మాల్యవంతు డిలా ప్రారంభించాడు. అతను మంచి ప్రాజ్ఞుడు.

"రాక్షసరాజా! సకలవిద్యలూ నేర్చి నీతిశాస్త్రంప్రకారం నడుచు కునే రాజు శత్రువుల నందరినీ వశపరుచుకుని చిరకాలం రాజ్యపాలనం చెయ్యగలుగుతాడు. నీతి తెలిసిన రాజు తప్పివచ్చినప్పుడు శత్రువు లతో సంధిచేసుకుంటూ, వీలయినప్పుడు వారి నెదిరిస్తూ తన పక్షం బాగుచేసుకుని గొప్ప ఐశ్వర్యం అనుభవిస్తాడు. తన బలం క్షీణంగా వున్నప్పుడు రాజయినవాడు యుక్తిగా సంధిచేసుకోవాలి. తాను ప్రబలంగా వున్నప్పుడు యుద్ధంచెయ్యాలి. రావణా! సంగతి అంతా చూస్తే రామునితో సంధిచేసుకోడమే మన కిప్పుడు శ్రేయస్కరం అని తోస్తోంది; కనక, యీగొడవ అంతా యెవరి మూలంగా పుట్టిందో ఆసీతను రామున కిచ్చెయ్యడం మంచిది. దేవతలూ, మహా

ర్షులూ, గంధర్వులూ రామునకు జయం కలగా లని కోరుతున్నారు. అతనితో నీకు విరోధం తగదు. సంధిచేసుకో. భగవంతు డైన బ్రహ్మ ధర్మమూ అధర్మమూ సృజించాడు. వాటిలో ధర్మం దేవతల పక్షం. అధర్మం అసురులపక్షం. ధర్మం అధర్మాన్ని జయించినప్పుడు కృతయుగం నడుస్తుంది. ధర్మాన్ని అధర్మం జయించినప్పుడు కలి యుగం నడుస్తుంది. నువ్వు లోకాలన్నీ జయించినప్పుడు ధర్మం నశించి అధర్మం ప్రబలిపోయింది. అందువల్ల మన శత్రువులు బలవంతు లైనారు. ప్రమాదంవల్ల నువ్వు అధర్మం అవలంబించావు. అది మన లను నశింపచేస్తుంది. ధర్మం సురల నాశ్రయించింది. నువ్వోకానొక కారణంవల్ల విషయాసక్తుడవై అగ్నిహోత్రాలవంటి మహర్షు లకు ఆయాసం కలిగించావు. ఆమహర్షుల ప్రభావం భగభగ మండుతున్న నిప్పువంటిది. దాన్ని యెదురుకోడం శక్యంకాని పని. ఆమహర్షులు ఎప్పుడూ తపస్సు చేసుకుంటూ ధర్మం తప్పక గొప్పగొప్ప యజ్ఞాలు చేస్తూ దేవతల నానంద పరుస్తూ వుంటారు. వారు యథావిధిగా హోమాలు చేస్తారు. వేదాలు వల్లిస్తారు. రాక్షసులు పారిపోయేటట్టు వేదపారాయణం చేస్తారు. వారిని చూస్తే రాక్షసు లందరూ గ్రీష్మకాలపు మేఘాల్లాగ దిక్కులకు పారిపోతారు. మహర్షుల హోమధూమం వృద్ధి అయి రాక్షసుల తేజస్సు నావరించేస్తోంది. ఆమహర్షులు అక్కడక్కడ చేసే తీవ్రతపస్సు రాక్షసులకు సంతాపం కలిగిస్తోంది. దేవదానవ గంధర్వుల వల్ల మాత్రమే మరణం లేకుండా వుండేటట్టు నువ్వు వరం సంపాదించావు; కాని మనుష్యులూ, కోతులూ, కొండముచ్చులూ, యెలుగుబంట్లూ మహాబలపరాక్రమాలతో మనమీాదికి వస్తున్నాయి. దుర్నిమిత్తాలు కూడా చాలా ఘోరంగా కనపడుతున్నాయి. వాటివల్ల రాక్షసులకు వినాశకాలం వచ్చినట్టు కనపడుతోంది. మేఘాలు గాడిద

ల్లాగ భయంకరంగా గర్జిస్తున్నాయి. లంకలో రక్తవర్షం కూడా కురుస్తున్నాయి. గుర్రాలూ యేనుగులూ యేడుస్తూ కన్నీళ్ళు విడుస్తున్నాయి. జెండాలు వెనకటిలాగ రెపరెపలాడడం లేదు. పైగా పడిపోతున్నాయి. దుష్టాలైన నక్కలూ గద్దలూ లంకలో ప్రవేశించి గుంపులుగుంపులుగా కూడి దారుణంగా అరుస్తున్నాయి. నల్లని స్త్రీలు యెదట నిలిచి తెల్లని పళ్ళు కనపడేటట్టు నవ్వుతున్నట్టూ, ఇళ్ళల్లోవున్న వస్తువు లెత్తుకుపోతున్నట్టూ కలలు వస్తున్నాయి. ఇళ్ళముందు వేసే బలులు కుక్కలుముట్టుకుపోతున్నాయి. ఆవులకు గాడిదలు పుడుతున్నాయి. ఎలుకలూ ముంగిసలూ కలిసితిరుగుతున్నాయి. పిల్లులూ పులులూ కలుస్తున్నాయి. పందులూ కుక్కలూ ఏకం అవుతున్నాయి. కిన్నరులు రాక్షసులతోనూ మనుష్యులతోనూ కలుస్తున్నారు. ఎర్రని కాళ్ళతో తెల్లని పావురాలు రాక్షసుల వినాశం సూచిస్తూ తిరుగుతున్నాయి. ఇళ్ళలో పెంచబడుతున్న గోరువంకలు చీచీ కూచీ అంటూ క్రూరంగా కూస్తున్నాయి. పక్షులూ మృగాలూ కలహిస్తూసూర్యుని కేసి చూస్తూ ఏడుస్తున్నాయి. బుర్ర గొరిగించుకుని నల్లగానూ పింగళవర్ణంగానూ వున్న పురుషు డొకడు వికటంగా ప్రతీయింటియెదటా కనపడుతున్నాడు. ఇలాంటి దుర్నిమిత్తా లింకా యెన్నో కనపడుతున్నాయి. కనక, యివన్నీ ఆలోచించి నువ్వు శ్రేయస్సు కలిగేటట్టు ప్రవర్తించు" ఇంత చెప్పినా రావణుడు అయిష్టంగా వున్నట్టు గ్రహించి మాల్యవంతు డంతటితో వూరుకున్నాడు.

## ౩౬

## రావణుడు లంకాపురరక్షణకు ఏర్పాట్లు చెయ్యడం

మృత్యువశం అయివుండడంవల్ల రావణునకు మాల్యవంతుని హితవు నచ్చలేదు. దానిమీాద చురచురచూస్తూ అతను "నువ్వు శత్రు

పక్షంతో లాలోచీ అయినావు. పైకి నా(శ్రేయస్సు కోరుతున్నట్టు మాట్లాడుతున్నావు. అంచేతనే హితం చెబుతున్నట్టు నటిస్తూ నాకు అహితం చెబుతున్నావు. నీమాట నేను లెక్కచెయ్యను. రాముడు మనుష్యమాత్రుడు. ఏకాకి. కోతులను వెంటబెట్టుకునివచ్చాడు. తండ్రి అతన్ని అడవులకు వెళ్ళగొట్టాడు. అలాంటి రాముడు బహుసమర్థుడని నువ్వెలా చెబుతావూ? నేను రాక్షసజాతి కంతకీ ఈశ్వరుణ్ణి. దేవత లందరూ నన్ను చూస్తే గజగజలాడిపోతారు. బలపరాక్రమాలలో నాకు సాటి అయినవా డెక్కడాలేడు. అలాంటి నేను హీనుణ్ణని యెలా చెబుతున్నావూ? వీరు లంటే చూసి నువ్వు ఓర్చుకోలేవు. లేక, నీకు నాశత్రువులయెడల పక్షపాతబుద్ధి వుంది. కాదంటే నిన్ను శత్రువులు ప్రోత్సాహపరుస్తున్నారు. అంచేతనే నావిషయమై నువ్విలా పరుషంగా మాట్లాడావు. పండితుడూ శాస్త్రాలు తెలిసినవాడూ శత్రువుల ప్రోత్సాహం లేకపోతే పదస్థుడైన ప్రభువుని గురించి నీలాగ యెవడూ పరుషంగా మాట్లాడడు. పద్మంమాత్రం లేని లక్ష్మివంటి సీతను నేను జనస్థానంనుంచి తీసుకువచ్చాను. ఆమెను నేను రామున కెందు కివ్వాలి? వానరకోటులతోనూ లక్ష్మణునితోనూ సుగ్రీవుని తోనూ కూడా కొద్దిదినాలలోనే నేను రాముణ్ణి కూల్చేస్తాను, చూద్దువుగాని. ఎవనితో ద్వంద్వయుద్ధంచెయ్యడానికి దేవతలుకూడా భయపడతారో ఆరావణుడు రామునితో యుద్ధం చెయ్యడానికి భయపడిపోతా డనుకున్నావా? శత్రువు నన్ను రెండుగా చీల్చినా సరే, నేనెవరికీ వంగను. ఇది నాస్వభావం. స్వభావం మార్చుకోవడం యెవరికీ శక్యం కాదు. రాముడు సముద్రంమీద సేతువు కట్టాడు. అయితే? అదేమంత ఘనకార్యమూ? అంతమాత్రాన నువ్వలా భయపడిపోతావేం? నేను సత్యంమీద వొట్టుపెట్టి చెబుతున్నాను. రాముడు వానరసేనతో సముద్రం దాటి రావడం నిజమే; కాని అతను బతికివుండి

వెళ్ళలేదు" అంటూ మాల్యవంతుణ్ణి కఠినంగా దూషించాడు. దాంతో సిగ్గుపడిపోయి మాల్యవంతుడు మరి మాట్లాడలేకపోయాడు. పైగా రావణునకు జేజేలు పలికి, సెలవు పొంది అత నింటికి వెళ్ళిపోయాడు.

తరవాత, రావణుడు మంత్రులతో బాగా చర్చించి తీవ్రంగా ఆలోచించి పురరక్షణకు గట్టి యేర్పాట్లు చేశాడు. పూర్వద్వారాన ప్రహస్తుణ్ణి వుండమన్నాడు. దక్షిణద్వారాన మహాపార్శ్వుణ్ణీ మహోదరుణ్ణీ వుండమన్నాడు. పశ్చిమద్వారాన ఇంద్రజిత్తుని వుండమన్నాడు. అతనికి అపారమైన రాక్షససేనను జతయిచ్చాడు. ఉత్తరద్వారాన శుకుణ్ణీ సారణుణ్ణీ వుండమన్నాడు. "నేను కూడా యిక్కడికి వస్తూవుంటా" ననిన్నీ వాళ్లకి చెప్పాడు. మహావీరుడూ పరాక్రమవంతుడూ అయిన విరూపాక్షుణ్ణి నగరం మధ్యభాగంలో వుండమన్నాడు. ఈఏర్పాట్లతో తనకు జయం తప్పదని అత ననుకున్నాడు. తరవాత మంత్రులను వెళ్లిపొమ్మని తా నంతఃపురానికి వెళ్లిపోయాడు.

## 32

## రాముడు వ్యూహంతీరి లంకమీదికి బయలుదేరడం

నరుల రాజయిన రాముడూ, వానరుల రాజయిన సుగ్రీవుడూ, వాయుసుతుడైన హనుమంతుడూ, భల్లూకరాజయిన జాంబవంతుడూ, రాక్షసుడైన విభీషణుడూ, వాలి కుమారుడైన అంగదుడూ, సుమిత్ర కొడుకయిన లక్ష్మణుడూ, శరభుడూ, సుషేణుడూ, మైందుడూ, ద్వివిదుడూ, గజుడూ, గవాక్షుడూ, కుముదుడూ, నళుడూ, పనసుడూ—వీరందరూ శత్రుదేశం చేరాక ఒకచోట కలిసి "అదిగో, రావణపాలితమైన లంక కనపడుతోంది. దేవతలూ, గంధర్వులూ, నాగులూ, కూడా అది జయించడం

కష్టం. దాన్నికొట్టా లంటే యేమిటి చెయ్యాడం?" అని ఆలోచించారు. "రావణు డెప్పుడూ అప్రమత్తుడై లంక కాపాడుకుంటున్నాడు; కనక, బాగా ఆలోచించాలి" అనుకున్నారు. దానిమీద విభీషణు డందుకుని నామంత్రు లైన అనలుడూ, శరభుడూ, సంపాతీ, ప్రఘసుడూ పక్షిరూపాలతో లంకలో శత్రువులలో ప్రవేశించి అక్కడ జరుగుతూ వున్న దంతా తెలుసుకువచ్చారు. వారు చెప్పిం దేమిటంటే? ప్రహస్తుడు తన బలగంతో పూర్వద్వారం కాశాడు. మహాపార్శ్వుడూ మహోదరుడూ దక్షిణద్వారం కాశారు. అనేకమంది రాక్షసయోధులను కూర్చుకుని ఇంద్రజిత్తు పశ్చిమద్వారం కాశాడు. రావణుడు గొప్పగొప్ప రాక్షసయోధులతో ఉత్తరద్వారం కాశాడు. విరూపాక్షుడు లంక మధ్యభాగం కాశాడు. ఇదంతా చూసి బాగా తెలుసుకుని నామంత్రులు వచ్చి చెప్పారు. వెయ్యి యేనుగులు— రథాలూ, గుర్రాలూ అయుతం — పదాతులు కోటిమంది — ఇది రావణుని ఆత్మబలం. వాళ్లంతా చాలా బలవంతులూ విక్రాంతులూను. వీరిలో ఒక్కొక్క యోధునకు పరివారంగా పదేసిలక్షల రాక్షసు లున్నారు. లంకలో వున్న బండారం యిదీ" అని చెప్పి తనమంత్రులను గూడా వివరంగా చెప్పమన్నాడు. వాళ్లున్నా అలాగే చెప్పగా మళ్లీ విభీషణుడు "రామా! నీకు కోపంవద్దు. నేనున్న దున్నట్టు చెబుతున్నాను. మరిన్నీ నేను నీకు రోషం రావడానికి చెబుతున్నాను గాని భయం కలగడాని క్కాదు. ఇక వున్న దల్లా యేమిటంటే? రావణుడు కుబేరునిమీదికి యుద్ధానికి వెళ్లినప్పుడు అరవై లక్షల రాక్షసయోధులు వెంటవెళ్లారు. వాళ్లందరూ పరాక్రమంలోనూ, బలంలోనూ తేజస్సులోనూ దర్పంలోనూ రావణునకు సాటిఅయినవాళ్లు. నువ్వేమో, రావణునకు తగినవాడవు. దేవతలనుగూడ నువ్వు నిగ్రహించగలవు, తక్కినవాళ్ల లెక్కయేమిటీ?

కనక, యీవానరసేన నంతనీ మొగ్గరంతీర్చి బయలుదేరితివా అనా యాసంగా రావణుణ్ణి సంహరించగలవు " అన్నాడు.

విభీషణు డిలా చెప్పగా రాము డందుకుని "నీలుడు పూర్వద్వారం మీాదికి వెళ్ళేది. అక్కడ అతను ప్రహస్తునికి తగ్గవాడు. గొప్ప సేనతో వెళ్ళి అంగదుడు దక్షిణద్వారంలో మహాపార్శ్వుణ్ణీ మహోదరుణ్ణీ కూల్చేది. అపారమైన వానరసేనతో వెళ్ళి హనుమంతుడు పశ్చిమద్వారం కొట్టేది. రావణుడు దైత్యులకూ దానవులకూ మహర్షులకూ చాలా అపకారం చేస్తున్నాడు. వరగర్వంతో క్షుద్రుడై సకలలోకాలూ పీడి స్తున్నాడు. కనక, వాణ్ణి చంపడానికి స్వయంగా నేను ఉత్తరద్వారంమీాదికి వెడతాను. సుగ్రీవుడూ జాంబవంతుడూ, విభీషణుడూ మనసైన్యం మధ్యన వుండి అంతా చక్కబెడుతూ వుంటారు. అయితే, ఈమహా యుద్ధంలో వానరులు నరరూపంలో వుండగూడదు. వానరులుగానే వుండాలి. మనవాళ్ళని తెలుసుకోడాని కిదే గుర్తు. నేనూ, లక్ష్మ ణుడూ, నీలుడూ, అంగదుడూ, హనుమంతుడూ, సుగ్రీవుడూ, విభీష ణుడూ - ఈయేడుగురమూ మాత్రమే మానవరూపంతో వుంటాము " అని చెప్పాడు.

తరవాత, వారందరూ నేలయీనినట్టు బయలుదేరి లంకమీాదికి వెళ్లారు.

## ౩౮

## రాముడు సైన్యంతో సువేలశిఖరంమీదికి వెళ్ళడం

అప్పుడు రాముడు సుగ్రీవుణ్ణీ విభీషణుణ్ణీ పిలిచి " ఈసువేలపర్వతం రక రకాల ధాతువులతో చాలా చక్కగా వుంది. మనమందరమూ వెళ్ళి దానిమీాద నివసింతాము. రావణుడు ధర్మం గుర్తించకా సదాచారం ఆలోచించకా వంశం లెక్కచెయ్యకా రాక్షససాధారణమైన నీచ

బుద్ధితో చావుమూడడంవల్ల నాభార్యను హరించాడు. రావణుని పేరు చెబితేనే నాకు వొళ్ళు మండిపోతోంది. వాడుచేసిన అపరాధంవల్ల రాక్షసకులానికంతకూ నాశనం కలుగుతోంది. పాపం వొక్కడే చేస్తాడు; కాని ఆవొక్కడి మూలంగా కులం అంతా చెడుతుంది" అంటూ బయలుదేరాడు. ధనుష్పాణిఅయి అతని వెంట లక్ష్మణుడు బయలుదేరాడు. తరవాత సుగ్రీవుడూ, విభీషణుడూ, హనుమంతుడూ, అంగదుడూ, నీలుడూ, మైందుడూ, ద్వివిదుడూ, గజుడూ, గవయుడూ, శరభుడూ, గంధమాదనుడూ, పనసుడూ, కుముదుడూ, హరుడూ, రంభుడూ, జాంబవంతుడూ, సుషేణుడూ, ఋషభుడూ, దుర్ముఖుడూ, శతవలీ - తక్కిన వానరవీరులూ బయలుదేరారు.

వారందరూ క్షణకాలంలో సువేలశిఖరం అధిరోహించారు. వారికి లంక కనపడింది. ప్రాకారాలూ, ద్వారాలూ, మిద్దెలూ, మేడలూ, రాక్షసులూకూడా స్పష్టంగా కనపడ్డారు. దానిచుట్టూ కాపున్న రాక్షసయోధులు నల్లని ప్రాకారంలాగ కనపడ్డారు. వాళ్ళని చూడగానే వానరవీరులు సింహనాదాలు చేశారు. అప్పటికి సూర్యాస్తమానం అయింది. సంధ్యారాగం సన్నగిల్లి రాత్రి బలిశాటప్పటికి చంద్రోదయం అయింది. రాముడు తన పరివారం అంతటితోటీ ఆరాత్రి అక్కడ గడిపాడు.

## ౩౬

## పర్వతశిఖరంనుంచి రాముడు లంకచూడడం

వారక్కడ ఆరాత్రి సుఖంగా గడిపారు. తెల్లవారింది. అక్కడికి లంకాపట్నం స్పష్టంగా కనపడింది. లంకలోవుండిన వనాలూ, ఉపవనాలూకూడా కనపడ్డాయి. అవి మిట్టపల్లాలు లేకుండా సమంగా వున్నాయి. విశాలంగానూ చక్కగానూ వున్నాయి. చూడసొంపుగా వున్నాయి.

అవి చూసి వారు చాలా ఆశ్చర్యపడ్డారు. సంపంగిచెట్లూ, అశోక చెట్లూ, పొన్న చెట్లూ, సాలవృక్షాలూ, తమాలవనాలూ, హింతాళాలూ, మద్దిచెట్లూ, సప్తపర్ణాలూ, కర్ణికారాలూ, కలిగొట్టుచెట్లూ అక్కడ వేలూలక్షలూ వున్నాయి. రకరకాల తీగలున్నూ యెన్నో వున్నాయి. అన్నీ విరగబూసివున్నాయి. అన్ని ఋతువులలో పూస్తూ కాస్తూ ఫలిస్తూవుండే అసాధారణవృక్షాలున్నూ అక్కడ వేలున్నాయి. అక్కడక్కడ చక్కని పచ్చికబయళ్ళున్నాయి. అక్కడి ప్రతీవృక్షమూ సువాసనలు వెదజిమ్మే పూలతోనూ కమ్మనిపళ్ళతోనూ నిండివున్నాయి.

ఆవృక్షాలమీద తుమ్మెదలూ, గోరువంకలూ చిలకలూ కిలకిల్లాడుతున్నాయి. కోకిలలు శ్రవణానందంగా గానం చేస్తున్నాయి. సరస్సులలో హంసలూ కారండవాలూ మొదలైనవి చక్కగావిహరిస్తున్నాయి.

అక్కడికి వెళ్ళేటప్పటికి వానరయోధులకు సుగంధిలమైన పిల్లవాయువు హాయికూర్చింది. వారి సింహనాదాలతో లంకాపట్నం ముఖరితం అయిపోయింది. వారు నడుస్తూ వుంటే రేగిన దుమ్ము ఆకాశం కప్పేసింది. అక్కడవుండిన సింహాలూ, పులులూ, ఏనుగులూ, భల్లూకాలూ, అడవిదున్నలూ, లేళ్ళూ, దుప్పులూ మొదలైన ఆటవికజంతువులు వారిని చూసీ, వారి సింహనాదాలు వినీ పికాపికలై పారిపోయాయి.

లంకాపట్నం ఆపర్వతశిఖరాన వుంది. అది నూరామడల పొడుగూ ముప్ఫయ్యామడల వెడల్పూ వుంది. ఖేచరులు కూడా అక్కడికి వెళ్లడం కష్టం అంటే, మనుష్యులసంగతి చెప్పడానికేమి వుందీ? లంకలో వున్న మిద్దెలూ మేడలూ తెల్లని మేఘాల్లాగ అపూర్వంగా వున్నాయి. ఆపట్నంలో చైత్యప్రాసాదం వొకటుంది. దానికి వెయ్యి స్తంభాలున్నాయి. అది కైలాసపర్వతశిఖరంలాగ ఆకాశం వొరుసుకుంటూ వుంది. అక్కడ షష్టిగడియలూ నూరుగురు రాక్షసులు కాపుంటారు.

లంక కంతకీ అది గొప్ప అలంకారంగా వుంది. అలాగ దేవతలకు కూడా దుర్లభమైన ఆ లంకాపట్నం రాముడు చూశాడు. అతనికి చాలా ఆశ్చర్యం కలిగింది.

## ४०

## రావణసుగ్రీవుల మొదటి ద్వంద్వయుద్ధం

రాముడు త్రికూటశిఖరంమీద నుంచుని అటూ యిటూ చూడగా రమ్యమైన లంకాపట్నం కనపడింది. ఆలంకలో కూడా అతనికి మొదట రావణుడు కనపడ్డాడు. రావణు డొక గోపురాగ్రాన సింహాసనంమీద కూచునివున్నాడు. పరిచారికలు తెల్లని వింజామరలు వీస్తూనూ, శ్వేతచ్ఛత్రంపట్టీ అతన్ని సేవిస్తున్నారు. అతను ఎర్రని గంధంపూసుకుని రత్నాభరణాలు ధరించి బంగారపురంగుగల ఆకాశాన నల్లని మేఘం వున్నట్టున్నాడు. అతనివక్షస్థలం ఐరావతం కొమ్ములతో కలిగిన కాయలతో నిండివుంది. కుందేటిరక్తం అంత యెర్రని బట్టలు కట్టుకుని వున్నాడు.

రాముడూ వానరులూ అతన్ని చూస్తూనే వుండగా సుగ్రీవునకు రావణుడు కళ్లబడేటప్పటికి క్రోధవేగం హెచ్చిపోయింది. వెంటనే అత నొక్కగంతున ఆగోపురంమీదికి వాలి ఒక్క క్షణం రావణుని యెదట నిర్భయంగా నుంచుని “నేను లోకనాథుడైన రామునకు భృత్యుణ్ణీ స్నేహితుణ్ణీని. రాముని తేజోబలం సాయంతో చూసుకో, నిన్నిప్పుడు విడిచిపెట్టను” అంటూ తృణీకరించి పలికి చిత్రవిచిత్రమైన రావణుని కిరీటం కిందికి పడదోసి నేలమీదికి వాలాడు. దానిమీద రావణుడు “ఎక్కడో వున్నప్పుడు నువ్వు సుగ్రీవుడవు; కాని నాయెదట పడ్డావు. ఇప్పుడు గ్రీవాహీనుడవయిపోతావు చూసుకో” అంటూ లేచి సుగ్రీవుణ్ణి పడదోశాడు; కాని సుగ్రీవుడు బంతిలాగ లేచి రావణుణ్ణి పడదోశాడు.

వారిద్దరూ పిడికిళ్లతో గుద్దుకున్నారు. అరిచేతులతో చరుచుకున్నారు. మోచేతులతో పొడుచుకున్నారు. గోళ్లతో బరుకుకున్నారు. వారి శరీరాలు చెమటతోనూ రక్తంతోనూ నిండిపోయాయి. విరగబూసిన బూరుగుచెట్లలావున్న వారిద్దరూ ఆయాసం తీర్చుకుంటూ ఒక్క క్షణం నుంచున్నారు. తరవాత వొకరిమీద వొకళ్లు పడ్డారు. ఒకళ్ల నొకళ్లు వంచుకున్నారు. ఒకళ్ల నొకళ్లు పడదోసుకున్నారు. చివరికెగిరి ప్రాకారానికీ పరిఘకీ మధ్య పడ్డారు. వెంటనే లేచి వొకళ్లనొకళ్లు పట్టుకుని మిక్కిలీ పట్టుదలతో పులిసింహాల లాగా, యేనుగుగున్నల్లాగా యుద్ధంచేశారు. ఇటు పట్టుదల, అటు అభ్యాసం – వీటికి తోడు సాటిలేని శక్తి – వీటితోవారు ఒకళ్ల నొకళ్లు నలిపిచంపేదా మని కౌగిలించుకున్నారు. తోసుకున్నారు. కుమ్ముకున్నారు. పడ్డారు. లేచారు. తరవాత మండలమార్గంగా తిరిగారు. చారీ, కరణమూ, ఖండమూ, సవ్యమూ, అపసవ్యమూ సవ్యాపసవ్యమూ, అర్ధభ్రమణమూ, వైష్ణవవైశాఖమండలాలూ ఆలీఢప్రత్యాలీఢాలూ, గోమూత్రగమనమూ, ఉపసర్పణాపసర్పణాలూ, తిరిశ్చీనగతీ, తిర్యగ్గతీ, వక్రగతీ, పరిమోక్షమూ, ప్రహారమూ, మోఘకరణమూ, వర్జనమూ, పరిహరణమూ, పరిధావనమూ, ఒకడు నుంచునివుండగా రెండోవాడు వీలుచూసుకుంటూ వాడి చుట్టూ తిరుగుతూవుండడమూ, అభిద్రవణమూ, ఆప్లావమూ, ఆస్థానమూ, పరావృత్తమూ, అపావృత్తమూ అవద్రుతమూ, అవప్లుతమూ, ఉపన్యస్తమూ, అపన్యస్తమూ మొదలైన మార్గాలవలంబించి చాలా తీవ్రంగా పోరాడారు. చివరికి రావణుడు తన మాయాబలం ప్రయోగించడానికి నిశ్చయించుకున్నాడు. అది గ్రహించి సుగ్రీవుడు జితకాశీ, జితక్లముడూ అయి ఆకాశాని కెగిరాడు. వంచితుడై రావణు డలాగే వుండిపోయాడు. అప్పటికప్పుడే సుగ్రీవుడు రాముని

దగ్గిరికి వెళ్లిపోయాడు. రాముడందుకు చాలా సంతోషించాడు. వానరవీరులు పరమానందంతో సింహనాదం చేశారు.

## ౪౧

## అంగద రాయబారం

అప్పుడు రాముడు సుగ్రీవుణ్ణి కౌగిలించుకుని "వానరరాజా! నాతో ఆలోచించకుండా - చెప్పనయినా చెప్పకుండా నువ్వీ సాహసకృత్యం చేశావు. రాజు లయినవా రెప్పుడూ యిలా తొందరపడకూడదు. నువ్వు వీరాధివీరుడవే. సాహసవంతుడవే; కాని నన్నూ, యీ వానర బృందాన్నీ, విభీషణుణ్ణీ సంశయావస్థలో పడగొట్టి నువ్వీ సాహసం చేశావు. ఇంకెప్పుడూ నువ్విలాంటిపని చెయ్యవద్దుసుమా! నీకేమయినా అపాయం సంభవించివుంటే నాకు సీతతో యేమిపనీ? భరతునితోనూ, లక్ష్మణునితోనూ, శత్రుఘ్నునితోనూ, చివరికి నాశరీరంతో మాత్రం యేమి పనీ? నీబలపరాక్రమాలు నాకు తెలిసినా, నువ్వు మళ్ళీ రాక ముందు నేను, సపుత్రబలవాహనంగా రావణుణ్ణి యుద్ధంలో సంహరించి లంకలో విభీషణుణ్ణి అయోధ్యలో భరతుణ్ణి అభిషేకించి తరవాత నేను దేహత్యాగం చేసేద్దా మనుకున్నాను" అంటూ నిష్ఠురా లాడాడు. దానిమీద సుగ్రీవుడు "రామా! నేను నాపౌరుషం తెలిసినవాణ్ణి కదా! నీభార్యని హరించినవాడు కళ్ళబడితే నేనెలా వూరుకోగలనూ?" అని యెదురడిగాడు.

అందుకతన్ని ప్రశంసచేసి రాముడు లక్ష్మణునితో "తమ్ముడూ! మనం చల్లని జలమూ ముమ్మరంగా పళ్ళూ వున్న స్థలం చూసుకుని వ్యూహం పన్నుకుని వుందాము. లోకక్షయకరమైన భయం సంభవించింది. ఇప్పుడు భల్లూకవానరరాక్షసవీరు లనేకులు నాశనం అయిపోతారు. గాలి చాలా పరుషంగా వీస్తోంది. భూమి వణికిపోతోంది.

పర్వతశిఖరాలు వ్రూగిపోతున్నాయి. చెట్లు కూలిపోతున్నాయి. మేఘాలు ఘోరంగా వురుముతూ ర క్తంకలిసిన వర్షం కురుస్తున్నాయి. సంధ్యాకాంతి ఎ(రని చందనంలాగ భయంకరంగా వుంది. సూర్యబిం బంనుంచి భగభగమంటూ అగ్నిమండలం కిందికి పడుతోంది. మృగాలూ పిట్టలూ సూర్యునికేసి చూసి దీనంగానూ అమంగళంగానూ కూస్తున్నాయి. రాత్రి చంద్రుడు తేజోహీనుడై సంతాపం కలిగిస్తు న్నాడు. చంద్రబింబంచుట్టూ యిరుకుగా పరివేషం యేర్పడి వుంది చూడూ. సూర్యమండలంలో నల్లని మచ్చ కూడా కనపడుతోంది చూడూ. నక్షత్రా లన్నీ మలినంగా వున్నాయి. ఇదంతా చూ స్తే ప్రళయం దగ్గిరపడ్డట్టు కనపడ్డంలేదూ? కాకులూ, గద్దలూ, డేగలూ కిందుగా యెగురుతూ అమంగళకరంగా కూస్తున్నాయి. ఏమయినా మనం యిప్పుడే జయించరాని లంకముట్టడింతాము" అని చెబుతూ పర్వతం దిగాడు.

దిగి తనబలం అంతా చూశాడు. ఎటువంటివాళ్లకీ కూడా ఆమహాసైన్యం అజయ్యంగా కనపడింది. వెంటనే అతను సుగ్రీవునితో ఆలోచించి యుద్ధంచెయ్యమని వానరసేనకి ఆజ్ఞయిచ్చాడు. ప్రాతః కాలంకాగానే రాముడు ధనుర్ధరుడై సేనను వెంటబెట్టుకుని లంక మీాదికి బయలుదేరాడు. విభీషణుడూ, సుగ్రీవుడూ, హనుమం తుడూ, జాంబవంతుడూ, నళుడూ, నీలుడూ, లక్ష్మణుడూ అతని వెనకబయలుదేరారు. వారివెనక నేలయీనినట్టుగా భల్లూకవానర సేన బయలుదేరింది. ఏనుగుల్లా వున్న వానరవీరులు బండరాళ్లూ పెద్ద పెద్ద చెట్లూ పుచ్చుకుని బయలుదేరారు. ఒక్క క్షణంలో వారు లంక దగ్గిరికి చేరుకున్నారు. పర్వతశృంగంలాగ యెత్తయిన ఉత్తర ద్వారందగ్గిర రామలక్ష్మణులు నిలిచారు. రావణు డక్కడ వుండడం వల్లనే రాము డక్కడ ఆగాడు. రాముడు తప్ప మరొకడు ఆద్వారం

ఆక్రమించలేదు. రావణాధిష్ఠితమై అది వరుణాధిష్ఠిత మైన మహా సముద్రంలా వుంది. సాయుధులూ మహావీరులూ అయిన రాక్షసవీరు లనేకు లక్కడ కాస్తున్నారు. అక్కడ యోధుల కుపయోగించే ఆయు ధాలూ యంత్రాలూ, కవచాలూ అనేకా లున్నాయి. మైందుణ్ణీ ద్వివి దుణ్ణీ వెంటబెట్టుకుని నీలుడు తూర్పుద్వారం కాశాడు. అంగదుడు ఋషభుణ్ణీ గవాక్షుణ్ణీ, గజునీ గవయుణ్ణీ దగ్గిర వుంచుకుని దక్షిణద్వారం కాశాడు. ప్రమాథీ, ప్రఘసుడూ మొదలైన మహావీరులతో హను మంతుడు పశ్చిమద్వారం కాశాడు. గరుత్మంతునితోనూ, వాయువు తోనూ, సమానులైన భల్లూకవానరవీరులతో ఉత్తర ద్వారానికీ పశ్చిమద్వారానికీ మధ్యగా సుగ్రీవు డున్నాడు. సుగ్రీవుడున్నచోట ముప్ఫయిఆరుకోట్ల వానరవీరు లున్నారు. లక్ష్మణుడూ విభీషణుడూ రాముని ఆజ్ఞచొప్పున ప్రతీద్వారందగ్గిరా ఒక్కొక్క కోటివానర వీరుల నుంచారు. సుగ్రీవుడూ, జాంబవంతుడూ రామునకు బహుస మీపంలోనే వున్నారు.

అప్పుడు పెద్దపులులు బయలుదేరినట్టు బయలుదేరి వానరవీరులం లంక ముట్టడించారు. వారి శరీరాలు పొంగిపోతున్నాయి. వారి తోకలు ఎగురుతున్నాయి. రోషంవల్ల వారి మొగాలు చాలా భయం కరంగా వున్నాయి. వారిలో కొందరు పదేసి యేనుగుల బలంకలవారు. కొందరు నూరేసియేనుగుల బలం కలవారు. కొందరు వెయ్యేసియేను గుల బలంకలవారు. కొందరు ఓఘసంఖ్యాకాలైన యేనుగుల బలంకల వారు. కొందరు ఊహాకందని బలంకలవారు. అక్కడ వానరు లందరూ గుంపుగా చేరడం చూస్తే మిడత లొకచోటచేరి వున్నట్టుంది. లంక చుట్టూ విడిసిన వానరులతో భూమి కప్పడిపోయింది. ఇంకా వస్తున్న వానరులతో ఆకాశం నిండిపోయింది. అంచేత వాయుదేవున కైనా లంకలో ప్రవేశించడానికి వీలులేకపోయింది. మేఘాలవంటి వానర

వీరులు వచ్చి ఆకస్మికంగా లంక ముట్టడించడం చూసి రాక్షసు లాశ్చర్యచకితు లయిపోయారు. సముద్రం విరిగిపడితే ధ్వని అయేటట్టు ఆవానరసేన రావడంవల్ల భయంకరమైన ధ్వని బయలుదేరింది. ఆధ్వనితో ప్రాకారాలతోనూ తోరణాలతోనూ, మిద్దెలతోనూ మేడ లతోనూ లంకఅంతా గజగజలాడిపోయింది.

ఇలాగ రాముడు శత్రువులను జయించడానికి వానరసేన చక్కగా ఆయత్తపరిచి తరవాత జరిగించవలసింది ఆలోచించడానికి మంత్రులను చేరబిలిచి, రాజనీతి ననుసరించి విభీషణుని సలహాచొప్పున వాలి పుత్రు డైన అంగదుణ్ణి పిలిచి, “ వీరాధివీరా! నువ్వు రావణుని దగ్గిరికి వెళ్ళి నామాటగా యిలా చెప్పు.”

“ రావణా! నీసంపదకు వినాశకాలం వచ్చింది. నీఐశ్వర్యం లుప్తం అయిపోతుంది. నీకు చావు మూడింది. వరగర్వంతో నువ్వు మహర్షు లకూ, దేవతలకూ, గంధర్వులకూ, అప్సరసలకూ, నాగులకూ, యక్షు లకూ రాజులకూ చేసిన అపకారాలకుఫలంగా యిప్పుడు నీకంతం తట స్థించింది. భార్యాహరణంవల్ల కలిగిన రోషంతో దండధరుణ్ణయి వచ్చి నేనిదే నీద్వారందగ్గిర వేచివున్నాను. నువ్విప్పుడు నాచేతిలో చచ్చి దేవతలూ, మహర్షులూ, రాజర్షులూ పొందిన స్థానం చేరుకుంటావు. అధమా! ఏబలంతో నువ్వు నన్ను మోసంచేసి సీత నెత్తుకువచ్చావో ఆబలం అంతా యిప్పుడు చూపించు. నాకు సీతను సమర్పించి నన్ను శరణు పొందకపోతే లంక అంతా యిప్పుడు నానిశితబాణాలతో అరాక్షసం చేసేస్తాను. ధర్మాత్ముడూ, రాక్షసులందరిలోనూ మిక్కిలీ ఉత్తముడూ అయిన విభీషణుడు నన్ను శరణుపొందాడు. లంకారాజ్యా ధిపత్యం అతనికి వశపడుతుంది. నువ్వు పాపివి. మూర్ఖులతో నువ్వు ఆలోచిస్తావు. అంచేత రాజ్యం అనుభవించడానికి నువ్వు తగవు. శూరు డవై ధైర్యంతో యుద్ధం చెయ్యి. లేకపోతే నువ్వు నాబాణాల పాల

బడి అప్పుడు పవిత్రం అయిపోతావు. అలా కాక నువ్వు పక్షివై మూడులోకాలూ తిరిగినా నాకళ్ళపడ్డావు కనక, యిక బతకవు. నీహితం కోరి చెబుతున్నాను. ఇప్పుడే నీకు నువ్వు ఔర్ధ్వదైహిక క్రియలు చేసుకో. నేనిక్కడ వుండగా, బతికివుండగానే నువ్వొకమాటు నీలంకా పట్నం అంతా చూసుకో"

ఇదివిని అంగదుడు రూపొందిన అగ్నిలాగ ఆకాశమార్గాన రావణమందిరం ప్రవేశించాడు. అప్పటికి రావణుడు మంత్రులతో ఆలోచిస్తున్నాడు. అంగదుడు అతని యెదట నుంచున్నాడు. "నేను రాముని దూతను. వాలి పుత్రుణ్ణి. నా పేరు అంగదుడు. నా సంగతి యిదివరకే నువ్వు విని వుంటావు. రఘువంశతిలకమూ. కౌసల్యానంద వర్ధనుడూ అయిన రాముడు చెప్పమన్న మాట విను.

"రావణా! ఎదటి నిలిచి యుద్ధంచెయ్యి. పౌరుషం చూపించు. పుత్రులతోనూ, మిత్రులతోనూ, బంధువర్గంతోనూ, అమాత్యులతోనూ నిన్ను నాశనంచేసేస్తాను. నువ్వు చచ్చిపోతే మూడులోకాలూ నిర్భయా లవుతాయి. నిన్నిప్పుడు సంహరించి నేను దేవతలనూ, దానవులనూ, యక్షులనూ, గంధర్వులనూ, నాగులనూ, మహర్షులనూ ఉద్ధరిస్తాను. నువ్వు చావగానే నీ ఐశ్వర్యం అంతా విభీషణుని వశం అవుతుంది. నువ్వు వచ్చి సీతను సమర్పించి కాళ్ళమీద పడకపోతే యీ చెప్పిన దంతా జరిగిస్తాను"

అంగదు డిలా చెప్పాటప్పటికి రావణుడు క్రోధపరవశుడై మండి పడి "వీణ్ణి పట్టుకోండి. నరకండి" అంటూ పదిమాట్లు అరిచాడు. వెంటనే, దీప్తాగ్నులవంటి నలుగురు రాక్షసులు వచ్చి అంగదుణ్ణి పట్టు కున్నారు. ధీరుడూ, పరాక్రమశాలీ అయిన అంగదుడు తన బలం చూపించడానికి స్వయంగానే వాళ్ళకి పట్టుబడ్డాడు. వాళ్ళు పట్టుకోగానే అతను ఆ రాక్షసులను నలుగురినీ పిట్టలను పట్టుకున్నట్టు రెండుచేతు

లతోనూ పట్టుకుని పర్వతశిఖరంలా వున్న మేడమీాది కెగిరాడు. దాంతో, ఆ రాక్షసులు రావణుడు చూస్తుండగా అంగదుని వేగం భరించలేక నేలమీాద పడి పచ్చడిఅయిపోయారు. అంగదుడు మేడ శిఖరం కాళ్ళతో తన్ని పడగొట్టాడు. ఇలాచేసి అతను "మరిచిపోకు, నాపేరు అంగదుడు" అని బిగ్గరగా చెప్పి ఆకాశమార్గాన బయలు దేరినచోటికి వెళ్ళిపోయాడు. అది చూసి రాక్షసు లందరూ తల్లడిల్లి పోయారు. వానరు లందరూ ఉప్పొంగిపోయారు. రావణుడు తన మేడ కూల్చినందుకు మిక్కిలీ కోపించి తనకు వినాశం తప్పదని నిట్టూ ర్పులు విడిచాడు.

లంకాపట్నం చుట్టూవున్న వానరసేనను చూసి రాక్షసులు కొందరు ఆశ్చర్యచకితు లయిపోయారు. కొందరు భయపడిపోయారు. కొందరు పౌరుషం తెచ్చుకున్నారు. శూరులైనవారు యుద్ధానికి సిద్ధ పడ్డారు. ఆరాక్షసులకు ప్రాకారం చుట్టూమూగివున్న వానర వీరులు మరో ప్రాకారంలా కనపడ్డారు. దాంతో రాక్షసులు భయమోహి తులై హాహాకారాలు చేశారు.

## ౪౩
## యుద్ధప్రారంభం

ఇదంతా చూసి వెళ్ళి రాక్షసులు "వానరులు వచ్చి ముట్టడించా"రని చెప్పారు. అదివిని మండిపడి, రావణుడు నగరరక్షణం విషయమై యింకా దృఢమైన కట్టుదిట్టాలు చేసి మేడయెక్కి చూశాడు. ప్రాకా రానికి బయట భూమే కాక, చెట్లూ చేమలూ పర్వతాలూ, గుట్టలూ మిట్టలూ అంతటా వానరసేన నిండివుండడం కనపడింది. ఇలాగ భూమి అంతా నిండివున్న వానరులను చూసి అతను "వీళ్ళని నాశనం చెయ్య డం యెలాగా?" అని ఆలోచించాడు. ధైర్యం తెచ్చుకున్నాడు. వానర సేనాధిపతులనూ రాముణ్ణీ చూశాడు.

ఇక్కడ రాముడున్నూ అంతటా రాక్షసులతో నిండివున్న లంకా పట్నం చూశాడు. "హరిణనేత్ర అయిన జానకి యిక్కడే నానా బాధలూ పడుతోంది" అను కుంటూనే అతను "శత్రుసంహారం చెయ్యండి" అని వానరుల కాజ్ఞాపించండి. ఇది వినగానే వానరవీరులు ఒకరికంటే వొకరు ముందుకి పోదలచి సింహనాదాలు చేశారు. "పర్వ తశిఖరాలతోనూ, చెట్లతోనూ యీ రాక్షసులను చితకకొట్టేస్తాము. ఒక్కొక్కణ్ణి గుద్దుగుద్దుకి పడగొడతాం" అనుకుంటూ వారు లగ్గల కెగబాకారు. ముందుగా వారు మట్టితోనూ బండరాళ్ళతోనూ, చెట్ల తోనూ అగడ్త పూడ్చేశారు. వెంటనే వందలుగా, వేలుగా, లక్షలుగా ప్రాకారం ఆక్రమించారు. వారు ప్రాకారతోరణాలు కూల్చేశారు. గోపురాలు పడగొట్టారు. ఎగురుతూ దుముకుతూ గర్జిస్తూ రాక్షసుల మీద పడ్డారు. "మహాబలశాలి అయిన రామునకు జయం. మహావీరు డైన లక్ష్మణునకున్నూ జయం. రామునిచే పాలించబడుతున్న సుగ్రీ వునకున్నూ జయం" అంటూ వారు కామరూపులై ప్రాకారం ఆక్ర మించారు. వీరబాహువూ, సుబాహువూ, నళుడూ తమ సైన్యాలతో ప్రాకారం భేదించడానికి పూనుకున్నారు. ఎక్కడ సందయితే అక్క డల్లా వారు వానరులను చేర్చేశారు. జితకాశులైన పదికోట్ల వానర వీరులతో కుముదుడు పూర్వద్వారం కొట్టసాగాడు. ప్రఘసుడూ, పన సుడూ పెద్దసైన్యంతో అతనికి సాయంచెయ్యడానికి సిద్ధంగా వున్నారు. మహాబలశాలి అయిన శతవలి యిరవైకోట్ల వానరవీరులతో దక్షిణ ద్వారం భేదించ బూనుకున్నాడు. తార తండ్రి అయిన సుషేణుడు ఆరుకోట్ల వానరవీరులతో పశ్చిమద్వారం వశపరుచుకోడానికి పూను కున్నాడు. ఉత్తరద్వారాన లక్ష్మణునితో కలిసి రాముడు నిలిచాడు. రామునకు కోటివానరవీరులతో మహాకాయుడూ గవాక్షుడూ వొక పక్కనా, కోటి భల్లూకవీరులతో ధూమ్రుడు మరొక పక్కనా,

సాయంవున్నారు. మహాబలపరాక్రమశాలి అయిన విభీషణుడు కవచం తొడిగి గదాపాణి అయి తన మంత్రులతో కూడా రాముని దగ్గిరగా వున్నాడు. గజుడూ, గవాక్షుడూ, శరభుడూ, గంధమాదనుడూ ఎవరికి కావలసిన సాయం వారికి చేస్తూ అంతటా తిరగసాగారు.

ఇదంతా వినీ, చూసీ రావణుడు "కలియబడండి" అని రాక్షస వీరులకు ఆజ్ఞాపించాడు. ఇది వినీ వినగా రాక్షసులు సింహనాదాలు చేశారు. భేరీలు మోగాయి. శంఖాలు లురిమాయి. తెల్లని శంఖాలూదే నల్లని రాక్షసులు బలాకలతోనూ మెరుపుతీగలతోనూ, నిండి వున్న కారుమబ్బుల్లా వున్నారు. వారు రావణుని ఆజ్ఞకాగానే ప్రళయకాలంలో సముద్రం యెంత వేగంగా వుంటుందో అంతవడిగా బయలుదేరారు. వారి రాకచూసి వానరవీరులు త్రికూటపర్వతం వూగిపోయేలాగ సింహనాదాలు చేశారు. శంఖదుందుభి ధ్వానాలతో కలిసి ఆసింహనాదం భూమిని ప్రాణికించేసింది. ఆకాశం పూరించేసింది. సముద్రం అల్లకల్లోలపరిచేసింది. దీనికి సాయం లంకలో రథనేమి ధ్వనీ, హయహేషలూ, గజబృంహితాలూ రాక్షసుల సింహనాదాలూ ముప్పిరిగొన్నాయి. ఈస్థితిలో సంకులసమరం ప్రారంభం అయింది. రాక్షసులు గదలతోనూ, శక్తిశూలపరశ్వధాదులతోనూ వానరులను కొట్టసాగారు. "సుగ్రీవునకు జయం" అని అరుస్తూ వానరులు చెట్టుచేమలతోనూ, రాళ్ళతోనూ రాక్షసులను కొట్టసాగారు. వారు గోళ్ళతోగీకుతూ పళ్ళతో పీకుతూనున్న రాక్షసులను పీడించసాగారు. ప్రాకారంమీది రాక్షసులు భిండివాలాలూ, ఖడ్గాలూ, శూలాలూ విసిరి నేలమీది వానరులను చీకాకుపరచగా, వానరవీరులు ఎగిరి ప్రాకారంమీది రాక్షసులను కిందపడగొట్టసాగారు. ఒక్క క్షణంలో యుద్ధం భయంకరం అయి భూమి అంతా రక్తమాంసాలతో నిండిపోయింది.

౪౩

## ఉభయపక్షాలా ప్రముఖుల ద్వంద్వయుద్ధం

వానరుల యుద్ధవిధానం చూశాటప్పటికి రాక్షసులకు బలమూ కోపమూ కూడా ఎక్కువయిపోయాయి. దాంతో వాళ్లు సువర్ణ శేఖరాలతో మెరుస్తున్న గుర్రాలమీదా, అగ్నిశిఖలవంటి జెండాలతో విరాజిల్లుతున్న రథాలమీదా, సూర్యసన్నిభాలైన కవచాలతోనూ సింహనాదులు చేస్తూ రావణునకు జయం సంపాదించడాని కురికారు. గొప్ప వానరసేన కూడా శ్రీరామునకు జయంకోరుతూ ఆరాక్షసులమీద పడింది. దీంతో రాక్షసులకూ వానరులకూ ద్వంద్వయుద్ధం ప్రారంభం అయింది. పరమశివునితో యముడు కలియబడ్డట్టు వాలిపుత్రుడైన అంగదునితో ఇంద్రజిత్తు కలియబడ్డాడు. విభీషణుని సచివుడైన సంపాతీ ప్రజంఘుడూ వొకచోటా, జంబుమాలీ హనుమంతుడూ వొకచోటా కలపటం అయినారు. మహాక్రోధుడైన విభీషణుడు మిత్రఘ్నునితో కలియబడ్డాడు. తపనునితో గజుడూ, నికుంభునితో మహాతేజశ్శాలి అయిన నీలుడూ తలపడ్డారు, వానరప్రభువైన సుగ్రీవుడు ప్రఘసునిమీద పడ్డాడు. లక్ష్మణుడు విరూపాక్షునిమీది కురికాడు. అగ్నికేతుడూ, రశ్మికేతుడూ, సుప్తఘ్నుడూ, యజ్ఞకోపుడూ అనే రాక్షసులు రాముణ్ణి ఎదిరించారు. వజ్రముష్టి అనే రాక్షసుడు మైందుణ్ణీ, అశనిప్రభు డనే రాక్షసుడు ద్వివిదుణ్ణీ ఎన్నుకున్నారు. వీరుడూ, ప్రతాపశాలీ, రణదుర్ధరుడూ అయిన ప్రతపను డనే రాక్షసుడు తీక్ష్ణవేగుడైన నళుణ్ణి ఎదురుకున్నాడు. ధర్ముని కుమారుడూ బలవంతుడూ అయిన సుషేణుడు విద్యున్మాలి అనే రాక్షసుణ్ణి నిలబెట్టాడు. మరికొందరు వానరవీరులు మరికొందరు రాక్షసయోధులతో తలపడి ఘోరయుద్ధం సాగించారు

ఆయుద్ధంలో వెంట్రుకలే పచ్చికగా, శరీరాలే కర్రలుగా రక్తనదులు ప్రవహించాయి.

ఇంద్రజిత్తు మిక్కిలీ క్రుద్ధుడై శత్రుసైన్యాలను నాశనంచేసే అంగదుణ్ణి గదతో కొట్టాడు. దానికి కినిసి అంగదుడు, కాంచన చిత్రాంగమైన ఇంద్రజిత్తు రథం సారధితోనూ, గుర్రాలతోనూ నుగ్గుచేసేశాడు. ప్రజంఘుడు మూడు బాణాలతో సంపాతిని కొట్టాడు. సంపాతి అశ్వకర్ణం అనేచెట్టుతో కొట్టి ప్రజంఘుణ్ణి చంపేశాడు. రథం మీాద వుండిన జంబుమాలి క్రుద్ధుడై రథశక్తితో హనుమంతుని వక్షస్థలంమీాద కొట్టాడు. వెటనే హనుమంతు డారథంమీాది కురికి ఒక్క చరుపు చరిచి జంబుమాలిని చంపేశాడు. ప్రతపనుడు నళుణ్ణి కొట్టాడు. నళుడు ప్రతపనుని కళ్ళు పోగొట్టాడు. ప్రఘుసుడు వానర వీరులను మింగేసేటట్టు రాగా సుగ్రీవుడు సప్తపర్ణవృక్షంతో కొట్టి వాణ్ణి పడగొట్టాడు. అగ్నికేతువూ, రశ్మికేతువూ, సుప్తఘ్నుడూ పదునైన బాణాలు వేసి రాముణ్ణి నొప్పించారు. దానిమీాద మహోగ్రుడై రాముడు అగ్నిశిఖలవంటి నాలుగుబాణాలతో వాళ్ళని నలుగురినీ మట్టుపెట్టేశాడు. మైందుడు వజ్రముష్టిని ఒక్క గుద్దుగుద్దాడు. దాంతోవాడు రథంతోనూ గుర్రాలతోనూ కోటబురుజు కూలేటట్టు కూలాడు. నికుంభుడు నూరుబాణాలు విడిచి నీళుణ్ణి కొట్టాడు! దాని మీాద మండిపడి నీలుడు వాడి రథచక్రమే వూడబెరికి శ్రీమహావిష్ణువు సుదర్శనంతో కొట్టేటట్టు దాంతో ఆనికుంభుణ్ణి సారథినీ తలకొట్టి చంపేశాడు. పిడుగువంటి ద్వివిదుడు అశనిప్రభు డనే రాక్షసుణ్ణి పర్వత శిఖరంతో కొట్టాడు. చివరికి సాలవృక్షంతో కొట్టి వాణ్ణీ, సారథినీ గుర్రాలనూ కూడా చంపేశాడు. విద్యున్మాలి రథంమీాద వచ్చి సుషేణుణ్ణి కొట్టి సింహనాదంచేశాడు. వెంటనే సుషేణుడు ఒక బండరాయి విసిరి ముందు వాడి రథం కూల్చేశాడు. దాంతో వాడు

అతిలాఘవంగా కిందికి దూకి గదాపాణి అయి మీదికి వచ్చాడు. సుషేణుడు మళ్ళీ వాడి బండరాయి విసిరి వాణ్ణి కూడా కూల్చేశాడు.

ఇలాగ దేవదానవుల్లాగ రాక్షసులూ వానరులూ ఘోరయుద్ధం చేశారు. అప్పుడు ఆయుద్ధభూమి విరిగిపోయిన ఖడ్గాలతోనూ, శక్తులతో మరపట్టసాలతోనూ, రథాలతోనూ, కూలిపోయిన గుర్రాలతోనూ యేనుగులతోనూ చనిపోయిన రాక్షసులతోనూ వానరులతోనూ నిండి పోయింది. అక్కడ నక్కలు నిర్భయంగా సంచరించసాగాయి; అయినా జంకక రాక్షసులు సూర్యాస్తమయంకోసం యెదురుచూడసాగారు.

## ४४

## ఇంద్రజిత్తు రామలక్ష్మణులను నాగాస్త్రంతో బంధించడం

వానరులూ రాక్షసులూ యిలా యుద్ధంచేస్తూవుండగానే పొద్దుగూకింది. వానరుల ప్రాణాలు తీసే చీకటి అలుముకుంది. ఆచీకటిలో వారికి ఘోరయుద్ధం జరుగుతూనే వుంది. రాక్షసు లనుకుని వానరు లనే వానరులు చంపసాగారు. వానరు లనుకుని రాక్షసులు రాక్షసు లనే సంహరించజొచ్చారు. "చంపు, చీల్చెయ్యి. రా. నుంచో. ఆగు" అంటూ ఆచీకటిలో పరుషంగా అరుపులు వినరాసాగాయి. కాంచనాభరణాలు ధరించిన నల్లని రాక్షసులు ఆచీకటిలో వెలిగే ఓషధులతో నిండిన పర్వతాలలాగ వున్నారు. అనంతమైన ఆచీకటిలో క్రోధ మూర్ఛితులై రాక్షసులు వానరులను నమిలివేస్తూ మహావేగంగా సంచరించసాగారు. వానరు లందుకు మిక్కిలీ కోపించి ఆకాశాని కెగిరి గుర్రాలనూ ధ్వజాలనూ ఏనుగులనూ చీల్చివేశారు. రాక్షసులను కూడా వారు రక్కీ, కొరికీ, చరిచీ చీకాకుపరిచారు. రాముడూ లక్ష్మణుడూ తీక్ష్ణబాణాలు ప్రయోగించి కనుబడుతున్నవాళ్ళనీ, కన పడనివాళ్ళనీ కూడా అనేకమంది రాక్షసులను సంహరించారు. గుర్రపు

డెక్కలతో రేగి రథచక్రాలతో పైకెగిసిన దుమ్ము అందరికీ కళ్ళల్లోనూ చెవుల్లోనూ దూరి పీడించసాగింది. రక్తనదులు ప్రవహించాయి. ఆచీకటిలో — ఆదుమ్ములో — ఆరక్తంలో భేరీభాంకారాలూ శంఖారావాలూ మిళితమై గంభీరంగా వినిపిస్తున్నాయి. వానరులలోనూ రాక్షసులలోనూ పడిపోయిన వాళ్ళ మూలుగులూ, పోరుతున్న వాళ్ళ అరుపులూ చాలా భయంకరంగా వున్నాయి. శవాలతోనూ, విరిగి పోయిన ఆయుధాలతోనూ, బండరాళ్ళతోనూ, చెట్లతోనూ, రక్త మాంసాలతోనూ ఆయుద్ధభూమి అడుగుపెట్టడానికి వీలులేకుండా అయి పోయింది. ఆరాత్రి లోకక్షయకరమైన కాళరాత్రి అయిపోయింది. ఆచీకటిలో రాక్షసులు బాణాలు విడుస్తూ రామునిమీదికే ఉరికారు. ఆరాక్షసుల సింహనాదాలు ప్రళయకాలంలో సప్తసముద్రాల ఘోర ధ్వనుల్లా వున్నాయి; కాని ఆచీకటిలోనే రాముడు క్షణంలో ఆరు బాణాలతో ఆరుగురు రాక్షసులను చంపేశాడు. రాముని బాణాలు సహించలేక యమశత్రుడూ, మహాపార్శ్వుడూ, మహోదరుడూ, వజ్రదంష్ట్రుడూ, ఉత్తరద్వారం రక్షిస్తున్న శుకసారణులూ బతుకు జీవుడా అని పారిపోయారు. రాముని తీక్ష్ణబాణాలతో మెరుపుతీగ లతో లాగ యుద్ధభూమి అంతటా వెలుగు ఏర్పడింది. రామునిమీదికి వచ్చిన మరికొందరు రాక్షసులు కూడా అగ్గిలో పడ్డ మిడతల్లాగ మాడిపోయారు. రాక్షసుల సింహనాదాలూ, వానరుల పెడబొబ్బలూ మరీ ప్రబలిపోయాయి. దాంతో త్రికూటపర్వతం వూగిపోయింది. కొండముచ్చులు ఆచీకటిలో రాక్షసులను పట్టుకుని తినెయ్యసాగారు. అంగదుడు ఇంద్రజిత్తుని కూల్చదలచి ముందతని సారథినీ గుర్రాలనూ చంపేశాడు. దాంతో ఇంద్రజిత్తు రథం విడిచిపెట్టి అక్కడే మాయం అయిపోయాడు. వాలిపుత్రుడైన అంగదుని ఆప్రతాపం చూసి రామలక్ష్మణులు మిక్కిలీ ఆనందించారు. ఇంద్రజిత్తు శక్తిసామర్థ్యాలు

బాగా యెరిగిన అది చూచినవా రందరూ అంగదుణ్ణి చాలా మెచ్చుకున్నారు. వానరయోధులు అనేకులూ, సుగ్రీవుడూ, విభీషణుడూ సెబాస్ అని అంగదుణ్ణి ప్రసంసించారు.

ఇంద్రజిత్తు ఈపరాభవంతో చాలా క్రుద్ధు డయిపోయాడు. అప్పుడు రాముడు వానరులనందరినీ చూసి "మీరందరూ సుగ్రీవుని దగ్గిర జాగ్రత్తగా వుండండి. వాడికి బ్రహ్మవరం వుంది. దాంతో వాడు త్రిలోకాలూ పీడిస్తున్నాడు. నాకోసం మీరిప్పుడు ఓర్పువహించాలి" అని చెప్పాడు. ఇలా చెబుతూవుండగానే రామునిమీదా, లక్ష్మణుని మీదా ఇంద్రజిత్తు ఘోరా లైన నాగాస్త్రాలు ప్రయోగించాడు. దాంతో వాడు వారిని శరీరం అంతటా కొట్టాడు. దాంతో వారిని బంధించిన్నీ వేశాడు. వానరు లందరూ అది చూశారు.

## ౪౫

## ఇంద్రజిత్తు బాణాలతో రామలక్ష్మణులు పడిపోవడం

రాముడు ఇంద్రజిత్తు ఎక్కడ వున్నాడో చూసిరమ్మని సుషేణుని కొడుకు లిద్దరినీ, నలుణ్ణీ, అంగదుణ్ణీ, శరభుణ్ణీ, వినతుణ్ణీ, జాంబవంతుణ్ణీ, సానుప్రస్థుణ్ణీ, ఋషభుణ్ణీ, ఋషభస్కంధుణ్ణీ పంపాడు. వాళ్ళు పది మందీ పెద్దపెద్ద చెట్లు పుచ్చుకుని ఆకాశంలో బయలుదేరారు; కాని తీక్ష్ణాస్త్రాలు వేసి ఇంద్రజిత్తు వారి వేగం తగ్గించాడు. ఎంతప్రయత్నం చేసిన్నీ వాళ్ళు ఇంద్రజిత్తును కనుక్కో లేకపోయారు. దీనికి సాయం ఇంద్రజిత్తు రామలక్ష్మణులనే బాణాలతో కొట్టసాగాడు. ఆదెబ్బలతో చాలా యెక్కువగా రక్తంస్రవించగా వారిద్దరూ విరగబూసిన మోదుగుచెట్లలా వున్నారు. అలా కొడుతూనే - అలా మాయం అయి వుండే యింద్రజిత్తు పళ్లు పటపట కొరుకుతూ రామలక్ష్మణులను చూసి "నేను అంతర్ధానం అయి యుద్ధంచేశాటప్పుడు దేవరాజయిన మహేంద్రుడు

కూడానన్ను సమీపించలేదు. నన్ను చూడనూలేదు. మిమ్మల్ని నిద్దర్శి బాణాలతో ముంచేసి యిప్పుడే యమలోకానికి పంపేస్తాను'' అని చెప్పి మళ్ళీ బాణాలతో కొట్టి వికవికనవ్వుతూ సింహనాదం చేశాడు. మళ్ళీ మళ్ళీ బాణాలు వేశాడు. రామలక్ష్మణులను ప్రతీమర్మంమీదా కొట్టి చీకాకు పరిచాడు. దాంతో వారు క్షణంలో చూపు లేకుండా అయి పోయారు. వారిశరీరంనిండా బాణాలు గుచ్చుకుని వున్నాయి. ఉండుండి వారు వాణికిపోతూ ఇంద్రధ్వజాల్లాగ నేలమీద పడిపోయారు. వారి శరీరాలమీద అంగుళం అయినా బాణాలు తగలని చోటు లేదు. అప్పుడు ప్రస్రవణపర్వతంమీదినుంచి సెలయేరులు ప్రవహించే టట్టు వారి శరీరాలనుంచి రక్తం వరదలు కట్టింది. ముందు రాముడు పడిపోయాడు. ఇంద్రజిత్తు వారిని నారాచాలూ, అర్ధనారాచాలూ, భల్లాలూ, అంజలికాలూ, వత్సదంతాలూ, సింహదంష్ట్రలూ, అర్ధచంద్ర బాణాలూ మొదలైన వివిధబాణాలతో కొట్టాడు. రాముడుపడిపోయినా ఎక్కుపెట్టబడి వుండిన ధనుస్సు అతని చేతిలోనే వుంది. అలా వుండిన రాముణ్ణి చూసి లక్ష్మణుడు ప్రాణాలమీద ఆశ వదలుకున్నాడు. రాముడు భూమిమీద పడివున్నందుకు అతను చాలాచాలా దుఃఖించి నాడు. వానరులున్నూ మిక్కిలీ విచారించారు.

## ४६

## రామలక్ష్మణులను కొట్టేశానని ఇంద్రజిత్తు రావణునితో చెప్పడం

అటుపైకీ యిటు కిందికీ చూస్తున్న వానరులు రామలక్ష్మణులు పడి పోవడం చూశారు. వాన కురిసివెలిసినట్టు ఇంద్రజిత్తు వూరుకోగా విభీషణు డప్పుడు సుగ్రీవునితో కూడా అక్కడికి వచ్చాడు. చేష్టలు తక్కి మెల్లిమెల్లిగా నిట్టూర్పులు విడుస్తూ రక్తంలో తేలుతున్న రామలక్ష్మణులను చూసి నీలుడూ, ద్వివిదుడూ మైందుడూ, సుషే

ణుడూ, కుముదుడూ, అంగదుడూ, హనుమంతుడూ మిక్కిలీ విచారిం చారు. తక్కినవానరులు కూడా చాలా దుఃఖించారు. అందరూ ఆకాశం కేసి చూశారు; గాని యెవరికీ యింద్రజిత్తు కనపడలేదు. విభీషణుడు మాయలన్నీ యెరిగినవాడు కనక ఇంద్రజిత్తుని చూశాడు.

అక్కడ యింద్రజిత్తు తాను చేసిన పనీ, రామలక్ష్మణులు పడిపోయి వుండడమూ చూసి గర్వంతో రాక్షసులతో "ఖరుణ్ణీ దూషణుణ్ణీ సంహరించిన మహావీరులయిన రామలక్ష్మణులను నేను చంపేశా నదిగో చూడండి. దేవతలూ మహర్షులూ వచ్చినా ఈనాగాస్త్రబంధం విడి పించలేరు. ఎవరిమూలాన నాతండ్రి నిద్రలేక బాధపడుతున్నాడో, ఎవని వల్ల యీ లంకాపట్నం అంతా వర్షాకాలపునదిలాగ కలిగిపోతోందో అందుకు మూలకారణం అయిన రాముణ్ణి నేను సంహరించేశాను. దీంతో, రామలక్ష్మణుల పరాక్రమమూ, సర్వవానరవీరుల బలపరా క్రమాలూ నిష్ఫలం అయిపోయాయి." అని చెప్పి తక్కిన వానర సేనాధిపతులను కూడా తీక్ష్ణాస్త్రాలతో కొట్టాడు. అందులోనూ, నీలుణ్ణి తొమ్మిది బాణాలతో కొట్టాడు. మైందుణ్ణీ ద్వివిదుణ్ణీ మూడేసి బాణాలతోనూ, జాంబవంతుణ్ణి ఒక్కబాణంతోనూ, హనుమంతుణ్ణి పదిబాణాలతోనూ, గవాక్షుణ్ణీ శరభుణ్ణీ రెండేసి బాణాలతోనూ, అంగదుణ్ణి అనేకబాణాలతోనూ బాధించి సింహనాదం చేశాడు.

ఇదంతా చేసి అతను నవ్వి, గొంతెత్తి "రాక్షసవీరులారా! ఇదిగో రామలక్ష్మణులను నేను శరబంధంతో కట్టి నేలమీద పడ వేశాను చూడండి." అని చెప్పాడు. అది చూసి రాక్షసు లందరూ చాలా ఆశ్చర్యపడ్డారు. రాముడు చనిపోయా డనుకుని వాళ్లు సింహ నాదాలు చేస్తూ ఇంద్రజిత్తుని చాలా మెచ్చుకున్నారు. ఇంద్రజిత్తుకూడా ఉచ్ఛ్వాసనిశ్వాసాలు లేకుండా పడివున్న రామలక్ష్మణులను చూసి వారు చనిపోయా రనే భావించాడు. ఇలా అనుకుని అతను పరమానం

దంతో లంకాపట్నంలోకి వెళ్లి రాక్షసుల కందరికీ ఆనందం కలిగించాడు.

ప్రతీఅంగుళానికీ రాముని శరీరం అంతా బాణాలతో నిండివుండడం చూసి సుగ్రీవుడు చాలా విచారించాడు. అది గుర్తించి విభీషణుడు "సుగ్రీవా! భయపడకు. విచారించకు. కళ్లనీళ్లు తుడుచుకో. యుద్ధాలంటే యిలాగే వుంటాయి. విజయం స్థిరంకాదు. మనఅదృష్టం యేమయినా మిగిలివుంటే రామలక్ష్మణుల మూర్ఛ తగ్గిపోతుంది. నువ్వు ధైర్యం నిలుపుకో. అనాథనైన నాకు ధైర్యం కలిగించు. సత్యంలోనూ ధర్మంలోనూ నమ్మకమూ గౌరవభావమూ గలవాళ్లకి మృత్యుభయం లేదు." అని చెప్పి సుగ్రీవుని కళ్లు నీళ్లతో తుడిచి "సుగ్రీవా! ఇది విచారించవలసిన కాలం కాదు. అతిస్నేహం మరణానికి కారణం అవుతుంది. అంచేత సర్వమూ చెరిచే అధైర్యం విడిచి రామునికోసం వచ్చిన యీవానరసైన్యం విషయం ఆలోచించు. అదీకాక. తెలివి వచ్చేదాకా, రామలక్ష్మణులను కాపాడు. తెలివివచ్చిన తరవాత వీరే మనల నందరిని కాపాడతారు. రామున కేమీ భయంలేదు. రాముడు చచ్చిపోడు. చనిపోయినవాళ్ళ మొగాలింత కళగా వుండవు. కనక, నీకు నువ్వు ధైర్యంచెప్పుకో. సేనకున్నూ ధైర్యం కలిగించు. ఇంతలో నేనంతా చక్కబెడతాను. అదిగో వానరు లందరూ ఒకళ్లకొకరు చెవిలో చెప్పుకుంటూ భయపడుతున్నారు. నేనిదే అంతటా తిరుగుతూ ధైర్యం కలిగిస్తాను. దాంతో వారు వాడిపోయిన పూలదండ తీసిపారేసే టట్టు భయం విడిచిపెడతారు" అని వూరడించాడు.

సర్వసైన్యంతోనూ లంకాపట్నంలోకి వెళ్ళిన యింద్రజిత్తు రావణుని దగ్గిరికి వెళ్ళి నమస్కరించి "రామలక్ష్మణులు చనిపోయా" రని నివేదించాడు. ఇది విని మహానందభరితుడై యెగిసిపడ్డాడు రావణుడు. కొడుకుని కౌగిలించుకున్నాడు. శిరస్సు మూర్కొన్నాడు. "వివ

రాలు చెప్పు" అని అడగ్గా ఇంద్రజిత్తు సర్వమూ చెప్పాడు. ఇదంతా విని రాముని వల్ల తనకు కలిగిన జ్వరం విడిచిపోగా రావణుడు తేలికపడ్డాడు.

## ౪౭

## త్రిజట సీతకు రామలక్ష్మణును చూపించడం.

కృతార్థుణ్ణయినా ననుకుని ఇంద్రజిత్తు లంకలోకి వెళ్ళిపోయాక వానరప్రముఖులు రాముని చుట్టూ కూచుని దుఃఖించసాగారు. వారిలో హనుమంతుడూ, అంగదుడూ, నీలుడూ, సుషేణుడూ, కుముదుడూ, నళుడూ, గజుడూ, గవాక్షుడూ, గవయుడూ, శరభుడూ, గంధమాదనుడూ, జాంబవంతుడూ, వృషభస్కంధుడూ, రంభుడూ, శతవలీ, పృథువూ మరీ విచారించారు. వానరవీరులు చెట్లూ చేమలూ చేత బట్టుకుని పైకీ కిందికీ, పక్కలకీ చూస్తూ గడ్డిపరక కదిలినా రాక్షసులు వస్తున్నా రని కంగారుపడసాగారు.

రావణుడున్నూ మిక్కిలీ ఆనందించి ఇంద్రజిత్తును పంపేసి అశోకవనంలో సీతకు కాపున్న రాక్షసాంగనలను పిలిపించాడు. వాళ్ళకి నాయకురాలు త్రిజట. ఆమె వాళ్ళని తీసుకవచ్చింది. రావణుడు వాళ్ళని చూసి "ఇంద్రజిత్తు రాముణ్ణి చంపేశా డని సీతతో చెప్పండి. ఆమెని పుష్పకంమీాద తీసుకువెళ్ళి రామలక్ష్మణుల శవాలు చూపించండి. ఎవణ్ణి చూచుకుని గర్వంతో సీత నన్ను తిరస్కరిస్తోందో ఆ రాముడు లక్ష్మణునితో కూడా యుద్ధంలో చచ్చిపోయాడు. కనక, ఆమె యిప్పుడు నిశ్శంకగా నిర్విచారంగా నిరపేక్షగా సకలాభరణాలూ ధరించివచ్చి నన్ను సుఖపెడుతుంది. రాముడు చనిపోడంవల్ల మరి గతి లేదు కనక, ఆమె నన్ను పొందితీరుతుంది" అని చెప్పాడు.

"సరే" అని చెప్పి ఆరాక్షసాంగనలు పుష్పకంతీసుకువెళ్లి సీత నెక్కించి యుద్ధరంగానికి తీసుకువెళ్లారు. రావణుడు లంక అంతా జెండాలతో అలంకరింపించి "ఇంద్రజిత్తు రాముణ్ణీ లక్ష్మణుణ్ణీ చంపే శాడు" అని పట్నం అంతటా చాటింపించాడు.

పుష్పకంమీద వెళ్లి సీత వానరసైన్యం అంతా పడిపోయివుండడం చూసింది. రాక్షసు లందరూ ఉప్పొంగిపోతూ వుండడం కూడా చూసింది. రామలక్ష్మణుల పక్కని కూచుని వానరప్రముఖులు కూడా దుఃఖిస్తూ వుండడం చూసింది. శరీరం అంతా బాణాలతో నిండిపోయి పడిపోయివుండిన రామలక్ష్మణులను కూడా చూసింది. అది చూసి ఆమె కిందపడి పొరలుతూ చాలా దుఃఖించింది.

## ४७

## రామలక్ష్మణులు చావలే దని త్రిజట సీతకు ధైర్యంచెప్పడం

ఆదుఃఖంతో సీత యిలా అంది.

"సాముద్రికం తెలిసినవారు నేను ముత్తయిదువుగానే వుంటా ననీ, కొమాళ్లతల్లి నవుతా ననీ చెప్పారు; కాని రాముడు చని పోయాడు. వారి మాట లబద్ధం అయిపోయాయి. విషయజ్ఞులు నేను నాభర్తతో అనేకయజ్ఞాలు చేస్తా ననీ, చివరికి అశ్వమేధం కూడా చేస్తా ననీ చెప్పారు. అవేమీ చెయ్యకుండానే రాముడు చనిపో యాడు. వారు చెప్పింది అబద్ధం అయిపోయింది. సిద్ధాంతులు నేను నిత్యసుమంగళి నయి వుంటా ననిచెప్పారు. రాముడు చనిపోయాడు. వా రసత్యవాదు లయిపోయారు. 'నువ్వు వీరపార్థివభార్య నవుతా వనీ ధన్యురాల' వనీ చెప్పినవా రందరూ అనృతవాదు లయిపోయారు. నాపాదాలలో పద్మరేఖలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. ఇలాంటి లక్షణాలుగల స్త్రీలు భర్తతో సామ్రాజ్య పట్టాభిషేకభాగ్యం అనుభ

విస్తారు. స్త్రీలకు వైధవ్యం కలిగించే లక్షణా లేమీ నాశరీరంమీద లేవు. నా కేశాలు సూక్ష్మాలూ, సమాలూ నీలాలూ అయి వున్నాయి. నాకనుబొమలు కలిసివుండక విడివిడిగానే వున్నాయి. నాపిక్కలు గుండ్రంగా వున్నాయి. వాటిమీద రోమాలు కూడా లేవు. నాదంతాలు ఎడంగా లేవు. నానేత్రపార్శ్వాలూ, నేత్రాలూ, చేతులూ, పాదాలూ, సీలమండలూ, తొడలూ బలిసివున్నాయి. నాచేతివేళ్లు గుండ్రంగా సమంగా వున్నాయి. గోళ్లు గుండ్రంగా వున్నాయి. నా స్తనాలు పీనంగా ఒరుసుకుంటూ వున్నాయి. చూచుకాలున్నూ శాస్త్రంలో చెప్పినట్టేవున్నాయి. నానాభి లోతుగా వుంది. నాపక్కలూ వక్షస్థలమూ మాంసలాలయి వున్నాయి. నా శరీరం రంగు రత్నకాంతిలా వుంది. నాశరీరంమీది వెంట్రుకలు చాలా మృదువుగా వున్నాయి. నాకాలివేళ్లూ అరికాళ్లూ నేలమీద బాగా ఆనుకునివుండడం శాస్త్రవేత్తలు చాలా మంచి దన్నారు. నాఅరికాళ్ల లోనూ అరిచేతులలోనూ యవచిహ్నాలు స్ఫుటంగా వున్నాయి. నావేళ్లు సందులేకుండానే వున్నాయి. కన్యాలక్షణాలు తెలిసిన బ్రాహ్మలు నేనెప్పుడూ చిరునవ్వు నవ్వుతూ వుంటా నని చెప్పారు. జ్యోతిశాస్త్రం తెలిసిన పండితులు నాకు నాభర్తతో కూడా సామ్రాజ్యపట్టాభిషేకం జరుగుతుం దని చెప్పారు; కాని అదంతా అబద్ధం అయిపోయింది. రామలక్ష్మణులు జనస్థానం అంతా వెతికి, చివరికి నేనున్న చోటు తెలుసుకుని, అక్షోభ్యం అయిన సముద్రం కూడా దాటివచ్చి గోష్పాదమాత్రంలో విఫలు లయిపోయారు. చచ్చిపోయారు. రామలక్ష్మణులకు వారుణాస్త్రమూ, ఆగ్నేయాస్త్రమూ, ఐంద్రాస్త్రమూ, వాయవ్యాస్త్రమూ, బ్రహ్మశిరోస్త్రమూ తెలుసు. అలాంటి మహావీరులు నన్నునాథను చేసి చనిపోయారు. శత్రువైన వాడు మనోజవం కలవా డయినా రామునికంటబడితే బతికిపోలేడు.

రాముడే శత్రునితో కూడా యుద్ధరంగాన దీర్ఘనిద్రపొందా డంటే యిక కాలాని కశక్యం యేమివుందీ ? కౌసల్యను తలుచుకుంటే నాకు మహాదుఃఖం వస్తోంది. రాముణ్ణిగురించీ, లక్ష్మణుణ్ణి గురించీ నన్ను గురించీ, నాతల్లిని గురించీ కూడా నేనంతగా దుఃఖించను. ఆమహా యిల్లాలు 'పధ్నాలుగుసంవత్సరాల వనవాసవ్రతం గడిపి సీతా రాములూ లక్ష్మణుడూ యెప్పుడూ వస్తా' రని యెదురుచూస్తోంది"

సీత యిలాగ తలుచుకుతలుచుకు దుఃఖిస్తూ వుండడం చూసి త్రిజట యిలా వూరడించింది.

" దేవీ! నువ్వు అనవసరంగా విచారించకు. నీభర్త బతుకుతాడు. రాముడూ లక్ష్మణుడూ బతికే వున్నా రనడానికి నాకు అనేకశుభలక్షణాలు కనపడుతున్నాయి. యుద్ధంలో చచ్చిపోయినవాళ్ళ మొగాల మీాద కోపచిహ్నాలూ ఆనందలక్షణాలూ వుండవు. మరొన్ని వీరిద్దరూ చనిపోయే వుంటే దివ్యమైన యీాపుష్పకవిమానం నిన్ను భరించివుండదు. సేనాధిపతి చచ్చిపోతే సేన అంతా చుక్కానికాడ లేని నావ లాగ దిక్కులేకుండా పోతుంది; కాని యిలా వుండదు. ఈసేన అంతా నిశ్చలంగా వుంది. ఇది రామలక్ష్మణులను జాగ్రత్తగా కాపాడుతోంది. స్పష్టంగా కనపడుతున్న యీాలక్షణాలవల్ల రామలక్ష్మణులు బతికే వున్నా రని ధైర్యంగా వుండు. నేను ఇదంతా నీమీాది స్నేహంవల్ల చెబుతున్నాను. నేనింతవరకూ అబద్ధం ఆడియెరగను. ఇకముందున్నూ ఆడను. ఇప్పుడు కూడా చెప్పడంలేదు. నువ్వు శీలవతివి. అంచేత నామనసు కెక్కావు. దేవతలే కాదు దేవేంద్రు డయినా రామలక్ష్మణులను వోడించలేడు. రామలక్ష్మణుల దగ్గిర మంచిలక్షణాలు చాలా వుండడం చూసి నేను నీకిది చెప్పగలుగుతున్నాను. ఒక్కటి చూడూ. వీరు ఇద్దరూ మాటా చూపూ లేకుండా పడిపోయివున్నా రే; కాని మొగాలుకళతప్పివున్నాయా? సాధారణం చచ్చిపోయినవాళ్ళ మొగాలు

చాలా వికృతంగా వుంటాయి. కనక, సీతా! శోకించకు. మోహపడకు. దుఃఖించకు. రామలక్ష్మణులు బతికేవున్నారు. రామలక్ష్మణులకోసం బతికివుండడం నీకు అశక్యం కాదు ”

త్రిజట యిలాగ దృఢంగా చెప్పగా సీత చేతులు జోడించుకుని “ నువ్వు చెప్పింది యథార్థం కావాలి ” అంది. తరవాత విమానం లంకలోకి వెళ్ళిపోయింది. సీత త్రిజటతోనూ, తక్కిన రాక్షసాంగనల తోనూ విమానం దిగి అశోకవనంలో ప్రవేశించింది. కాని అక్కడకు వెళ్ళాక ఆమె రామలక్ష్మణులకోసం దుఃఖిస్తూనే వుంది.

## ౪౯

## లక్ష్మణుణ్ణి చూసి రాముడు బహువిధాల దుఃఖించడం

తన చుట్టూ కూచుని సుగ్రీవాది వానరవీరులు విచారిస్తూ వుండగా స్థైర్యం కలవాడు కనకా, సత్త్వవంతుడున్నూ కాబట్టీ రాముడు మూర్ఛ తేరాడు. అతను కళ్ళు విప్పాటప్పటికి నెత్తుటివరదలో మునిగి వుండిన లక్ష్మణుడు కనబడగా చాలా ఆదుర్దాపడిపోయి “ నాతమ్ముడు యుద్ధంలో నిర్జితుడై పడిపోయివుండడం చూశాను ; ఇక నాకు సీతతో నేమిపనీ ? ప్రాణాలతో మాత్రం యేమిపనీ ? మానవలోకంలో వెతి కితే నాకు సీతవంటి స్త్రీ దొరక్కపోదు ; కాని సచివుడూ సాంప రాయికుడూ అయిన లక్ష్మణునివంటి సోదరుడు దొరకడు. సుమిత్రా నందవర్ధనుడైన లక్ష్మణుడు చచ్చిపోయేటట్టయితే యీ వానరవీరు లందరూ చూస్తూ వుండగా నేను నా ప్రాణాలు విడిచేస్తాను. నేను కౌసల్యకేమి చెబుతానూ ? సీత కేమి చెబుతానూ ? కొడుకునుచూడా లని యెదురుచూస్తూ వున్న సుమిత్ర కేమి చెబుతానూ ? నేను లక్ష్మణుడు లేకుండా వెళ్ళి ఆమె నేమని వూరడించగలనూ ? నాతో

కూడా వనవాసానికి వచ్చిన లక్ష్మణుడు కూడా లేకుండా వెళ్ళి భరతున కేమి చెప్పనూ? శత్రుఘ్ను నకు మాత్రం యేమి చెప్పనూ? సుమిత్ర నింది స్తే యెలా సహించగలనూ? నేనిక్కడే ప్రాణాలు విడిచిపెట్టే స్తాను, ఇక బతకలేను. నాకోసం లక్ష్మణుడు చనిపోతే, ధిక్! నాబతుకు కాల్చనా? లక్ష్మణా! నేను దుఃఖిస్తూ వుంటే నన్నెప్పుడూ నువ్వు ఆశ్వాసించేవాడివి. ఇప్పుడు నేనెంత దుఃఖిస్తున్నా మాటాడవేమి? ఇక్కడ అనేకమంది రాక్షసులను సంహరించిన లక్ష్మణు డిక్కడే నిహతుడై పడివున్నాడు. బాణాలతో నిండి శరతల్పంమీద వుండి నట్టున్న యీలక్ష్మణుడు అ స్తమించే సూర్యుడులా వున్నాడు. లక్ష్మణుడు నే నడవులకు వస్తూవుంటే నావెంటబడ్డాడు. అతను యమ పురికి వెడుతున్నాడు; కనక, అతన్ని నే ననుసరిస్తాను. ఎల్లప్పుడూ బంధుజనాలనూ నన్నూ అనుసరించి వుండే లక్ష్మణుడు నామూలాన ఇలాంటి అవస్థపా లయినాడు. ఎంతకోపం వచ్చినా యితనువ్యతిరేకం చెప్పి యెరగడు. పరుషంగా మాట్లాడిన్నీ యెరగడు. వెయ్యి చేతులు కలవాడు కనక కా ర్తవీర్యార్జునుడు ఏకకాలంలో అయిదు వందల బాణాలు విడుస్తాడు. ఆమాత్రం కాలంలో లక్ష్మణుడు రెండు చేతులతోనే అంతకంటే యెక్కువబాణాలు విడవగలడు. తన బాణా లతో ఇంద్రునిబాణాలు కూడా కొట్టెయ్యగల లక్ష్మణుడు గొప్పశయ్య మీద పరుండతగ్గవా డయివుండిన్నీ యిలాగ కటికినేలమీద పడు కున్నాడు. నేను విభీషణునకు రాక్షసరాజ్యం పట్టంకట్టలేకపోయాను. ఈదుఃఖానికితోడు ఈమిథ్యాప్రలాపం కూడా నన్ను దహించేస్తుంది. సుగ్రీవా! వానరసేనను వెంటబెట్టుకుని నువ్విప్పుడే కిష్కింధకు వెళ్ళిపో. లేకపోతే, నేను లేననుకుని రావణుడు నిన్ను తరిమికొడతాడు. అంగదుణ్ణీ నీలుణ్ణీ నలుణ్ణీ తక్కినవారినీ వెంటబెట్టుకుని వెంటనే నువ్వు సముద్రందాటిపో. హనుమంతు డెవరూ చెయ్యలేని పని చేశాడు.

జాంబవదాదులున్నూ గొప్పగా యుద్ధంచేశారు. అందుకు నేను చాలా సంతోషించాను. అంగదుడూ, మైందుడూ ద్వివిదుడూ చాలా కష్టపడ్డారు. కేసరీ సంపాతీ ఘోరయుద్ధం చేశారు. గవయుడూ, గజుడూ, గవాక్షుడూ శరభుడూ మొదలైనవారు ప్రాణాలకు తెగించి నాకోసం చాలా గొప్పగాయుద్ధం చేశారు. సుగ్రీవా! ఏమిచేసినా మనుష్యులు దైవాజ్ఞ ఉల్లంఘించలేరుగదా? స్నేహితు డెంతవరకూ చెయ్యగలడో అంతా నువ్వు నాకుచేశావు. వానరప్రముఖులారా! శక్తి వంచన లేకుండా మీరు మిత్రకార్యం నిర్వహించారు. ఇదిగో, నే ననుజ్ఞ యిస్తున్నాను. యథేచ్ఛగా వెళ్ళిపొండి" అని బహువిధాల విచారించి చివరి కిలా చెప్పాడు. అది విని వానరు లందరూ కళ్ళల్లో నీళ్ళు పెట్టుకున్నారు. ఇంతలో, సైనికుల కందరికీ ధైర్యంచెప్పి విభీషణుడూ గదాపాణి అయివచ్చాడు. కాటుకకొండలాగ వస్తున్న అతన్ని చూసి వానరు లందరూ ఇంద్రజిత్తే వస్తున్నా డనుకుని పారిపోసాగారు.

## ౫౦

## గరుత్మంతుడు వచ్చి రామలక్ష్మణులను తేర్చడం

సుగ్రీవుడు "సుడిగుండాన తగులుకున్న నావ లాగ వానరసేన యింత కంగారుపడుతోం దేమిటి?" అడిగాడు. అందుకు అంగదుడు "రామ లక్ష్మణు లిద్దరూ పడిపోయివుండడం నువ్వు చూడ్డంలేదూ?"అని బదు లడిగాడు. దానిమీద సుగ్రీవుడు "ఇప్పుడు కలిగిన భయాని కదొక్కటే కారణం కాదు. ఈవానరులు తలో దిక్కుకీ పారిపోతున్నారు. ప్రతీ వాడూ సిగ్గూ లజ్జా విడిచి వెనక్కి చూడకుండా పరుగెత్తుతున్నారు. పడిపోయినవాణ్ణి లేవతియ్యకుండా వానిమీదినుంచే దాటిపోతున్నారు" అన్నాడు.

ఇంతలో గదాపాణి అయిన విభీషణుడు వచ్చి సుగ్రీవునకు జయం పలికి రాముణ్ణి చూశాడు. సుగ్రీవుడు విభీషణుడు రావడం చూసి జాంబవంతునితో "వచ్చినవాడు విభీషణుడు. ఇతన్ని చూసి మనవాళ్లు ఇంద్రజిత్తు అనుకుని పారిపోతున్నారు. వాళ్ళ నందరినీ వచ్చినవాడు విభీషణుడు అని చెప్పి మళ్ళించు" అన్నాడు. జాంబవంతు డలా చెయ్యగా ధైర్యం చిక్కబట్టుకుని వానరు లందరూ మళ్ళీ వెనక్కి వచ్చారు.

విభీషణుడు పడివున్న రాముణ్ణీ లక్ష్మణుణ్ణీ చూసి చాలా బాధ పడ్డాడు. తరవాత చేతులకు తడిచేసుకుని వారి కళ్ళు తుడిచి "సత్వ సంపన్నులూ పరాక్రమవంతులూ అయిన రామలక్ష్మణులు మాయావు లైన రాక్షసులవల్ల యీస్థితికి వచ్చారా? సత్యపరాక్రములు కనక వీరు యథార్థంగా పోరారు. నాఅన్న కొడుకు దుర్మార్గుడు కనక కూట యుద్ధంచేశాడు. బాణాలు నాటి నేలమీద పడివుండినవీరు ముండ్లపం దులలా వున్నారు. నేనెవరి పరాక్రమంవల్ల ప్రతిష్ఠ పొందుదామని ఆశించానో వారిస్థితిలో వున్నారు. నారాజ్యకాంక్ష భగ్నం అయిపో యింది. నాశత్రువు బలపడ్డాడు. కృతకృత్యుడున్నూ అవుతాడు. బతికి వుండిన్నీ నేనిప్పుడుచచ్చినవాణ్ణయిపోయాను" అంటూ చాలావిచా రించాడు.

అప్పుడు సుగ్రీవు డతన్ని కౌగిలించుకుని "ధర్మజ్ఞా! నువ్వు లంకాధి పత్యం పొందుతావు, సంశయంలేదు. రావణుడూ అతనికొడుకూ కూడా చెడిపోతారు, తప్పదు" అని ఊరడించి తన మామగా రైన సుషేణుణ్ణి చూసి "మామా! తెలివివచ్చాక వీరి నిద్దరినీ తీసుకుని యుక్తపరివారంతోనువ్వు కిష్కింధకు వెళ్ళిపో. తరవాత నేనుసపుత్రమిత్ర బాంధవంగా రావణుణ్ణి నాశనంచేసి సీతను తీసుకువస్తాను"అని చెప్పాడు.

అది విని సుషేణుడు "అతిభయంకర మైన దేవాసురయుద్ధం చూసి వున్నాను. అప్పుడు మాయావు లయిన దానవులు మాయచేసి దేవతలను బాధించారు. దానిమీద బృహస్పతి దెబ్బలుతగిలినవారినీ, చచ్చినవారినీ మంత్రయుక్తా లయిన మహౌషధులతో బతికించి మళ్ళీ గొప్ప యోధులుగా చేశాడు. ఆమహౌషధులు తీసుకురావడానికి సంపాతినీ పనసుణ్ణీ క్షీరసముద్రానికి పంపు. వారు ఆఓషధు లెరుగుదురు. క్షీరసముద్రంలో ఉత్తరాన చంద్రగిరీ, ద్రోణపర్వతమూ అని రెండు పర్వతా లున్నాయి. దేవదానవు లక్కడే క్షీరసాగరమథనంచేసి అమృతం సంపాదించారు. ఆఓషధులు రెండూ ఆపర్వతాలమీద వున్నాయి. వాటిపేరు, ఒకటి సంజీకరణీ, రెండోది విశల్యకరణీని. వాటిని ఈహనుమంతుడు తేగలడు" అని చెప్పాడు.

సుషేణు డిలా చెబుతూ వుండగా సుడిగాలి వీచింది. సముద్రం కలిగిపోయింది. భూమి గజగజలాడిపోయింది. పెద్దపెద్ద చెట్లన్నీ పెల్లగిల్లి వెళ్లి సముద్రంలో పడ్డాయి. సముద్రంలో వున్న పాములన్నీ భయభ్రాంతా లయిపోయాయి. చేపలూ మొదలయిన జలజంతువులు సముద్రం అడుక్కి వెళ్లిపోయాయి. "ఇదేమిటీ?" తెల్లపోయి వానరులు చూడగా గరుత్మంతుడు వస్తున్నాడు. అతన్ని చూసి బాణరూపంతో రామలక్ష్మణులను పట్టుకునివున్న పాములన్నీ మొగిరిపోయాయి. గరుత్మంతుడు తన రెండుచేతులతోనూ రామలక్ష్మణుల మొగాలు నిమిరాడు. ఇలాగ గరుత్మంతుడు తాకగానే రామలక్ష్మణుల గాయా లన్నీ మానిపోయాయి. వారిశరీరాలకు తొల్లిటి వర్చస్సు పూనుకుంది. మరిన్నీ వారికి తేజస్సూ, బలవీర్య పరాక్రమాలూ, ఓజస్సూ, ఉత్సాహమూ, బుద్ధీ, స్మృతీ పూర్వంకంటే రెట్టింపు ఎక్కువయాయి. గరుత్మంతుడు పరమసంతుష్టు డయి వారి నిద్దరినీ కౌగిలించుకున్నాడు. అతణ్ణి చూసి రాముడు "నీలను

గ్రహంవల్ల, ఇంద్రజిత్తు మాకు కలగించిన అపాయం తప్పిపోయింది. మేము పూర్వంలాగే బలవంతులం అయినాము. నిన్ను చూడగా, మాతండ్రి అయిన దశరథుణ్ణి చూసినట్టూ, మాతాత అజమహారాజును చూసినట్టూ నాహృదయం ప్రసన్నం అవుతోంది. నువ్వు రూపసంపన్నుడవు. దివ్యవస్త్రాభరణాలు ధరించావు. నువ్వెవరు నాయనా ?" అని అడిగాడు.

దానికి గరుత్మంతుడు "ఇక్ష్వాకువంశవర్ధనా! నేను మీస్నేహితుణ్ణి. నాపేరు గరుత్మంతుడు. మీకు సాయంచెయ్యడానికి వచ్చాను. ఇప్పుడు మిమ్మల్ని బంధించిన యీనాగాలను విడిపించడానికి మహేంద్రుడు కూడా సమర్థుడు కాడు. ఈనాగాలు క్రూరవిషంగల కద్రువ బిడ్డలు. ఇంద్రజిత్తు మాయవల్ల బాణాలయి మిమ్ము పట్టుకున్నాయి. నువ్వు ధర్మజ్ఞుడవూ సత్యపరాక్రముడవూ కనక మీరదృష్టవంతులైనారు. శత్రువు మిమ్ము ఏమీ చెయ్యలేకపోయాడు. నాగబంధం మీకిప్పుడు వదిలిపోయింది. అయితే, యిక ముందయినా మీరిద్దరూ చాలా జాగ్రత్తగా వుండాలి. సహజంగా రాక్షసు లందరూ కూటయుద్ధంచేసేవాళ్లే. శూరులూ, పరిశుద్ధహృదయులూ అయిన మీబలం ఋజుత్వం గలది. కనక, మీరు రాక్షసులను నమ్మగూడదు. ఇలాంటి యుక్తులతోనే వాళ్లు మిమ్మల్ని బాధిస్తారు." అని చెప్పి మళ్లీ రాముణ్ణి కౌగిలించుకుని "ఇక వెళ్లివస్తా" నని, మళ్లీ అందుకుని "రామా! నువ్వు ధర్మజ్ఞుడవు. శత్రువులను కూడా ప్రేమిస్తావు. నీకు నేను ఎలాగ స్నేహితుణ్ణయినానో అది యిప్పుడడగవద్దు. యుద్ధంలో కృతకృత్యుడవైన తరవాత అంతా నీకే తెలుస్తుంది. బాలురనూ వృద్ధులనూ మాత్రం మిగిల్చి నీబాణాలతో లంకను నాశనం చేసి రావణుణ్ణి సంహారించి నువ్వు సీతను పొందగలవు." అని చెప్పి రామలక్ష్మణులకు ప్రదక్షిణంచేసి ఆకాశాని

కెగిరి వెళ్లిపోయాడు. ఇలాగ పునరారోగ్యవంతులైన రామలక్ష్మణు లను చూసి వానరులు ఎగిరిగంతులువేశారు. సింహనాదాలు చేశారు. తోక లెగరవేశారు. భేరీలూ, మృదంగాలూ వాయించారు. శంఖా లూదారు. తొడలు చరచారు. భుజాస్ఫాలనంచేశారు. చెట్లు పీకి యుద్ధానికి సిద్ధపడ్డారు. పరవళ్లు తొక్కుతూ లంకాద్వారాలమీదికిన్నీ వెళ్లారు. వారి సింహనాదాలు, ఆఅర్థరాత్రిసమయాన, ఉరుముల్లాగ చాలా భయంకరంగా వున్నాయి.

## ౫౧

## రావణాజ్ఞతో ధూమ్రాక్షుడు యుద్ధానికి బయలుదేరడం

స్నిగ్ధగంభీరమైన ఆధ్వని రాక్షసులే కాక రావణుడు కూడా విన్నాడు. అప్పుడు రావణుడు మంత్రులను చూసి "మేఘాలురిమేటట్టు వాన రులు మహోత్సాహంతో సింహనాదాలు చేస్తున్నారు. వారి కేదో ఆనందం కలిగివుంటుంది, సందేహం లేదు. ఆధ్వనితో సముద్రం అంతా కలగిపోతోంది. ఆరామలక్ష్మణులు శరబద్ధులై వుండడమూ వానరులు సింహనాదాలు చెయ్యడమూ చూస్తే నాకేదో సందేహం కలుగుతోంది" అని పలికి భటులను చూసి "శోకించవలసిన సమ యంలో వానరు లానందధ్వానాలు చేస్తున్నారు, అదేమిటో త్వరగా చూసిరండి" అని చెప్పాడు. వాళ్ళు వెళ్ళి ప్రాకారాలెక్కి జరుగు తున్నదిచూసి తెల్లపోయి మెల్లిగా రావణుని దగ్గిరికి వెళ్ళి సంగతంతా జాగ్రత్తగా చెప్పారు. "శరముక్తులు కావడమే కాదు, రామలక్ష్మ ణులు మత్తేభాల్లాగ విజృంభిస్తున్నా" రని కూడా చెప్పారు.

అది విని రావణుడు తెల్లపోయి విషణ్ణవదనుడై "వరప్రభావంతో యింద్రజిత్తు వారిని ఘోరసర్పాలవంటి బాణాలతో కట్టేశాడు. నా

శత్రువులలాంటి బాణాలు కూడా విడిపించుకున్నారంటే యీ రాక్షస బలానికేదో చేటుమూడినట్టు తోస్తోంది. ఇంతవరకూ అనేక యుద్ధాలలో ఎందరో శత్రువులను నాశనం చేసిన వాసుకి సమానాలైన శరాలు వ్యర్థాలయిపోవడమా?" అంటూ మండిపడుతూ నిట్టూర్పులు విడిచి ధూమ్రాక్షుడనే సేనాధిపతిని పిలిచి "వీరాధివీరా! గొప్పబలంతో వెళ్ళి శత్రువులను జయించిరా" అని ఆజ్ఞాపించాడు. "చిత్తం" అని ధూమ్రాక్షుడు బయలుదేరాడు. అతని వెంట బయలుదేరిన రాక్షస సైనికులు ఆనవాలుకోసం గంటలుకట్టుకున్నారు. సహజంగానే వాళ్ళు ఘోరాకారులు. దానికి సాయం వికటంగా అరుస్తూ బయలుదేరారు. శూలాలూ, ముద్గరాలూ, గదలూ, పట్టిసాలూ, ముసలాలూ, పరిఘలూ, భిండివాలాలూ భల్లాలూ, ప్రాసలూ, పరశ్వధాలూ, మొదలైన రకరకాల ఆయుధాలు పుచ్చుకుని నడిచికొందరూ, రథాలెక్కికొందరూ, గాడిదలెక్కి కొందరూ, గుర్రాలెక్కి కొందరూ, మదగజాలెక్కి కొందరూ ఫుల్లుల్లాగ బయలుదేరారు. ధూమ్రాక్షుడు రథంయెక్కాడు. దానికి గాడిదలు కట్టారు. వాటిమొగాలు తోడేలు మొగాల్లాగా, సింహం మొగాల్లాగా వున్నాయి. ఆరథం నడిస్తే పెద్దచప్పుడవుతోంది.

ధూమ్రాక్షుడు హనుమంతుడున్న పశ్చిమద్వారానికి వెళ్ళాడు. వెడుతూ వుంటే వికృతాకారంగల ఘోరపక్షులు కొన్ని ఆకాశాన నిలిచి వాణ్ణి వారించాయి. రథశిఖరంమీద వొక పెద్దగద్ద వాలింది. శవాలు తినే రాంబందు జెండామీద వాలింది. నెత్తుటితో తడిసిన మొండెంవొకటి రథంముందు పడింది. మేఘాలు నెత్తురువాన కురిశాయి. భూమి గజగజలాడింది. గాలి యెదురు తిరిగింది. చీకట్లు కమ్మి దిక్కులు తెలియలేదు. ధూమ్రాక్షుడా దుర్నిమిత్తాలు చూసి బెంగ పెట్టుకున్నాడు. అయినా సాహసించి వెళ్ళి చంద్రోదయసమయాన వుప్పొంగే సముద్రంలా వున్న వానరసేన చూశాడు.

## ౫౨

## హనుమంతుడు ధూమ్రాక్షుణ్ణి చంపడం

ధూమ్రాక్షుని రాక చూసి వానరులు సింహనాదం చేశారు. వెంటనే ఘోరయుద్ధం ప్రారంభం అయింది. రాక్షసులు వివిధాయుధాలతో కొట్టగా వానరులు చెట్లతోనూ రాళ్ళతోనూ కొట్టారు. ప్రతీవానర వీరుడూ తన పేరు చెబుతూ రాక్షసులను చావబాదసాగాడు. కొందరు రాక్షసులు నెత్తురుకక్కుకుంటూ పడిపోయారు. కొందరు పిండిపిండి అయిపోయారు. కొందరు ముద్ద అయిపోయారు. కొందరు చెట్లకింద అణగిపోయారు. గుర్రాలు కూలాయి. ఏనుగులు పీనుగు లయాయి. రథాలు విరిగాయి. గాడిదలు పడిపోయాయి. వానరులు కొందరు రాక్షసులను గోళ్ళతో పీకారు. కొందరిని కరిచారు. కొందరిని చరిచారు. అది చూసి రాక్షసులు కొందరు విజృంభించారు. ధూమ్రాక్షుడు మరీ మండిపోయాడు. వాళ్లు ప్రాసలతో కొందరినీ శూలాలతో కొందరినీ, గదలతో కొందరినీ, ముసలాలతో కొందరినీ – యిలాగ రకరకాలుగా కొందరు వానరులను సంహరించారు. కొందరు వానరులు రెండేసిముక్కలయిపోయారు. కొందరి పేగులు బయటికి వచ్చాయి. కొందరు పారిపోయారు. సింహనాదాలు ప్రబలాయి. ఆయుధధ్వను లెగిశాయి. అల్లెతాడే తీగగా, ఎక్కిళ్ళే తాళాలుగా, మూలుగులే సంగీతంగా అప్పుడు యుద్ధగాంధర్వవిద్య చక్కగా రక్తికట్టింది.

అందరిలోనూ ధూమ్రాక్షు డెక్కువవానరులను సంహరించాడు. అది చూసి హనుమంతుడు క్రుద్ధుడై పెద్దబండరాయి యెత్తి రథం మీాద విసిరాడు. అది చూసి ధూమ్రాక్షుడు గభీమని రథం దిగి గద విసిరాడు; కాని యింతలో ఆబండరాయి రథం విరిచేసింది. ఆదెబ్బ తాళలేక గుర్రాలూ, సారథీ చచ్చిపోయారు. ఇంతలో హనుమంతుడు

మరికొందరు రాక్షసులను నాశనంచేసి మరో బండరాయి తెచ్చి మళ్ళీ ధూమ్రాక్షుని మీదపడ్డాడు. ధూమ్రాక్షుడు గదపుచ్చుకుని యెదురు తిరిగాడు. మళ్ళీ ఘోరయుద్ధం జరిగింది. ఇనపమేకులతో నిండివుండిన ఆగదను ధూమ్రాక్షుడు హనుమంతునిమీదికి విసిరేశాడు. హనుమంతుడది తప్పించుకుని పర్వతశిఖరం వొకటి తెచ్చి ధూమ్రాక్షునిమీద పడేశాడు. దానికిందపడి ధూమ్రాక్షుడు పచ్చడి అయిపోయాడు. అది చూసి అక్కడి రాక్షసు లందరూ దిక్కు తెలియకుండా పారిపోయారు. హనుమంతుడు బ్రహ్మాండం బద్దలయేటట్టు సింహనాదం చెయ్యగా, వానరు లత్యానందంతో అతని చుట్టూ చేరి పూజించారు.

## ४ 3

## వజ్రదంష్ట్రుడు అంగదునిమీదికి బయలుదేరడం

ధూమ్రాక్షుడు చచ్చిపోయా డనేటప్పటికి రావణుడు క్రోధమూర్ఛితుడయిపోయాడు. తోకతొక్కిన తాచులాగ బుసకొట్టాడు. పెద్ద నిట్టూర్పు విడిచాడు. చివరికి వజ్రదంష్ట్రు డనే సేనాధిపతిని పిలిచి "రాక్షసయోధులను వెంటబెట్టుకుని నువ్వు వెళ్లు. రాముణ్ణీ సుగ్రీవుణ్ణీ వానరులనూ సంహరించిరా" అని ఆజ్ఞాపించాడు. వజ్రదంష్ట్రుడు శూరుడు. గొప్పవీరుడున్నూ. మాయావి. "చిత్తం" అంటూ బయలుదేరాడు వాడు. చిత్రవిచిత్రాభరణా లలంకరించుకుని రత్నకిరీటం ధరించి బయలుదేరాడు. ఏనుగులూ, గుర్రాలూ, గాడిదలూ, లొట్టిపిట్టలూ, రథాలూ యెక్కి రాక్షసయోధు లనేకులు వెంటబయలుదేరారు. కాల్బంటులకు లెక్కేలేదు. అందరూ కర్రలూ, రోకళ్లూ, శూలాలూ, తోమరాలూ, భిండివాలాలూ, పాశాలూ, శక్తులూ, పట్టసాలూ, ఖడ్గాలూ, చక్రాలూ, గదలూ, పరశ్వథాలూ పుచ్చుకున్నారు. అందరూ రంగురంగుల బట్టలు కట్టు

కున్నారు. అందరూ అగ్నుల్లాగ వెలుగుతున్నారు. గొప్పగొప్ప రాక్షసయోధులు తోమరాలూ, అంకుశాలూ మొదలైన ఆయుధాలు పుచ్చుకుని ఏనుగులెక్కి వెడుతూవుంటే పర్వతాలు నడుస్తున్నట్టుంది. ఆరాక్షసబలం అంతా సింహనాదాలు చేసుకుంటూ వెడుతూవుంటే ఉరుముతూ మెరుస్తూ నల్లని మేఘాలు నడుస్తున్నట్టుంది.

వాళ్లందరినీ వెంటబెట్టుకుని వజ్రదంష్ట్రుడు దక్షిణద్వారంలోనుంచి అంగదునిమీదికి వెళ్లాడు. ఆదిలో బయలుదేరాటప్పటికే వాడికెన్నో దుర్నిమిత్తాలు కనపడ్డాయి. మేఘాలు లేని ఆకాశంనుంచి భగభగ మండుతూ ఉల్కలు పడ్డాయి. నక్కలు అమంగళకరంగా కూశాయి. అనేకజాతుల క్రూరమృగాలు రాక్షసుల చావు సూచిస్తూ వికటంగా అరిచాయి. అది గుర్తించి అనేకులు నిరాశతో నేలమీదకూలబడ్డారు; కాని వజ్రదంష్ట్రుడు మాత్రం అవేమీ లక్ష్యపెట్టక ధైర్యంతో రణోత్సుకుడై ముందుకి నడిచాడు.

వాళ్ల రాక చూసి వానరులు దిక్కులుపిక్కటిల్లేటట్టు సింహనాదాలు చేశారు. వెంటనే రాక్షసులకూ వానరులకూ సంకుల సమరం ప్రారంభం అయింది. అనేకు లటూ ఇటూ కూడా శరీరాలు తెగిపోయీ, తల లెగిరిపోయీ రక్తంకారుతూ పడిపోసాగారు. కొందరు ఒక్కొక్కనినే యెదిరించి పోరసాగారు. చెట్లూ, రాళ్లూ, శస్త్రాలూ వాడుతూవుంటే యుద్ధరంగం అంతటా భయంకరమైన శబ్దం బయలుదేరింది. రథనేమిధ్వనీ, ధనుష్టంకారాలూ, శంఖభేరీ భాంకారాలూ కలిసి అది మరింత దారుణం అయిపోయింది. వానరులు అరిచేతులతో చరిచి కొందరినీ, కాళ్లతో తన్ని కొందరినీ, పిడికిళ్లతో పొడిచి కొందరినీ, మోకాళ్లతోనూ, మోచేతులతోనూ కుమ్మికొందరినీ, ఒరికి కొందరినీ, కొరికి కొందరినీ, రాళ్లతో కొట్టికొందరినీ, చెట్లతో మకిరికొందరినీ రాక్షసులను ఘోరంగా సంహరించారు.

అది చూసి వజ్రదంష్ట్రుడు పాశహస్తుడైన యముడు లాగ శత్రు సంహారం ప్రారంభించాడు. రాక్షసయోధులు కూడా క్రోధమూర్ఛితులై రకరకాల ఆయుధాలతో వానరులను సంహరించారు. అది చూసి వాలిపుత్రుడైన అంగదుడు దావానలం అయిపోయాడు. దాంతో అతను చెట్లు పుచ్చుకుని సింహం క్షుద్రమృగాలను సంహరించేటట్టు రాక్షసులను దులిపి దులిపి చంపసాగాడు. అతనిమీదికి వెళ్ళిన రాక్షసులందరూ తల లెగిరిపోయి తాడిచెట్లలాగ కూలసాగారు. విరిగిపోయిన రథాలతోనూ, తెగిపోయిన వానర రాక్షసుల శరీరాలతోనూ, కూలిపోయిన గుర్రాలతోనూ, గాడిదలతోనూ, ఏనుగులతోనూ, లొట్టిపిట్టలతోనూ యుద్ధభూమి నిండిపోయింది. హారాలతోనూ, కేయూరాలతోనూ రంగురంగుల వస్త్రాలతోనూ శస్త్రాలతోనూ నిండి నక్షత్రాలతో నిండివుండిన శరదాత్రిలాగ కూడా వుంది. సుడిగాలి వీస్తే మేఘాలెగిరి తూలిపడేటట్టు అంగదుని డాక తాగలేక రాక్షసులు వొణికిపోయారు.

## ౫౪
## అంగదుడు వజ్రదంష్ట్రుణ్ణి సంహరించడం

రాక్షసులు ఇలా అయిపోడం — అంగదుడు జయించడం — యివి చూసి సహించలేక వజ్రదంష్ట్రుడు ధనుస్సు పుచ్చుకుని వానరసైన్యం మీద శరవర్షం కురిశాడు. రాక్షసయోధులున్నూ అనేకమంది రథాలమీద బయలుదేరి నానారకాల ఆయుధాలతోనూ వానరులను కొట్టసాగారు. అందుకు రోషపడి వానరులు రాళ్ళూ రప్పలూ పుచ్చుకుని కలిసి తిరగబడ్డారు. రాక్షసులు రకరకాల ఆయుధాలు వేలకొద్దీ వానరులమీద విసిరారు. వానరులు పెద్దాచిన్నా అని చూడకుండా చెట్లూ, బండరాళ్లూ, పర్వతాలూ రాక్షసులమీద విశిరేశారు. ఇటు రాక్షసులూ, అటు వానరులుకూడా వెనకతియ్యకపోడంవల్ల

యుద్ధం ఘోరం అయిపోయింది. ఇటూ అటూ కూడా కొందరి తల లెగిరిపోయాయి. కొందరి చేతులు తెగిపోయాయి. కొందరి డొక్కలు చిరిగిపోయాయి. కొందరి కాళ్ళు ఎగిరిపోయాయి. వాళ్ళందరూ యుద్ధభూమిలో పడిపోయి రక్తంలో తేలిపోసాగారు. అక్కడ కాకులూ గద్దలూ రాబందులూ నక్కలూ స్వేచ్ఛగా తిరగసాగాయి.

ఉన్నట్టుండగా ఉప్పెనలాగ యెగిసి వానరసైన్యం రాక్షసులను ముంచేసింది. అది చూసి వజ్రదంష్ట్రుడు రోషతామ్రాక్షుడై వానరుల మీాద మళ్ళీ శరవర్షం కురిశాడు. ఒక్కొక్క బాణంతో వాడు అయిదుగురినీ, ఆరుగురినీ, ఏడుగురినీ, ఎనిమండుగురినీ, తొమ్మండుగురినీ కూడా వానరులను సంహరించసాగాడు. ఆవుద్ధతి భరించలేక వానరులు అంగదుని దగ్గిరికి పారిపోయారు. అది చూసి అంగదుడు వజ్రదంష్ట్రునిమీాద పడ్డాడు. వెంటనే అంగదుడూ వజ్రదంష్ట్రుడూ సింహాల్లాగా ఏనుగుల్లాగా ద్వంద్వయుద్ధం ప్రారంభించారు. తోమరాలతో యేనుగును కొట్టేటట్టు వజ్రదంష్ట్రుడు వేలకొద్దీ బాణాలతో అంగదుణ్ణి మర్మస్థలాల్లో కొట్టాడు. శరీరం అంతటా రక్తం కారుతుండగా అంగదుడు వజ్రదంష్ట్రునిమీాద వొక పెద్ద చెట్టు విసిరాడు. వజ్రదంష్ట్రుడు దాన్ని ముక్కముక్కలుగా కొట్టెయ్యగా అంగదుడు ఒక పర్వతం విసిరాడు. అది చూసి వజ్రదంష్ట్రుడు గదాపాణి అయి రథం విడిచి కిందికి దిగాడు. ఒక్క అంగలో ముందుకు వెళ్ళి అంగదు డాగద వృక్షాక్కన్నాడు. ఇంతలో ఆపర్వతంపడి వజ్రదంష్ట్రుని రథం గుర్రాలతో కూడా పచ్చడి అయిపోయింది. అంగదుడు మళ్ళీ మరొకపర్వతం ఎత్తి వజ్రదంష్ట్రునిమీాద విసిరాడు. దాంతో వజ్రదంష్ట్రుడు నేలమీాద పడి మూర్ఛపోయాడు.

కాని ఒక్కక్షణంలో తేరుకుని వాడు మరో గద పుచ్చుకుని అంగదుణ్ణి వక్షస్థలంమీాద కొట్టాడు. అయినా లాభంలేకపోగా గద పార

వేసి వజ్రదంష్ట్రుడు ముష్టియుద్ధానికి సిద్ధపడ్డాడు. ఇద్దరూ సమానంగా కొట్టుకున్నారు. ఇద్దరికీ రక్తాలు కారాయి. అయినా అంగారకబుధు ల్లాగా వాళ్ళు పోరుతూనే వున్నారు. కొంతసేపయాక అంగదుడు అతి లాఘవంగా తప్పించుకుని వొక పెద్దచెట్టు పెరికి వానిమీద పడేశాడు. వజ్రదంష్ట్రుడూ ఒకచెట్టు విసిరాడు. అంగదుడు కత్తీ డాలూ పుచ్చు కోగా, వజ్రదంష్ట్రుడున్నూ కత్తీ డాలూ తీశాడు. జయకాంక్షులై మళ్ళీ యిద్దరూ సమంగా పోరారు. ఇద్దరికీ గాయాలు తగిలాయి. ఇద్దరూ పూసిన మోదుగుచెట్లు అయిపోయారు. కొంతసేపటికి అలసట వచ్చి ఇద్దరూ మోకాళ్ళమీద కూచున్నారు; కాని క్షణంలో అంగ దుడు లేచి తోకతొక్కిన తాచులాగ మండిపడుతూ ఖడ్గంతో వజ్ర దంష్ట్రుని తల నరికేశాడు. అది చూసి రాక్షసులు లంకలోకి పరు గెత్తారు. వానరలు వాళ్ళని తరిమి తరిమి కొట్టి అంగదుణ్ణి చుట్టుకుని హర్షధ్వానాలు చేశారు.

## ౫౫

## రావణుడు వానరులమీదికి అకంపనుణ్ణి పంపడం

వజ్రదంష్ట్రుడు హతుడైపోయా డని విని రావణుడు “ఇప్పు డకంపనుణ్ణి వెళ్ళమను. భీమవిక్రములైన రాక్షసుల నతనితో పంపు. అకంపనుడు గొప్పయోధుడు. శత్రువులను సంహరించగలడు. తన సేననూ రక్షించు కోగలడు. ఐశ్వర్యం సంపాదించా లని ఆశపడుతున్నాడు. నాశ్రేయస్సు కోరేవాళ్ళలో అతను ముఖ్యుడు. యుద్ధం అంటే అతనికి చాలా సంబరం కూడాను. అతను రామలక్ష్మణులనూ, సుగ్రీవుణ్ణీ, తక్కిన వాన రులనూ జయించగలడు” అని సేనాధిపతికి ఆజ్ఞాపించాడు. సేనాధిపతి సర్వమూ సిద్ధంచెయ్యగా అకంపనుడు బయలుదేరాడు.

అకంపనుడు మేఘుంఅంత వుంటాడు. మేఘుంలాగ నల్లగావుంటాడు. మేఘుం ఉరిమినట్టున్నూ ఉరుముతాడు. వాణ్ణి దేవతలు కూడా కదప లేరు. వాడు మకరకుండలాలు ధరించి రథం యెక్కి బయలుదేరాడు; కాని వెడుతూ వెడుతూ వుండగా వాడి గుర్రాలు అకస్మాత్తుగా దీనంగా అయిపోయాయి. వాడి యెడమకన్ను అదిరింది. మొగం తెల్ల బారింది. కంఠం గద్గదికం అయిపోయింది. అంతవరకూ సుదినంగా వున్నది దుర్దినం అయిపోయింది. పక్షులూ మృగాలూ వికటంగా కూశాయి; కాని సింహస్కంధుడూ, శార్దూలపరాక్రముడూ అయిన అకంపనుడు ఆదుర్నిమిత్తాలు లక్ష్యపెట్టకుండా యుద్ధరంగానికి వెళ్లి పోయాడు.

వాళ్ళ ధ్వని విని వానరులు ఉలిక్కిపడి చెట్లూ చేమలూ రాళ్ళూ రప్పలూ పుచ్చుకుని సిద్ధపడ్డారు. క్షణంలో ఉభయపక్షాలూ కలపటం అయిపోయాయి. వానరులూ రాక్షసులూ కూడా అతిబలవంతులే. అందరూ శూరులే. అందరూ పర్వతాల్లాంటివాళ్ళే. ఇక భేదం యేమి టంటే? రాక్షసులు రావణుని కోసమూ, వానరులు రామునికోసమూ ప్రాణాలకు తెగించివున్నారు. వాళ్లూ వీళ్ళూ చేసిన సింహనాదాలతో భూనభోంతరాళాలు దద్దిరిల్లిపోయాయి. వాళ్ళూ వీళ్లూ తొక్కిన పర వళ్ళతో ఎర్రని దుమ్ము రేగింది. దాంతో ఒకరి కొకరు కనపడలేదు. జెండాలు కనపడలేదు. గుర్రాలు కనపడలేదు. ఏనుగులూ రథాలూ కూడా కనపడలేదు. కత్తులూ కఠారులూ కనపడలేదు. ధ్వని వొక్కటే వినపడుతోంది. వానరులు వానరులను కూడా సంహ రించారు. రాక్షసులు రాక్షసులను కూడా సంహరించారు. కొంత సేపటికి యుద్ధరంగంలో రక్తం వరదలయి పారింది. దాంతో దుమ్ము అణగిపోయింది. కత్తులతోనూ గదలతోనూ ముసలతోమరాదుల తోనూ చెట్లతోనూ శిలలతోనూ రాక్షసులూ వానరులూ చితక్కొ

ట్టుకున్నారు. వానరులు రాక్షసులను సంహరించారు. రాక్షసులు వానరులను నేలగూల్చారు. అకంపనుడు మిక్కిలీ క్రుద్ధుడై ముందుకి వచ్చి రాక్షసులను రెచ్చగొట్టాడు. ఈలోపున కుముదుడూ, నళుడూ, మైందుడూ ద్వివిదుడూ మొదలైన వానరవీరులు వచ్చి సింహనాదాలు చేశారు. వారిని చూసి వానరులు మహోత్సాహభరితులై రాక్షసుల మీద విరుచుకుపడ్డారు.

## ౫౬

## హనుమంతుడు అకంపనుణ్ణి సంహరించడం

వానరుల ఔద్ధత్యం చూసి అకంపనుడు మిక్కిలీ రుష్టుడై గొప్ప ధనుస్సుచేతబుచ్చుకుని "చూడూ, వానరులు చాలామంది రాక్షసులను సంహరిస్తున్నారే, రథం అక్కడికి తీసుకుపద. ఆవానరు లందరూ ఏనుగుల్లాగా పర్వతాల్లాగా వున్నారు. రాళ్ళూ రప్పలూ పుచ్చుకుని చాలా బలవంతు లయివున్నారు. వాళ్ళు రాక్షసుల నందరినీ రూపుమాపేటట్టున్నారు ; కనక, నేను వారిని సంహరించాలి" అని సారథిని తొందరపెట్టాడు. సారథి రథం అక్కడికి తీసుకువెళ్ళాడు. వెంటనే అకంపనుడు శరవర్షంతో ముంచెత్తి వానరులను నాశనంచెయ్యసాగాడు. ఆధాటి కాగలేక వానరులు వెనక్కిమళ్ళారు. హనుమంతు డది చూశాడు. వెంటనే అతను అకంపనునిమీాది కురికాడు. దాంతో ధైర్యసాహసాలు వచ్చి వానరు లతని వెంట మళ్ళీ ముందు కురికారు.

అకంపనుడు పర్వతంమీాద మహేంద్రుడు వాన కురిసేటట్టు హనుమంతునిమీాద బాణప్రయోగంచేశాడు ; గాని హనుమంతు డవేమీా లెక్కచెయ్యలేదు. వేంటనే భూమి అదిరేటట్టు అడుగులు వేసుకుంటూ అకంపనునిమీాదికి బయలుదేరాడు. అప్పుడు అతను మధ్యందిన మార్తాండ బింబంలాగ దుర్నిరీక్ష్యు డయివున్నాడు. అయితే, తనచేతిలో

ఏదీ ఆయుధం లేదని అప్పటికి గుర్తించి అత నొక పర్వతం పెకలించి పరవళ్ళు తొక్కుతూ సింహనాదంచేస్తూ గిరగిర తిప్పుతూ ముందికి నడిచాడు; కాని దూరంనుంచి అర్థచంద్రబాణాలు వేసి అకంపనుడు దాన్ని పిండిచేసేశాడు. చేతనున్న ఆయుధం అలాగ భగ్నంకాగా హనుమంతుడు క్రోధమూర్ఛితుడై అశ్వకర్ణం అనే చెట్టు పెరికి గిరగిర తిప్పాడు. అతని ఊరువేగంతో అనేకవృక్షాలు కూలిపోయాయి. పాదతాడనంతో భూమి గజగజ లాడిపోయింది. ఆచెట్టుతో హనుమంతుడు యోధులతోకూడా యేనుగులనూ రథికులతోకూడా రథాలనూ పెక్కింటినీ, అనేకమందిపదాతులనూ సంహరించాడు. ప్రళయ కాలరుద్రుడులా వున్న హనుమంతుణ్ణి చూడలేకే రాక్షసు లనేకులు పారిపోయారు.

అకంపను డది చూశాడు. వెంటనే హనుమంతుణ్ణి పధ్నాలుగు బాణాలతో కొట్టాడు. ఆ బాణాలతో హనుమంతుడు చెట్లతో నిండిన పర్వతంలాగా, ఆ గాయాలతోనూ రక్తంతోనూ పొగలేని అగ్నిలాగా వున్నాడు. దాంతో మండిపడి అతను మరోవృక్షం పెరికి అకంపనుని నెత్తి అణిచాడు. నిమిషంలో అకంపనుడు పచ్చడి అయిపోయాడు. అది చూసి రాక్షసవీరులు భూకంపంలో చెట్లలాగ పడిపోయారు. ఆయుధాలు విడిచిపెట్టి, జుట్టువిడిపోడమూ, బట్ట లూడిపోతూ వుండడమూ కూడా తెలియకుండా చెమటలు కార్చుకుంటూ, తమలో తామే గెంటుకుంటూ, తోసుకుంటూ, తిట్టుకుంటూ. లంక లోకి పారిపోయారు. వెనక్కితిరిగి తిరిగి చూస్తూ యెగిరిపోయారు.

అప్పుడు వానరులు హనుమంతుణ్ణి చుట్టుముట్టారు. పొగిడారు. మొక్కారు. పూజించారు. హనుమంతుడున్నూ వారిని యథోచితంగా సత్కరించాడు. వానరులు, హనుమంతుడు అకంపనుణ్ణి చంపిన సంగతి తమవాళ్ల కందరికీ తెలియడానికి గొంతెత్తి అరిచారు.

అది విని పెద్దపెద్ద రాక్షసయోధులే అదిరిపడ్డారు. ఆకాశాన వున్న దేవతలందరూ హనుమంతుణ్ణి పూజించారు. ఇక్కడ రాముడూ, లక్ష్మణుడూ, సుగ్రీవుడూ, తక్కిన వానరముఖ్యులూ, విభీషణుడూ అతన్ని మిక్కిలీ ఆదరించారు.

## ౫౭

## రావణాజ్ఞతో ప్రహస్తుడు యుద్ధానికి బయలుదేరడం

అకంపనుడు చచ్చిపోయాడన్న వార్త విని రావణుడు ముందు మండి పడ్డాడు; గాని తరవాత మొగం వేలవేసుకుని మంత్రులను చూసి, క్షణకాలం ధ్యానించి, ఆలోచన సాగించి పట్నం చూడ్డానికి పొద్దున్నే బయలుదేరాడు. పట్నం అంతా చాలా కట్టుదిట్టంగా వుంది. ఎక్కడ ఏర్పరిచిన రక్షణ లక్కడ భద్రంగా వున్నాయి. రాక్షసయోధు లందరూ చాలా మెళుకువగా వున్నారు. అందు కానందించి రావణుడు సభాస్థలికి వచ్చి అమర్షితుడై ప్రహస్తునితో "శత్రువులు ఆకస్మికంగా వచ్చి కోట ముట్టడించినప్పుడు యుద్ధం చెయ్యడం తప్ప మరొక మోక్షోపాయం కనపడదు. ఇలాంటప్పుడు నేనో, కుంభకర్ణుడో, సేనాధిపతి వైన నువ్వో, ఇంద్రజిత్తో, నికుం భుడో తప్ప మరెవళ్లూ ఈభారం వహించలేరు. కనక, నువ్వు తగి నంత బలగం వెంటబెట్టుకుని యుద్ధానికి వెళ్లు. నువ్వు బయలుదేరడమూ, నిన్ను చూసి రాక్షసులు సింహనాదాలు చెయ్యడమూ చూసిం దంటే చపలస్వభావంగల వానరసేన పారిపోతుంది. వానరులు సహ జంగా చపలులు. వాళ్లు శిక్షణ యెరగరు. స్థిరచిత్తులు కూడా కారు. అంచేత, సింహం రంకెవేస్తే యేనుగులు పారిపోయేటట్టు నువ్వు పెడ బొబ్బ పెట్టావంటే వాళ్లు చెట్టుకొక పిట్టగా యెగిరిపోతారు. వాన

రులు పారిపోతే రాముడూ, లక్ష్మణుడూ అసహాయు లయిపోయి నీకు సులభంగా దొరికిపోతారు. యుద్ధంచెయ్యకపోతే మనకి విపత్తు తప్పదు. యుద్ధంచేస్తే జయం లభించవచ్చు. అయితే, యిప్పుడు నీవుద్దేశం యేమిటి? నువ్వు నాకు అనుకూలంగా చెప్పినా సంతోషమే, ప్రతికూలంగా చెప్పినా సంతోషమే, యేదో వొకటి నిస్సంశయంగా చెప్పు." అన్నాడు.

దానిమీద ప్రహస్తుడు, బృహస్పతి ఇంద్రునకు చెప్పేటట్టు "మహారాజా! ఇదంతా మనం నీతివిశారదులైన మంత్రులతో యిదివరకే ఆలోచించి నిశ్చయించుకున్నాం. దీనిని గురించి మాలో మాకు భిన్నాభిప్రాయా లేర్పడి వివాదలు కూడా కలిగాయి. సీత నిచ్చెయ్యడమే శ్రేయస్కరం అని నేను గట్టిగా చెప్పాను. ఇప్పుడూ, యుద్ధం చెయ్యవలసిందే అని కూడా దృఢంగా చెప్పాను. నువ్వు నాకనేక సమ్మానాలు చేశావు. సకలవాంఛలూ తీర్చావు. అడిగిందల్లా యిచ్చావు. అనేకవిధాల గౌరవించావు. ఇప్పుడు సమయం వచ్చింది. ఇక నావూహాలతోనూ వుద్దేశాలతోనూ, నిశ్చయాలతోనూ పనిలేదు. నీకు ఏదియిష్టమో అదే నేను చేస్తాను. నీకంటే నాకు నాప్రాణా లెక్కువ కాదు. నీశ్రేయస్సు కంటే నాకు నాభార్య బిడ్డలూ ఐశ్వర్యమూ ఎక్కువ కాదు. ఇదిగో, నీకోసం నాప్రాణాలయినా యిచ్చేస్తాను, చూసుకో." అని రావణునకు విన్నవించి బలాధ్యక్షులను చూసి "నాకు సాయంగా గొప్ప రాక్షసబలం కూర్చి తీసుకురండి. నాచేతిలో చచ్చిన వానరులను భక్షించి గద్దలు మొదలైన పక్షులు తృప్తిపొందాలి." అని చెప్పాడు.

వెంటనే నానావిధాయుధాలతోనూ గొప్పసేన కూర్చి తెచ్చారు. ఆసేనలోని యోధు లనేకులు హోమాదికంచేసి అగ్నిహోత్రుణ్ణి తృప్తిపరిచివచ్చారు. అనేకులు బ్రాహ్మణులకు సమస్కరించి ఆశీర్వచ

నాలు పోసుకొచ్చారు. రకరకాల పూలదండలు వేసుకుని కొందరు వచ్చారు. శాస్త్రంగానూ కవచాలు తొడుక్కొని ధనుస్సులు చేతబట్టుకుని రావణునకు నమస్కారాలు చేసి ప్రహస్తుని చుట్టూమూగారు. వెంటనే ప్రహస్తుడు రావణుని ఆజ్ఞ అందుకుని, భయంకరమైన ఢంకా మీాద దెబ్బకొట్టించి, చక్కని రథం యెక్కాడు. దానికి పూన్చిన గుర్రాలు చాలా గొప్పవి. సారథి చాలా సమర్థుడు. అది చంద్ర బింబంలాగా, సూర్యబింబంలాగా మెరిసిపోతోంది. అది బయలు దేరితే మేఘా లురుముతున్నట్టు గొప్ప ధ్వని బయలుదేరింది. దాని మీాద సర్పధ్వజం రెపరెపలాడుతోంది. దాని కప్పూ చక్రాలూ చాలా గట్టివి.

రథం బయలుదేరగానే దుందుభులు మోగాయి. శంఖా లురిమాయి. రాక్షసులు సింహనాదాలు చేశారు. ఆధ్వనితో దిక్కులు పిక్కటిల్లాయి. ప్రహస్తుని వెంట బయలుదేరిన రాక్షసులు చాలాసమర్థులు. వాళ్ళని చూస్తేనే భయంపట్టుకుంటుంది. నరాంతకుడూ, కుంభహనుడూ, మహానాదుడూ, సమున్నతుడూ-అని ప్రహస్తుని మంత్రులు నలుగురు. వాళ్లున్నూ ప్రహస్తుని వెంట బయలుదేరారు. వారినందరినీ వెంటబెట్టుకుని ప్రహస్తుడు తూర్పుద్వారం దాటి యుద్ధరంగంలోకి వచ్చాడు.

ఆప్రహస్తుడూ, అతని సైనికులూచేసిన సింహనాదాలు విని లంకలో వున్నవారందరూ భయభ్రాంతులై వికృతంగా అరిచారు. మేఘశూన్యం [illegible] న అకాశం అంతా నిండిపోయి మాంసభుక్కులైన పక్షులు ప్రహస్తుని రథంమీాద అపసవ్యంగా తిరిగాయి. నక్కలు నోట నిప్పులు కక్కుతూ అమంగళంగా అరిచాయి. ఆకాశంనించి ఉల్కలు రాలాయి. గాలి పెడసరంగా వీచింది. గ్రహాలు తేజోహీనా లయినాయి. మేఘాలు పరుషంగా ఉరిమాయి. రక్తంకూడా

రథంమీద కురిశాయి. ప్రహస్తుని జెండా మీద దక్షిణముఖంగా వొక పెద్దగద్ద యెక్కి కూచుంది. అదిచూసి ప్రహస్తుడు తెల్లపోయాడు. సారథిచేతిలో వున్న కొరడా మాటి మాటికీ కిందపడిపోసాగింది. బయలుదేరాటప్పుడు ప్రహస్తుడు అష్టవసువులకుగూడా దుర్లభమైన తేజస్సుతో ప్రకాశించాడు. తీరా యుద్ధ భూమిలో అడుగు పెట్టా టప్పటికి ఆతని తేజస్సంతా సన్నగిల్లిపోయింది. గుర్రాలు తొట్రు పడ్డాయి.

ప్రఖ్యాతబలపౌరుషాలు గల ప్రహస్తుడు రావడంచూసి వానర సేన రకరకాల ఆయుధాలు పుచ్చుకుని సిద్ధపడింది. వారి సింహనా దాలు మిన్నుముట్టాయి. ఉభయసైన్యాలూ తారసిల్లాయి. వారూ వీరూ "రారా, అంటే నుంచోరా" అంటూ జబ్బలు చరిచారు. తర వాత ప్రహస్తుడు బుద్ధిహీనుడై విజయం కోసం అగ్గిలోపడే మిడతలాగ వానరసైన్యంమీద పడ్డాడు.

## ౫౨

## నీలుడు ప్రహస్తుణ్ణి సంహరించడం

భీమపరాక్రముడై వస్తున్న ప్రహస్తుణ్ణి చూసి రాముడు "ఎవడీ మహా కాయుడు? గొప్పవీరుడులాగానే కనపడుతున్నాడే?" అని విభీషణు ణ్ణడిగాడు. దానికి విభీషణుడు "వాడు రావణుని సేనాధిపతి. పేరు ప్రహస్తుడు. లంకలోవున్న రావణుని సైన్యంలో మూడువంతులు వాని స్వాధీనంలో వుంటుంది. నిజానికి వాడు గొప్పవీరుడు. శస్త్రాస్త్రవేది. మహాశూరుడు ప్రఖ్యాత బలపరాక్రముడు" అని వివరంగా చెప్పాడు.

ఇంతలో ప్రహస్తుణ్ణీ, వాడి సైనికులనూ చూసి వానరవీరులు సింహ నాదాలు చేశారు. రాక్షసుల చేతుల్లో వున్న ఖడ్గాలూ, శక్తులూ, యష్టులూ, బాణాలూ, శూలాలూ, ముసలాలూ, గదలూ, పరిఘలూ,

ప్రాసలూ, పరశ్వధాలూ, ధనుస్సులూ మిలమిలా మెరిశాయి. వానరులు విరగపూసిన చెట్లూ, బండరాళ్ళూ పుచ్చుకుని యెదురు నడిచారు. ఇరు వాగులూ కలపటం అయినాయి. రాళ్ళవర్షమూ, శరవర్షమూ దారుణం అయిపోయాయి. రాక్షసు లనేక వానరవీరులను కూల్చారు. వానరుల నేక రాక్షసయోధులను సంహరించారు. రాక్షసులు వానరులలో కొందరిని శూలాలతో పొడిచారు కొందరిని చక్రాలతో నరికారు. కొందరిని గొడ్డళ్ళతో కొట్టారు. కొందరిని పరిఘలతో బాదారు. కొందరికి ఊపిరి ఆగిపోయింది. కొందరు చాపకట్టుగా పడిపోయారు. కొందరి గుండెలు పైకి వచ్చాయి. కొందరు రెండు ముక్క లయిపోయారు. కొందరి డొక్కలు చిరిగిపోయాయి. దీనికి బదులు వానరులు రాక్షసులను చెట్లతో బాదీ, రాళ్ళతో కొట్టీ పచ్చడిచేసేశారు. కొందరిని అరిచేతులతో చరిచి పడగొట్టారు. కొందరిని కాళ్ళతో కుమ్మి ముద్ద చేసేశారు. కొందరిని గుద్ది రక్తం కక్కుకుని చచ్చేటట్టు చేశారు. రాక్షసుల లోనూ, వానరులలోనూ కూడా యేడ్పులూ సింహనాదాలూ రేగి భూనభోంతరాళాలు దద్దిరిల్లిపోయాయి. వానరులూ రాక్షసులూ కూడా నిర్భయంగా యుద్ధం చేశారు.

ప్రహస్తుని మంత్రులైన నరాంతకుడూ, కుంభహనుడూ, మహానాదుడూ, సమున్నతుడూ వానరవీరులను చాలామందిని సంహరించారు. అది చూసి సహించలేక ద్వివిదుడు పర్వతశిఖరంతో కొట్టి నరాంతకుణ్ణి చంపేశాడు. దుర్ముఖుడు పెద్దచెట్టుతో బాది సమున్నతుణ్ణి కూల్చేశాడు. జాంబవంతుడు పెద్దబండరాయి పుచ్చుకుని మహానాదుణ్ణి గుండెలు పగలగొట్టి చంపాడు. తారుడు పెద్దచెట్టొకటి పెరికి దాంతో గొడ్డును బాదినట్టు బాది కుంభహనుణ్ణి మట్టిలో కలిపాడు. అది చూసి మిక్కిలీ కృద్ధుడై ప్రహస్తుడు రథంమీద నిలిచి శరవర్షం కురిసి యెంతోమంది వానరులను సంహరించాడు.

ఉభయసేనల్లోనూ ప్రళయకాలంలో సముద్రాలు సుడితిరిగితే కలిగే ధ్వని పుట్టింది. వానరుల కళేబరాలతోనూ రాక్షసుల కళేబరాలతోనూ యుద్ధభూమి అంతా కూలిపోయిన పర్వతాలతో నిండినట్లయిపోయింది. వసంతకాలంలో విరగబూసిన మోదుగు చెట్లతో నిండిన అడవిలాగ ఆయుద్ధభూమి రక్తమయం కూడా అయిపోయింది.

యుద్ధభూమి అప్పు డొక మహానదిలా వుంది. వీరుల కళేబరాలే దానికి గట్లు. విరిగిన ఆయుధాలే గట్లమీది వృక్షాలు. రక్తమే జలం. యముడే అది సంగమించే సముద్రం. యకృత్తులూ ప్లీహాలూ బురద. పేగులే నాచు. శిరస్సులే చేపలు. అంగాలూ అవయవాలే పచ్చికపట్లు. గద్దలే హంసలు. కాకులే సారసపక్షులు. క్రొవ్వే నురగలు. ఏడ్పులే తరంగధ్వనులు. అది పిరికివాళ్లు దాటలేరు. వానరులూ రాక్షసులూ దాన్ని అతిసుళువుగా దాటసాగారు.

అప్పుడు ప్రహస్తుణ్ణి నీలుడు చూశాడు. ఆకాశాన మహావాయువు మేఘాల మీద విరుచుకుపడేటట్టు ప్రహస్తుడు నీలునిమీద విరుచుకుపడ్డాడు. ఉరికి బాణవర్షం కురిశాడు. ఆబాణాలు నీలుని శరీరం దూసుకుపోయాయి. నీలుడు మండిపడి పెద్దచెట్టొకటి పెరికి ప్రహస్తుణ్ణి దాంతో కొట్టాడు. ఆదెబ్బతినిన్నీ ప్రహస్తుడు మళ్లీ బాణవర్షం కురిశాడు. అవి మీద పడుతూవుంటే లక్ష్యం చెయ్యకుండా నీలుడు కళ్లు మూసుకునుంచున్నాడు. అది గొప్ప వానలో ఆంబోతు కళ్లు మూసుకుని నిశ్చలంగా నుంచుని వున్నట్టుంది. కొంతసేపటికి నీలుడు మళ్లీ వొకచెట్టుపెరికి దాంతో ప్రహస్తుని రథం గుర్రాలను చంపాడు. ప్రహస్తుని చేతిలో వున్న ధనుస్సు వుళాక్కుని విరిచి పారేశాడు. దానిమీద ప్రహస్తుడు రోకలిపుచ్చుకుని బయలుదేరాడు. అప్పుడిద్దరూ మదపుటేనుగుల్లాగ కలియబడ్డారు. ఒకళ్లు నొకళ్లు పళ్లతో

కరుచుకున్నారు. గోళ్లతో రక్కుకున్నారు. అరిచేతులతో చరుచుకున్నారు. చూసిచూసి ప్రహస్తుడు రోకలిపుచ్చుకుని నీలుని లలాటం బద్దలుకొట్టాడు. రక్తం కారుతూ వుండినా నీలు డొక చెట్టుపెరికి ప్రహస్తుని వక్షస్థలంమీద కొట్టాడు. ప్రహస్తుడు రోకలిపుచ్చుకుని మళ్లీ నీలునిమీది కురికాడు. అది చూసి నీలు డొక బండరాతితో ప్రహస్తుని శిరస్సు బద్దలుకొట్టాడు. దాంతో మొదలు నరికిన చెట్టులాగ ప్రహస్తుడు చచ్చి నేలమీద పడిపోయాడు. వాడి తలలోనుంచి రక్తం వరదలు కట్టింది.

ప్రహస్తుడు నీలునిచేతిలో చచ్చిపోవడం చూసి రాక్షసబలం లంకలోకి పారిపోయింది. ఆరాక్షససేన అప్పుడు కట్టతెగిపోయిన ప్రవాహంలాగ వుంది. లంకలో ప్రవేశించి వాళ్లు మూగివాళ్లయిపోయారు. నోరు విప్పలేకపోయారు. రాముడూ లక్ష్మణుడూ, వానరులూ నీలుణ్ణి మిక్కిలీ గౌరవించారు.

## ౫౬

## రామరావణుల మొదటియుద్ధం

ఇలాగ ప్రహస్తుడు చచ్చిపోగా, భయభ్రాంతం అయిపోయి రాక్షససైన్యం లంకలోకి పారిపోయింది. ఈవార్త విని రావణుడు మిక్కిలీ శోకించి, అంతలో మళ్ళీ మిక్కిలీ క్రుద్ధుడై రాక్షసవీరులను చూసి "దేవేంద్రుని బలం నాశనంచేసిన ప్రహస్తుణ్ణి సపరివారంగా సంహరించిన వానరవీరులను తేలికగా చూడడానికి వల్లకాదు. కనక, వాళ్ళని సంహరించి విజయం ఆర్జించడానికి స్వయంగా నేనే యుద్ధరంగానికి వెడతాను. దీప్తాలయిన బాణాలతో ఎండిపోయిన అడవి కాల్చేసేటట్టు ఆరాముణ్ణీ, లక్ష్మణుణ్ణీ కాల్చేస్తాను" అని చెప్పి రథం యెక్కి బయలుదేరాడు. ఆరథం చాలా గొప్పది. దానికి పూన్చిన గుర్రాలున్నా

ఉత్తమజాతివి. సహజంగా రావణుడు కూడా తేజశ్శాలి. అతనివెంట కాటుకకొండలవంటి రాక్షసయోధులున్నా ఎందరో బయలుదేరారు. పట్నం విడిచి బయటకి వెళ్ళాటప్పటికి రావణునకు మహాసముద్రంలా వున్న వానరసైన్యం కనపడింది. వానరు లందరూ చెట్లూ, బండ రాళ్ళూ పట్టుకుని వున్నారు.

ఆరాక్షససేనను చూసి రాముడు విభీషణుణ్ణి "ఆవచ్చే సైన్యం పతాకలతోనూ ధ్వజాలతోనూ నిండివుంది. రకరకాల ఆయుధాలు ధరించివుంది. నడగొండ లవంటి యేనుగులతో చాలా గంభీరంగా వుంది. అది యెవరిదీ?" అని అడిగాడు. దానిమీద విభీషణు డిలా చెప్పాడు. "రామా! రాక్షసులలో ముందు ఏనుగుమీద వస్తున్నాడు చూడూ. అతని మొగం బాలసూర్యబింబంలాగ యెర్రగా వుంది. అతను అకంప నుడు. రథం యెక్కి మరొకడు వస్తున్నాడు. ఆ రథంమీద సింహ ధ్వజంవుంది. చేతిలో వున్న ధనుస్సు ఇంద్రధనుస్సును మించివుంది. అత నొక యేనుగులా వున్నాడు. అత నే మా అన్న కొడుకు ఇంద్రజిత్తు. వింధ్యపర్వతంలాగ మహాశరీరుడై ధనుష్పాణి అయి రథంమీద వస్తున్న వాడు అతికాయుడు. రక్తజీరలున్న కళ్ళతో ఏనుగునెక్కి వస్తున్న వాడు మహోదరుడు. గుర్రం యెక్కి మిలమిలమెరుస్తున్న ఖడ్గంచేతబట్టుకుని వస్తున్న వాడు. పిశాచుడు నిజంగా వాణ్ణి పిడుగు అని చెప్పాలి. మెరుపులాగ మెరుస్తున్న శూలంపట్టుకుని ఆబోతు నెక్కి వస్తున్న వాడు త్రిశిరుడు. సర్పధ్వజంతో ధనుష్టంకారం చేస్తూ వస్తున్న ఆజీమూతవర్ణుడు కుంభుడు. బంగారంతో చేసి వజ్రాలు పొది గిన పరిఘ పుచ్చుకుని వస్తున్న వాడు నికుంభుడు. ఇత నెన్నో అద్భుత కార్యాలు చేశాడు. వివిధాయుధాలతో నిండి అగ్నిలాగ వెలుగు తున్న రథంయెక్కి వస్తున్న వాడు నరాంతకుడు. అతను పర్వతశిఖరా లతో అతినిపుణంగా యుద్ధంచేస్తాడు. లొట్టిపిట్టల మొగాలూ, పులి

మొగాలూ, పాముతలలూ, గుర్రపుతలలూ, లేడితలలూ గల భూతాలు సేవిస్తూ వుండగా దర్పంగా వస్తున్నవాడు రావణుడు. అతను ఇదివరలో దేవతల ననేకులను సంహరించినవాడు. అతనికి శ్వేతచ్ఛత్రం వుంది. నెత్తిమీద కిరీటం మెరుస్తోంది. వింధ్యపర్వతం వంటి శరీరం గలవాడు. అనేకమాట్లు ఇంద్రుణ్ణీ కుబేరుణ్ణీ జయించిన వాడు. సూర్యు డున్నట్టున్నాడు ”

ఇది విని రాముడు “విభీషణా! రావణు డెంత తేజశ్శాలీ? మధ్యందిన మార్తాండుణ్ణి మించివున్నాడుగదా? తేజస్సమావృతమై అతని రూపం స్పష్టంగా కనపడుతోంది, దేవదానవవీరులకు కూడా అలాంటి శరీరం వుండదు. మహోజశ్శాలి అయిన రావణుని భటు లందరూ పర్వతాలవంటివాళ్ళే. అందరూ పర్వతాలతో యుద్ధంచేసే వాళ్లే. అందరూ దీప్తా లైన గొప్ప ఆయుధాలు ధరించినవాళ్ళే. ఆ పరివారంతో రావణుడు యముడులా ప్రకాశిస్తున్నాడు; కాని వాడు మహాపాపాత్ముడు. నాకళ్ళబడ్డాడు, ఇక బతకడు. సీతాపహా రణంవల్ల పుట్టిన నాక్రోధం యిప్పుడు చూపిస్తాను ” అంటూ ధనుస్సందు కుని బాణం తొడిగాడు. లక్ష్మణుడున్నూ ధనుస్సు పుచ్చుకున్నాడు.

అప్పుడు రావణుడు బలవంతులై వున్న రాక్షసులతో “మీారు ద్వారాలలోనూ, గోపురాలమీాదా జాగ్రత్తగా వుండండి. నేనిక్కడికి మీాతో కూడా రావడం చూసి వానరులు ఈసందుపాట్లో శూన్యం అయిన లంక ఆక్రమించి నాశనంచేస్తారు భద్రం ” అని గట్టిగా చెప్పి, వాళ్లు వెళ్లాక, పెద్దచేప సముద్రజలం అల్లకల్లోలం చేసేటట్లు వానర సైనికులను చీకాకుపరిచాడు. ఆవుద్ధృతం చూసి సుగ్రీవుడు సహించ లేక ఒక పర్వతశిఖరం పెరికి రావణునిమీాదికి వెళ్లాడు; కాని రావణుడు దాన్ని తన బాణాలతో పిండిచేసేశాడు. మరిన్నీ వెంటనే యమునితోసమాన మైన బాణం తొడిగి సుగ్రీవుణ్ణి కొట్టాడు. అది

పిడుగువంటిది. అది, కుమారస్వామి, బాణంతో క్రౌంచపర్వతం భేదించినట్టు సుగ్రీవుణ్ణి భేదించింది. వెంటనే అతను హాహాకారం చేస్తూ భూమిమీద పడిపోయాడు. అది చూసి రాక్షసులు మరీ చెలరేగారు.

అప్పుడు గవాక్షుడూ, గవయుడూ, ఋషభుడూ, జ్యోతిర్ముఖుడూ, నళుడూ మహోత్సాహంతోనూ మహోద్రేకంతోనూ మహాక్రోధంతోనూ పర్వతాలు పుచ్చుకుని రావణుని మీద పడ్డారు; కాని రావణుడు ఆపర్వతాలు గుండచేసేశాడు. ఆవానరవీరులను కూడా పడగొట్టాడు. వానరసైన్యం అంతా కూడా బాణాలతో ముంచెత్తేశాడు. అది సహించలేక ఆర్తనాదం చేస్తూ వానరులు రాముణ్ణి శరణు జొచ్చారు. వెంటనే రాముడు మళ్లీ ధనుస్సుపట్టుకుని బయలుదేరాడు; కాని లక్ష్మణుడు చేతులు జోడించుకుని "అన్నా! నువ్వా దురాత్ముని వధించడం యెంత? కాని వాణ్ణి నేను సంహరిస్తాను, అనుజ్ఞ దయచెయ్యి" అని కోరాడు. దానిమీద రాముడు "నాయనా! వెళ్లు. జాగ్రత్తగా వుండు. రావణుడు మహావీరుడు సుమా! త్రిలోకాలూ కూడ వాణ్ణేమీ చెయ్యలేవు. వాడిలో లోపమేమిటో పరకాయించు. నీలోట్లు తెలుసుకుని జాగ్రత్తగా వుండు. ప్రయత్న పూర్వకంగా కంటితోనూ, ధనస్సుతోనూ ఆత్మరక్షణం చేసుకో" అని చెప్పాడు.

అందుకు మిక్కిలీ ఆనందించి రాముణ్ణి కౌగిలించుకుని పూజించి నమస్కరించి లక్ష్మణుడు బయలుదేరాడు. అప్పటి కింకా రావణుడు వానరులమీద బాణవర్షం కురుస్తూనే వున్నాడు. అప్పుడు హనుమంతుడు లక్ష్మణుడు బయలుదేరడం చూసి తాను కూడా ఆబాణాలు లక్ష్యపెట్టకుండా రావణునిమీది కురికాడు. ఉరికి చెయ్యెత్తి రావణుణ్ణి పిలిచి "నువ్వు దేవతలను చంపావు. దానవులను చంపావు. గంధర్వులను చంపావు. యక్షులను చంపావు; కాని నిన్ను వానరులు చంపుతారు చూసుకో. ఇదిగో, అయిదువేళ్లు గల నాకుడిచెయ్యి నీశరీరంనుంచి

నీఆత్మను వేరుచేసేస్తుంది" అని గద్దించాడు. రావణుడు ఇదవిని కళ్ళెర్ర జేసి "నన్ను త్వరగా కొట్టి కీర్తి సంపాదించుకో. తరవాత నిన్ను నేను నాశనంచేస్తాను" అంటూ వురిమాడు. దానిమీద హనుమంతుడు "సరే కాని, ఇదివరలో నాచేతిలో చచ్చిన నీకొడుకు అక్షుణ్ణి తలుచుకో" అన్నాడు. ఇదివినడమేతడవుగా రావణుడు అరచేతితో హనుమంతుని వక్షస్థలంమీద ఒక్క చరుపు చరిచాడు. దాంతో హనుమంతుడు ఊగిపోయాడు; కాని క్షణంలో నిలవరించుకుని తన అరచేతితో రావణుణ్ణి ఒక్క చరుపు చరిచాడు. దాంతో రావణుడు కూడా వూగిపోయాడు. అది చూసి మహర్షులూ, వానరులూ, సిద్ధులూ, దేవతలూ, అసురులూ ఆనందధ్వానాలు చేశారు.

కొంతసేపటికి తేరుకొని రావణుడు హనుమంతుణ్ణి "భేషు, వానరా! భేషు. నువ్వు నాశత్రుడవైనా నీపరాక్రమం మెచ్చుకుంటున్నా" నన్నాడు. దానికి హనుమంతుడు "రావణా! నాదెబ్బతిని నువ్వింకా బతికే వున్నావు. నాపరాక్రమం యేమి పరాక్రమంలే. నన్నింకోమాటు కొట్టి చూడు, డాబులుచాలించి, తరవాత, నిన్నొక్క గుద్దుతో యమలోకానికి పంపేస్తా" నన్నాడు. ఈమాటతో రావణుడు క్రోధోద్రిక్తుడైనాడు. వెంటనే పిడికిలి బిగించి హనుమంతుని గుండెలమీద ఒక పోటు పొడిచాడు. దాంతో హనుమంతుడు మళ్ళీ వూగిపోయాడు. హనుమంతు డలాగ విహ్వలు డయిపోగా రావణుడు ఆరోషంతోనే నీలునిమీది కురికాడు. ఉరికి కాలసర్పాలవంటి బాణాలతో కొట్టాడు. నీలుడు పర్వతంపెరికి రావణునిమీది కురికాడు. అప్పటికి తేరుకున్న హనుమంతుడు రావణుణ్ణి పిలిచి "ఇంకొకనితో యుద్ధంచేస్తున్నవాణ్ణి కొట్టగూడదు. నువ్వు నీలునితో పోరాడుతున్నావు కనక, నిన్నిప్పటికి విడిచిపెట్టా" నన్నాడు. రావణుడిది వింటూనే నీలుడు విసిరిన పర్వతం తన బాణాలతో పిండీగుండా

చేసేశాడు. తన ప్రయత్నం యిలా భగ్నం అయిపోయినందుకు నీలుడు మిక్కిలీ క్రోధంతో ప్రళయాగ్ని అయిపోయి అశ్వకర్ణ వృక్షాలూ, మద్దిచెట్లూ, మామిడిచెట్లూ మరికొన్ని చెట్లూ రావణుని మీద విసిరాడు; కాని రావణుడవి నాశనంచెయ్యడమే కాకుండా తీక్ష్ణబాణాలతో నీలుణ్ణి మళ్ళీ కొట్టాడు. అప్పుడు నీలుడు అంగుష్ఠ మాత్రుడయిపోయి రావణుని జెండామొక్క కూచున్నాడు. అది చూసి రావణుడు మండిపడ్డాడు. అది చూసి నీలుడు సింహనాదం చేసి ఒకమాటు జెండామీదా, మరోమాటు ధనుస్సుమీదా, యింకో మాటు కిరీటంమీదా వాలి రావణుణ్ణి చీకాకుపరిచాడు. నీలుని ఆ లాఘవం చూసి లక్ష్మణుడూ, హనుమంతుడూ, రాముడూ చాలా ఆశ్చర్యపడ్డారు. రావణుడు కూడా నీలుని లాఘవాని కాశ్చర్య పడ్డాడు; కాని చివరకి ఆగ్నేయాస్త్రం తీశాడు. అంతకి ముందే నీలుడు రావణుణ్ణి చీకాకుపరచడం చూసి వానరులు సింహనాదాలు చేశారు. దాంతో విభ్రాంతుడయిపోయి రావణుడు కొంతసే పేమీ చెయ్యలేకపోయాడు.

ఒక్క క్షణానికి తేరుకుని రావణుడు అస్త్రం బాగా సంధించి "నీలా! నీలాఘవంతో బాగా మాయచేస్తున్నావు; కాని చేతనైతే యిక నీప్రాణాలు కాసుకో. నువ్వెన్నో రూపాలుపొందడం వింతగానే వుంది; కాని నేను అస్త్రం తొడిగాను. నీపని అయిపోయింది" అని చెప్పి అస్త్రం విడిచాడు. అదితగిలి నీలుడు కిందపడిపోయాడు. అయితే, అతను అగ్నిదేవుని కొడుకు కనకా, సహజంగా మహావీరుడు కనకా ఆ ఆగ్నేయాస్త్రం అతన్నేమీ చెయ్యలేకపోయింది. అతను గొంతుకకూచున్నట్టు పడ్డాడే గాని ప్రాణభయం కలగలేదు.

ఇలాగ నీలుడు మూర్ఛిల్లగా రావణుడు ఉరుముతూ లక్ష్మణుని మీది కురికి, అడ్డువచ్చిన సుగ్రీవాదులను వారించి భూమి అదిరేటట్టు

ధనుష్టంకారం చేశాడు, అది చూసి మహాసత్త్వుడైన లక్ష్మణుడు "రావణా! వానరులతో కాదు, నువ్వు యుద్ధంచెయ్యడం నామీదికి రా" అనిపిలిచాడు. ధనుష్టంకారమున్నూ చేశాడు. అది వినాటప్పటికి క్రోధం యినుమడింపగా రావణుడు "లక్ష్మణా! నీకుచావు మూడింది. అంచేతనే నాకళ్ళబడ్డావు. నాబాణాల దెబ్బతో నువ్విప్పుడే యమపురికి పోతావు" అని బదులుచెప్పాడు. దానిమీద లక్ష్మణుడు "ప్రభావ సంపన్నులు గర్జించరు. నువ్వు డాబులుకొడుతున్నావు. నీవీర్యమూ, నీ బలపరాక్రమాలూ నాకు తెలుసు. మాటలతో ఏమిపనీ, యిదిగో ధనుష్పాణి నయి నేను సిద్ధంగా వున్నాను రా" అని గదిమి, రావణుడు తనమీద యేడుబాణాలు వెయ్యగా, వాటిని తన బాణాలతో ముక్కలుచేశాడు. రావణుడు బాణాలు వేశాడు. లక్ష్మణుడు వాటిని ఛేదించాడు. లక్ష్మణుడున్నూ బాణాలు వేశాడు. రావణుడు వాటిని ఖండించాడు. ఒకబాణం లలాటానికి తగిలి లక్ష్మణుడు మూర్ఛిల్లాడు; కాని వెంటనే తేరుకుని రుష్టుడై రావణుని ధనుస్సు విరగగొట్టాడు. అంతటితో వూరుకోక మరోమూడు బాణాలు వేసి నసాళంఅంటేటట్టు కొట్టగా రావణుడు మూర్ఛిల్లాడు; కాని వెంటనే తేరుకున్నాడు. వెంటనే బ్రహ్మయిచ్చిన శక్తిని లక్ష్మణునిమీద ప్రయోగించాడు. లక్ష్మణుడు దాన్ని నిప్పులవంటి బాణాలతో కొట్టాడు గాని అది అతని వక్షస్థలంమీద నాటుకుంది. దాంతో లక్ష్మణుడు మూర్ఛిల్లాడు. వెంటనే రావణుడు వచ్చి లక్ష్మణుణ్ణి పట్టుకున్నాడు; కాని యెత్తలేక పోయాడు. హిమవత్పర్వతం యెత్తవచ్చు. మందరపర్వతం యెత్తవచ్చు. త్రిలోకాలూ యెత్తిపారెయ్యవచ్చు; కాని యుద్ధరంగంలో వున్నంత కాలమూ శత్రు వెంతటివా డయినా లక్ష్మణుణ్ణి యెత్తలేడు.

లక్ష్మణుడు బ్రహ్మదేవుని శక్తి తన వక్షస్థలంమీద నాటగానే తాను విష్ణ్వంశ అయివుండడం తెలుసుకున్నాడు. అంచేతనే రావణు

డత న్నొత్తలేకపోయాడు. అది చూసి హనుమంతుడు మిక్కిలీ క్రుద్ధుడై రావణుణ్ణి పిడుగువంటి వొక్కగుద్దు గుద్దాడు. దాంతో కళ్ళుతిరిగి, కాళ్ళు నిలవక వూగివూగి రావణుడు కిందపడిపోయాడు. అతని కళ్ళనుంచీ నోళ్ళనుంచీ రక్తం స్రవించింది. రావణు డల్లా మూర్ఛిల్లి వుండడం చూసి ఋషులూ, దేవతలూ పరమానందభరితు లైనారు. వానరు లుబ్బి సింహనాదాలు చేసారు.

తరవాత, హనుమంతుడు చేతులతో యెత్తి లక్ష్మణుణ్ణి రాముని దగ్గిర పడుకోబెట్టాడు. హనుమంతుడు స్నేహితుడూ పరమభక్తుడూ కనక, లక్ష్మణుడు అతనిచేతిలో చాలా తేలిక అయినాడు. ఇంతలో ఆబ్రహ్మశక్తి లక్ష్మణుణ్ణి విడిచి మళ్ళీ రావణుని దగ్గిరికి వెళ్ళిపోయింది. అప్పుడు లక్ష్మణుడు తాను విష్ణ్వంశ అయివుండడం మళ్ళీ స్మరించు కున్నాడు. దాంతో అతనికి తగిలిన గాయా లన్నీ మాయం అయి పోయాయి. శరీరం వజ్రంకంటే దృఢం అయిపోయింది. ఇంతలో తేరు కుని రావణుడు ధనుస్సు అందుకుని నిశితశరాలతో వానరవీరులను కొట్టసాగాడు. ఆదెబ్బలకు వానరులలో మొనగాళ్ళు కొందరు పడి పోయారు. తక్కినవాళ్ళు పారిపోసాగారు. అది చూసి రాముడు రావ ణునిమీద విరుచుకుపడ్డాడు. అప్పుడు హనుమంతుడు రామునిదగ్గిరికి వచ్చి శ్రీమహావిష్ణువు గరుత్మంతుణ్ణి అధిష్టించినట్లు నువ్వూ నాభుజా లెక్కి శత్రువును సంహరించు” అని ప్రార్థించాడు.

అక్కడ రావణుడు రథంమీదా, ఇక్కడ రాముడు హనుమంతుని భుజాలమీదా వుండి యుద్ధంప్రారంభించారు “రావణా! నిలు నిలు. నా కపకారం చేసి యెక్కడికి వెళ్ళినా నువ్వింక బతకవు. నువ్వింద్రుని దగ్గిరకి వెళ్ళినా సరే, యముని దగ్గిరికి వెళ్ళినా సరే, సూర్యమండలంలోకి వెళ్ళినా సరే, బ్రహ్మలోకం వెళ్ళినా సరే, కైలాసానికి వెళ్ళినా సరే, అగ్ని నాశ్రయించినా సరే, దశదిక్కులకూ పారిపోయినా సరే

నిన్ను విడిచిపెట్టను. రావణా! తొందరపడకు. శక్తితో కొట్టి యెవరిని నువ్వు మూర్ఛిల్లజేశావో ఆలక్ష్మణుడే మళ్ళీ యిప్పుడు వచ్చి సకళత్ర పుత్రబాంధవంగా నిన్ను నాశనంచేసేస్తాడు. నీయెదట వున్న నేను కూడా జనస్థానంలో గొప్పగొప్ప ఆయుధాలతో వచ్చిన రాక్షస వీరులను పధ్నాలుగువేలమందిని వొక్కణ్ణే సంహరించాను'' చెప్పాడు.

అది విని రావణుడు ముందు కాలాగ్నివంటి బాణాలతో హనుమంతుణ్ణి కొట్టాడు; కాని హనుమంతుడు జంకలేదు, అతని తేజస్సు మరీ వృద్ధిఅయిపోయింది. ఇంతలో రాముడు తీక్ష్ణబాణాలతో రావణుని రథమూ గుర్రాలూ, సారధీ, జెండా, ఛత్రమూ, చామరాలూ, సమస్తమూ నాశనంచేశాడు. వజ్రాయుధంతో ఇంద్రుడు మేరుగిరిని కొట్టేటట్టు మరో తీవ్రబాణంతో రావణుణ్ణి కూడా గుండెలు పగిలేటట్టు కొట్టాడు. పిడుగు పడినా, ఇంద్రుడు వజ్రాయుధంతో కొట్టినా కొంచెమైనా చలించని రావణుడు రాముని దెబ్బ సహించలేక ధనుస్సు విడిచి గిరగిర తిరిగాడు. ఇంతలో అర్ధచంద్రబాణంతో రాముడు వాడి కిరీటం కూడా యెగరగొట్టాడు.

పడగొట్టి "రావణా! నువ్వు మహాభయంకరం అయిన పని చేశావు. నావీరులను చాలామందిని కూడా కొట్టావు. అంచేత చాలా అలిసివున్నావు కనక, నిన్నిప్పుడే చంపక విడిచిపెడుతున్నాను. నేను సెల విస్తున్నాను, లంకలోకి వెళ్ళిపో. శ్రమతీర్చుకో. తరవాత ధనుష్పాణివై రథం యెక్కిరా. అప్పుడు నాబలం చూద్దువుగాని" అని గట్టిగా చెప్పాడు. దాంతో సిగ్గుపడి రావణుడు లంకకు వెళ్ళిపోయాడు. తరవాత, రాముడు లక్ష్మణుణ్ణీ వానరులనూ ఆరోగ్యవంతులుగా చేశాడు. రావణుని యీస్థితి చూసి భూతగణా లన్నీ ఆనందించాయి.

## కుంభకర్ణుణ్ణి లేపమని రావణుడు మంత్రులకు ఆజ్ఞాపించడం

రావణుడు లంకలో ప్రవేశించి చాలా దుఃఖించాడు. సింహాన్ని చూసి యేనుగులాగా, గరుత్మంతుణ్ణి చూసి పాములాగా రాముణ్ణి చూసి రావణుడు బేజారయిపోయాడు. బ్రహ్మాస్త్రాలవంటీ, మెరుపుతీగలవంటీ రామబాణాలు తలుచుకుని అతను గడగడలాడిపోయాడు. అయినా, బంగారుసింహాసనం అధిష్ఠించి మంత్రులను చూసి "నేను చేసినమహా తప స్సంతా వ్యర్థం అయి పోయింది. ఇంద్రునివంటివాణ్ణి కొట్టిన నేను ఒక మనుష్యునిచేతిలో వోడిపోవలసివచ్చింది. "నీకు మనుష్యుల వల్ల భయం కలుగుతుంది" అని బ్రహ్మ చెప్పాడు. ఘోర మైన ఆమాట యిప్పుడు నిజం అయింది. దేవతలవల్లా, దానవులవల్లా, గంధర్వులవల్లా, యక్షులవల్లా, రాక్షసులవల్లా, నాగులవల్లా నాకు మరణం కలక్కుండా వుండేటట్టు కోరి వరం సంపాదించాను; మనుష్యులను తృణీకారంగా చూసి వాళ్ళవల్ల అపాయం రాకుండా వుండేటట్టు కోరుకోలేకపోయాను. వెనకటికి, నాచేతిలో చచ్చిపోతూ ఇక్ష్వాకు వంశీయు డైన అనరణ్యుడు "రాక్షసాధమా! తొందరపడకు. నా వంశంలోనే ముందుముందొక మహాపురుషుడు పుడతాడు. అతను నిన్ను సపుత్రంగా – సామాత్యంగా – సబలంగా – సాశ్వసారథిగా – సంహరించేస్తాడు" అని చెప్పాడు. ఆమహాపురుషుడు రాముడే అయి వుంటాడు. వేదవతిని నేను పీడించినప్పుడు ఆమె నన్ను శపించింది. ఆవేదవతే యిప్పుడు సీత అయి జనకుని కూతురుగా పుట్టివుంటుంది. పార్వతీ, నందీశ్వరుడూ, రంభా, పుంజికస్థలా తపఃప్రభావం వల్ల ఏమన్నారో అది యిప్పుడు నన్ను కట్టికుడిపేటట్టుంది. తపస్సంపన్నులమాట యెప్పుడూ వృథా కాదు. రాక్షసవీరులారా! ఇదంతా

యుద్ధకాండ
మీరు మనసులో వుంచుకోండి. దీని ననుసరించి జాగ్రత్తగా మసులు కోండి. లంకను జాగ్రత్తగా రక్షించండి. వెంటనే మీరు కుంభ కర్ణుణ్ణి లేపండి. అతను మహాగంభీరుడు. దేవదానవులను సంహా రించగలవాడు. కాని, బ్రహ్మశాపం వుంది అతనికి, ద్వారాలలోనూ ప్రాకారాలమీదా అప్రమత్తులై వుండండి కుంభకర్ణుడు దైవవశుడై బుద్ధిలేక సుఖంగా నిద్రపోతున్నాడు. అతను పడుకున్నాడంటే ఆరో యేడో యెనిమిదో తొమ్మిదో మాసాలు గడిస్తేగాని మేలుకోడు. తొమ్మిది దినాలకిందట నాకు ఆలోచన చెప్పి అతను పడుకున్నాడు. అతన్ని త్వరగా లేపండి. అతను మహావీరుడు. రాక్షసులందరి లోనూ ప్రధానుడు. వానరులనూ రామలక్ష్మణులనూ నిమిషంలో చంపగలడు. అలాంటి గ్రామ్యసుఖాలకు మరిగి యెప్పుడూ నిద్రా మూర్ఛితుడై వుంటాడు. కుంభకర్ణుడు మేలుకుంటే నాకు రామునికి ఓడిపోయి వచ్చా నన్న దుఃఖం పోతుంది. ఏమి లాభమూ ? నిజంగా అతను మహేంద్రుణ్ణి మించినవాడే ; కాని నాకిలాంటి చిక్కు వచ్చినా సాయం చేసే స్థితిలో లేడు ” అని చెప్పాడు.

వెంటనే మంత్రులు కొందరూ భృత్యులు కొందరూ కుంభకర్ణుని యింటికి బయలుదేరారు. గంధమూ, పుష్పమాలికలూ, వివిధాలైన భక్ష్యాలూ మాంసరాసులూ, అన్నరాసులూ, రక్తపుకడవలూ, రకరకాల మద్యాలూ పట్టుకువెళ్లారు. కుంభకర్ణుని యిల్లు యెటు చూసినా ఆమడ వైశాల్యం కలది. అది చాలా చక్కని భవనం. సుగంధభరితం ; కాని కుంభకర్ణుని నిట్టూర్పు గాలి విసిరికొట్టగా యెంతో కష్టంమీద వారు లోపలికి వెళ్లగలిగారు. పడుకుని వున్నా కుంభకర్ణుడు చాలా భయంకరంగా వున్నాడు. అతని శరీరం పర్వతంలా వుండగా, అతని నోరు తెరుచుకుని పాతాళంలా వుంది. ముక్కు పుటాలు భయంకరంగా వున్నారు. శరీరం అంతా గరిపొడిచివుంది.

అతనిశరీరంలోనుంచి కొవ్వువాసనా రక్తంవాసనా గుప్పున కొడు తున్నాయి. అతని శరీరం రత్నాభరణాలతో అలంకృతం అయివుంది. నిద్రలో కూడా అతను కిరీటంపెట్టుకునే వున్నాడు.

వారు పట్టుకువెళ్లిన పదార్థా లన్నీ అతని కెదురుగా వుంచారు. మాంసరాసుల్లో లేడిమాంసమూ, దున్నల మాంసమూ, పందిమాం సమూ యెక్కువగా వుంది. వెళ్లివెళ్లగానే ముందుగా వారు అతని శరీరం అంతా గంధంపూశారు. పూలదండలు వేశారు. పూలు చల్లారు. ధూపంవేశారు. తరవాత మేఘాల్లాగ ఉరిమారు. చంద్ర బింబాలవంటి శంఖాలూదారు. అంతా కలిసి పెడబొబ్బలుపెట్టారు. కొట్టారు. అటూయిటూ కదిపారు. భేరీలు వాయించారు. బాకా లూదారు. తొడలు చరుచుకుంటూ సింహనాదాలు చేశారు. ఆధ్వనికి ఆచుట్టుపట్లవుండిన పిట్టలన్నీ యెగిరిపోయాయి. అప్పటికీ అతనికి మెళు కువ రాకపోగా, వారు, గుదియలూ, రోకళ్లూ, గదలూ, ముద్గరాలూ పుచ్చుకుని కొట్టారు. గుద్దారు. కుమ్మారు. మధ్యమధ్య అతని నిట్టూర్పు గాలివేగం సహించలేక వారే పడిపోతూవచ్చారు. చివరికి, వారు గుర్రాలూ, లొట్టిపిట్టలూ, గాడిదలూ, యేనుగులూ తీసుకువచ్చి అతనిమీద ఎక్కించారు. అవి మీద యెక్కి తొక్కుతూవుండగావారు భేరీలు వాయించారు. శంకాలూదారు. పెడబొబ్బలుపెట్టారు. పెద్దపెద్ద కర్రలతో చితకకొట్టారు. ఆకోలాహలంతో లంక అంతా దద్దరిల్లి పోయింది. అతను మాత్రం లేవలేదు.

అప్పుడు వారు ఇది కాదు ఉపాయం అనుకుని వెయ్యి భేరీలు ఏక కాలంలో వాయించారు. కొందరు జుట్టుపట్టుకులాగారు. కొందరు చెవులు నులిమారు. కొందరు కరిచారు. కొందరు చెవుల్లో నూరు కడవలతోనీళ్లు పోశారు. కొందరు కూటాలూ ముద్గరాలూ పుచ్చు కుని నెత్తిమీదా, గుండెలమీదా బాదారు. వెయ్యియేనుగులు మీద

నడిపించారు. దాంతో అతనికి మెళుకువవచ్చింది. ఆస్పర్శకి శరీరం తడుముకున్నాడు. ఆవులిస్తూ, పర్వతశిఖరాలవంటి బాహువులు చాపుకుంటూ బడబాముఖం వంటి నోరు తెరుచుకుని లేచాడు. ఆవు లించినప్పుడు పాతాళబిలంలా వున్న అతని నోరు బాలసూర్యబింబం లాగ యెర్రగా వుంది. ఆభరణాలంకృత మైన అతని శరీరం బలాకప క్షులతో కూడివున్న నీలమేఘంలావుంది. అతని కళ్లు నిప్పులుకక్కు తున్న గ్రహాలలా వున్నాయి.

వెంటనే వారు అన్నరాసులూ, మాంసరాసులూ, రక్తపుకడవలూ, మద్యభాండాలూ చూపించారు. అవన్నీ తిని అవన్నీ తాగి అతను గర్రున తేన్చాడు. దాంతో అతనికి తృప్తి అయిందని గుర్తించి కొందరు తలలు వంచుకుని నమస్కరించారు. కొందరు పాదాలంటి నమస్కరించారు. కొందరు సాష్టాంగపడ్డారు. అప్పటికీ నిద్రాకషాయకలుషితా లైన కళ్ళు బలవంతాన విప్పుకుంటూ చూసి అతను తనని లేపినందుకు ముందు ఆశ్చర్యం కనపరిచి, తరవాత "ఇంతకష్టపడి నన్నెందుకు లేపారూ? రాజుగారికి క్షేమమేనా? ఏమీ భయకారణం కలగలేదుకదా? ఏదో భయంవచ్చే వుంటుంది. సంగతి యేమిటో చెప్పండి, నిమిషంలో నేను రాజుగారి భయంపోగొడతాను. ఇంద్రుణ్ణయినా కూలగొట్టేస్తాను. అగ్నినైనాచీల్చేస్తాను. అన్నయ్య స్వల్పకారణంతో నన్ను లేపించడు. ఆదేమిటో వివరంగా చెప్పండి" అని అడిగాడు.

## కుంభకర్ణుడు రావణుని దగ్గిరికి బయలుదేరడం

వచ్చినవారిలోయూపాక్షుడనే మంత్రి ముందుకివచ్చి "కుంభకర్ణా! దేవతలవల్లమనకెప్పుడూ భయంలేదు; కాని మనుష్యులవల్ల చాలా భయం సంభవించిది. ఇలాంటి భయం మనకి దైత్యులవల్లా, దానవులవల్లా కూడా

యెప్పుడూ తటస్థించలేదు. నడగొండలవంటి వానరులు వచ్చి లంక అంతా నిండిపోయారు. సీతను తీసుకువచ్చినందుకు మిక్కిలీ కోపించి రాముడు మన కిలాంటి భయం కలిగించాడు. ఒక్క వానరుడు వచ్చి మొన్న మొన్ననే లంక అంతా దహించివెళ్లాడు. అక్షకుమారుణ్ణి చంపేశాడు. చచ్చిపోయాడని రాముడు విడిచిపెట్టగా లంకేశ్వరుడు కూడా ప్రాణాలు దక్కించుకువచ్చాడు. దేవతలూ, దానవులూ, దైత్యులూ చెయ్యలేని పనిచేసి రాముడు రాజుగారిని దయతలచివిడిచిపెట్టాడు" అని చెప్పాడు. అదివిని కళ్లు గిరగిర తిప్పి కుంభకర్ణుడు "యూపాక్షా! నేను ముందు వానరుల నందరినీ, లక్ష్మణుణ్ణీ రాముణ్ణీ చంపేసి తరవాత రాజుగాదగ్గిరకి వస్తాను. వానరుల రక్తంమాంసాలతో రాక్షసుల కందరికీ తృప్తికలిగిస్తాను. నేను స్వయంగా రామలక్ష్మణుల రక్తంతాగేస్తాను" అని చెప్పాడు. దానిమీద మహోదరుడనే రాక్షసప్రముఖుడందుకుని "ప్రభూ! ముందు అన్నగారి దర్శనం చేసి, సంగతిసందర్భాలు విని మంచిచెడ్డలు విచారణచేసి తరవాత శత్రువులను వధించవచ్చు" అని చెప్పాడు. అది విని "సరే" అంటూ కుంభకర్ణుడు లేచాడు. వెంటనే రాక్షసులు రావణుని దగ్గిరికి వెళ్లి "రాజేంద్రా! నీతమ్ముడు కుంభకర్ణుడు లేచాడు. అక్కణ్ణుంచే యుద్ధానికి వెళ్లమంటవా, యిక్కడికి రమ్మంటవా?" అని అడిగారు. దానిమీద "అతన్నిక్కడే చూస్తాను. యథాన్యాయంగా గౌరవించి తీసుకురండి" అని రావణుడు చెప్పాడు. వారు కుంభకర్ణునిదగ్గిరికి వచ్చి "రాజేంద్రుడు నిన్ను చూడా లనుకుంటున్నాడు కనక, బయలుదేరి అతన్ని సంతోషపెట్టు" అనివిన్నవించారు.

వారు వచ్చేదాక బద్ధకంగా పడుకునివున్న కుంభకర్ణుడు "సరే" అంటూ లేచి, మొగం కడుక్కుని, స్నానంచేసి, సర్వాభరణాలూ ధరించి దప్పిక తీర బలకర మైన మద్యం పుచ్చుకో దలచి "పట్టుకురండి"

అన్నాడు. వెంటనే వారు ఎన్నో మద్యభాండాలు పట్టుకువచ్చారు. అదంతా పుచ్చుకుని కుంభకర్ణుడు మిక్కిలి తృప్తుడై కాలాంతకుడు లాగ బయలుదేరాడు. అత నడుగులు వేస్తూవుంటే భూమి అదిరింది. అతని తేజస్సుతో రాజమార్గం అంతా ధగధగలాడింది. పర్వతశిఖరం లాగ అతను రాజమార్గంలో నడుస్తూ వుంటే దూరాన్నుంచి చూసి వానరులు భయభ్రాంతు లయిపోయారు. కొందరు రాముణ్ణి శరణు జొచ్చారు. కొందరు పారిపోతూ పడిపోయారు. కొందరు దిక్కు తెలియ కుండా పరుగెత్తారు. కొందరు నేలమీాద పడుకున్నారు.

## ౬౧

## కుంభకర్ణుని జన్మవృత్తాంతం

ధనుర్ధరుడై వున్న రాముడు కుంభకర్ణుణ్ణి చూశాడు. అతనికి కుంభకర్ణుడు త్రివిక్రమావతారకాలంలో విష్ణువున్నట్టు కనపడ్డాడు. అతన్ని చూసి వానరసేన పారిపోవడం చూసి రాముడు విభీషణుణ్ణి "కిరీటం ధరించి మెరుపుతోవున్న నల్లని మేఘంలా వున్న యీాపర్వతా కారు డెవరు? భూమండలానికి వీడు జెండాలాగ వున్నాడు. వీణ్ణి చూసి వానరు లందరూ పారిపోతున్నారు. వీడెవడైనా అసురుడా? ఇలాంటివాణ్ణి నేనెప్పుడూ చూడలేదు. వీడిసంగతి వివరంగా చెప్పు" అని అడిగాడు.

దానిమీాద విభీషణు డిలా చెప్పాడు. "అతను విశ్రవసుని కొడుకు కుంభకర్ణుడు. యముణ్ణీ దేవేంద్రుణ్ణీ కూడా జయించినవాడు. ఇంత ప్రమాణంగలవాడు రాక్షసుల్లో మరొకడు లేడు. అతను వేలకొద్దీ దానవులనూ, దేవతలనూ, యక్షులనూ, నాగులనూ, రాక్షసులనూ, గంధర్వులనూ, విద్యాధరులనూ, కిన్నరులనూ జయించాడు. శూలం పుచ్చుకుని అతను బయలుదేరా డంటే మృత్యువు అనుకుంటూ

దేవతలు కూడా పారిపోతారుగాని యెదటపడి నిలవలేరు. సహజంగానే అతను తేజశ్శాలి. మహాబలశాలి. తక్కినరాక్షసులందరూ వరాలు పొంది గొప్పవాళ్ళయినారు. అతను పుట్టగానే అత్యాకలి కల్గా కనపడ్డ జంతువుసల్లా తినసాగాడు. అదిచూసి ప్రజలు భయభ్రాంతులై పారిపోయి, దేవేంద్రుణ్ణి శరణుపొంది సంగతి అంతా చెప్పుకున్నారు. అప్పుడు ఇంద్రుడు మిక్కిలీ కోపించి వజ్రాయుధం పుచ్చుకుని కొట్టాడు ఆదెబ్బకి వూగిపోయి కుంభకర్ణుడు సింహనాదం చేశాడు. ప్రాణికోటి ఆధ్వనికి కూడా మిక్కిలీ భయపడిపోయింది. భూమి గడగడలాడింది. అప్పుడు కుంభకర్ణుడు ఇంద్రు డెక్కివున్న ఐరావతం దంతం వొకటి వూడలాగి దాంతో ఇంద్రుణ్ణి గుండెలమీద కొట్టాడు. ఆదెబ్బకి ఇంద్రుడు మండిపడ్డాడు. ఆదెబ్బకి దేవతలూ, బ్రహ్మర్షులూ, దానవులూ మిక్కిలీ దుఃఖించారు. తరవాత అందరినీ వెంటబెట్టుకుని ఇంద్రుడు బ్రహ్మదగ్గిరికి వెళ్ళి కుంభకర్ణుని దౌర్జన్యం అంతా చెప్పాడు. ప్రజల నందరినీ భక్షించేస్తున్నా డనీ, దేవతల నందరినీ బాధిస్తున్నా డనీ మున్యాశ్రమాలు నాశనంచేస్తున్నా డనీ పరస్త్రీలకు మానభంగం చేస్తున్నాడనీ ఇది యిలా జరిగిపోతే లోకం అంతా త్వరలోనే శూన్యం అయిపోతుం దనీ గోలపెట్టాడు.

ఇంద్రుడు చెప్పిం దంతా విని కుంభకర్ణుణ్ణి చూసి బ్రహ్మకూడా "బాబోయ్" అంటూ భయపడిపోయాడు; కాని క్షణంలో తేరుకుని "ఒరేయ్! లోకం నాశనం చెయ్యడానికి పులస్త్యుడు నిన్ను కన్నాడు. అంచేత నువ్వు ఇదిమొదలు చచ్చినట్టుపడి నిద్రపోతావు" అని శపించాడు. వెంటనే కుంభకర్ణు డక్కడే పడిపోయాడు. అది చూసి రావణుడు మిక్కిలీ భయభ్రాంతుడై "ప్రభూ! చక్కగా పెరిగిన బంగారుచెట్టు ఫలించే సమయంలో నరికేస్తావా? నీమునిమనమణ్ణి నువ్వే యిలా శపించవచ్చునా? అయితే, నీమాట అబద్ధం కాదు. ఇతను

నిద్రపోతాడు. కాని యితను నిద్రించడానికీ మేలుకోడానికీ వేళలు ఏర్పాటుచెయ్యి" అని ప్రార్థించాడు.

దానిమీద బ్రహ్మ "ఆరుమాసాలు నిద్రపోడం. ఒక్కదినం మాత్రం మేలుకునివుండడం. ఇదీ వీడికిచ్చిన శాపం నేను సద్దుబాటు చేసిన విధం. ఆవొక్కదినమూ వీడు మిక్కిలీ క్రుద్ధుడైన అగ్ని హోత్రంలాగ నోరు తెరుచుకుని కనపడ్డ ప్రాణినల్లా తినేస్తాడు" అని చెప్పాడు. ఇలాంటి స్థితిలో రావణుడు నీపరాక్రమానికి భయపడి యిప్పుడు వీణ్ణి లేపించాడు. ఆకారణంవల్ల వీడిప్పుడు తన శిబిరంనుంచి బయలుదేరి వానరులను భక్షించడానికి వస్తున్నాడు. అయితే, వీణ్ణి చూసే భయపడి పారిపోతున్నారువానరులు, వీడితో యుద్ధం వెలా చేస్తారూ? కనక, వానరులకు అది వొక యంత్రమే కాని మనిషి కాదని చెప్పించు. అలాచెబితే వానరులు నిర్భయంగా వుంటారు."

ఇది విని రాముడు సేనాధిపతి అయిన నీలుణ్ణి పిలిచి "వెళ్లి సైన్యాలన్నీ మొగ్గరంతీర్చు. లంకాద్వారాలాక్రమించుకో. పర్వతశృంగాలూ, బండరాళ్లూ, చెట్లూ సిద్ధంచేసివుంచు. వానరులందరూ ఆయుధపాణులై సిద్ధంగా వుండాలి" అని ఆజ్ఞాపించాడు. నీలుడు సెలవివ్వగా గవాక్షుడూ, శరభుడూ, హనుమంతుడూ, అంగదుడూ పర్వతశృంగాలు పట్టుకుని ద్వారాలడ్డుకున్నారు. వానరవీరులు వృక్షాలతో రాక్షసులను మర్దించసాగారు. అప్పుడు లంక ముట్టడించియున్న ఆవానరసేన పర్వతం చుట్టూ చేరిన మేఘమాలికలా వుంది.

## ౬౨

## ఆపద గడవబెట్టమని రావణుడు కుంభకర్ణుణ్ణి ప్రార్థించడం

ఇంకా నిద్రమత్తుగానే వున్న కుంభకర్ణుడు రాక్షసులు వేలకొద్దీ తన వెంట రాగా రావణుని దర్శనానికి బయలుదేరాడు. అప్పుడు ప్రతీ

యింటినుంచీ అతనిమీద పూలవాన కురిసింది. అతను రాజభవనం ప్రవేశించాటప్పుడు అక్కడి భూమి అంతా వొణికింది. అతన్ని చూడగానే రావణుడు లేచివెళ్లి కౌగలించుకుని సింహాసనం దగ్గిరికి తీసుకువెళ్లాడు. కుంభకర్ణుడున్నూ భక్తితో అన్నపాదాలు మొక్కి అన్న చూపించిన ఆసనంమీద కూచుని, కళ్లెఱ్ఱబడ "రాజేంద్రా! నన్నెందుకు లేపించావూ? ఎవనివల్ల నీకు భయం కలిగిందీ? ఎవ డిప్పుడు చావడానికి సిద్ధంగా వున్నాడూ?" అని అడిగాడు.

దానిమీద రావణుడు "తమ్ముడా! నువ్వు పడుకుని యిప్పటికి చాలాకాలం అయింది. అంచేత నాకు రామునివల్ల కలిగిన భయం నువ్వెరగవు. రాముడు సుగ్రీవసహితుడై వానరసేనతో సముద్రం దాటివచ్చి లంక ముట్టడించాడు. లంకలో వనాలూ ఉపవనాలూ కూడా సేతువుమీద దాటివచ్చిన వానరసేనతో నిండిపోయివున్నాయి చూడు. రాక్షసులలోముఖ్యులైనవారు చాలామంది వానరుల చేతిలో చచ్చిపోయారు; కాని వానరుల్లో మాత్రం వొక్కడూ చచ్చినట్టు లేదు. వెనకకూడా వానరు లెప్పుడూ పరాజితులు కాలేదు. అంచేతనే నాకింత భయంపుట్టింది. మహాబలా! రాక్షసులను కాపాడు. వానరులను నాశనంచెయ్యి. ఇందుకోసం నిన్ను లేపించాను. బొక్కసం అంతా వ్యయం అయిపోయింది. బాలబాలికలూ వృద్ధులూ మిగిలివుండిన యీలంకనూ నన్నూ రక్షించు. సోదరునికోసం నువ్వు ఈగొప్పపని చెయ్యాలి. నేనింతవరకూ నిన్ను ఇలాంటి కోరిక కోరలేదుగదా? నీమీద నాకు స్నేహభావమూ గౌరవాదరాలూ చాలా యెక్కువ. దైవాసురయుద్ధంలో నువ్వు అందరినీ జయించావు. నీపరాక్రమం యిప్పుడు చూపించాలి. ప్రాణికోటిలో నీయంత బలశాలి మరొకడు లేడు. శత్రువుల నందరినీ సంహరించి నాకీ మహోపకారం చెయ్యి" అని ప్రార్థించాడు.

## కుంభకర్ణుడు రావణుణ్ణి నిందించడం

రావణుడిలా ప్రార్థించగా కుంభకర్ణుడు నవ్వి యిలా ప్రారంభించాడు.

"వెనక, మనమంతా ఆలోచించినప్పుడు ఏది దోషం అనుకున్నామో అది హితుల మాట వినకపోవడంవల్ల నీకిప్పుడు సంభవించింది. పాపకర్ములకు నరకం సిద్ధించినట్టు నువ్వు చేసిన చెడ్డపనికి వెంటనే ఫలితం సిద్ధించింది. మంచిచెడ్డలు ఆలోచించకుండా కేవలబలగర్వంతో నువ్వు సీతను ఎత్తుకువచ్చావు. ఐశ్వర్యగర్వంతో ఎవడు వెనక చెయ్యవలసిన పనులు ముందూ ముందు చెయ్యవలసిన పనులు వెనకా చేస్తాడో వాడు నీతీ దుర్నీతీ గుర్తించలేడు. దేశమూ కాలమూ పాత్రా విచారించకుండా చేసిన పనులు అసర్పాలు చేసిన హోమాల్లాగ వ్యతిరేకఫలితం కలిగిస్తాయి. తాను బలిష్ఠంగానూ శత్రువు దుర్బలంగానూ వున్నప్పుడు యుద్ధం చెయ్యాలి. అది ఉత్తమకర్మ. తానూ శత్రువూ సమానస్థితిలో వున్నప్పుడు సంధిచేసుకోవాలి. అది మధ్యమకర్మ. తాను దుర్బలంగానూ శత్రువు బలిష్ఠంగానూ వున్నప్పుడు దానోపాయం అవలంబించాలి. ఈమూడూ కర్మారంభోపాయమూ, పురుషద్రవ్యసంపత్తూ, దేశకాలవిభాగమూ, వినిపాతప్రతీకారమూ, కార్యసిద్ధీ—అనే యీ అయిదింటితోనూ జతపరిచి చెయ్యాలి. మంత్రులతో ఆలోచించి యివి నిశ్చయపరుచుకుని మరీ పనికి పూనుకోవాలి. ఏపని వచ్చినా మంత్రులతో ఆలోచించాలి. స్నేహితుల సలహా పుచ్చుకోవాలి. దేశకాలపాత్రలు గుర్తించుకోవాలి. ఇలా నడుచుకునే రాజే బాగు పడతాడు.

ప్రతీవాడూ ధర్మార్థకామాలు అనుభవింపవచ్చు. అయితే, వాట్నొకట్టే విడివిడిగానూ, రెండేసీ మూడేసీ జంటగా కూడా సేవించవచ్చు.

అంటే, ప్రాతఃకాలంలో ధర్మం చెయ్యాలి. మధ్యాహ్నకాలంలో అర్థం – అంటే డబ్బు ఆర్జించాలి. సాయంకాలం కామం తీర్చుకోవాలి. ఇవి వొక్కొక్కటే సేవించేపద్ధతి. లేదా ? ప్రాతఃకాలాన, అప్పు డాచరించవలసిన ధర్మమూ మధ్యాహ్నం ఆర్జించవలసిన డబ్బూ కలిపి సేవించవచ్చు. మధ్యాహ్నం; అప్పుడు చెయ్యవలసిన అర్థార్జనా ప్రాతఃకాలం ఆచరించవలసిన ధర్మమూ కలిపి సేవించవచ్చు. సాయంకాలం, అప్పుడు తీర్చుకోవలసిన కామమూ మధ్యాహ్నం ఆర్జించవలసిన అర్థమూ కలిపి సేవించవచ్చు. మూడూ ఏకకాలంలో సేవించా లంటే అందుకు తగ్గది సాయంకాలం. అంతే గాని ధర్మార్థాలు విడిచి మూడుకాలాలయందూ ఒక్క కామం మాత్రమే సేవించేవా డధము డనిపించుకుంటాడు. రాజూ రాజువంటివాడూ యీమూడుపక్షాలూ విని వీటిలో ఉత్తమమైనవి అవలంబించక పోతే వాడి చదువూ వినికీ వ్యర్థం. మంచి చెడ్డలు తెలిసినవాడు సామదానభేదదండోపాయాలలో యేది యెప్పు డాచరించాలో మంత్రులతో ఆలోచించి ధర్మాధర్మాలు గుర్తించి నడుచుకునేవాడి కెప్పుడూ ఆపదలు రావు. అంటే రాజయినవాడికి మంత్రులతో ఆలోచించడం అగత్యం. వాళ్లు చెప్పే మంచిచెడ్డలు విని మంచిమార్గాన నడవడమున్నూ అగత్యం. అలాంటివాడే అభ్యుదయపరంపరాభివృద్ధిగా చిరకాలం రాజ్యవైభవం అనుభవిస్తాడు. పశువులవంటి పురుషులు కొందరు శాస్త్రార్థాలు తమ కేమీ తెలియకపోయినా ఆలోచనలు చెప్పవస్తూవుంటారు. అర్థశాస్త్రం తెలిసినవా రనుభవించే ఐశ్వర్యం అనుభవించతలిచేవాళ్లు అలాంటి వాళ్ల ఆలోచనలు వినకూడదు. అహితమైనది కూడా కొందరుహితం అని మొండిగా వాదిస్తారు. వాళ్లని దగ్గిరికి రానివ్వకూడదు. వాళ్ల ఆలోచన వినిపించుకోగూడదు. దుష్టులైన మంత్రులు శత్రువులతో చేరి వినాశం కలిగించడానికి తమరాజుచేత చెడ్డపనులు చేయిస్తారు. కనక, రాజయినవాడు

మంత్రులతో కూడా హితచింతకు లెవరో వంచకు లెవరో చక్కగా గుర్తించుకోవాలి. పక్షులు క్రౌంచపర్వతరంధ్రంలోనుంచి దూరిపో తాయి. దుష్టమంత్రులను విడిచిపెట్టని రాజు ఛిద్రాలు తెలిసి శత్రువు లలాగే లోపలప్రవేశించి నాశనంచేస్తారు. ఎవడు శత్రువుల సంగతి బాగా తెలుసుకోకా, ఆత్మరక్షణవిషయమై శ్రద్ధలేకుండానూ వుంటాడో ఆరాజు చెడిపోతాడు. ఈవిషయమై మన తమ్ముడు విభీషణుడు చెప్పింది చాలా మంచిది. అలా చెయ్యి. అదే మనకి శ్రేయస్కరం. ఇక నీ కెలా తోస్తే అలా చెయ్యి"

ఇది వినగానే రావణుని కనుబొమ్మలు ముడిపడ్డాయి. అతనికి చాలా కోపంవచ్చింది. "పూజ్యుడైన గురువులాగా, ఆచార్యుడులాగ నువ్వు నాకు ధర్మాలు బోధిస్తున్నావా? ఇప్పుడు మాటలతో ప్రయోజనం లేదు. పనిచెయ్యాలి. విభ్రాంతివల్లనో, తెలియకో, బలగర్వంతోనో యేదో చేశాము. అది యిప్పుడు కలిసిరాదు. దానివిషయమే మళ్లీ మళ్లీ చెప్పడం వ్యర్థం. జరిగినదానికై ఆలోచన వద్దు. జరిగిం దేదో జరిగిపోయింది. ఇప్పు డేమిచెయ్యాలో అది చెయ్యి. నీకు నామీాద స్నేహమే వుంటే — నీబలపరాక్రమాలు నీకు తెలిసే వుంటే — ఇది నీకు తప్పకుండా చెయ్యవలసిం దనిన్నీ తోస్తే నేను తప్పుచెయ్యడం వల్ల కలిగిన ఆపద పరాక్రమంతో నువ్వు తొలగించెయ్యి. కార్యంచెడి దీనుడై వుండేవాడికి సాహాయ్యం చేసి వొడ్డెక్కించేవాడే స్నేహితుడు. అని రావణుడు తీక్ష్ణంగా అన్నాడు.

## కుంభకర్ణుడు యుద్ధానికి సిద్ధపడడం

ఇది విని కుంభకర్ణుడు రావణునకు కోపంవచ్చిం దని గ్రహించి మెల్లిగా అందుకున్నాడు. "రాజేంద్రా! విచారించకు. కోపగించకు. స్వస్థంగా వుండు. ఎవనివల్ల నువ్విలాంటి ఆపదకు పాల్పడ్డావో వాణ్ణి నేను నాశ

నంచేస్తాను. ఈవిషయమై నేను బతికివున్నంతకాలమూ నీకు బెంగఅక్క
ర్లేదు. నేను నీకాబంధుణ్ణి. స్నేహితుణ్ణి. కనక, సర్వకాలసర్వావస్థ
ల్లోనూ నేను నీకు హితమే చెబుతూ వుండాలి. స్నేహితుడు ఇప్పు
డేమి చెయ్యాలో నే నదే చేస్తాను చూసుకో. యుద్ధంచేసి శత్రువుల
నందరినీ సంహారించేస్తాను చూసుకో. నేనిప్పుడే రాముణ్ణీ లక్ష్మణ్ణుణీ సంహా
రించేస్తాను. దాంతో శత్రుసేన అంతా పారిపోతుంది చూసుకో.
యుద్ధరంగంలోనుంచి నేను రాముని తలకొట్టి తెస్తాను. అది చూసి
నువ్వు సంతోషించు. సీత దుఃఖిస్తుంది. బంధువుల నెడబాసిన లంకా
వాసు లైన రాక్షసులు ఇప్పుడు రాముడు చచ్చిపోవడం చూస్తారు.
వారి కందరికీ నేనిప్పుడు శత్రువులను నాశనంచేసి దుఃఖంపోగొడతాను.
పర్వతంవంటి సుగ్రీవుడు రక్తంలో మునిగి యుద్ధభూమిలో పడివుం
టాడు తొందరపడకు. ఇక్కడ వుండిన యీరాక్షసయోధులూ నేనూ
కూడా రాముణ్ణి వధించడానికి ఉద్యుక్తులం అయివున్నాము. ఇలాంటి
స్థితిలో రాముడు నిన్నెలా చంపుతా డయ్యా? కాదంటావా?
రాముడు ముందు నన్ను చంపగలిగితేనే నీదాకా వస్తాడు. నావిష
యమై మాత్రం నా కేమీ విచారంలేదు. కనక, నాకు వెంటనే సెల
వియ్యి. యుద్ధానికి పంపతగ్గవాడు నీకు నాకంటే మరొకడు లేడు. నీశ
త్రువుల నందరినీ నేనే చంపేస్తాను. ఇంద్రుడు వచ్చినా, యముడు
వచ్చినా, అగ్నిహోత్రుడు వచ్చినా, వాయువు వచ్చినా, కుబేరుడు
వచ్చినా, వరుణుడు వచ్చినా, అందరూ కలిసే వచ్చినా వాళ్లని నేను
కూల్చేస్తాను. తెల్లని పదునైన శూలం ధరించి పర్వతంలాగ నేను జయ
లుదేరా నంటే ఇంద్రు డయినా భయపడి పారిపోతాడు. ఆయుధం
లేకుండా వొట్టిచేతులతో నేను యుద్ధానికి వెళ్లినా బతకతలిచినవా
డెవడూ నాకళ్లబడడు. నాకు శక్తి అక్కరలేదు — గద అక్కరలేదు —
కత్తి అక్కరలేదు — బాణా లక్కరలేదు. — ఇంద్రుణ్ణి కూడా నేను

విడిచేతులతో నలిపి చంపేస్తాను. ఒకవేళ రాముడు నాపిడికిలి వేగం సహించగలిగేటట్టయితే, అప్పుడు నా బాణాలు అతని రక్తం తాగు తాయి. రాజా! నేనుండగా నీకీ చింత యెందుకయ్యా? నేనిప్పుడే నీశత్రువులను సంహరించబోతున్నానుగదా? కనక, రాముణ్ణి తలుచుకుని యిక భయపడకు. రాముణ్ణీ, లక్ష్మణుణ్ణీ, సుగ్రీవుణ్ణీ కూడా నేను కూలగొట్టేస్తాను. లంక తగలబెట్టిన హనుమంతుణ్ణీ, వానరయోధులనూ కూడా సంహరించి నీకు గొప్పకీర్తి కలిగిస్తాను. నీకింద్రునివల్ల భయం వచ్చినా చివరికి బ్రహ్మవల్ల భయంకలిగినా నేను పోగొడతాను. నేను కన్నెర్రజేశానంటే దేవత లందరూ మట్టి అయిపోతారు. నేను యముణ్ణి కూల్చేస్తాను. అగ్నిని మింగేస్తాను. సూర్యుణ్ణిపడగొట్టేస్తాను. నక్షత్రాలు డుల్లగొట్టేస్తాను. ఇంద్రుణ్ణి చంపేస్తాను. సముద్రం తాగేస్తాను. పర్వతాలు పిండికొట్టేస్తాను. భూమిబద్దలు కొట్టేస్తాను. చాలా కాలంగా గాఢనిద్రలో వుండిన కుంభకర్ణుని పరాక్రమం సకల భూతాలూ యిప్పుడు చూస్తాయి. మూడులోకాల్లోనూ, వున్న ప్రాణి కోటి నాకొక్క పూట ఆహారానికయినా చాలదే, ఇక నాతో యుద్ధం యెలా చేస్తుందీ? సుఖాలే అనుభవించతగిన అన్నయ్యా! రాముణ్ణి చంపడం రూపంగా నీకు గొప్పసుఖం కలిగిస్తాను. రాముణ్ణీ లక్ష్మణుణ్ణీ చంపేసి, వానరయోధుల నందరినీ మింగేస్తాను. కనక, రాజేంద్రా! ఇక నువ్వు క్రీడాలోలుడవై వుండు. మంచిమంచి రకాల మద్యం బాగా తాగు. నీపను లన్నీ నిర్విచారంగాచేసుకో. పరితాపంవద్దు నేను రాముణ్ణి చంపగానే సీత నీస్వాధీనం అయిపోతుంది, తప్పదు."

## ౬౪
## మహోదరుడు కుంభకర్ణుణ్ణి ధిక్కరించడం

కుంభకర్ణు డిలా చెప్పగా, మహోదరు డందుకుని యిలా అన్నాడు.

"కుంభకర్ణా! నువ్వు గొప్పకుటుంబంలోనే పుట్టావు; కాని గర్వి

ష్టివి, బుద్ధిహీనుడవు. ఏ విషయ మయినా నీకు కార్యా కార్యాలు తెలియవు. రాజేంద్రుడు నీతీ అవినీతీ యెరుగును; కాని బాల్యచాపలంవల్ల నువ్వు మాత్రం డాబులుకొడుతున్నావు. రాక్షసరాజు దేశమూ, కాలమూ, పాత్రా, వృద్ధీ, క్షయమూ, తనవీ శత్రువులవీ కూడా బాగా గుర్తించగలడు. కేవలమూ బలంమాత్రం వుండి, బుద్ధిలేక, వృద్ధసేవ కూడా చెయ్యని నీవంటివాడికిగూడా చెడ్డదని తోచే పని మహాపండితు డైన రావణు డెందుకు చేస్తాడూ? ధర్మార్థకామాలు పృథగాశ్రయా లని యెంతో చెప్పావే? వాటి సంగతి నీ కే మయినా తెలుసా? ఏ ఫలం కలిగినా దానికి కర్మే కారణం. అయి తే, కర్మ మంచిదై తే చెడ్డఫలితం కలుగుతుంది. ధర్మార్థామాలే కాదు, అధర్మమూ అనర్థమూ కూడా ఒక్కొక్కప్పుడు శ్రేయస్సే కలిగిస్తాయి. పురుషులు ఇహలోకాని కుపయోగించే పనులూ, పరలోకాని కుపయోగించే పనులూ కూడా చేస్తూనే వున్నారు. కేవలమూ కామపరులుకూడా సుఖా లనుభవించకపోవడంలేదు. ఇదంతా ఆలోచించే రావణుడు సీతను తీసుకువచ్చాడు. మేమున్నూ బాగా ఆలోచించే అందు కంగీకరించాము. శత్రువు విషయమై రావణుడు చేసిన సాహసకార్య మేమీ లేదు. నివ్వొక్కడవే యుద్ధానికి వెడతానన్నావే? అందుకు తగ్గ బలపరాక్రమాలు నీకున్నా యన్నావే? ఆవిషయమై కూడా అసందర్భం వుంది, చెబుతా విను. రాముడు జనస్థానంలో అతిబలవంతు లైన రాక్షసుల నెందరినో చంపాడు. అతణ్ణి నువ్వొక్కడవూ ఏమిచెయ్యగలవూ? జనస్థానంలో రాముని కోడిపోయినవా రందరూ యిప్పటికీ భయభ్రాంతు లయే వున్నారు తెలుసా? రాముడు సింహం అని నువ్వెరగవు. కనకనే బుద్ధిలేక నిద్రించిన పాముని లేపడానికి వెడుతున్నావునువ్వు. దివ్య తేజస్సుతో మెరిసిపోతూ, క్రోధంతో దుర్నిరీక్ష్యుడై మృత్యువులాగ సహించ

రాని రాముణ్ణెవడు సమీపించగలడూ? రాముని కళ్ళబడింది ధం.క్షే రాక్షససైన్యం అంతా నాశనం అయిపోతుంది. నువ్వొక్కడవూ యేమి చెయ్యగలవూ? చేతకానివా డెవడు సర్వశక్తిసంపన్నుడైన శత్రువు నెదిరించి ప్రాణాలు పోగొట్టుకుంటాడూ? రామునివంటి వాడు మనుష్యులలో మరొకడు లేడు. అతను ఇంద్రునితోనూ సూర్యునితోనూ సమానుడు. నువ్వొక్కడవూ అత న్నెదిరించగలవా?"

కుంభకర్ణు ణ్ణిలా తర్జనభర్జన చేసి, తరవాత, మహోదరుడు రావణునితో యిలా అన్నాడు.

"రాజేంద్రా! సీతను తీసుకువచ్చావు. నీ అధీనంలో పెట్టుకున్నావు. ఇక వట్టిమాట లెందుకూ? నువ్వెప్పుడు కావా లనుకుంటే అప్పుడే ఆమె నీవశం అవుతుంది. సీత నీకు స్వాధీనంకావడానికి నాకొక ఉపాయం తోచింది. అది విని యిష్టమైతే అలా చెయ్యి. నేనూ ద్విజిహ్వుడూ, సంహ్రాదీ, కుంభకర్ణుడూ, వితర్దనుడూ – మే మయిదుగురమూ రాముణ్ణి సంహరించడానికి వెళ్ళా లని ప్రకటనచెయ్యి. మేమూ వెళ్ళి అతనితో తీవ్రంగా యుద్ధంచేస్తాము. గెలుస్తామూ, సరే, ఉపాయమే అక్కరలేదు. మన శత్రువు బతికే వుంటే మేము యుద్ధం చెయ్యనే చేస్తాముకదా? మేము రక్తంతో తడిసి యుద్ధరంగం నుంచి వస్తాము. రామనామాలు చెక్కినబాణాలు మా శరీరాలు గుచ్చుకునివుండగానే వస్తాము. "మేము రాముణ్ణీ లక్ష్మణుణ్ణీ తినేశాము" అంటూ మేము నీ పాదాలు పట్టుకుంటాము. అప్పుడు నువ్వు మంచిమంచి బహుమతు లియ్యి. వెంటనే నువ్వు రాముడూ, లక్ష్మణుడూ చచ్చిపోయారని పట్నం అంతా చాటింపించు, మిక్కిలీ సంతోషం నటిస్తూ నువ్వు భృత్యులకు రకరకాల బహుమతులు పంచిపెట్టు. యోధులకు పూలదండలువెయ్యి. కొత్తబట్టలు కట్టబెట్టు. గంధాలు పూయించు. మద్యంకూడా సమర్పించు. నువ్వున్నూ మద్యపానం

చెయ్యి. దాంతో రామలక్ష్మణులు చనిపోయా రనే వార్త అంతటా వ్యాపించగానే నువ్వు సీతదగ్గిరికి వెళ్ళి రహస్యంగా సీత నూరడించు. ధనధాన్యాలు చూపించీ, వస్తువాహనాలు చూపించీ ఆమెని ఆశపెట్టు. ఈ కపటోపాయంతో ఆమె యిక దిక్కులే దని నిరాశతోనూ, స్త్రీసాహజమైన చాపలంతోనూ నీస్వాధీనం అయిపోతుంది. ఆమె మొన్నటిదాకా సకలసుఖాలూ అనుభవించింది. ఇప్పుడు సకల దుఃఖాలతోనూ వేగిపోతోంది. దీంతో ఆమె ఆశ నిరాశ కావడంవల్ల సుఖాలయినా తక్కాలి అనుకుని తప్పకుండా నిన్ను అలుముకుంటుంది. ఇది నేను చాలాచాలా ఆలోచించి తేల్చినమహూపాయం. నువ్వు రామునికళ్ళబడితే అపాయం తప్పదు. నీకోరిక యిక్కడవుండగానే నెరవేరుతుంది. యుద్ధంచెయ్యకుండా వుండడమే మంచిది. సైన్యం నాశనంచేసుకోకుండా, ప్రాణంసంశయావస్థకు పాల్పడకుండా, యుద్ధం చెయ్యకుండానే శత్రువులను జయిస్తే కలిగే కీర్తి సంపదా చాలా గొప్పవి. చిరకాలం అవి అనుభవించవచ్చు"

## ౬౫

## దిద్దుకుని దిద్దుకుని కుంభకర్ణుడు యుద్ధరంగంలో ప్రవేశించడం

మహోదరు డిలా చెప్పి వూరుకోగా కుంభకర్ణుడు రావణునితో "రాజేంద్రా! దురాత్ముడైన రామునివల్ల నీకు కలిగిన భయం నేను పోగొడతాను. నువ్వు సుఖంగా వుండు. నీరు లేని మేఘాల్లాగ శూరులు వ్యర్థంగా పేలరు. నేను యుద్ధంలో నాప్రతాపంచూపించి ఆ విధంగా గర్జిస్తాను చూడు. శూరు లయినవారు ఇతరులు తమ్మెంత దూషించినా చలించరు. ఆత్మస్తుతి కూడా చేసుకోరు. గొప్పపని మాత్రమే చేసిచూపిస్తారు. మహోదరా! పండితుల మనుకుని విర్రవీగే నీవంటి పిరికిపందలు చెప్పే మాటలు వినడంవల్ల రావణునకు

వచ్చిన చిక్కు యిది. ఇచ్చకాలాడి రావణుణ్ణి తప్పుదారిలో పెట్టి మీరింతవరకూ తెచ్చారు. ఇప్పుడేమయిందీ? బొక్కసం అంతా తరిగిపోయింది. సైన్యం అంతా నాశనం అయిపోయింది. రాజుమాత్రం మిగిలాడు. దీనికంతకూ కారణం మీరు. రాజుకి మీరు శత్రువులు కాని మిత్రులు కారు. మీరు చేసిన దుర్నయంవల్ల కలిగిన ఆపద తప్పించడానికి నేనిదే యుద్ధానికి వెడుతున్నాను" అన్నాడు.

ఇది విని నవ్వుతూ రావణుడు "కుంభకర్ణా? మహోదరునకు రాముడంటే భయంపట్టుకుంది. అంచేతే యుద్ధం వద్దంటున్నాడు. స్నేహంలోనూ, బలంలోనూ నాకు నీవంటివాడు మరొకడు లేడు. కనక, నువ్వు వెళ్ళి శత్రువులను సంహరించి జయంపట్టుకురా. అంచే తనే నా భయం పోగొడతావని నేను నిన్ను లేపించాను. నాకు స్నేహితులైన రాక్షసులు తమ విశ్వాసం చూపించడానికిదే సమయం. కనక, శూలం పుచ్చుకుని అగ్గిలాగ వెళ్ళి వానరులనూ రాజపుత్రులనూ సంహరించిరా. నీ రూపం చూస్తేనే వానరులు పారిపోతారు. రామలక్ష్మణులకున్నూ గుండెలు పగిలిపోతాయి" అని చెప్పి ప్రోత్సహించి తనకి మళ్ళీ పునర్జన్మ వచ్చినట్టానందించాడు. కుంభకర్ణుని పరాక్రమం తెలిసినవాడు కనక, నిష్కలంకుడైన పూర్ణచంద్రుడులాగ ప్రముదితచిత్తుడై వెలిశాడు.

రావణుడిలా చెప్పగా కుంభకర్ణుడు యుద్ధానికి బయలుదేరాడు. అతను ఒక గొప్పశూలం పుచ్చుకున్నాడు. అది పిడుగుకంటే తీక్ష్ణం అయినది. దేవతలనూ దానవులనూ యక్షులనూ గంధర్వులనూ అనేకులను నాశనంచేసింది. దానికి ఎర్రని పూలదండ కట్టారు. సహజంగానే అది అగ్నిజ్వాలలా వుంది. శత్రువుల రక్తం దానికి పేరుకునివుంది. అది చేత పుచ్చుకొని కుంభకర్ణుడు "రాజేంద్రా! నేనొక్కణ్ణే వెడతాను. బలం అంతా యిక్కడే వుండనియ్యి. నాకు చాలా ఆకలిగా

వుంది, వెళ్ళి ఆవానరులను తినెయ్యాలి.'' అన్నాడు. దానిమీద రావణుడు "వద్దువద్దు, సైన్యం వెంటపెట్టుకునే వెళ్లు. వానరు లంటే యేమనుకున్నావో గొప్ప బలాపరాక్రమవంతులు. అతివేగం కలవాళ్లు. నువ్వొక్కడవే వెడితే నిన్ను కొరికి చంపుతారు. అంచేత శత్రువులను నాశనంచెయ్యగల సైనికులనువెంటబెట్టుకునే వెళ్లు. రాక్షసులకు కీడు కలిగిస్తున్న శత్రువుల నందరినీ నాశనంచేసి రా'' అని చెబుతూ సింహాసనం దిగి కుంభకర్ణుని మెడలో చాలావిలవగల రత్నమాలిక ఉంచాడు. మురుగులజోడాలు వేశాడు. ఉంగరాలు తొడిగాడు. సకలాభరణాలూ అలంకరించాడు. ముత్యాలహారం వేశాడు. గంధం పూశాడు. పూలదండలతో ముంచేశాడు. చెవులకు కుండలాలు పెట్టాడు. అంగదాలూ కేయూరాలూ తొడిగాడు.

ఇవన్నీ ధరించాటప్పటికి కుంభకర్ణుడు అగ్నిలా వున్నాడు. అతను కట్టుకున్న బంగారు మొలతాడు అమృతోత్పాదనకాలంలో మంధర పర్వతానికి చుట్టిన వాసుకి లా వుంది. అప్పుడు కుంభకరు గొప్ప కవచంధరించాడు. సర్వాభరణాలూ ధరించి శూలపాణి అయి నుంచునివుండిన కుంభకర్ణుడు శ్రీమహావిష్ణువు త్రివిక్రమావతారం లాగ వెలిగిపోయాడు.

కుంభకర్ణుడు రావణుణ్ణి కౌగిలించుకుని ప్రదక్షిణంచేసి నమస్కారాలు సమర్పించి బయలుదేరాడు. రావణు డాశీర్వదించాడు. భేరీలు మోగాయి. శంఖా లురిమాయి. గదలూ, ఖడ్గాలూ, ముసలాలూ, ముద్గరాలూ, శూలాలూ, ధనుస్సులూ ధరించి గొప్పగొప్ప యోధు లనేకులు గుర్రాలమీదా ఏనుగులమీదా, గాడిదలమీదా, ఒంటెల మీదా అతనివెంట బయలుదేరారు. రథికులున్నూ చాలామంది వెళ్ళారు. అతను వీధిలో వెడుతూవుంటే రాక్షసస్త్రీలు పూలవాన కురిశారు. అప్పు డతను నిశ్చలంగా వానలో నడుస్తున్న మదగజంలా

వున్నాడు. అతని వెనక రకరకాలఆయుధాలు పుచ్చుకుని పదాతులు నడిచారు.

అప్పుడు కుంభకర్ణుడు మహోరూపం ధరించాడు. అతని శరీరం నూరు ధనుస్సుల వెడల్పూ, ఆరువందల ధనుస్సుల పొడుగూ వుంది. అతని కళ్లు బండిచక్రాలలా వున్నాయి. అత నొక పర్వతం లా వున్నాడు.

కాలిపోయిన పర్వతంలా వున్న ఆకుంభకర్ణుడు తన అనుచరులను సమీపించి పాతాళంలా వున్న నోరు తెరిచి నవ్వుతూ "అగ్నిహోత్రుడు మిడతలను మాడ్చేసేటట్టు వానరులను జట్టుజట్టుగా యిప్పుడే మాడ్చేస్తాను. నిజానికి వానరులు నాకేమీ అపకారంచెయ్యలేదు. మావంటిగొప్పవాళ్ల ఉద్యానవనాల్లో ఉండవలసిన జాతి అది. ఈలంక మీద దండెత్తడానికి మూలపురుషు డైన రాముణ్ణి లక్ష్మణునితో కూడా చంపేసేటట్టయితే తక్కినవారంతా చచ్చిపోయినట్టే లెక్క" అన్నాడు. అది విని వారు భూనభోంతరాళాలు బద్దలయిపోయేటట్టు పెడబొబ్బలుపెట్టారు; కాని కుంభకర్ణుడు తీరాబయలుదేరాటప్పటికి కొన్ని దుర్నిమిత్తాలు తోచాయి. మేఘాలు గాడిదల్లాగ ఎర్రనై ఉల్కలు రాల్చాయి. అడవులతోనూ సముద్రంతోనూ భూమి అంతా వడకిపోయింది. వికృతాకారాలు గల నక్కలు అమంగళకరంగా అరిచాయి. పక్షులు అపసవ్యంగా మండలభ్రమణంచేశాయి. గద్దలు అతనిమెదట దండలాగ వరసలుకట్టి యెగిరాయి. అతని యెడమక న్నదిరింది. ఎడమచెయ్యి వొణికింది. సూర్యుడు కాంతిహీను డయినాడు. గాలి పెళుసుగా వీచింది.

కాని కుంభకర్ణు డివేమీ లక్ష్యపెట్టకుండా కాలవశుడై ముందుకే అడుగువేశాడు. అతను కోటగోడ దాటేసి మహాసముద్రంలా వున్న వానరసేన చూశాడు. వానరులు పర్వతంలా వున్న కుంభకర్ణుణ్ణి చూసి దిక్కుతోచకుండా పరుగెత్తసాగారు. అది చూసి కుంభకర్ణుడు

సింహనాదంచేశాడు. అది విని వానరులు కొందరు అదిరిపడిపోయారు. కుంభకర్ణుడు కింకరులతో ఒయలుదేరిన యముడులాగ యుద్ధాని కున్ముఖు డయినాడు.

## ౬౬

### కుంభకర్ణుణ్ణి చూసి పారిపోయే వానరులను అంగదుడు మళ్లించడం

కుంభకర్ణుడు నగరంలోనుంచి కోటగోడ దాటి యుద్ధరంగంలో ప్రవేశించాడు. అతను సముద్రం పొర్లిపోయేటట్టూ, పిడుగులుపడేటట్టూ, పర్వతాలు బద్దలయిపోయేటట్టూ అరిచాడు. యమునకూ వరుణునకూ కూడా అవధ్యుడైన అతణ్ణి చూసి వానరులు పారిపోసాగారు. వాళ్లనీ, ముఖ్యంగా నళుణ్ణీ నీలుణ్ణీ, గవాక్షుణ్ణీ, కుముదుణ్ణీ, చూసి అంగదుడు “మిమ్మల్ని మీరే మరిచి, మీప్రతాపాలూ, మీవంశ గౌరవప్రతిష్ఠలూ మరిచి క్షుద్రుల్లాగ యెక్కడికి పారిపోతారూ? బాగుంది. ఇప్పు డయినా వెనక్కిమళ్లండి. ప్రాణాలు తక్కించుకోడానికి చూస్తున్నారా? ఈవచ్చే మూర్తి యుద్ధంచెయ్యడానికి కాదు. ఇదొక యంత్రమే కాని ప్రాణి కాదు. రాక్షసవీరు డసలే కాదు. దీన్ని మేము నిమిషంలో కూల్చేస్తాము, వెనక్కి మళ్లండి” అని ప్రోత్సహించాడు.

ఇది విని కొంతసేపటికి వారు మళ్లారు. వృక్షాలూ బండరాళ్లూ పుచ్చుకుని యుద్ధానికి సిద్ధపడ్డారు. మదించిన యేనుగుల్లాగ వారు కుంభకర్ణుణ్ణి కూడా కొట్టసాగారు. కాని, పర్వతశిఖరాలతో కొట్టినా, బండరాళ్లతో కొట్టినా, చెట్లతో కొట్టినా కుంభకర్ణుడు చలించలేదు. అతని శరీరంమీద పడిన రాళ్లూ చెట్లూ పిప్పిపిప్పి అయిపోయాయి. ఇంతే కాక, దీంతో క్రుద్ధుడై కుంభకర్ణుడు వానరులను వధించసాగాడు. శరీరం అంతా రక్తం కమ్మగా అతని యెదటపడిన వానరు లందరూ మొరనిపువ్వుల్లాగ పడిపోసాగారు. వానరులు వెనక్కి తిరిగిచూడకుండా

కొందరు పారిపోయారు. కొందరు సముద్రంలోపడ్డారు. కొంద రాకాశాని కెగిరారు. కొందరు వచ్చినదారిపట్టి సేతువుమీదుగా పారిపోయారు. కొందరు మిట్ట లెక్కారు. కొందరు పల్లాలలో దాగుకున్నారు. కొందరు చెట్లెక్కారు. కొందరు పర్వతాలెక్కారు. కొందరు గుహల్లో దూరారు. కొందరు మాటలేకుండా కూచున్నారు. చచ్చిన శవాల్లాగ నేలమీద బోర్లాపడుకున్నారు.

వారిని చూసి అంగదుడు "నిలవండి. పరుగెత్తకండి. యుద్ధం చేద్దాం. భయభ్రాంతులకు భూమండలం అంతా తిరిగినా భద్రమైన స్థలం దొరకదు. ప్రాణాలు కాపాడుకుంటే యేమి ప్రయోజనమూ? భయపడి ఆయుధాలు కిందపడేసి పారిపోయేవాళ్లని చూస్తే పెళ్లాలు కూడా నవ్వుతారు. అంతకంటే చావేముంది? మన మంతా గొప్ప కుటుంబాల్లో పుట్టాం. ఎక్కడి కలా పారిపోతారు? అనార్యులు పరుగెత్తాలి కాని మీరా? మనం పదిమందిదగ్గిరా యేమిటేమిటో డాబులుకొట్టాం. అవన్నీ యిప్పు డెక్కడికి పోయాయి? పారిపోయి బతికేవాణ్ణి లోకులు పిరికిపంద అని పిలుస్తారు. కనక, సత్పురుషులు వెళ్లే మార్గం అనుసరించండి. భయం విడిచిపెట్టండి. మనం యుద్ధంలో చచ్చిపోతామా, బ్రహ్మలోకానికి వెడతాం. శత్రువులను సంహరిస్తామా, కీర్తీ సంపదా, సుఖాలూ అనుభవిస్తాం. కుంభకర్ణుడు రాముని కళ్లబడ్డా డంటే మరి బతకడు. ఒక్క కుంభకర్ణుణ్ణి చూసి, ఇంతమందిమి మనం పారిపోతే యిన్నాళ్లూ కూడబెట్టుకున్న మన కీర్తి అంతా నాశనం కాదూ?" అని నిష్ఠురా లాడాడు.

దీనిమీద వానరులు పారిపోతూనే "కుంభకర్ణుడు మమ్మల్ని చంపేస్తున్నాడు. ఇది యిక్కడ ఉండవలసిన సమయం కాదు. జీవితం అంటే మాకు చాలా యిష్టం" అన్నారు; కాని, అంగదుడు బతిమాలీ ప్రోత్సహించీ వాళ్లనందరినీ మళ్లించాడు. ఇంతలో హనుమంతుడు వచ్చి

కలుసుకోగా వారంతా సుగ్రీవుని ఆజ్ఞకోసం యెదురుచూస్తూ నిలిచి పోయారు. వెంటనే ఋషభుడూ, శరభుడూ, మైందుడూ, ధూమ్రుడూ, నీలుడూ, కుముదుడూ, సుషేణుడూ, గవాక్షుడూ, రంభుడూ, తారుడూ, ద్వివిదుడూ, పనసుడూ, హనుమంతుడూ మొదలైనవా రందరూ యుద్ధానికిన్ని వురికారు.

## ౬౭

## రాముడు కుంభకర్ణుణ్ణి చిత్రవధ చెయ్యడం

మహాకాయు లైన ఆ వానరవీరు లందరూ అంగదుని మాటమీద వెనక్కి వచ్చి దృఢనిశ్చయంచేసుకుని సంకులసమరం ప్రారంభించారు. చెట్లూ, బండరాళ్లూ పర్వతశిఖరాలూ పుచ్చుకుని కుంభకర్ణునిమీద విరుచుకుపడ్డారు. దాంతో మిక్కిలీ క్రుద్ధుడై కుంభకర్ణుడు గద పుచ్చు కుని వానరులను సంహరించసాగాడు. ఒక్కొక్క గదాప్రహారానికి ఏడేసి వందలూ యెనిమిదేసివందలూ వెయ్యేసిమందీ వానరులు కూలిపోసా గారు. పైగా, ఆ కుంభకర్ణుడు, ఒక్కొక్కమాటు పదేసిమందినీ, యిర వయ్యేసిమందినీ, ముప్ఫయ్యేసిమందినీ నోటబెట్టుకుని మింగెయ్యసాగాడు. దాంతో వానరులు మళ్లీమళ్లీ పారిపోతూ, అంగదుని మాటలమీద మళ్లీమళ్లీ నిలవరించుకుంటూ యుద్ధం సాగించారు.

ద్వివిదుడు ఒకపర్వతం పెకలించుకువచ్చి కుంభకర్ణునిమీద వేశాడు; కాని అది గురితప్పి రాక్షససేనమీద పడింది. దానికింద పడి అనేక గుర్రాలూ, అనేకయేనుగులూ, అనేకరథాలూ, అనేకమంది రాక్షస యోధులూ గుండ అయిపోయారు. ద్వివిదుడు మరోపర్వతం తెచ్చి వేశాడు. దానికిందపడి రాక్షసులు గుర్రాలతోనూ యేనుగులతోనూ, రథాలతోనూ అంతకంటే యెక్కువమంది చనిపోయారు. రాక్షసరథి కులు కాలసర్పాలవంటి బాణాలతో వానరుల ననేకమందిని సంహరిం

చారు. దానికి బదులుగా వానరులున్నూ చెట్లు పెరికి తెచ్చి గుర్రాలూ యేనుగులూ, రథాలూ, లొట్టిపిట్టలూ, గాడిదలూ యెక్కి యుద్ధం చేస్తున్న రాక్షసుల ననేకులను సంహరించారు.

ఇలావుండగా హనుమంతుడు ఆకాశానవచ్చి కుంభకర్ణునిమీద పర్వతశిఖరాలూ చెట్లూ పడేశాడు. కాని కుంభకర్ణుడు శూలంతో వాటినన్నిటినీ ఛేదించేసి ఆ శూలంతో వానరులమీద విరుచుకు పడ్డాడు. అది చూసి హనుమంతుడు ఒక పర్వతశిఖరం తెచ్చి వాడి గుండెలమీద కొట్టాడు. ఆ దెబ్బతో కుంభకర్ణుడు ముక్కునా నోట్టా రక్తం కక్కుకున్నాడు. శరీరం అంతా నెత్తురుకొల్లు అయిపోయింది. మూర్ఛకూడా తలచూపింది; కాని నిలవరించుకుని ఆ శూలంతో హనుమంతుని గుండెలమీద పొడిచాడు. దాంతో హనుమంతుడు కూడా రక్తం కక్కుకుంటూ కొంచెం వూగాడు. అది చూసి రాక్షసులు విజృంభించారు. వానరు లనేకులు తోకముడిచారు.

అప్పుడు నీలు డడ్డుపడి వానరుల నాపుచేసి పర్వతశిఖరం వొకటి కుంభకర్ణునిమీద విసిరాడు. దాన్ని కుంభకర్ణు డొక్క గుద్దుగుద్ది పిండి చేసేశాడు. వెంటనే ఋషభుడూ, శరభుడూ, నీలుడూ, గవాక్షుడూ, గంధమాదనుడూ, పర్వతాలూ వృక్షాలూ పుచ్చుకుని కుంభకర్ణుని మీద పడ్డారు. అరిచేతులతో చరిచారు. కాళ్లతో తన్నారు; కాని అవన్నీ కుంభకర్ణునకు ఈగవాలినట్టయినాయి. పైగా ఋషభుణ్ణి కౌగ లించుకుని గట్టిగా నొక్కాడు. దాంతో నెత్తురు కక్కుకుంటూ వాడూ పడిపోయాడు. తరవాత, కుంభకర్ణుడు శరభుణ్ణి ఒక్క గుద్దు గుద్దాడు. నీలుణ్ణి మోకాటిపోటు పొడిచాడు. గవాక్షుణ్ణి అరిచేతితో ఒక్క చరుపు చరిచాడు. గంధమాదనుణ్ణి ఒక్క తాపుతన్నాడు. వారందరూ రక్తం కక్కుకుంటూ పడిపోయారు.

పెరిగిపోయి కుంభకర్ణుణ్ణి చంపేస్తే ? సుగ్రీవుణ్ణి విడిపించడమూ, కుంభకర్ణుణ్ణి చంపడమూ ఈరెండూ చూసి వానరులు చాలా సంతోషిస్తారు. ఇంతకీ: సుగ్రీవుడు తనని దేవతలు పట్టుకున్నా, నాగులు పట్టుకున్నా విడిపించుకోగలడే ? రాళ్ళదెబ్బ తగిలి మూర్ఛరావడంవల్ల సుగ్రీవు డిప్పుడు జరుగుతున్నది తెలుసుకోలేకుండా వున్నాడు. అతను తేరుకున్నాడంటే తనకీ వానరులకూ మేలుకలిగేటట్టు చెయ్య గలడు. నేను విడిపిస్తే సుగ్రీవునకు అపకీర్తి వస్తుంది. దాంతో అతనికి కోపమున్నా వస్తుంది. అంచేత, నేను భారం అంతా సుగ్రీవుని పరాక్రమంమీదే వుంచి పారిపోతున్న వానరులను ధైర్యంచెప్పి మళ్ళిస్తాను" అనుకుని వానరులను మళ్ళీ నిలుపుచేశాడు.

కుంభకర్ణుడు సుగ్రీవుణ్ణెత్తుకుని లంకలోకి బయలుదేరాడు. అతని మీద రాక్షసులూ, రాక్షసాంగనలూ పువ్వులు చల్లారు. పేలాలు చల్లారు. సుగంధజలాలు చల్లారు. దాంతో అదివరకే కదులుతున్న సుగ్రీవుడు తేరుకున్నాడు. తనని కుంభకర్ణుడు ఎత్తుకుని లంకావీధులలో వెడుతూ వుండడం అతనికి తెలిసింది. "అయ్యో, నేనిప్పుడు కుంభకర్ణునిచేతిలో చిక్కిపోయానే ? ఏమిటీ చెయ్యడం ? ఏంచేస్తే వానరులకు ఇష్టమూ ప్రీతీ, హితమూ కలుగుతుందో అది చేస్తాను" అనుకుని అతను వెంటనే గోళ్లతో కుంభకర్ణుని చెవులు గిల్లి తెంచిపారేశాడు. ముక్కు కొరికి పారేశాడు. పైగా, పొట్టమీదా పక్కలూ కరిచాడు. దానికి మిక్కిలీ కోపించి కుంభకర్ణుడు సుగ్రీవుణ్ణి నేలనిబెట్టి రాశాడు. రాక్షసులు అనేకవిధాల కొట్టారు. అయినా, తప్పించుకుని, సుగ్రీవుడు, ఒక్క ఎగురెగిరి రాముని దగ్గిరికి వెళ్ళిపోయాడు.

ముక్కూ చెవులూ పోగా రక్తం కార్చుకుంటూ కుంభకర్ణుడు సెలయేళ్లతో నిండిన పర్వతంలా వున్నాడు. సుగ్రీవుడు తప్పించుకుని

పోడం చూసి అతను మరీ మండిపడి మళ్లీ యుద్ధరంగంలోకి బయలు దేరాడు. "అయ్యో, ఆయుధంపోయిందే?" అనుకుని అతను ముద్గరం అందుకుని బయలుదేరాడు. అయితే, ఆకోపంతో అతను రాక్షసు లెవరో వానరు లెవరో గుర్తించలేక చేతికందినవాళ్ల నల్లా, వాళ్లనీ వీళ్లనీ కూడా సంహరించసాగాడు. అది చూసి క్రుద్ధుడై లక్ష్మణుడు యుద్ధం ప్రారంభించాడు. అతను ముందు కుంభకర్ణుని శరీరాన ఏడు బాణాలు నాటించాడు. తరవాత మరికొన్ని బాణాలు ప్రయోగించాడు; కాని కుంభకర్ణుడు లక్ష్మణుణ్ణి విడిచి రాముని మీాదికి దుమికాడు. వెంటనే రాముడు రౌద్రాస్త్రం ప్రయోగించికుంభకర్ణుని గుండెలమీాద పదునైన బాణాలు నాటించాడు. ఆదెబ్బతిని రామునిమీాది కురికిన కుంభకర్ణుని నోట అగ్నిజ్వాలలు వెలువడ్డాయి. దాంతో అతను వానరులను నాశనంచెయ్యసాగాడు. రాముడు మళ్లీ బాణాలువేసి కుంభకర్ణుని చేతిలో వున్న గద పడగొట్టాడు. అతని చేతవున్న మరికొన్ని ఆయుధాలున్నూ దాంతోపాటు కిందపడిపోయాయి. ఇలాగ నిరాయుధుడయిపోయిన కుంభకర్ణుడు చేతులతోనూ కాళ్లతోనూ యుద్ధంప్రారంభించాడు. కోపఘూర్ణితుడై రాక్షసులనూ వానరులనూ కూడా తిని వెయ్యసాగాడు. ఆస్థితిలోనే వాడు పర్వతశిఖరంవొకటి రాముని మీాదికి విసిరాడు; కాని రాముడు ఏడుబాణాలతో అది అంతరిక్షాన వుండగానే పిండిపిండిచేశాడు; అప్పుడు కుంభకర్ణుడు రెండువందల వానరులను నలిపివెయ్యడానికి బయలుదేరగా రాముడు వాణ్ణి నేల మీాద పడేటట్టు కొట్టాడు. ఇదంతా చూస్తున్న లక్ష్మణుడు కుంభకర్ణుణ్ణి చంపడాని కనేకోపాయా లాలోచించి "అన్నా! రక్తగంధంవల్ల మత్తుడై వీడు వానరులనీ రాక్షసులనీ భేదం గుర్తించకుండా దొరికిన వాళ్ల నందరినీ మింగేస్తున్నాడు. కనక, ఇప్పుడు వానరులు వీడిమీాద ఎక్కితే చాలామంచిది. వానరప్రముఖులు వీణ్ణి కదలకుండా చెయ్యడం

కూడా చాలా మంచిది. దాంతో వీడు కిందపడిపోతాడు. వానరులకు రక్షణ కలుగుతుంది" అని చెప్పాడు.

ఆమాట వినడమే తడవుగా కిచకిచ కూస్తూ వానరులు వాడిమీది కెగిరికూచున్నారు; కాని వాడు పెద్దయేనుగు మావటివాళ్లను విదలించికొట్టేటట్టు వానరులను విదలించాడు. అది చూసి రాముడు "వీడు చాలా దురాత్ముడు" అని తలచి మళ్లీ ధనస్సు ఎత్తాడు. అది చూసి వానరులు విజృంభించారు. రాముడు నారి మోగించాడు. దాంతో మిక్కిలీ క్రుద్ధుడై వాడు రానిముకేసి తిరిగాడు. అప్పుడు రాముడు "రాక్షసరాజా! కుంభకర్ణా! భయపడకు, రా. నేనిదే సిద్ధంగా వున్నాను. నేనే రాముణ్ణి. క్షణంలో నిన్ను చంపేస్తాను" అని చెప్పాడు. అది విని కుంభకర్ణుడు వికృతంగా నవ్వి చాలా క్రోధం వహించి వానరులను పారదోలుతూ రామునిమీదికి బయలుదేరి "రామా! నేను విరాధుణ్ణి కాను. కబంధుణ్ణి కాను. ఖరుణ్ణి కాను. వాలిని కాను. మారీచుణ్ణి కాను. నేను కుంభకర్ణుణ్ణి వచ్చాను. ఇదిగో మంచియినుముతో చేసిన నాముద్గరం చూశావా? దీంతో నేనిదివరలో యెందరో దానవులనూ దేవతలనూ సంహరించాను. నాముక్కూ చెవులూ తెగిపోయా యని చులకనగా చూడకు. అవిలేకపోవడం వల్ల నాకు లేశమూ బాధలేదు. కనక, ఇక్ష్వాకుశార్దూలా! ఏదీ, నామీద నీబలం కొంచెం చూపించూ, తరవాత నీపౌరుషం గుర్తించి నిన్ను తినేస్తాను" అని పలికాడు.

వెంటనే రాముడు మంచి బాణాలు విడిచాడు; కాని వాటివల్ల కుంభకర్ణుడు జంకలేదు. అవి సప్తతాళాలనూ భేదించిన బాణాలు. వాలిని సంహరించిన బాణాలు; కాని అవి కుంభకర్ణుణ్ణి ఏమీ చెయ్యలేకపోయాయి. కుంభకర్ణుడు ఆ బాణాలు ముద్గరంతో గిరగిరతిప్పి

కొట్టాడు. దాంతో వానరులను కూడా కొట్టాడు. అది సహించక రాముడు వాయవ్యాస్త్రం ప్రయోగించాడు. దాంతో కుంభకర్ణుని కుడిచెయ్యి తెగి ముద్గరంతో కూడా కిందపడిపోయింది. కుంభకర్ణుడా దెబ్బతిని, పెడబొబ్బలుపెట్టాడు. ఆ ముద్గరంకింద పచ్చడి అయిపోయి కొందరు వానరులు చచ్చిపోయారు. పారిపోగానూ, చావగానూ మిగిలివున్న వానరులు మహాభయంకర మైన రామకుంభకర్ణుల ద్వంద్వ యుద్ధం చూడసాగారు. కుంభకర్ణుడు వెంటనే రెండోచేత్తో వొక చెట్టు పెరికి బయలుదేరాడు. రాముడు ఐంద్రాస్త్రం ప్రయోగించి ఆ చెయ్యి కూడా తెగకొట్టేశాడు. ఆ చేతికింద పడి కొన్ని బండరాళ్లు గుండ అయిపోయాయి. కొన్ని చెట్లు పిప్పి అయిపోయాయి. వానరరాక్షస వీరులు కొందరు ముద్దఅయిపోయారు. అక్కడికీ కుంభకర్ణుడు పెడబొబ్బలుపెడుతూ బయలుదేరాడు. వెంటనే రాముడు రెండు అర్థచంద్ర బాణాలు తొడిగి వాడి పాదాలు రెండూ నరికేశాడు. ఆ కాళ్లు తెగి పడిపోయినప్పుడు పెద్ద ధ్వని అయింది. దాంతో గుహలు పిక్కటిల్లాయి. సముద్రం తటతటలాడింది. ఆకాశం బొబ్బరించింది.

చేతులూ కాళ్లూ తెగిపోయినా నోరుతెరుచుకుని కుంభకర్ణుడు రాహువులాగ బయలుదేరాడు. వెంటనే రాముడు వాడి నోటినిండా బాణాలు గుప్పించాడు. దాంతో వాడికి మాట తిరగలేదు. మూర్ఛ కూడా వచ్చింది. అప్పుడు రాముడు మళ్లీ ఒక బాణం తొడిగాడు. అది సూర్యునితో సమానం. బ్రహ్మదండానికి సాటి. యమునకు దీటు. అది యింద్రనిర్మితం. అనగా ఐంద్రాస్త్రం. దాంతో ఇంద్రుడు వృత్రాసురుణ్ణి సంహరించినట్టు, రాముడు తలనరికి కుంభకర్ణుణ్ణి సంహరించాడు. ఆ దెబ్బకి ఆకాశాని కెగిరిపోయిన ఆ తల చంద్రబింబంలా మెరిసి కింద పడి ప్రాకారాలూ గోపురాలూ చూర్ణంచేసింది. కుంభకర్ణుని మొండెం కూడా కొండవిరిగిపడ్డట్టు పడిపోయింది. దానికింద పడి వానరులూ

రాక్షసులూ కూడా అనేకులు నలిగిచచ్చిపోయారు. ఆపాటుకి సము ద్రంలో వున్న జలజంతువులు కూడ హడలి చచ్చిపోయాయి.

అది చూసి దేవతలు మిక్కిలీ ఆనందించారు. దేవతలూ, గంధ ర్వులూ, మహర్షులూ, నాగులూ గుహ్యాకులూ, యక్షులూ, గంధ ర్వులూ చాలా పొగిడారు. రాక్షసులు గోలె త్తేశారు. రాహు విము క్తుడై సూర్యుడు చీకట్లు పోగొట్టేటట్టు రాముడు కుంభకర్ణుణ్ణి వధించి వానరసేన మధ్య మిక్కిలీ ప్రకాశించాడు. వానరులు మిక్కిలీ సంతో షించి రాముణ్ణి పూజించారు.

## ౬౮

## కుంభకర్ణుని చావువిని రావణుడు దుఃఖించడం

రాక్షసులు వెళ్లి కుంభకర్ణుడు చనిపోయా డని రావణునకు చెప్పారు. "రాజేంద్రా! మృత్యువుతో సమాను డైన కుంభకర్ణుడు వానరులను భక్షించీ, పారదోలీ చివరికి మరణించాడు. అతను కొంచెంసేపు మిక్కిలీ పరాక్రమించాడు; కాని రాముని తేజస్సు యెదట నిలవలేకపోయాడు. అతని మొండెం సగం సముద్రంలో పడింది. అతని తల లంకాద్వారం కప్పేసింది. అతని కాళ్లూ చేతులూ యుద్ధరంగం నిండిపోయాయి. రామబాణాలతో అతను ముద్దయిపోయాడు. శుష్కవృక్షం దావాగ్ని తగిలి మండిపోయినట్టు అతను చనిపోయా" డని వివరంగా చెప్పారు.

అది విని రావణుడు మూర్ఛపడిపోయాడు. పినతండ్రి మృతి విని దేవాంతకుడూ, నరాంతకుడూ, త్రిశిరుడూ, అతికాయుడూ మిక్కిలీ దుఃఖించారు. సోదరుడు చనిపోయినందుకు మహోదరుడూ, మహాపా ర్శ్వుడూ కూడా శోకాక్రాంతు లైనారు. తరవాత చాలాకష్టంమీద తేరుకుని రావణుడు కుంభకర్ణుణ్ణి తలుచుకుని యిలా విచారించాడు.

"వీరాధివీరా! శత్రుదర్పఘ్నా! కుంభకర్ణా! నువ్వు నన్ను విడిచి వెళ్లిపోయావా? నామనశ్శల్యం పెరికివారెయ్యకుండానూ, బంధువుల

మనఃపీడ తొలగించకుండానూ శత్రువులను మాత్రం పీడించి వెళ్లిపోయావా? ఎవణ్ణి చూసుకుని నేను సురాసురలకు కూడా భయపడకుండా వున్నానో ఆనా కుడిభుజం పడిపోయింది. ఇక నేనున్నా నన్న మాట యేమిటీ? దేవతలకూ దానవులకూ లొంగని నువ్వు రాముని చేతిలో ఎలా చచ్చిపోయావు తండ్రీ? వజ్రాయుధం కూడా నిన్నేమీ చెయ్యలేకపోయింది. నువ్వు రామబాణార్తుడ వయిపోయావా? ఇదే దేవతలూ, ఋషులూ ఆకాశన చేరి నువ్వు చచ్చిపోయినందుకు ఆనంద ధ్వానాలు చేస్తున్నారు. మహాసంతోషంతో వానరు లిప్పుడే లంకా ద్వారా లాక్రమించేస్తారు కామోసు. ఇక నాకు రాజ్యం యెందుకూ? సీతమాత్రం యెందుకూ? కుంభకర్ణుడు లేని నాకు బతుకే భారంకదా? నాసోదరుణ్ణి చంపిన రాముణ్ణి నేను చంపనైతిని. నాజీవితం కాల్చనా? నాకిప్పుడు మరణమే శ్రేయస్కరం కదా? నేను నాతమ్ముణ్ణి విడిచి క్షణం అయినా వుండలేను. అత నెక్కడ వున్నాడో అక్కడికే వెళ్లిపోతాను. వెనకటి అపకారాలు తలుచుకుని దేవత లిక నన్ను బాధిస్తారు. కుంభకర్ణా! నువ్వు పోయాక నేనిక యింద్రుణ్ణెలా జయించగలనూ? మహాత్ముడైన విభీషణుడు చెప్పినమాట నాకప్పుడు వినపడింది కాదు. కుంభకర్ణుడూ ప్రహస్తుడూ చచ్చిపోడంవల్ల విభీషణుని మాట తలుచుకుంటే నాకిప్పుడు సిగ్గవుతోంది. ధార్మికుడైన విభీషణుణ్ణి నేను లేవగొట్టేశాను. ఆదార్జన్యమే నాకిలాంటి దురవస్థ కలిగించింది"

ఇలాగ వగచివగచి రావణుడు మళ్లీ మూర్ఛిల్లాడు.

## ౬౯

## అంగదుడు నరాంతకుణ్ణి చంపడం

రావణు డిలా దుఃఖిస్తూవుండడం చూసి అతని కొడుకైన త్రిశిరుడు "మాపినతండ్రికుంభకర్ణుడు మహాపరాక్రమవంతు డయినా దారు

ణంగా చనిపోడం నిజమే; కాని రాజేంద్రా! నీవంటి సత్పురుషులిలా దుఃఖించరు. నిజంగా నువ్వు త్రిలోకాలకూ చాలినవాడవు. ప్రాకృతుడు లాగ దుఃఖించడం ధర్మంకాదు. నీకు బ్రహ్మ యిచ్చిన శక్తీ, కవచమూ, బాణమూ, ధనుస్సూ, వేయిగాడిదలు కట్టే రథమూ ఉన్నాయి. శస్త్రం లేకుండానే నువ్వనేకమార్లు దేవతలను జయించావు. సర్వాయుధసంపన్నుడవై రాముణ్ణి చంపలేకపోవు. నువ్విక్కడే నిశ్చలంగా వుండు. నేను వెళ్లి గరుత్మంతుడు సర్పాలను నాశనంచేసేటట్టు నీశత్రువులను రూపుమాపేస్తాను. దేవేంద్రుడు శంబరుణ్ణి చంపినట్టూ, విష్ణువు నరకుణ్ణి చంపినట్టూ నేను రాముణ్ణి నరికేస్తాను” అని వూరడించాడు.

త్రిశిరుని మాట విని రావణుడు తాను చచ్చి మళ్లీ బతికినట్టనుకున్నాడు. త్రిశిరుని మాట విని దేవాంతకుడూ, నరాంతకుడూ, అతికాయుడూ, నేను నేనంటూ గర్జిస్తూ యుద్ధానికి సిద్ధపడ్డారు. వీరందరూ రావణుని కుమాళ్లు. అందరూ ఆకాశయానం చెయ్యగలరు. అందరూ గొప్పగొప్ప మాయలు చెయ్యగలరు. అందరూ ఇదివరలో దేవతలను జయించినవారు. అందరూ దుర్జయులు. అందరూ మహాబలపరాక్రమవంతులని ప్రఖ్యాతిగన్నవారు. అందరూ ఎలాంటి యుద్ధంలోనూ పరాజయం పొంది యెరగనివారు. అందరూ సకలాస్త్రాలూ తెలిసి సకల యుద్ధమర్మాలూ యెఱిగినవారు. అందరూ విజ్ఞానవేత్తలు. అందరూ వరాలు సంపాదించినవారు. అలాంటి కొడుకులతో పరివృతుడై రావణుడు దేవేంద్రుడు లా వున్నాడు.

రావణుడు వారిని కౌగిలించుకుని, ఆభరణాలతో అలంకరించి ఆశీర్వదించి పంపించాడు. అతను తన కొడుకుల రక్షణకోసం వారివెంట మహావీరులైన తన తమ్ములు మహోదరుణ్ణీ మహాపార్శ్వుణ్ణీ కూడా పంపించాడు. ఏనుగులవంటి ఆ మహావీరు లందరూ రావణునకు ప్రద

క్షిణ నమస్కారాలు చేసి బయలుదేరారు. మహోదరుడు నీలజీమూతంవంటి యేనుగెక్కాడు. అది ఐరావతం కుటుంబంలోది. దానిపేరు సుదర్శనం. దానిమీద సకలాయుధాలూ, అంబులపొదులూ సిద్ధంగా వున్నాయి. త్రిశిరుడు గొప్పగుర్రాలు పూన్చిన రథం యెక్కాడు. దానిమీది కూడా సకలాయుధాలూ సిద్ధంగా వున్నాయి. ఆ రథం మీద అతను పర్వతశిఖరాన మెరుపులతోనూ ఉల్కలతోనూ ఇంద్ర ధనుస్సుతోనూ మెరుస్తున్న నీలమేఘంలా వున్నాడు. అతను మూడు శిరస్సులకూ మూడు కిరీటాలు ధరించి మూడు కాంచన శిఖరాలతో రమణీయం అయివున్న హిమవత్పర్వతంలా వున్నాడు. అతికాయుడు కూడా మంచి రథం యెక్కాడు. అతను గొప్పధానుష్కుడు. రథమున్నూ చాలా చక్కనిది. దానిమీద కూడా సకలాయుధాలూ కూర్చిపెట్టారు. నరాంతకుడు మనోజవంగల గొప్పగుర్రం యెక్కాడు. అతను ప్రాసా శక్తీ ధరించి వున్నాడు. నెమిలిమీద ఆరోహించిన కుమారస్వామిలా మెరిసిపోతూ బయలుదేరా డతను. దేవాంతకుడు వజ్రాలు పొదిగిన పరిఘ పట్టుకుని, మందరపర్వతం పట్టుకుని వున్న మహావిష్ణువులా వున్నాడు. మహాకాయుడైన మహాపార్శ్వుడు గద పుచ్చుకున్నాడు.

వారివెంట రథాలమీదా, యేనుగులమీదా, గుర్రాలమీదా గొప్పగొప్ప యోధులూ లెక్కలేనంతమంది పదాతులూ కూడా బయలుదేరారు. కిరీటాలు ధరించివున్న ఆరాజపుత్రులు ఆకాశాన మహోజ్వలగ్రహాలలా అన్నట్టున్నారు. వారు పట్టుకున్న ఆయుధాల ధవళకాంతిపుంజాలు నీలాకాశాన బారులు తీరిన హంసల్లా వున్నాయి. వారందరూ కూడా "శత్రువులను చంపనైనా చంపాలి; లేకపోతే, చావనైనా చావాలి" అని స్థిరనిశ్చయం చేసుకుని బయలుదేరారు. పరాక్రమవంతులూ, యుద్ధదుర్మదులూ అయిన .. ఆ రాక్షసులు

గర్జిస్తూ సింహనాదాలు చేస్తూ శత్రువులను తూలనాడుతూ నారి మోగిస్తూ వెళ్ళారు. వారి అరపులతోనూ జబ్బచరుపులతోనూ భూమి గజగజలాడిపోయింది. వారి సింహనాదాలతో ఆకాశం పగిలిపోయింది.

వారందరూ వెళ్ళి రాళ్ళూ రప్పలూ పట్టుకునివున్న వానరసైనికులను చూశారు. వానరులు కూడా రథాలమీదా, ఏనుగుల మీదా, గుర్రాలమీదా సకలాయుధాలూ ధరించివచ్చిన రాక్షస యోధులను చూశారు. వెంటనే మొదట వానరులూ వారిని చూసి తరవాత రాక్షసులూ సింహనాదాలు చేస్తూ పరవళ్ళుతొక్కారు. ఆకాశాని కెగిరి కొందరూ కుప్పిగంతులు వేస్తూ కొందరూ భూమి మీదే వుండి కొందరూ రాక్షసబలగంమీద పడి వానరులు రాళ్ళతోనూ రప్పలతోనూ యుద్ధం ప్రారంభించారు. చూస్తూండగా పోరు ఘోరం అయిపోయింది. రాక్షసులు ప్రయోగించిన బాణాల దెబ్బలకు తాళుకుంటూ వానరులు బండరాళ్ళూ పెద్దపెద్ద చెట్లూ విసిరి రాక్షసులను సంహరించసాగారు. కొందరు రథికులమీద పడ్డారు. కొందరు అశ్వికులమీద పడ్డారు. కొందరు ఏనుగులమీద పడ్డారు. కాల్బంటుల్లో కలిసేపోయారు. గుద్దులూ, తాపులూ, పోట్లూ, చరుపులూ రాళ్ళ దెబ్బలూ తిని రాక్షసులు రక్తం కక్కుకో సాగారు. రాక్షసులు కూడా ఇందకు తీసిపోకుండా వానరులను సంహరించారు. కొంతసేపటికి వానరులు ప్రయోగించిన రాళ్ళూ రప్పలతోనూ, రాక్షసులు ప్రయోగించిన ఆయుధాలతోనూ, ఉభయవర్గాల రక్తమాంసాలతోనూ నిండిపోయి యుద్ధభూమి అడుగుపెట్టడానికి తెరపిలేకుండా అయిపోయింది. వానరులు రాక్షసులతోనే రాక్షసులను బాదసాగారు. రాక్షసులున్నూ వానరులతోనే వానరులను కొట్టసాగారు. వానరులు విసిరిన రాళ్ళు ఒడిసిపట్టుకుని రాక్షసులు తిప్పికొట్టి వానరులను సంహరించసాగారు. వానరులు రాక్షసులచేతిలో వున్న ఆయుధాలు పెరుకుకుని

వాటితోనే రాక్షసులను సంహరించసాగారు. రాక్షసులు, కవచాలు చిరిగి కత్తినాటులు తగిలి పాలుకారే వృక్షాల్లాగ రక్తం కార్చుకుంటూనే పోరారు. వానరులు రథం పుచ్చుకుని రథంమీద వేసికొట్టీ, యేనుగును పట్టుకుని యేనుగుమీద వేసికొట్టీ, గుర్రంతోనే గుర్రాలను కొట్టీ భీషణంగా పోరారు.

ఆ దొమ్మిలో రాక్షసులు క్షీణిస్తూవుండడమూ వానరులు ఉద్రిక్తులవుతూ వుండడమూ చూసి ఆకాశాన దేవతలూ మహర్షులూ, యక్షులూ, గంధర్వులూ జయధ్వానులు చేస్తూ మిక్కిలీ ఆనందించారు. అప్పుడు వాయువేగం అయిన గొప్పగుర్రం యెక్కి పదునైన శక్త్యాయుధం పుచ్చుకుని నరాంతకుడు మహాసముద్రంలో పెద్దచేపలాగ వానర సైన్యంలో జొరబడ్డాడు. ఒక్కక్షణంలో వాడు ఏడువందల వానరులను సంహరించాడు. వాడు మార్గం అంతా వానరకళేబరాలతో నింపేస్తూనే ముందుకి సాగాడు. వానరులు మీద పడదా మనుకుంటూ వుండగానే వాడు వాళ్లని సంహరించేస్తూ వచ్చాడు. వానరులు విసిరిన చెట్లన్నీ వాడు తన కత్తితో ముక్కముక్కలుగా పడగొట్టేశాడు. వర్షాకాలపు ఝంఝామారుతం లాగ వాడు యుద్ధభూమిలో తిరుగుతూ వుంటే వానరులు నిలవరించుకోలేక పోయారు. వాళ్లు పారిపోలేక పోయారు. నుంచోనూలేక పోయారు. ఎగరలేక పోయారు. వాడి ధాటి కాగలేక వానరులు గగ్గోలు పడిపోయారు.

అంతకి ముందు కుంభకర్ణునిచేతిలో మూర్ఛపడ్డ వానరయోధులు తేరుకునివుండి సుగ్రీవుని దగ్గిరికి చేరుకున్నారు. నరాంతకుణ్ణి ఎదిరించలేక భయభ్రాంతులై వానరులు కంగారుపడుతూ వుండడమూ గుర్రం యెక్కి కత్తిజళిపిస్తూ నరాంతకుడు కాలయముడులాగ తిరుగుతూ వుండడమూ చూసి సుగ్రీవుడు "వెళ్లి వాణ్ణెదిరించు, చూస్తావేం?

త్వరగా వధించిరా” అంటూ గర్జించాడు. ఆ మాట వినడమే తడవుగా అంగదుడు వెళ్ళిపడ్డాడు. ఆయుధాలు లేక గోళ్ళూ పళ్ళూ మాత్రమే గల అంగదుడు నరాంతకుణ్ణి చూసి “ఆగు, ఈ ప్రాకృతుల మీదనా నీ ప్రతాపం చూపించడం? చేతనైతే నీప్రాస నాగుండెల మీద వెయ్యి” అంటూ ఉరిమాడు. అది విని మిక్కిలీ రుష్టుడై పెదవి కొరుక్కుంటూ రోజి నరాంతకుడు అంగదుని మీద ప్రాస విసిరేశాడు; కాని అంగదుని గుండెలమీద పడి అది రాతిమీద పడ్డ గాజుపెంకులాగ పొడిపొడిఅయి కిందపడిపోయింది. దాంతో ఉద్రిక్తుడై అంగదుడు అరిచేత్తో ఒక్క చరుపు చరిచి ముందు గుర్రాన్ని చంపేశాడు. దానిమీద మహోద్రిక్తుడై నరాంతకుడు పిడికిలి బిగించి అంగదుని నెత్తిమీద పిడుగులాంటి వొక్క మొట్టు మొట్టాడు. దాంతో అంగదుని ముక్కునా నోటా రక్తం వచ్చింది. కొంచెం తల తిరిగింది; కాని క్షణంలో తేరుకుని అంగదుడు అంతకంటే గట్టిగా పిడికిలి బిగించి నరాంతకుని గుండెలమీద పొడిచాడు. వెంటనే రక్తం కక్కుకుంటూనూ, కళ్ళు తేలవేసుకుంటూనూ కిందపడి నరాంతకుడు విలవిల తన్నుకుని ప్రాణాలు విడిచాడు. అది చూసి అంతరిక్షాన దేవతాగణమూ, కింద వానరవీరులూ ఆనందధ్వానాలు చేశారు.

## ౭౦

## హనుమంతుడు దేవాంతకుణ్ణి చంపడం

నరాంతకుడు చచ్చిపోడం చూసి దేవాంతకుడూ, త్రిశిరుడూ, మహోదరుడూ మిక్కిలీ దుఃఖించారు. మహోదరుడు వెంటనే మిక్కిలీ రుష్టుడై యేనుగునెక్కి అంగదునిమీది కురికాడు. దేవాంతకుడు పరిఘ పుచ్చుకుని బయలుదేరగా, సూర్యమండలంలాగ వెలిగిపోతున్న రథమెక్కి త్రిశిరుడు విజృంభించాడు. ఇలాగ ఏకకాలంలో ముగ్గురు రాక్షు

సవీరులు తనమీదికి వచ్చినా జంకక అంగదు డొక పెద్దచెట్టు పెరికి దేవాంతకునిమీద విసిరాడు ; కాని త్రిశిరుడు దాన్ని ఆకాశాన వుండ గానే ముక్కముక్కలు చేసేశాడు. అందుకు కినిసి అంగదుడు చెట్లూ బండరాళ్లూ లెక్కలేకుండా కలిపికొట్టాడు. త్రిశిరుడు నిశితబాణాలతో వాటినీ చూర్ణంచేసేశాడు. దేవాంతకుడు కూడా పరిఘతో వాటిని గుండచేస్తూ వుండగా త్రిశిరుడు నిశితబాణాలు వేస్తూ అంగదునిమీద విజృంభించాడు. ఏనుగుమీద వచ్చి మహోదరుడు తోమరాలు విసిరి అంగదుని వక్షస్థలంమీద కొట్టాడు. ఈసందుబాట్లో దేవాంతకుడు అతణ్ణి పరిఘతో కొట్టి మరోదెబ్బ కొట్టేవీలుకోసం వెనక్కి తగ్గాడు. అయినా అంగదుడు వెనుదీయక మహోదరు డెక్కిన యేనుగు నొక చరుపుచరిచాడు. ఆదెబ్బతో దానికళ్లు కిందపడిపోయాయి. అది గీపెట్టింది. అంతటితో వూరుకోక అంగదుడు దాని దంతం వూడబెరికి దేవాంతకుణ్ణి చావగొట్టాడు. దాంతో దేవాంతకుడు నోట రక్తం కక్కుకుంటూ తూలిపోయాడు ; గాని మళ్లీ అంతలో నిలవరించుకుని పరిఘతో అంగదుణ్ణి కొట్టాడు. ఆదెబ్బతిని అంగదుడు మొదట మోకరిల్లాడు ; కాని మళ్లీ లేచి విజృంభించాడు. అతను లేస్తూ వుండగా త్రిశిరుడు మూడు బాణాలతో నొసట కొట్టాడు.

అప్పుడు ముగ్గురు రాక్షసులు అంగదునిమీద పడి విజృంభించడం సహించలేక హనుమంతుడూ నీలుడూ వాళ్లమీద పడ్డారు. నీలుడు త్రిశిరునిమీద వొక పర్వతశిఖరం విసిరాడు ; కాని త్రిశిరుడు దాన్ని ఖండించేశాడు. ఈసందుబాట్లో దేవాంతకుడు పరిఘతో హనుమంతుని మీది కురికాడు ; కాని వాడింకా వస్తూవుండగానే హనుమంతుడు పిడికిలిబిగించి నెత్తిమీద మొట్టాడు. రాక్షసులు దద్దరిల్లిపోయేటట్టు ఒక్కపెడబొబ్బకూడా పెట్టాడు. ఆదెబ్బతో దేవాంతకుడు పళ్లూడిపోగా, గుడ్లు చితికిపోగా, నాలుక వేలాడగా నేలమీదపడి ప్రాణాలు విడిచాడు.

## నీలుడు మహోదరుణ్ణి చంపడం

దేవాంతకుడు పడిపోగా త్రిశిరుడు మండిపడి నీలునిమీద బాణవర్షం కురిశాడు. మహోదరుడున్నూ క్రుద్ధుడై మరొక యేనుగునెక్కివచ్చి, తానుగూడా నీలునిమీద బాణాలు గుప్పించాడు. దాంతో నీలుడు కొంతసేపు స్తబ్ధుడై నిలిచిపోయాడు; కాని అంతలో తేరుకుని వొక పర్వతంపెరికి మహోదరుని నెత్తిమీద వేసి కొట్టాడు. దాంతో మహోదరుడు కూడా కూలిపోయి ప్రాణాలువిడిచాడు.

## హనుమంతుడు త్రిశిరుని తలలు నరకడం

పినతండ్రి చావు చూసి మహోగ్రుడై త్రిశిరుడు నిశితబాణాలతో హనుమంతుణ్ణి ముంచెత్తాడు. హనుమంతు డవి తప్పించుకుని పర్వతశిఖరం విసిరాడు. త్రిశిరుడు దాన్ని పిండిచేశాడు. హనుమంతుడు మహోగ్రుడై త్రిశిరునిమీద చెట్టుమీద చెట్టుచొప్పున తెరపిలేకుండా విసిరాడు. త్రిశిరు డాచెట్లన్నీ నరికి సింహనాదం చేశాడు. అప్పుడు హనుమంతు డొక్క గంతువేసి ఒక్క చరుపుచరిచి త్రిశిరుని గుర్రాలను గిల్లీ, రక్కీ చంపేశాడు. దానిమీద చాలా కోపించి త్రిశిరుడు శక్తిని ప్రయోగించాడు. హనుమంతుడు ఉల్కలాగ వస్తున్న ఆ శక్తిని మధ్యనే పట్టుకుని వెదురుకర్ర విరిచినట్టున పెళ్ళున విరిచి సింహనాదం చేశాడు. అది చూసి వానరులందరూ మిక్కిలీ ఆనందంతో మేఘాల్లాగ ఉరిమారు. అప్పుడు త్రిశిరుడు కత్తి పుచ్చుకుని హనుమంతుణ్ణి గుండెలమీద కొట్టాడు. ఆదెబ్బ తిని హనుమంతుడు త్రిశిరుని గుండెల మీద ఒక్క చరుపు చరిచాడు. దాంతో వాడు కళ్ళు తిరిగిపోగా, కత్తివిడిచి నేలమీద పడిపోయాడు. హనుమంతు డాకత్తి పుచ్చుకుని రాక్షసులు భయభ్రాంతులయిపోయేటట్టు బొబ్బరించాడు. ఇంతలో త్రిశిరుడు లేచి హనుమంతుణ్ణి ఒక్కపోటుపొడిచాడు. ఆ దెబ్బతిని

హనుమంతుడు మిక్కిలీ రుష్టుడై వాడి తల పట్టుకుని కత్తితో మూడు తలలూ నరికిపారేశాడు. అవి నక్షత్రాల్లాగ నేలమీద పడ్డాయి. హనుమంతుడు త్రిశిరుణ్ణి చంపడంచూసి వానరులు సింహనాదాలు చేశారు. దాంతో భూమి కంపించింది. రాక్షసులు పారిపోయారు.

## ఋషభుడు మహాపార్శ్వుణ్ణి చంపడం

ఇలాగ త్రిశిరుడూ, మహోదరుడూ, దేవాంతకుడూ నరాంతకుడూ చనిపోడం చూసి మహాపార్శ్వుడు మిక్కిలీ కోపించి గదపుచ్చుకుని బయలుదేరాడు. అది యినుముతో చేశారు. దానికి బంగారపు పట్టీలు వేశారు. దానిమీద మాంసమూ రక్తమూ యిగిరిపోయి వున్నాయి. దానికి ఎర్రని పూలదండలు కట్టారు. ఐరావతమూ మహాపద్మమూ, సార్వభౌమమూ మొదలైన మహామహా యేనుగులు కూడా ఆ గద చూస్తే గజగజ వొణికిపోతాయి. అది పుచ్చుకుని వాడు వానరులమీద పడ్డాడు. అది చూసి ఋషభుడు "నుంచో" అంటూ వచ్చి వాడి యెదట నుంచున్నాడు. అందుకు మండిపడి మహాపార్శ్వుడు ఆ గదతో కొట్టాడు. ఋషభుడు రక్తంకక్కుకున్నాడు; గాని అంతలో తేరుకొని తోకతొక్కిన నల్లతాచులాగ మండిపడి ఆ గద పుళాక్కుని అది తిప్పితిప్పి మహాపార్శ్వుని నెత్తిమీద కొట్టాడు. దాంతో వాడి తల భళ్ళున కుండలాగ పగిలిపోయింది. గుడ్లురాలాయి. విలవిల తన్నుకుంటూ నేలమీద పడి నోరు తెరిచేశాడు. అది చూసి రాక్షససేన కట్ట తెగిన సముద్రంలాగ పారిపోయింది.

## ౭౧

## లక్ష్మణుడు బ్రహ్మాస్త్రం వేసి అతికాయుణ్ణి చంపడం

సైన్యం అంతా చెల్లాచెదరయిపోడమూ, సోదరులు చచ్చిపోడమూ, పినతండ్రులున్నూ మరణించడమూ చూసి అతికాయుడు మండిపడి

వెయ్యి సూర్యబింబాల్లాగ వెలిగిపోతున్న రథం యెక్కి తనపేరు చెబుతూ సింహనాదం చేస్తూ ధనుష్టంకారమున్నూ చేస్తూ బయలుదేరాడు.

ఆ సింహనాదమూ, ఆనేమివి[శావణమూ, ఆజ్యాశబ్దమూ వానరులను గడగడలాడించేశాయి. వానరులు అతికాయుణ్ణి చూసి కుంభకర్ణుడే లేచివస్తున్నాడనుకుని భయార్తులై ఒకణ్ణొకడు సాయంచూసుకని పారిపోసాగారు. కొందరు వెళ్ళి రాముణ్ణి శరణుజొచ్చారు.

రాముడు రథంమీద వస్తున్న పర్వతంవంటి ఆ రాక్షసుణ్ణి చూసి "విభీషణా! పర్వతంలా వున్నాడు వీ డెవడూ? వెయ్యిగుర్రాలు పూన్చిన రథంమీద వస్తున్నాడు. నిశితాలైన శూలాలూ, ప్రాసలూ, ముద్గరాలూ రథంనిండా వున్నాయి. ఆ ధనుస్సు చాలా గొప్పదిలా వుంది. రథానికి నలుగురు సారథు లున్నారు. రథంమీద యిరవైవొకచోటా, పదివొకచోటా, ఎనిమిది వొకచోటా అమ్ములపొదు లున్నాయి. రెండుఖడ్గా లున్నాయి. ఒక్కొక్కటి పదేసిమూళ్ళ పొడుగుంది. కాంచనాంగదా లలంకరించిన చేతులతో వీడు రెండు శిఖరాలతో హిమవత్పర్వతంలా తేజరిల్లుతున్నాడు. కుండలాలతో మెరిసిపోతున్న వీడిశిరస్సు పునర్వసునక్షత్రమధ్యగతం అయిన చంద్రబింబంలా వుంది. వీణ్ణి చూసి వానరులందరూ పారిపోతున్నారు. ఎవడు వీడు" అని అడిగాడు. అందుకు విభీషణుడు ఇలా చెప్పాడు.

"మహాతేజశ్శాలీ, కుబేరుని తమ్ముడూ, భీమకర్ముడూ, రాక్షసేశ్వరుడూ అయిన రావణు డున్నాడుగదా? వీడు అతని కొడుకు. వీడు వృద్ధసేవి. విద్యావంతుడు. సర్వాస్త్రవేత్తలకూ నాయకమణి. గుర్రంమీదా, రథంమీదా, యేనుగుమీదా, వీడు చాలా గొప్పగా యుద్ధం చేస్తాడు. ఖడ్గప్రహారంలోనూ, శస్త్రపాతనంలోనూ మిక్కిలీ నిపుణుడు. సామదానభేదదండోపాయాలు చక్కగా నేర్చినవాడు. వీడి బాహుబలమే లంకకు ఆధారం. వీడి తల్లి ధాన్యమాలిని. గొప్ప

తపస్సు చేసి వీడు బ్రహ్మను మెప్పించి గొప్పగొప్ప అస్త్రాలు సంపాదించి అనేకమంది శత్రువులను జయించాడు. రాక్షసులను రక్షించాడు. యక్షులను సంహరించాడు. తన బాణాలతో దేవేంద్రుని వజ్రాయుధం స్తంభింపచేశాడు. బ్రహ్మ వీడికి దేవాసురులవల్ల మరణం రాకుండా వుండేటట్టు వరమూ, కవచమూ, యీ రథమూ యిచ్చాడు. వీడు వరుణుని పాశం కూడా వ్యర్థంచేసేశాడు. వీడిపేరు అతికాయుడు. రాక్షసులందరిలోనూ శ్రేష్ఠుడు. కనక, వీడి బాణాలతో వానరసైన్యం నాశనం కాకముందే వీడివిషయమై బాగా శ్రద్ధచెయ్యాలి ".

విభీషణు డిలా చెబుతూ వుండగానే అతికాయుడు వానరసైన్యంలో ప్రవేశించి ధనుష్టంకారం చేశాడు. వాణ్ణి చూడగా వానరులలో ప్రముఖులుసాహసించి యెదురుకున్నారు. వారిలో ముఖ్యులు కుముదుడూ, మైందుడూ, ద్వివిదుడూ, నీలుడూ, శరభుడూను. వాళ్లు చెట్లూ, పర్వతశిఖరాలూ, బండరాళ్లూ విసిరారు; కాని అతికాయుడు వాటిని సులభంగా నుగ్గుచేసేశాడు. పైపెచ్చు నిశితబాణాలతో వారిని కొట్టాడు. దాంతో వాళ్లు వాడియెదట నిలిచి యేమీచెయ్యలేకపోయారు. యౌవనదర్పంతోవున్న సింహం లేళ్లను భయభ్రాంతంచేసేటట్టు వానరసైనికుల నందరినీ వాడు క్షోభపెట్టేశాడు. వారు యుద్ధంచెయ్యనివా ణ్ణెవణ్ణీ కొట్టలేదు. పైగా ధనుష్పాణియై రాముని యెదటికి వెళ్లి " నేను శరచాపాలు ధరించి రథంమీద యుద్ధసన్నద్ధు ణ్ణయివచ్చాను. ప్రాకృతులతో నేను యుద్ధంచెయ్యను. యుద్ధోత్సాహం గలవా డెవడైనావుంటే నామీదికి రావాలి" అని సగర్వంగా అన్నాడు.

ఆమాట వింటూనే ఉద్రిక్తుడై లక్ష్మణుడు ధనుస్సుతీసి, ఎక్కుపెట్టి నారి మోగించి బాణంతొడిగాడు. లక్ష్మణుని ధనుష్టంకారం భూనభోంతరాళాలు నిండి పర్వతాలనూ సముద్రాన్నీ వూపేసి రాక్షసులను భయభ్రాంతులను చేసేసింది. ఆజ్యాశబ్దం విని అతికాయు డాశ్చర్యపడి,

తరవాత రుష్టుడై పదనైన బాణం తీసి "లక్ష్మణా! నువ్వు కుర్రవాడవు. పరాక్రమం చూపలేవు. యమునివంటి నాతో యుద్ధం యేమిటి, పో పో. నాబాణాల వేగం హిమవత్పర్వతమూ, అంతరిక్షమూ, భూమీ కూడా సహించలేవు. సుఖంగా నిద్రిస్తున్న ప్రళయాగ్ని నెందుకు రేపుతావూ? ధనుస్సు కిందపడేసి వెళ్లిపో. ప్రాణాలు పోగొట్టుకోకు. లేక, నువ్వు మళ్లిపోడాని కిష్టపడకపోతే సిద్ధంగా వుండు. క్షణంలో నిన్ను యముని సన్నిధికి పంపేస్తాను. నాబాణాలు చూసుకో. ఇది శత్రువుల గర్వం అనేకమాట్లణిచాయి. త్రిశూలంతో సాటి అయినవి. ఈబాణం పామయి నీరక్తం తాగేస్తుంది" అని గద్దించాడు.

ఇలా అంటూనే అతికాయుడు బాణం తొడిగాడు. ఆమాటలు సహించక రుష్టుడై లక్ష్మణుడు "మాటలతో నువ్వు గొప్పవాడవు కావు. సత్పురుషులు డాబులుచెప్పరు. నేను ధనుష్పాణి నయి నిలిచి వుండగా మాట లెందుకూ బలం చూపించు. పనిచేసి నీపౌరుషం యేపాటిదో కనపరుచు. మాటలువద్దు. పౌరుషం చూపించినవాడే శూరు డనిపించుకుంటాడు. సకలాయుధాలూ వెంటబెట్టుకుని నువ్వు రథంమీద వచ్చావు. శరాలతోనో అస్త్రాలతోనో నీపరాక్రమం చూపించు. కాలం తాటిపండు రాల్చినట్టు నా నిశితబాణాలతో నేను నీతల యెగరగొట్టేస్తాను. నా బాణా లిప్పుడే నీరక్తం తాగుతాయి చూసుకో. నేను కుర్రవా ణ్ణని చులకనచెయ్యవద్దు. నేను బాలు ణ్ణయినా, వృద్ధుణ్ణయినా నీకు మృత్యువు నని తెలుసుకో. విష్ణువు బాల్యంలోనే త్రివిక్రమావతారంలో త్రిలోకాలూ ఆక్రమించాడు" అన్నాడు.

లక్ష్మణుని హేతువాదం విని అతికాయుడు అతికుపితుడై బాణం తీశాడు. అప్పుడు విద్యాధరులూ, దేవతలూ, దైత్యులూ, మహా ర్షులూ, గుహ్యకులూ ఆ యుద్ధం చూడ్డానికి వచ్చారు. అతికాయుడు

తీసిన బాణం తొడిగి లక్ష్మణునిమీద విడిచాడు. వస్తున్న సర్పంవంటి బాణం లక్ష్మణు డర్ధచంద్రబాణంతో తునియలుచేశాడు. అది చూసి అతికాయుడు మరీ రుష్టుడై అయిదుబాణాలు తొడిగి లాగి విడిచాడు. అవి దగ్గరికి రాకుండానే లక్ష్మణుడు తునియలు చేసి నిశితమైన బాణం వొకటి తొడిగి లాగి, విడిచాడు. ఆ బాణం అతికాయుని నొసట గుచ్చుకుంది. రుద్రుని బాణం తగిలి త్రిపురగోపురం గడగడ లాడినట్టు లక్ష్మణుని బాణం తగిలి అతికాయుడు గడగడవొణికిపోయాడు; కాని "లక్ష్మణా! బాగుబాగు. బాణం బాగా వేశావు" అని మొగం వంచుకుని చేతులు సరిగా వుంచుకుని రథంతో చిత్రవిచిత్రంగా తిరిగాడు. మరిన్ని వాడు "ఒకటి—మూడు—అయిదు—ఏడు—" అంటూ బాణాలు తీసి, తొడిగి, లాగి, విడిచాడు. అవి సూర్యబింబాల్లాగ ఆకాశం తేజస్వంతం చేశాయి; కాని లక్ష్మణుడు వాటిని తునియలు చేసేశాడు. అది చూసి మిక్కిలీ కోపించి అతికాయుడు మరో శరం తీసి లక్ష్మణుని గుండెలమీద కొట్టాడు. దాంతో లక్ష్మణునకు రక్తం చిమ్మింది. అప్పుడతను మదజలం వోడుతున్న యేనుగులా వున్నాడు. లక్ష్మణుడు ఆ బాణం వెంటనే తీసేసుకుని తానొక బాణం తొడిగి ఆగ్నేయాస్త్రం యోజించి విడిచాడు. అతికాయుడు సౌరాస్త్రం ప్రయోగించాడు. ఆ రెండూ ఆకాశాన వొకదాన్నొకటి నాశనంచేసుకున్నాయి. అప్పుడు అతికాయుడు ఇషీకాస్త్రం ప్రయోగించాడు. ఇంద్రాస్త్రం ప్రయోగించి లక్ష్మణుడు దాన్ని పడగొట్టాడు. అతికాయుడు యామ్యాస్త్రం ప్రయోగించాడు. లక్ష్మణుడు వాయవ్యాస్త్రంతో దాన్ని కొట్టేశాడు. తరవాత అతను అతికాయునిమీద బాణవర్షం కూడా కురిశాడు; కాని ఆ బాణాలన్నీ కవచానికి తగిలి బొద్దుబారి కిందపడిపోయాయి. తరవాత లక్ష్మణుడు వెయ్యిబాణాలు వేశాడు. అయినా అతికాయునకు బాధ కలగలేదు.

అప్పుడు వాయుదేవుడు లక్ష్మణుని దగ్గిరికి వచ్చి "వత్సా! బ్రహ్మ వీడికి అభేద్యకవచం యిచ్చాడు. బ్రహ్మాస్త్రంతోగాని ఆ కవచం భిన్నమూకాదు, వాడు చావనూ చావడు" అని చెప్పాడు. లక్ష్మణుడు వెంటనే బ్రహ్మాస్త్రంప్రయోగించాడు. దాంతో నక్షత్రాలూ గ్రహాలూ భయభ్రాంతా లయినాయి. దిక్కులూ, ఆకాశమూ, భూమీ వ్రాణి కాయి. అతికాయు డది చూశాడు. అనేక బాణాలు వేసిన్నీ కొట్టాడు; కాని అది లక్ష్యపెట్టక దగ్గిరికి వచ్చేసింది. అప్పుడు అతికాయుడు దాన్ని శక్తితోనూ, క్షురాంతోనూ కొట్టాడు; కాని అది తిన్నగా వెళ్ళి వాడి తల తీసేసింది. కిరీటంతో వున్న అతికాయుని శిరస్సు హిమ వత్పర్వతశిఖరంలాగ నేలమీద పడిపోయింది. అది చూసి రాక్షసు లందరూ భయభ్రాంతు లయిపోయారు. అందరూ గోలపెడుతూ యేడుస్తూ రోజుకుంటూ లంకలోకి పారిపోయారు. వానరు లత్యా నందంతో సింహనాదాలు చేసి లక్ష్మణుణ్ణి బహువిధాల పూజించారు.

## ౭౨

## రాముని సామర్థ్యం తలుచుకుంటూ రావణుడు చింతించడం

లక్ష్మణుని చేతిలో అతికాయుడు చచ్చిపోవడం విని రావణుడు యిలా అన్నాడు.

"ధూమ్రాక్షుడు మిక్కిలీ కోపిష్ఠి. గొప్ప ధానుష్కుడు. శస్త్రాస్త్రవేత్తలలో శ్రేష్ఠుడు. అకంపనుడూ, ప్రహస్తుడూ, కుంభకర్ణుడూ కూడా అలాంటివాళ్ళే. మహాబలపరాక్రమవంతు లైన వీరందరూ యుద్ధం అంటే పొంగిపోయేవాళ్ళు. శత్రువు లెంతటివాళ్ళయినా అనా యాసంగా జయించేవాళ్ళు. శత్రువుల చేతిలో యెప్పుడూ అపజయం యెరగనివాళ్ళు; కాని వాళ్ళందరూ రామునిచేతిలో చచ్చిపోయారు. నానాశస్త్రవిదులైన మరికొందరు రాక్షసయోధులున్నూ పడిపోయారు.

ప్రఖ్యాతబలపరాక్రమవంతుడు నాకొడుకు ఇంద్రజిత్తు వరప్రసాదలబ్ధాలైన శరాలతో రామలక్ష్మణులను కట్టేశాడు. సురాసురలు కూడా ఆబంధం విప్పుకోలేరు. యక్షులూ, గంధర్వులూ, కిన్నరులూ కూడా అది సడలించుకోలేరు; కాని శక్తివల్లనో, మాయవల్లనో, సమ్మోహనప్రభావంతోనో రామలక్ష్మణులు బంధముక్తు లయిపోయారు. దానికి కారణం యేమో లేశమూ తెలియకుండా వుంది. నాఅనుజ్ఞతో యుద్ధానికి వెళ్లినవారు కూడా అందరూ చనిపోయారు. వానరబలంతోనూ, సుగ్రీవునితోనూ రామలక్ష్మణులను జయించగలవా డెవడూ కనపడ్డంలేదు. రాక్షసులను సంహరించిన రాముని పరాక్రమమూ, శస్త్రాస్త్రబలమూ ఆశ్చర్యకరంగా వున్నాయి. రాముడు నారాయణుడయి వుంటా డని తోస్తోంది. అతనికి లంకాద్వారాలు మూసుకోవలసి వచ్చింది. రాక్షసయోధులారా! మీమీ స్థానాలలో అప్రమత్తులై వుండి లంక రక్షిస్తూవుండండి. సీతవుండిన అశోకవనంకూడా జాగ్రత్తగా చూస్తూ వుండాలి. ఆ వనంలో యెవణ్ణీ ప్రవేశించనియ్యకూడదు, యెవణ్ణీ పోనివ్వకూడదు. ప్రదోషంకానివ్వండి, అర్ధరాత్రి కానివ్వండి, ప్రభాతంలో కానివ్వండి మీ రెక్కడివా రక్కడ వుండి పురరక్షణం చేస్తూ వుండాలి. వానరులను తేలికగా చూడకండి. శత్రుసైన్యం నిలిచి వుందో, యుద్ధంచేస్తోందో, మీదికి వస్తోందో చూస్తూ వుండాలి"

ఇది విని రాక్షసు లందరూ రాజాజ్ఞప్రకారం జాగ్రత్తగావున్నారు. వారి నలా ఆజ్ఞాపించి రావణుడు పుత్రమరణం తలచి విచారిస్తూ అంతఃపురానికి వెళ్లిపోయాడు.

## ౭౩

## ఇంద్రజిత్తు రామలక్ష్మణాదుల నందరినీ మూర్ఛిల్ల జెయ్యడం

హతశేషు లైన రాక్షసులు పారిపోయి దేవాంతకాదు లందరూ చనిపోయిన సంగతి రావణునకు చెప్పారు. అది విని రావణుడు మొదట

మూర్ఛితుడై, తరవాత అనేకవిధాల దుఃఖించాడు. అది చూసి ఇంద్ర జిత్తు "నాయనా! ఇంద్రజిత్తు బతికివుండగా నీకీ దుఃఖం యేమిటీ? ఇంద్రజిత్తు బాణాలు సహించి యెవడూ యుద్ధభూమిలో నిలిచివుండ లేడే? ఇదే రామలక్ష్మణుల నిద్దరినీ నా బాణాలతో పడగొట్టి చంపే స్తాను చూడు. ఈక్షణంలోనే రామలక్ష్మణులను చంపేస్తాను. ఇది నా ప్రతిజ్ఞ, పరీక్షచేసుకో. ఇంద్రుడూ, యముడూ, విష్ణువూ, సాధ్యులూ, అశ్వినీదేవతలూ, అగ్ని, సూర్యచంద్రులూ యిప్పుడే వచ్చి నా బల పరాక్రమాలు చూడాలి. అని చెప్పి వాయువేగంగల రథంయెక్కి యుద్ధరంగానికి బయలుదేరాడు. అతనివెంట గొప్ప ధానుష్కులూ, గదాశక్తితోమరాది వివిధాయుధాలు వాడడంలో అద్వితీయులైన యోధులూ అనేకమంది గుర్రాలమీదా, ఏనుగులమీదా, రథాల మీదా బయలుదేరారు. రాక్షసయోధుల స్తుతివాక్యాలతోపాటు శంఖారావాలూ, భేరీభాంకారాలూ మిన్నుముట్టాయి. పరిచారకులు పట్టిన శ్వేతచ్ఛత్రంతో యింద్రజిత్తు ఆకాశాన నిండుచంద్రబింబంలా ప్రకాశిస్తున్నాడు. మరికొందరు పరిచారకు లతనికి బంగారువింజా మరలు వేశారు. అప్పుడు ఇంద్రజిత్తు రాజమార్గంలో వెడుతూ వుంటే ఆ లంకాపట్నం మధ్యందిన మార్తాండునితో ఆకాశంలాగ భాసించింది.

యుద్ధరంగంలో ప్రవేశించగానే ఇంద్రజిత్తు తన రథంచుట్టూ రాక్షసులను కాపుంచాడు. మరిన్ని అతను యథావిధిగానూ, మంత్ర వతుగానూ అగ్నిహోత్రంలో హోమాలు చేశాడు. గంధమాల్యాల తోనూ, లాజసంస్కారాలతోనూ హవిస్సు హోమంచేశాడు. అప్పు డతని కక్కడ శస్త్రాలే హవిస్సూ సమిధలూ — వస్త్రాలూ అయిశాయి. ఆసాధన సంపత్తి కూర్చుకుని అతను బతికివున్న నల్లని మేకను కంఠం నరికి హోమంచేశాడు. ఒక్కమాటు జ్వాలింపజేయగానే విజయసూచ కంగా అగ్ని పొగలేకుండా మండింది. అగ్ని ప్రదక్షిణార్చులతో

స్వయంగా వచ్చి హవిస్సు లందుకున్నాడు. ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్ర మంత్రం జపించి తన ధనుస్సూ, రథమూ అభిమంత్రించాడు. ఆ విధంగా అతను హోమంచేస్తూవుంటే నక్షత్రాలతోనూ గ్రహాలతోనూ ఆకాశం అంతా వాణికిపోయింది. హోమం పూర్తి అయేటప్పటికి ఇంద్రజిత్తు ధనుస్సుతోనూ, బాణాలతోనూ ఖడ్గాలతోనూ, రథంతోనూ, గుర్రాల తోనూ, సారథితోనూ ఆకాశాన మాయం అయిపోయాడు.

అప్పుడు రాక్షససేన సింహనాదాలు చేస్తూ బయలుదేరింది. ఆసైనికులు బాణాలతోనూ, తోమరాలతోనూ, అంకుశాలతోనూ వానరులను తీవ్రంగా కొట్టారు. ఇంద్రజిత్తు "భయపడకండి. ఉద్రిక్తులై వానరులను సంహరించండి" అని ప్రోత్సహించాడు. దాంతో మరింత ఉత్సాహం పొంది రాక్షసులు వానరులమీద నిరంతరంగా బాణవర్షం కురిశారు. ఇంద్రజిత్తు బాణాలతోనూ, నాళీకాలతోనూ, గదతోనూ ముసలంతోనూ వానరులను వధించ సాగాడు. ఆదెబ్బలు లెక్క-చెయ్యకుండా వానరులు రాళ్ళూ రప్పలూ పుచ్చుకుని ఇంద్రజిత్తుమీదికి బయలుదేరారు. అందుకు ఇంద్రజిత్తు మరీ రోషంపొంది ఒక్కొక్క బాణంతో అయిదేసిమందినీ, ఏడేసి మందినీ, తొమ్మిదేసిమందినీ వానరులను చీల్చేశాడు. అది చూసి రాక్షసు లుప్పొంగిపోతూ మరీ విజృంభించారు. వారు విజృంభించిన కొద్దీ ఇంద్రజిత్తు నిశితబాణాలతో వానరులను సంహరించసాగాడు. శరపీడితులై భిన్నగాత్రులై జయాశవదులుకుని వానరులు పడిపో సాగారు. అది చూసి వానరప్రముఖులు కొందరు ఇంద్రజిత్తుమీదికి వెళ్ళారు. వారు తమ జీవితంకంటె రామకార్యమే గొప్ప దనుకుని సింహనాదాలు చేస్తూ ఇంద్రజిత్తుమీద చెట్లూ, బండరాళ్ళూ, పర్వత శిఖరాలూ ధారాపాతంగా కురిశారు. మరొకడయితే ఆవర్షంలో ప్రాణాలు విడిచివుండును; కాని యింద్రజిత్తు తన బాణాలతో వాటి

నన్నిటినీ తుత్తునియలుచేసి పారేశాడు. వెంటనే కాలసర్పాలవంటి బాణాలతో మళ్ళీ వానరులను పీడించసాగాడు. ముందుగా, వాడు పద్ధెనిమిది బాణాలతో గంధమాదనుణ్ణి కొట్టాడు. నళుణ్ణి తొమ్మిది బాణాలతో కొట్టాడు. మర్మవిదారణం చేసే యేడు బాణాలతో మైందుణ్ణి కొట్టాడు. గజుణ్ణి అయిదు బాణాలతో కొట్టాడు. పది బాణాలతో జాంబవంతుణ్ణీ, ముప్ఫయిబాణాలతో నీలుణ్ణీ కొట్టాడు. సుగ్రీవుణ్ణీ, ఋషభుణ్ణీ, అంగదుణ్ణీ, ద్వివిదుణ్ణీ వరప్రసాదలబ్ధాలైన బాణాలతోకొట్టి మూర్ఛిల్లజేశాడు, కాలాగ్నిలాగ క్రుద్ధుడై తక్కిన వానరప్రముఖులను కూడా చాలా బాధించాడు. వానరసేన అంతా చించిచెండాడాడు. దాంతో వానరసేన అంతా రక్తంలో మునిగి వుండడం అతను చూశాడు.

కొంతసేపటికి తనసైన్యం విడిచిపెట్టి ఇంద్రజిత్తు అదృశ్యుడయే వుండి నీలమేఘంలాగ వానరులమీద యెడతెరిపి లేకుండా బాణవర్షం కురిశాడు. వానరులకు తళతళ మెరిసె బాణాలు మాత్రమే కనపడు తున్నాయి. ఇంద్రజిత్తెక్కడున్నాడో వారికి కనపడలేదు. ఆబాణాల దెబ్బలతో వానరులు విరగబూసిన మోదుగుచెట్లయిపోయారు. కొందరు పైకి చూశారు. బాణాలు గుచ్చుకుని వారి కళ్లు పోయాయి. ఇంద్రజిత్తు ప్రాసలూ, శూలాలూ, బాణాలూ ప్రయోగించి హనుమంతుణ్ణీ, సుగ్రీవుణ్ణీ, అంగదుణ్ణీ, గంధమాదనుణ్ణీ, జాంబవంతుణ్ణీ, సుషేణుణ్ణీ వేగదర్శినీ, మైందుణ్ణీ, ద్వివిదుణ్ణీ, నీలుణ్ణీ, గవాక్షుణ్ణీ, గజుణ్ణీ, గోముఖుణ్ణీ, కేసరినీ, హరిలోముణ్ణీ, విద్యుద్దంష్ట్రుణ్ణీ, సూర్యాననుణ్ణీ, జ్యోతిముఖుణ్ణీ, దధిముఖుణ్ణీ, పావకాక్షుణ్ణీ, నళుణ్ణీ, కుముదుణ్ణీ చాలా బాదించాడు. రామలక్ష్మణులమీద కూడా వాడు బాణవర్షం ప్రారంభించాడు.

అప్పుడు రాముడు ఎంత వానకురిసినా చలింపని మదగజంలాగ ఆబాణవర్షం లెక్క చెయ్యక లక్ష్మణుణ్ణి పిలిచి "తమ్ముడూ! ఇంద్రజిత్తు బ్రహ్మాస్త్రంతో వానరసైన్యం పడగొట్టి యిప్పుడు మనమీద పడ్డాడు. వాడికి అనేకవరా లున్నాయి. మాయమై యుద్ధంచేస్తున్నాడు. వాణ్ణి కొట్టా లంటే యెలాగా? ఈమహనీయాస్త్రానికి కారణ మైన బ్రహ్మ అచింత్యశక్తివంతుడు; కనక, నాతో పాటు నువ్వుకూడా ప్రస్తుతం యీబాణపాతం సహించివుండు. ఈరాక్షసుడు బాణవర్గంతో దిక్కు లన్నీ కప్పేస్తున్నాడు. గొప్పగొప్పశూరు లందరూ మూర్ఛిల్లడంవల్ల యీవానరసైన్యం అంతా వెలవెలబోతోంది. మనమిద్దరమూ కూడా మూర్ఛిల్లి యుద్ధం చెయ్యకుండానూ, రోషహర్షాలు లేకుండానూ వుంటే వీడు లంకలోకి వెళ్లిపోతాడు" అని చెప్పాడు.

వెంటనే వారు మూర్ఛిల్లారు. అది చూసి ఇంద్రజిత్తు సింహనాదం చేశాడు. ఈసంగతి తండ్రికి చెప్పడానికి వెంటనే లంకలోకిన్నీ వెళ్లి పోయాడు.

## ౭౪

## హనుమంతుడు ఓషధిపర్వతం పెల్లగించుకురావడం

రామలక్ష్మణులు మూర్ఛిల్లడం చూసిన్నీ వానరసైన్యం మూర్ఛిల్లింది. తాము కూడా మూర్ఛిల్లివుండడంవల్ల సుగ్రీవుడూ, నీలుడూ, అంగ దుడూ జాంబవంతుడూ యీసంగతి లేశమూ యెరగరు. ఇదంతా చూసి బుద్ధిమంతులలో అగ్రేసరు డైన విభీషణుడు వానరులను ఊర డిస్తూ "భయంవద్దు. ఇది విచారించవలసిన సమయం కాదు. రామల క్ష్మణులు బ్రహ్మవాక్యం ఉల్లంఘించగూడ దని అలా పడుకున్నారే గాని అది మూర్ఛిల్లడం కాదు. బ్రహ్మ ఇంద్రజిత్తునకు బ్రహ్మాస్త్రం యిచ్చాడు. ఎలాంటివా రయినా దాన్ని గౌరవించకతప్పదు. అంచే తనే వారలా పడుకున్నారు" అన్నాడు.

ఈధర్మం బ్రహ్మాస్త్రాన్ని గౌరవించిన హనుమంతుడు విభీషణుని మాట విని "వానరయోధులలో ప్రముఖులు చాలామంది చనిపోయారు. ఇంకా బతివుండినవారిని మనం ఊరడిద్దాం అన్నాడు. విభీషణుడు అది బాగుం దన్నాడు. దాని మీద వారిద్దరూ మండుతున్న కొరివి పట్టుకుని ఆనిశీథాన యుద్ధరంగంలోకి బయలుదేరారు. ఎక్కడ చూసినా వానరులు ఏనుగుల్లాగ పడివున్నారు. కొందరికి తోకలు తెగిపోయాయి. కొందరికి చేతులూ కాళ్ళూ తెగిపోయాయి. కొందరికి తలలే యెగిరిపోయాయి. అందరి శరీరాలూ రక్తం కారుతున్నాయి. ఆప్రదేశం అంతా రక్తంతోనూ మాంసం తోనూ నిండి బురదగా వుంది. వారికి పడివున్న సుగ్రీవుడూ, అంగదుడూ, నీలుడూ, శరభుడూ, గంధమాదనుడూ, గవాక్షుడూ, సుషేణుడూ, వేగదర్శి, ఆహుకుడూ, మైందుడూ, నళుడూ, జ్యోతిముఖుడూ, ద్వివిదుడూ, పనసుడూ, కనపడ్డారు. అయిదుగడియల పొద్దువేళకి మొత్తం అరవై యేడుకోట్ల వానరులు హతులైనారు.

మహాసముద్రంలా వున్న ఆ వానరకళేబరాలమధ్య హనుమంతుడు విభీషణుణ్ణి వెంటబెట్టుకుని జాంబవంతుణ్ణి వెతకసాగాడు. ఒకచోట అతను కనపడ్డాడు. శరీరం అంతా బాణాలతో నిండిపోయివుంది. అసలే వార్థకం. దానికి తోడు ఇది. దీంతో అతను చల్లారిపోతున్న అగ్నిహోత్రం లా వున్నాడు. అతని దగ్గిరికి వెళ్ళి విభీషణుడు "ఆర్యా! ఇంద్రజిత్తు ప్రయోగించిన తీక్ష్ణబాణాలవల్ల నీ ప్రాణాలు పోకుండా నిలిచివున్నాయిగదా?" అని అడిగాడు. అదివిని జాంబవంతుడు కళ్ళు తెరవలేక చాలా కష్టంమీద "రాక్షసరాజా! మాటసవ్వడిని బట్టి నిన్ను గుర్తించాను. బాణాలబాధవల్ల కళ్ళు విప్పి నిన్ను చూడలేకుండా వున్నాను. అంజనావాయుదేవుల ముద్దుబిడ్డ హనుమంతుడు బతికివున్నాడా?" అని అడిగాడు. దానిమీద విభీష

ణుడు "జాంబవంతుడా! నువ్వన్నీ తెలిసినవాడవు; కాని రామలక్ష్మ ణుని మాటయినా యెత్తకుండా హనుమంతుడి సంగతి అడుగుతావేం? సుగ్రీవునిమీదా, అంగదునిమీదా, రాఘవులమీదా కూడా నీకు హను మంతునిమీద వుండినంత స్నేహం లేదే?" అని అడిగాడు. అందుకు జాంబవంతుడు "రాక్షసేంద్రా! దానికి కారణం వుంది. హనుమంతుడు బతికివుంటే వానరసేన చచ్చినా బతికివుం దన్నమాటే. హనుమంతుడు చనిపోయివుంటే మేము బతికివుండినా చచ్చినవాళ్ళమే. వాయువుతో సమానుడూ, పరాక్రమంలో అగ్నితో సమానుడూ అయిన హను మంతు డుంటేనే మాకు ప్రాణాలమీద ఆశ" అని బదులుచెప్పాడు.

ఇది విని హనుమంతుడు తనపేరు చెబుతూ జాంబవంతుని పాదాలు పట్టుకుని యథావిధిగా నమస్కరించాడు. హనుమంతుని మాట విని జాంబవంతుడు ఎంతబాధగా వున్నా పునర్జన్మ యెత్తినట్టనుకుని "వానరశార్దూలా! ఇలా రా నాయనా! నువ్వు వానరులను రక్షిం చాలి. నువ్వే రక్షించగలవు. మ కెవ్వరికీ నీకున్నంత పరాక్రమం లేదు. పైగా, నువ్వొక్కడవే వానరుల కందరికీ స్నేహితుడవు. ఇప్పుడు నీపరాక్రమం చూపించవలసిన సమయం వచ్చింది. మరొకనివల్ల ఇవ్వా ళేమీ కాదు. భల్లూకవానరవీరుల కందరికీ ఆనందం కలిగించు. మూర్ఛిల్లిన రామలక్ష్మణులను తేర్చు. సాగరం దాటి ఆకాశ మార్గాన నువ్విప్పుడు—నుంచున్న పాటున హిమవత్పర్వతం దగ్గిరికి వెళ్ళాలి. అక్కడ ఋషభం అనేపేరుతో స్వర్ణమయం అయిన పర్వ తమూ హిమవత్పర్వత శిఖరమూ వున్నాయి. ఆ రెండింటికీ మధ్యగా ఓషధిపర్వతం వుంది. దాని మీద ఓషధు లన్నీ వున్నాయి. అవన్నీ దశదిశలూ ప్రకాశమానం చేస్తూ మెరిసిపోతూ వుంటాయి. అక్కడ ముఖ్యంగా మృతసంజీవనీ, విశల్యకరణీ, సావర్ణ్యకరణీ, సంధానకరణీ

వున్నాయి. నువ్వు అవి తీసుకురావాలి. అవి తెస్తే నువ్వు వానరుల నందరినీ బతికించినవాడ వవుతావు" అని చెప్పాడు.

జాంబవంతుడు చెప్పింది వినగానే జలవేగంతో సముద్రంలాగ బలో ద్రేకాలతో హనుమంతుడు పొంగిపోయాడు. వెంటనే అతను పర్వత శిఖరంమీదికి దూకి తన పాదాఘాతంతో ఆ పర్వతం గడగడలాడిపో తూండగా తానొక పర్వతం లా అయినాడు. అతనికి ఔద్ధత్యం ఆ పర్వతం సహించలేకపోయింది. ఆ పర్వతంమీది చెట్లన్నీ కూలిపోయి అతని వేగంవల్ల మండిపోయాయి. పర్వతశిఖరాలు పిండీగుండా అయి పోయాయి. ఆ నిశీథసమయాన లంకాపట్నం ద్వారా లన్నీ కదిలిపో యాయి. గోపురాలు కూలిపడ్డాయి. రాక్షసు లందరూ భయభ్రాంతు లయిపోయారు. ఆ పర్వతంమీదినించి యెగిరి అతను మలయపర్వతం మీద వాలాడు. ఆ పర్వతంమీద అనేకజాతుల వృక్షా లెన్నో వున్నాయి. తటాకాలలో తామరపువ్వులూ కలవపువ్వులూ చక్కగా వికసించి వున్నాయి. అది అరవైఆమడల యెత్తుంది. దానిమీద విద్యా ధరులూ, గంధర్వులూ, దేవతలూ, అప్సరసలూ విహరిస్తున్నారు. మహర్షులు ధ్యానమగ్నులై వున్నారు. అనేకగుహాలతో నిండివున్న ఆ పర్వతంమీద అనేకజాతుల మృగా లున్నాయి. వారి నందరినీ భయ భ్రాంతులను చేస్తూ అతనాపర్వతంమీద మేరుపర్వతంలాగ పెరిగిపో యాడు. అతను కాళ్లతో పర్వతం గడగడవొణికేటట్టు తొక్కాడు. బడబాముఖంలాగ నోరు తెరిచి సింహనాదం చేశాడు. ఆధ్వని విని లంకలోవున్న రాక్షసు లందరూ కుక్కినపే లయిపోయారు.

అప్పుడు రామునకు నమస్కరించి, అతను తోక జాడించి, నడుము వంచి, నోరు తెరిచి ఆకాశాని కెగిరాడు. ఆహనుమంతుని బాహు వేగమూ, ఊరువేగమూ సహించలేక చెట్లూ, బండరాళ్లూ, వానరు లనేకులూ వెళ్లి సముద్రంలో పడ్డారు. అతను తాచుపాములవంటి

బాహువులు చాచుకుని అసలే అల్లకల్లోలంగా వున్న సముద్రం జలజంతువులతో మరింత క్షోభపడేటట్టు, విష్ణుమూర్తి విడిచిన సుదర్శన చక్రంలాగ ఆకాశం చీల్చుకుంటూ వెళ్లాడు. దారిలో అతని కనేక పర్వతాలూ, అనేకారణ్యాలూ కనపడ్డాయి. నదులూ తటాకాలూ, సరస్సులూ లెక్కలేనన్ని కనపడ్డాయి. పట్నాలూ పల్లెలూ అసంఖ్యాకంగా కనపడ్డాయి. ఇలాగ అతను జాంబవంతుడు చెప్పింది స్మరించుకుంటూ వాయువేగంగా వెళ్లి హిమవత్పర్వతం దగ్గిరికి చేరుకున్నాడు.

ఆ పర్వతంమీద అనేకజలపాతాలు పడుతూన్నాయి. ఎన్నో గుహలున్నాయి. తెల్లని మేఘమండలాలవంటి శిఖరాలు మెరుస్తున్నాయి. రకరకాల వృక్షా లున్నాయి. దేవతలూ, మహర్షులూ నివసించివుండిన ఆశ్రమా లెన్నో వున్నాయి. అక్కడ అతను బ్రహ్మకోశమూ, రజతాలయమూ, శక్రాలయమూ, రుద్రశరమోక్షమూ, హయగ్రీవమూ, బ్రహ్మకపాలమూ, వజ్రాలయమూ, వైశ్రవణాలయమూ, సూర్యప్రభా, సూర్యనిబంధనమూ, బ్రహ్మాసనమూ, శివధనుస్సూ, భూనాభీ, కైలాసమూ, హిమవచ్ఛిలా, ఋషభపర్వతమూ, కాంచనశిఖరమూ, చూశాడు. వాటి నడుమ సర్వౌషధులతోనూ తేజరిల్లుతున్న ఓషధిపర్వతమున్నూ చూశాడు.

ఇలాగ అతను అనేకవేల యోజనాల దూరంవెళ్ళి ఓషధిపర్వతం మీద ఓషధులను వెతకసాగాడు; కాని తమ్ము తీసుకుపోవడాని హనుమంతుడు వచ్చా డని గుర్తించి ఓషధులు అదృశ్యం అయిపోయాయి. అది గ్రహించి అతను మిక్కిలీ కోపంతో ఆబోతులాగ దిక్కులు పగిలేటట్టు రంకేవేసి "ఓషధిపర్వతమా? రామునిమీద కూడా నీకు దయలేనట్టుంది. ఇదే నీ నిశ్చయం అయేటట్టయితే కానీ, నాబాహుబలంతో నిన్ను పెల్లగించి గుండకొట్టేను చూసుకో" అంటూ వురిమి ఆ పర్వతం సమూలంగా పెల్లగించి ఆకాశాని కెగిరి

గరుడవేగంతో బయలుదేరాడు. ఆసాహసం చూసి ఖేచరులంతా ఆశ్చర్యపడ్డారు. ఆ పర్వతం సూర్యమండలంలా వుంది. సూర్యుని దగ్గిరగా ప్రయాణం, అసలు హనుమంతుడే సూర్యసమానుడు. ఇదంతా ఆకాశాన మరో సూర్యబింబం ఉదయించినట్టుంది. అప్పుడు సుదర్శనచక్రం ధరించివున్న మహావిష్ణువులా కూడా వున్నాడు.

అక్కడ అతణ్ణి చూసి వానరులు సింహనాదం చేశారు. వారిని చూసి అతనూ సింహనాదంచేశాడు. ఆ ధ్వని విని లంకలో వున్న రాక్షసులందరూ భయభ్రాంతులై అరిచారు. వెంటనే అతను ఆపర్వతంమీద వానరుల మధ్యగా వురికి వానరప్రముఖులకు శిరసానమస్కారా లర్పించి విభీషణుణ్ణి కౌగిలించుకున్నాడు. ఆ పర్వతం అక్కడికి వచ్చిన ఉత్తరక్షణంలోనే ఆ సువాసన తగలడంవల్ల రామలక్ష్మణులు ముందూ, తర్వాత వానరులందరూ లేచి సంపూర్ణారోగ్యవంతులై నిలిచారు. చనిపోయిన వానరులు కూడా మళ్ళీ బతికి సింహవిక్రములైనారు. మొత్తంమీద అక్కడ పడిపోయివుండినవారందరూ నిద్రపోయిలేచినట్టున్నారు. యుద్ధం ప్రారంభమైనది మొదలు, రాక్షసులు, వానరుల చేతిలో చచ్చిపోయిన తమవాళ్ళని ఎప్పటికప్పుడే సముద్రంలో పడేస్తూవచ్చారు. ఆసంఖ్య తెలిస్తే శత్రువులకు లోకువ అయిపోతామని రావణుడే అలా చెయ్యమని వాళ్ళకాజ్ఞాపించాడు. అందుచేత, ఓషధిపర్వతంవల్ల రాక్షసుల కేమీ లాభంలేకపోయింది. ఇలాగ అందరూ బతికి లేచాక హనుమంతుడు ఆ పర్వతం తీసుకువెళ్ళి యథాస్థానంలో వుంచేసి మళ్ళీ రాముని సన్నిధికి వచ్చి చేరుకున్నాడు.

## ౭౪

## వానరులు-లంకాపట్నం తగలబెట్టడం

సుగ్రీవుడు హనుమంతుణ్ణి పిలిచి "కుంభకర్ణుడు చచ్చిపోయాడు. కొడుకులున్నా చచ్చిపోయారు. ఈకారణంవల్ల రావణు డిప్పుడు యుద్ధం

జరిగించడు. కనక, మనవాళ్లలో బలవంతులూ వేగవంతులూ అయిన వాళ్లు కొరవులు చేతబుచ్చుకుని లంకలో ప్రవేశించాలి" అని చెప్పాడు. సూర్యాస్తమయం కాగానే ఆ ఆజ్ఞప్రకారం వానరులు లంకలో ప్రవేశించారు. కొరవులు పట్టుకుని లంక అంతా నిండిపోయిన వానరులను చూసి అక్కడక్కడ లంకలో కాపున్న రాక్షసులు పారిపోయారు. వెంటనే వానరులు పురద్వారాలకూ, కోటబురుజులకూ, అంతటావున్న మేడలకూ నిప్పుపెట్టారు. అగ్నిహోత్రం విజృంభించింది.

వేలకొద్దీ భవనాలు బుగ్గిఅయిపోయాయి. పర్వతాల్లా వున్న మేడలు కూలిపోయాయి. ఆమేడల్లో వున్న అగురూ, మంచిగంధపు కర్రలూ కూడా తగలబడిపోయాయి. ముత్యాలూ వజ్రాలూ, పగడాలూ భస్మం అయిపోయాయి. విలవగల పట్టుబట్టలు నుసి అయిపోయాయి. శాలువలూ, కంబళీలూ, బంగారుభూషణాలూ, ఆయుధాలూ, గుర్రాలకు వాడే అలంకారాలూ నాశనం అయిపోయాయి. ఏనుగులకంఠాభరణాలూ, నడుమున కట్టె మోకులూ, రథాలంకారాలూ, కవచాలూ, గుర్రాలకూ ఏనుగులకూ వాడే కవచాలూ నుసి అయిపోయాయి. ఖడ్గాలూ, ధనుస్సులూ, అల్లెతాళ్లూ, బాణాలూ, తోమరాలూ, అంకుశాలూ, శక్తులూ, వింజామరలూ, ఉన్నవస్తువులూ, సుగంధద్రవ్యాలూ మండిపోయాయి.

అప్పుడు లంకాపట్నంలో కొందరు బంగారపు నగిషీచేసిన కవచాలు తొడుక్కుని వున్నారు. కొందరు విలవగల వస్త్రాలు ధరించి పూలదండలు వేసుకుని కులాసాగా తిరుగుతున్నారు. కొందరు మద్యపానం చేసి కళ్లు తేలవేసుకుంటున్నారు. కొందరు తూలిపోయి నడుస్తున్నారు. కొందరిని స్త్రీలు వస్త్రాలు పట్టుకుని లాగుతున్నారు. కొందరు శత్రువులను తలచుకుని పళ్లుకొరుకుతున్నారు. కొందరు గదలూ, శూలాలూ, ఖడ్గాలూ పట్టుకుని వున్నారు. కొందరు మాంసాదులు భక్షిస్తున్నారు.

కొందరు మద్యపానంచేస్తున్నారు. కొందరు ప్రియురాళ్లతో కూడా వెలలేని శయ్యలమీద నిద్రిస్తున్నారు. కొందరు భయభ్రాంతులై బిడ్డలను ఎత్తుకుని అటూయిటూ పరిగెత్తుతున్నారు. ఇలాంటివాళ్ళందరూ ఆమంటల్లో పడి కాలిపోయారు.

అక్కడి భవనాలలో ఎన్నో అపూర్వమైనవి. వాటి విలవ యింత అని చెప్పడానికి లేదు. వాటి సౌకర్యాలు లెక్కలేనన్ని. వాటిలో బంగారపు పని ఎంతోచేశారు. వాటి కెన్నో అంతస్తు లున్నాయి. అవి ఆకాశం అంటుతున్నాయి. కౌజుపిట్టలూ, నెమిళ్లూ, వీణలూ, ఆభరణాలూ — వీటి ధ్వనులతో అవి ముఖరితా లయివున్నాయి. అన్నీపర్వతాలలా వున్నాయి. అవన్నీ బూడిద అయిపోయాయి. మండిపోతున్నతోరణాలు మెరుములతో వున్న నీలమేఘాల్లా కనపడుతున్నాయి. మేడలపైని నిద్రపోతున్న సుందరాంగులు హాహాకారాలు చేస్తూ ఆభరణాలు తీసేసుకుని వస్త్రాలు విడిచేసి కిందికురుకుతున్నారు. ఆభవనా లన్నీ దూరానికి ఓషధులతో మెరుస్తున్న హిమవత్పర్వత శిఖరాలులా కనపడుతున్నాయి. మేడలపై భాగాలు తగలబడుతూ వుంటే ఆలంకాపట్నం విరగబూసిన మోదుగుచెట్ల అడవిలా కనపడుతోంది. ఏనుగులూ, గుర్రాలూ కట్లుతెంచుకుని పట్నం అంతటా పరుగులుతీస్తూవుంటే అది ప్రళయకాలంలో జలజంతువులతో కలగిపోయివున్న మహాసముద్రంలా వుంది. ఏనుగును చూసి గుర్రం వొక దిక్కుకీ, ఆగుర్రాన్ని చూసి యేనుగు మరోదిక్కుకీ పారిపోతున్నాయి. లంకాపట్నం అంతా యిలాగ తగలబడిపోతూ వుంటే అది ప్రతిఫలించడంవల్ల సముద్రం అంతా ఎర్రగావున్నట్టు కనపడుతోంది. ఇలాగ లంక అంతా వానరులచేతిలో వొక్కక్షణంలో దగ్ధం అయిపోయింది. పొగలో యిరుక్కుని మంటలలో మాడిపోతూ రాక్షసాంగనలు చేసిన రోదనాలు పదిఆమడల దూరం వినిపిస్తున్నాయి. కొందరు రాక్షసులు

మంటలలో కాలిపోతూ పారిపోగా వానరులు వారిమీద పడుతున్నారు. రాక్షసుల రోదనధ్వనులూ, వానరుల హర్ష ధ్వానాలూ భూనభోంతరాళాలూ, సముద్రమూ నిండిపోతున్నాయి.

## రావణుడు కుంభనికుంభులను యుద్ధానికి పంపడం

ఈసమయాన స్వస్థశరీరులయి వుండిన రాముడూ లక్ష్మణుడూ ధనుష్పాణు లయినిలిచారు. రాముని ధనుష్టంకారం విని రాక్షసులు భయభ్రాంతు లయిపోయారు. రాము డప్పుడు వేదమయం అయిన ధనుస్సు ధ్వనింపచేసిన పరమశివుడులా వున్నాడు. వానరుల కోలాహలధ్వనీ, రాక్షసుల రోదనధ్వనీ, రాముని ధనుష్టంకారధ్వనిలో మునిగిపోయాయి; కాని యీమూడు ధ్వనులతోనూ దిక్కులు పిక్కటిల్లిపోయాయి. రాముని బాణాలతో కైలాసశిఖరం లా వున్న లంకాగోపురం చూస్తూవుండగా గభాలున కూలిపోయింది. అప్పటికి మేడలమీదా మిద్దెలమీదా కులాసాగా వుండిన రాక్షసులు రాముని శరవర్షం సంగతి విని కోలాహలంచేస్తూ యుద్ధసన్నద్ధు లయినారు. వారి కోలాహలమూ సింహనాదాలూ — వీటితో ఆరాత్రి కాళరాత్రి అయిపోయింది.

అప్పుడు సుగ్రీవుడు "లంకాద్వారాలు కాసి యుద్ధం చెయ్యండి" అని వానరుల కాజ్ఞాపించాడు. "వానరులలో యెవడు ఇందు కంగీకరించడో వాణ్ణి నరికెయ్యండి" అని కూడా సుగ్రీవుడు కఠినంగా శాసించాడు. సుగ్రీవుని ఆజ్ఞప్రకారం మండుతున్న కొరవులు పట్టుకుని లంకాద్వారా లాక్రమించివున్న వానరులను చూసి రావణుడు మండిపడ్డాడు. ఆ రావణుని శరీరం అంతటా కోపం రూపొందింది. వెంటనే అతను కుంభకర్ణుని కొడుకులు కుంభుణ్ణీ నికుంభుణ్ణీ రాక్షసయోధుల నెందరినో జతచేసి యుద్ధానికి పంపాడు. రావణుని ఆజ్ఞచొప్పున

యూపాక్షుడూ, శోణితాక్షుడూ, ప్రజంఘుడూ, కంపనుడూ కూడా వారివెంట వెళ్ళారు. తరవాత, రావణుడు "మీరు కూడా వెళ్ళి వానరులను జయించిరం" డని మరికొందరు రాక్షసయోధులను కూడా పంపాడు.

వారందరూ మళ్ళీమళ్ళీ సింహనాదాలు చేసుకుంటూ వెళ్ళారు. వానరుల చేతుల్లో వున్న కొరువుల వెలుగులూ, రాక్షసుల ఆభరణ కాంతులూ ఆకాశం అంతా ధగద్ధగితం చేశాయి. అప్పుడే ఉదయించిన చంద్రుని వెన్నెలా, ఆ యిరువాగుల ఆభరణకాంతులూ ఆకాశానికి మరింత వెలుగిచ్చాయి. లంకలోని మంటలవెలుగుల్లోనూ, వెన్నెలలోనూ, తమ ఆభరణకాంతుల్లోనూ వానరరాక్షసయోధులు మిలమిల్లాడారు. మేడలమంటలు ఆకాశం అంటాయి. అవి సముద్రంలో అట్టడుగుదాకా ప్రతిఫలించాయి.

రాక్షసులు జెండా లెగరవేసుకుంటూ, గుర్రా లురికించుకుంటూ ఏనుగులను పరుగెత్తించుకుంటూ, రథాలు తోలుకుంటూ, కత్తులు జళిపించుకుంటూ, పరవళ్ళు తొక్కుకుంటూ, తొడలు చరుచుకుంటూ, సింహనాదాలు చేసుకుంటూ వచ్చిపడ్డారు. ఆ రాక్షససముద్రంచూసి వానరులు ఊగిపోతూ సింహనాదాలు చేశారు. రాక్షసులు దుముకుతూ వచ్చి మిడత లగ్గిలో పడేటట్టు వానరసైన్యంలో పడ్డారు. వానరులు వొళ్లు మరచిపోయి చెట్లతోనూ రాళ్లతోనూ రాక్షసులను చావబాదారు. మీదిమీదికి వస్తున్న వానరులను పట్టుకుని రాక్షసులు తలలు నరికేశారు. వానరులు కొందరి చెవులు కొరికేశారు. కొందరి తలలు పిడికిళ్లతో బద్దలుకొట్టారు. రాళ్ళు విసిరి చేతులూ కాళ్ళూ విరగకొట్టారు. ఇలాగ వానరులు రాక్షసులలో ప్రముఖులనూ, రాక్షసులు వానరులలో ప్రముఖులనూ ఎందరినో సంహరించారు. వీణ్ణి కొడదా మని వాడు వస్తే వాణ్ణే వీడు కొట్టీ, వాణ్ణి పడగొడదా మని

వీడు వెడితే వీణ్ణే వాడు పడగొట్టీ, వీణ్ణి బూకరిద్దా మని వాడు వస్తే వాణ్ణే వీడు బూకరించీ, వాణ్ణి కొరుకుదా మని వీడు వెడితే వీణ్ణే వాడు కొరికీ — ఇలాగ కూడా వాళ్ళుభయులూ ఘోరయుద్ధం చేశారు. "నన్నుకొట్టు మరి చూస్తా" నని వొకడు — "ఇదిగో కొట్టా నేంచేస్తా" వని యింకొకడు — "కొట్టేస్తా చూసుకో" అని మరొకడు — "డాబుల కేమిలే, నుంచో" అని వేరొకడు — ఇలాగ కొందరు యుద్ధం చేశారు. కొందరి బట్ట లూడిపోయాయి. కొందరి కవచాలు జారిపోయాయి. కొందరి ఆయుధాలు పడిపోయాయి. అయినా వాళ్ళు దారుణయుద్ధంచేశారు. చివరికి జుట్టువిడిపోయి, కట్టుబట్టలు జారిపోయి, కవచాలు చిరిగిపోయి, జెండాలు విరిగిపోయి వున్న రాక్షసులను వానరులు చుట్టేశారు.

## ౭౬

## కుంభనికుంభాదు లందరూ వానరులచేతిలో చచ్చిపోడం

ఇలాగ సంకులసమరం జరుగుతూ వుండగా యుద్ధోత్సాహంతో అంగదుడు కంపనునిమీఁది కురికాడు. వెంటనే కంపనుడు "రా రా" అంటూ గదతో కొట్టగా అంగదుడు మూర్ఛిల్లాడు; కాని వెంటనే తేరుకుని అతను పర్వతశిఖరం వొకటి పెరికితెచ్చి విసిరాడు. దాంతో కంపనుడు పచ్చడి అయి చచ్చిపోయాడు.

ఇది చూసి శోణితాక్షుడు రథంమీఁద వచ్చి అంగదుణ్ణెదిరించాడు. వచ్చీరావడంలోనే వాడు బాణవర్షంకురుస్తూ వచ్చాడు. వాటిలో కొన్ని క్షురాలు. కొన్ని క్షురప్రాలూ. కొన్ని నారాచాలు. కొన్ని వత్సదంతాలు. కొన్ని శిలీముఖాలు. ఇంకా రకరకాలు; కాని అంగదుడు వాటిని లక్ష్యంచెయ్యలేదు. పైపెచ్చు వాడి బాణాలూ,

రథమూ, ధనుస్సూ విరగకొట్టిపారేశాడు. శోణితాక్షుడు వెంటనే కత్తీ డాలూ పుచ్చుకుని ఆకాశాని కెగిరాడు; కాని అంగదుడు అంత కంటే వడిగా యెగిరి వాణ్ణి పట్టుకుని వాడిచేతిలో వున్న కత్తి వుళా క్కుని సింహనాదం కూడా చేసి, జందెప్పెట్టుగా వాణ్ణి నరికిపారేశాడు. ఆ కత్తే పుచ్చుకుని మళ్ళీమళ్ళీ సింహనాదంచేస్తూ అనేకమంది రాక్షసులను కూడా సంహరించాడు.

అప్పుడు మహాబలశాలి అయిన యూపాక్షుడు తనవెంట రాగా రథంయెక్కి ప్రజంఘుడు అంగదునిమీదికి వచ్చాడు. ఇటు యూపాక్షుడూ — అటు ప్రజంఘుడూ — వీళ్ల కిద్దరికీ మధ్య అంగదుడు, విశాఖా నక్షత్రాలమధ్యవుండే చంద్రుడు లా వున్నాడు. అంగదునకు సాయం వచ్చి మైందుడూ ద్వివిదుడూ అతని పక్కగా నిలిచారు. అటు ముగ్గురు రాక్షసులు — ఇటు ముగ్గురు వానరులు — వీరికి చాలా ఘోరయుద్ధం జరిగింది. వానరులు వృక్షాలు విసిరారు. ప్రజంఘుడు వాటిని కత్తితో చెలిగిపారేశాడు. వానరులు రథంమీాదా గుర్రాలమీాదా చెట్లు విరిచి పడేశారు. యూపాక్షుడు బాణాలతో వాటిని చించిచెండాడాడు. మైందుడూ ద్వివిదుడూ చెట్లు విసరగా శోణితాక్షుడు గదతో వాటిని చిందరవందరచేశాడు. ఇంతలో భయంకర మైన ఖడ్గం పుచ్చుకుని ప్రజంఘుడు అంగదునిమీాది కురికాడు. అంగదుడు వాణ్ణి అశ్వకర్ణ వృక్షంతో కొట్టాడు. పిడికిలి బిగించి రెక్కగూటిమీాద వొక్క పోటు పొడిచాటప్పటికి ప్రజంఘుడు సహించలేక కత్తి విడిచిపెట్టేశాడు; కాని తానుగూడా పిడికిలి బిగించి అంగదుణ్ణి నొసట కొట్టాడు. దాంతో అత నొక్కక్షణంమాత్రం మూర్ఛిల్లిన ట్టయి, మళ్లీ వెంటనే తేరుకుని కిందపడివున్న ఖడ్గంపుచ్చుకుని కొబ్బరిపుచ్చె యెగరగొట్టినట్టు ప్రజంఘుని తల యెగరగొట్టేశాడు.

ఇలాగ పినతండ్రి చనిపోడం చూసి యూపాక్షుడు కళ్లనీళ్లుపెట్టుకుని బాణాలన్నీ అయిపోడంవల్ల కత్తి పుచ్చుకుని రథం దిగి బయలు దేరాడు. ద్వివిదుడు వచ్చిపడుతున్న యూపాక్షుణ్ణి గుండెలమీద ఒక్క గుద్దు గుద్ది పట్టుకున్నాడు. అందుకు మిక్కిలీ రుష్టుడై శోణి తాక్షుడు గదపుచ్చుకుని ద్వివిదుణ్ణి గుండెలమీద కొట్టాడు. ఆదెబ్బకి ద్వివిదుడు కొంచెం వూగిపోయాడు; కాని అంతలో దిటవు తెచ్చుకుని ఆగద వుళాక్కున్నాడు. ఈసందుబాట్లో మైందుడు యూపాక్షుని గుండెలమీద కొట్టాడు. తరవాత అటు శోణితాక్షుడూ యూపా క్షుడూ — ఇటు మైందుడూ ద్వివిదుడూ నలుగురూ కలియబడి కొట్టుకోసాగారు. ద్వివిదుడు, శోణితాక్షుణ్ణి, మొగం అంతా గోళ్లతో రక్కేసి కిందపడతోసి పచ్చడిచేసినట్టు నేలబెట్టి రాసేశాడు. మైందుడు రెండుచేతులతోనూ గట్టిగా పట్టుకుని నొక్కగా యూపాక్షుడు కిందపడి ప్రాణాలు విడిచాడు. ఇది చూసి రాక్షససేన అంతా భయభ్రాంతం అయిపోయి కుంభునికేసి పరుగెత్తి అతను ఉత్సాహపరచగా ఆగి పోయింది. వెంటనే కుంభుడు ఇనుమడించిన రోషంతో ధను స్సందుకుని నల్లతాచులవంటి బాణాలు విడిచాడు. బాణంతో కలిసి ఆకుంభుని ధనుస్సు రెండో ఇంద్రధనుస్సులా వుంది. అలాంటి ధనుస్సు ఆకర్ణాంతంగా లాగి వాడు ద్వివిదుణ్ణి కొట్టాడు. ఆదెబ్బతో అడుగులు తడబడి ద్వివిదుడు పర్వతశిఖరంలాగ పడిపోయాడు. ద్వివిదుడు పడిపోడం చూసి మైందుడు బండరాయి పుచ్చుకుని కుంభునిమీద విసిరాడు. కుంభుడు అయిదుబాణాలతో ఆరాతిని గుండచేసే శాడు. మర్లో బాణం తొడిగి మైందుణ్ణి గుండెలమీద కొట్టాడు. ఆదెబ్బతో మైందుడు కూడా మూర్ఛిల్లి పడిపోయాడు. ఇలాగ మేన మామ లిద్దరూ మూర్ఛిల్లడం చూసి అంగదుడు కుంభునిమీది కురి కాడు. మీదికి వస్తున్న అంగదుణ్ణి కుంభుడు అయిదుబాణాలతో

వొకమాటూ, మూడు బాణాలతో వొకమాటూ కొట్టాడు. దీనికి జంకక, లక్ష్యపెట్టక అంగదుడు కుంభుణ్ణి చెట్లతోనూ రాళ్లతో ముంచేశాడు. కుంభుడు నిశితబాణాలతో వాటి నన్నిటినీ చించి చెండాడి, మీాదికి వస్తున్న అంగదుణ్ణి ముక్కుమీాద గుద్దాడు.

దాంతో అంగదుని కళ్ళల్లోనుంచి రక్తంకారసాగింది. అయినా అత నొక చేత్తో కళ్ళు మూసుకుని, సమీాపానే వున్న మద్దిచెట్టు వొకచేత్తో పట్టుకుని గుండెలు తాకి వూపివూపి పెరికి విసరబోతూ వుండగా కుంభుడు అంతకి ముందే అంగదుణ్ణి ఏడుబాణాలు వేసి కొట్టాడు. దాంతో అంగదుడు అరిచి మూర్ఛిల్లాడు. అంగదుడు పడి పోడం చూసి వానరులు రాముని కీసంగతి చెప్పారు. రాముడు జాంబవంతుణ్ణీ, వానరప్రముఖులనూ పంపాడు. వారు చెట్లూ రాళ్ళూ పుచ్చుకుని అంగదుణ్ణి కాపాడుతూ కుంభునిమీాద పడ్డారు; కాని కుంభుడు నిశితబాణాలు వేసి జాంబవంతుణ్ణీ, సుషేణుణ్ణీ, వేగదర్శినీ ఆపేశాడు. మహావీరు లయ్యుండీన్నీ వారు ముందుకు వెళ్ళలేకపోయారు. అది చూసి అంగదుణ్ణి వెనకవేసుకుని సుగ్రీవుడు ఏనుగుమీాదికి సింహంలాగ కుంభునిమీాది కురికి రకరకాల చెట్లు విసిరాడు. ఆ చెట్లతో ఆకాశం అంతా నిండిపోయింది; కాని కుంభుడవన్నీ బాణాలతో నరికేశాడు. అందుకు కినిసి సుగ్రీవుడు మీాదికురికి కుంభుని ధనుస్సు వుళాక్కుని పెళ్ళున విరిచేసి "కుంభుడా! నీ పరాక్రమమూ, బాణవేగమూ, నీ వినయమూ, ప్రభావమూ రావణుని వాటిలాగ చాలా అద్భుతంగా వున్నాయి. నువ్వు ప్రహ్లాదునితోనూ, బలితోనూ, వృత్రారితోనూ, కుబేరునితోనూ పోల్చతగివున్నావు. నువ్వొక్కడవే నీ తండ్రితరవాత అంత బలవంతుడవు. జితేంద్రియుణ్ణి రోగా లేమీా చెయ్యలేనట్టు ధనుష్పాణవయి ఉంటే దేవతలు నిన్నేమీా చెయ్యలేరు; కనక, నేను చూస్తాను నీవిక్రమం వొకమాటు చూపించు. నీ పెత్తండ్రి రావణుడు

వరప్రసాదంవల్ల దేవదానవులను ఓర్చివుండగా, నీ తండ్రి నిజబలంవల్లనే దేవదానవులను సహించగలుగుతున్నాడు. ప్రతాపంలో నువ్వు రావణునితో సమానుడవు. ధనుర్విద్యలో ఇంద్రజిత్తుతో సమానుడవు. రాక్షసులలో నువ్వు చాలా గొప్పవాడవు. ఇంద్రశంబరులకు లాగ నీకూనాకూ పొసగిన ఈ యుద్ధం సకలభూతాలూ చూడాలి. నువ్వు గొప్పగొప్ప వానరుల ననేకమందిని పడగొట్టివున్నావు. అయితే, ఆ విధంగా నువ్వు అలసిపోయివున్నావుకనక, నిన్నిప్పుడు విడిచిపెడుతున్నాను. కొంచెం సేద తేరి రా నా బలం చూతువుగాని" అని గట్టిగా చెప్పాడు.

ఇది విని మిక్కిలీ రుష్టుడై కుంభుడు రెండుచేతులతోనూ సుగ్రీవుణ్ణి పట్టుకున్నాడు. వెంటనే మదించిన యేనుగుల్లాగ నిట్టూర్పులు విడుస్తూ నోట పొగతో కూడా అగ్నిజ్వాలలున్నూ విడుస్తూ ఒకణ్ణొకడు గెంటుకుంటూ పొడుచుకుంటూ తన్నుకుంటూ బాహాబాహియుద్ధంప్రారంభించారు. వాళ్ల పాదాభిఘాతాలతో భూమి వొణికింది. సముద్రం తొణికిసలాడింది. కొంతసేపటికి, సుగ్రీవుడు, అడుగుకంటూ మునిగిపోయే లాగ కుంభుణ్ణి సముద్రంలో విసిరిపారేశాడు. కుంభుడు పడ్డంవల్ల సముద్రంలో మేరుమందరపర్వతాల్లాగ జలోచ్ఛ్వాసం లేచింది; కాని కుంభుడు వెంటనే లేచివచ్చి సుగ్రీవుణ్ణి గుండెలమీద గుద్దాడు. దాంతో సుగ్రీవుని చర్మం చిట్లి రక్తంచిమ్మింది. కుంభుని ముష్టివేగం సుగ్రీవుని గుండెలు తాకి అగ్ని అయి మేరుపర్వతంవల్ల వజ్రాయుధంపడ్డప్పుడు పుట్టిన మంటలాగ మెరిసింది. దానికి మిక్కిలి కుపితుడై సుగ్రీవుడు కుంభుని గుండెలమీద పిడుగువంటి గుద్దుగుద్దాడు. ఆదెబ్బతో చల్లారిపోయిన నిప్పులాగ కుంభుడు కిందపడిపోయాడు. ఆపాటుకి భూమి గజగజ లాడింది.

# ౭౭

## మెడవిరిచేసి హనుమంతుడు నికుంభుణ్ణి చంపడం

తన సోదరుడు కుంభుడిలా కూలిపోడంచూసి నికుంభుడు కాల్చేస్తున్నట్టు చూస్తూ వచ్చి పర్వతశిఖరంవంటి పరిఘ గిరగిరతిప్పాడు. ఆపరిఘ మీద పంచాంగుళముద్ర వుంది. దానికి బంగారపుకట్లు బిగించి వజ్రాలూ, విద్రుమాలూ పొదిగారు. నిజంగా అది యమదండంలా వుంది. అది తిప్పుతూ నికుంభుడు నోరు తెరిచి సింహనాదం చేశాడు. అప్పుడు నికుంభుడు మెడలో వున్న రత్నాలపతకంతోనూ, భుజాల మీద అంగదాలతోనూ, చిత్రవిచిత్రాలైన కుండలాలతోనూ, చక్కని పూలదండతోనూ, చేత వుండిన ఆపరిఘతోనూ నీలమేఘం మెరుములతోనూ ఉరుములతోనూ, ఇంద్రధనుస్సుతోనూ యెలావుంటుందో అలా వున్నాడు. గిరగిరా తిరిగిన అతని పరిఘాగ్రంవల్ల ఆకాశాన ఆవహాది వాయువులు భిన్నాలయి ఆధ్వని పొగలేని అగ్నితో ప్రజ్వలించింది. ఆధ్వనికి అలంకాపట్నమూ, అమరావతీనగరమూ, గ్రహమండలమూ చలించాయి. ప్రళయాగ్నిలావున్న నికుంభుణ్ణి చూసి వానరులూ రాక్షసులూ కూడా కదల్లేకపోయారు; కాని హనుమంతుడు ఎదురొమ్ము విరుచుకుంటూ వచ్చి వాడి యెదట నుంచున్నాడు. వెంటనే నికుంభుడు ఆపరిఘ హనుమంతుని గుండెలమీద విసిరేశాడు; కాని హనుమంతుని రాతిగుండెకు తగిలి ఆపరిఘ ముక్కా చెక్కా అయి కిందపడిపోయింది. ఆదెబ్బకి హనుమంతు డొక్కమాటు వూగిపోయాడు కాని నిలవరించుకుని నికుంభుని గుండెలమీద వొక్క గుద్దుగుద్దాడు. దాంతో నికుంభుని చర్మం పగిలి రక్తం స్రవించింది. ఆదెబ్బకి మంటలున్నూ లేచాయి. అయితే, ఒక్కమాటు వూగిపోయి

నికుంభుడు హనుమంతుణ్ణి పట్టుకున్నాడు. అది చూసి రాక్షసులు మహోత్సాహంతో సింహనాదాలు చేశారు.

కాని హనుమంతుడు మిక్కిలీ రుష్టుడై ఆపట్టులోనే వుండి ముందు నికుంభుణ్ణి ఒక్క పోటుపొడిచాడు. తరవాత, ఆపట్టువిడిపించుకుని వాణ్ణి నేలమీద పెట్టి రాసేసి, తా నెగిరి వాడిగుండెలమీద వురికాడు. చివరికి వాడితల పట్టుకుని నేలమీదపెట్టి కొట్టికొట్టి మెడలు విరిచేసి భయంకరంగా అరిచాడు. నికుంభుని చావు చూసి వానరులు ఎగిరిగంతులువేస్తూ సింహనాదాలు చేశారు. దాంతో భూమి చలించింది. ఆకాశం పగిలిపోయింది. రాక్షసులు భయభ్రాంతు లయిపోయారు.

## ౭౮
## రావణాజ్ఞతో మకరాక్షుడు యుద్ధానికి రావడం

కుంభుడూ, నికుంభుడూ కూడా చచ్చిపోయా రని విని రావణుడు క్రోధంతోనూ శోకంతోనూ కూడా మూర్ఛితుడై, చివరికి ఖరుని కొడుకైన మకరాక్షుణ్ణి పిలిచి "నాయనా! నువ్వు రాక్షసయోధులను వెంటబెట్టుకు వెళ్ళి రామలక్ష్మణులనూ వానరులనూ సంహరించి రా" అని చెప్పాడు. దానిమీద మకరాక్షుడు తా నొక మహాశూరు ణ్ణను కుంటూ రావణునకు "తప్పకుండా సంహరిస్తా" నంటూ ప్రదక్షిణ నమస్కారాలు చేసి, దగ్గిరగా వున్న సేనాధిపతిని "రథం తెప్పించు. రాక్షసయోధులను కూడా రప్పించు" అన్నాడు. రథం వచ్చింది. బల గమూ వచ్చింది. వెంటనే రథానికి ప్రదక్షిణనమస్కారాలు చేసి యెక్కి మకరాక్షుడు "త్వరగా రథం పోనియ్యి" అని సూతుణ్ణీ "మీరంతా నాయెదట యుద్ధంచెయ్యాలి. రామలక్ష్మణులను వధించమని రాక్షస రాజేంద్రుడు నా కాజ్ఞాపించాడు. రాక్షసవీరులారా! రాముణ్ణీ లక్ష్మ ణుణ్ణీ సుగ్రీవుణ్ణీ నేనే సంహరించేస్తాను. దావాగ్ని యెండిపోయిన అడ

విని కాల్చేసేటట్టు వానరసేనను కూడా నేనే కాల్చేస్తాను” అని రాక్షసులను తొందరపెట్టాడు.

ఆమాటమీద కామరూపులైన ఆరాక్షసులు నానా ఆయుధాలూ పట్టుకునివచ్చారు. వారి పాదఘట్టనలతో భూమి వొణికిపోయింది. వారి దండచరుపులతోనూ, సింహనాదాలతోనూ, శంఖభేరీధ్వనులతోనూ భూనభోంతరాళాలు దద్దరిల్లిపోయాయి; కాని సారథిచేతిలోనుంచి కొరడా జారిపడిపోయింది. జెండాకూలిపోయింది. గుర్రాలు తొట్రుపడుతూ కళ్లనీళ్లు కార్చాయి. దుమ్ము రేగింది; అయితే, ఈదుర్నిమిత్తాలు లక్ష్యంచెయ్యకుండా రాక్షసులు రామలక్ష్మణు లున్నచోటికి వెళ్లిపోయారు. ఇంతవరకూ ఎలాంటి యుద్ధాల్లోనూ అపజయం ఎరగని ఆరాక్షసయోధులు నేనునే నంటూ అహమికతో ముందు కురికారు.

## ౭౯

## రాముడు మకరాక్షుణ్ణి సంహరించడం

మకరాక్షుణ్ణి చూసి వానరులు ఎగిరిగంతేసి యుద్ధానికి సిద్ధపడ్డారు. అప్పుడే దేవదానవయుద్ధంలాగ రాక్షసులకూ వానరులకూ సంకుల సమరం ప్రారంభం అయింది. వానరులూ రాక్షసులూ చెట్లతోనూ రాళ్లతోనూ, శూలాలతోనూ పరిఘలతోనూ కొట్టుకున్నారు. కొంత సేపటికి మకరాక్షుని ఔద్ధత్యం సహించలేక వానరులు పారిపోసాగారు. అదిచూసి రాక్షసులు సింహనాదాలు చేశారు. వానరులు పారిపోడం చూసి రాముడు తన నిశితబాణాలతో రాక్షసులను నిలేశాడు. రాక్షసులు ఆగిపోడం చూసి మకరాక్షుడు మండిపడి “రామా, రా, ద్వంద్వయుద్ధంచేద్దాం. దండకారణ్యంలో నాతండ్రిని చంపావు కాదూ? నేనిప్పుడు నీప్రాణాలు తీస్తాను రా. నిన్ను చూశాటప్పటికి నాకు వొళ్లు మండిపోతోంది. అప్పుడే నేనక్కడ లేనందుకు నా శరీరం

యిప్పుడు దుడికిపోతోంది. ఆకొన్న సింహానికి యేనుగు దొరికినట్టు నాకు దొరికావు నువ్వు నిలు. నువ్విప్పుడే నాబాణాల దెబ్బలతో యమలోకానికి వెళ్లి నువ్వు చంపినవాళ్లతో కలుసుకుంటావు. పదిమాట లెందుకూ? నిన్నూ నన్నూ లోకా లన్నీ యిప్పుడు చూడాలి, రా. అయితే, గదాయుద్ధమూ, బాణయుద్ధమూ, బాహుయుద్ధమూ నీకేది అలవాటు?" అనడిగాడు.

అది విని రాముడు ముందు నవ్వేశాడు. తరవాత "ఎందు కలా తగని కోతలు కోస్తావూ? యుద్ధం చెయ్యాలి గాని మాటలతో రాదు జయం. నీ తండ్రి వొక్కడే కాదు, త్రిశిరుడూ, దూషణుడూ, మరో పధ్నాలుగువేల రాక్షసులూ నా చేతిలో చచ్చిపోయారు. ఇక యిప్పుడు తీక్ష్ణతుండనఖాలు గల గద్దలూ, నక్కలూ, కాకులూ నీ మాంసం తింటాయి." అని బదులుచెప్పాడు. ఈ మాటలు సహించలేక మకరాక్షుడు రామునిమీద బాణవర్షం కురిశాడు. రాముడు తన బాణాలతో ఆ బాణాలను తుక్కుచేసేశాడు. మకరాక్షుడూ రాముడూ అప్పుడు ఘోరయుద్ధం చేశారు. వారి ధనుష్టంకారాలతో ఆకాశం చిల్లులుపడిపోయింది. ఆవింత చూడ్డానికి వచ్చి దేవతలూ, దానవులూ, గంధర్వులూ, కిన్నరులూ, నాగులూ ఆకాశం అంతా నిండిపోయారు. వారిద్దరూ ఒకరికంటే వొక రెక్కువ పరాక్రమం చూపిస్తూ, ఒకరు చేసినదానికంటే మరొక రెక్కువచేస్తూ ఘోర యుద్ధంచేశారు. మకరాక్షుడు రాముడు విడిచిన బాణాలు ముక్కలు చేశాడు. రాముడు మకరాక్షుడు వేసిన బాణాలు ముక్కముక్కలు చేశాడు. దిక్కులూ విదిక్కులూ, ఆకాశమూ, భూమీ కూడా బాణాలతో నిండిపోయాయి.

కొంతసే పిలా జరిగాక రాముడు పరమకుపితుడై యెనిమిది బాణాలతో మకరాక్షుని చేతి ధనుస్సూ సారథినీ సంహరించాడు.

గుర్రాలను పడగొట్టాడు. రథం విరగకొట్టాడు. దాంతో మకరాక్షుడు కిందికి దిగి సకలభూతభయంకర మైన శూలం పుచ్చుకుని గిరగిరతిప్పి రామునిమీదికి విసిరాడు ; కాని అది ఆకాశాన వుండగానే రాముడు మూడుబాణాలతో ముక్కలుచేసేశాడు. దానిమీద మకరాక్షుడు పిడికిలి బిగించి "నిలునిలు" అంటూ మీదికి బయలుదేరాడు. అది చూశాడు రాముడు. నవ్వాడు. వెంటనే పావకాస్త్రం తొడిగి, లాగి విడిచాడు. గుండెలు తెగి మకరాక్షుడు చాపచుట్టుగా నేలమీద పడి చచ్చిపోయాడు. రాక్షసులు భయభ్రాంతులై లంకలోకి పరుగెత్తగా భూమిమీద వానరులూ, ఆకాశాన దేవగంధర్వాదులూ ఆనంద విహ్వాలులైనారు.

## ౮౦

## ఇంద్రజిత్తు మళ్లీ రామలక్ష్మణులతో యుద్ధం చెయ్యడం

మకరాక్షుడు చచ్చిపోయా డని తెలిసి రావణుడు చాలా కోపించి పళ్లుపటపట కొరికి "ఏమిటీ చెయ్యడం?" అని వొక్కక్షణం ఆలోచించి, చూసిచూసి "నాయనా! వీరాధివీరా! రామలక్ష్మణులు మహావీరులే ; కాని ఎదురుగా వున్నప్పుడూ, అదృశ్యం అయినప్పుడూ కూడా నువ్వు వారికంటే మహాబలవంతుడవు. నువ్వు అసాధ్యుడైన యింద్రుణ్ణే జయించావు. ఇక మనుష్యులు నీకంటబడ్డాక నువ్వు చంపకుండా విడిచిపెడతావా ?" అని యింద్రజిత్తు నాజ్ఞాపించాడు.

ఇంద్రజిత్తు వెంటనే యజ్ఞశాలకు వెళ్లి యథావిధిగా అగ్నిహోత్రంలో హోమాలు చేశాడు. అతను హోమాలు చేస్తూవుండగా ప్రదక్షిణార్చులతో అగ్ని స్వయంగా వచ్చి హవిస్సు స్వీకరించాడు. ఇలాగ హోమం పూర్తిఅయినాక ఇంద్రజిత్తు దేవదానవరాక్షసులను తృప్తిపరిచి అంతర్ధానం అయివుండిన రథం యెక్కాడు. ఆరథానికి నాలుగు గుర్రాలు పూన్చారు. గొప్ప ధనుస్సూ, బాణాలూ సిద్ధంగా

వున్నాయి. జెండా అగ్నిహోత్రంలాగ మెరిసిపోతోంది. ఆసామగ్రి తోనూ, బ్రహ్మాస్త్రంతోనూ ఇంద్రజిత్తు దురాధర్షుడైనాడు.

లంకనుంచి బయలుదేరి వెళ్లి, ఇంద్రజిత్తు మళ్లీ హోమం చేసి తానుకూడా మాయం అయి రాక్షసయోధులను పిలిచి "కపటమునివేషాలతో అడవికి వచ్చివుండిన రామలక్ష్మణులను సంహరించి మానాయనకు విజయం సమర్పిస్తాను. రామలక్ష్మణులను సంహరించడమే కాదు, భూమిమీద వానరపురుగుకూడా లేకుండా చేస్తాను" అని చెబుతూ మళ్లీ రథం యెక్కాడు. అక్కణ్ణుంచి యుద్ధరంగంలోకి వెళ్లాటప్పటి కతనికి బాణవర్షం కురుస్తున్న రామలక్ష్మణులు కనపడ్డారు. "వీళ్ళే రామలక్ష్మణులయి వుంటా" రనుకుని అతను ధనుస్సు సారించి బాణవర్షం ప్రారంభించాడు. దాంతో మునిగిపోయిన్నీ రామలక్ష్మణులు దివ్యాస్త్రం తొడిగారు. కాని, వారెన్ని బాణాలు వేసినా వొక్కటీ కూడా యింద్రజిత్తుకి తగలలేదు. ఇంద్రజిత్తు పొగబుట్టించి ఆకాశమూ, దిక్కులూ కప్పేశాడు. దాంతో దిగ్విభేదమే తెలియకుండా పోయింది. ఇలాగ అతను వీరవిహారం చేస్తూ వున్నా అతని రథచక్రాలధ్వనీ, జ్యాఘోషా కూడా వినపడ్డంలేదు. బాణవర్షం మాత్రం యెడతెరిపిలేకుండా వుంది. అతను వరప్రసాదాలైన దివ్యాస్త్రాలతో రాముణ్ణి చాలా బాధించాడు; అయినా రామలక్ష్మణులు బాణాలు వెయ్యడం మానలేదు. అవి ఆకాశాన ఇంద్రుజిత్తుకి మర్మభేదంచేసి నెత్తుటతడిసి కిందపడిపోతున్నాయి. రామలక్ష్మణులు ఇంద్రజిత్తు బాణాలన్నీ ఖండిస్తూనే వున్నారు. వారు ఏవైపుగా తమమీదికి బాణాలు వస్తున్నాయో ఆవైపుగురిచూసి కొట్టసాగారు; కాని ఇంద్రజిత్తు శరవేగంగా తిరుగుతూ వారిబాణాలు తప్పించుకోడానికి చూడసాగాడు. ఇంద్రజిత్తు బాణాలు తగిలి రామలక్ష్మణులు విరగబూసిన మోదుగుచెట్లలా వున్నారు.

ఇంద్రజిత్తు బాణాలతో వానరులు అనేకులు దెబ్బతిన్నారు. అనేకులు పడిపోయారు. అనేకులు చచ్చిపోయారు. అది చూసి లక్ష్మణుడు "అన్నా! బ్రహ్మాస్త్రం ప్రయోగించి రాక్షసుల నందరినీ సంహరించేస్తా" నన్నాడు. దానిమీద రాముడు "నాయనా! ఒక్కని మూలాన రాక్షసుల నందరినీ సంహరించడం తగదు. యుద్ధంచెయ్యకుండా వున్నవాణ్ణీ, ప్రచ్ఛన్నంగా వున్నవాణ్ణీ, దోసిలివొగ్గినవాణ్ణీ శరణాగతుణ్ణీ, పారిపోయేవాణ్ణీ, ప్రమత్తుడై వున్నవాణ్ణీ చంపగూడదు; కనక మనం యింద్రజిత్తును సంహరించడానికే పూనుకుని నల్లతాచుల వంటి బాణాలు ప్రయోగింతాము. ఇంద్రజిత్తును వానరులు కనిపెట్టారంటే చంపేశా రన్నమాటే. వాడు ఇక భూమిలో దూరినా, ఆకాశంలో వున్నా, రసాతలంలో దాగినా — ఏమి చేసినా నాఅస్త్రంతో కాలి నేలమీద పడిపోతాడు, తప్పదు" అని చెప్పి రాముడు ఇంద్రజిత్తును వధించడానికి ఉపాయం చూడసాగాడు.

## ౨౧

## హనుమంతుని యెదట ఇంద్రజిత్తు మాయసీతను నరకడం

రాముని వుద్దేశం గ్రహించి ఇంద్రజిత్తు యుద్ధరంగం విడిచి పట్నంలో వెళ్లిపోయాడు; కాని అక్కడికి వెళ్లాక కుంభకర్ణాదుల వధ జ్ఞాపకం రాగా క్రోధరక్తాక్షుడై మళ్లీ బయలుదేరి పశ్చిమద్వారాన యుద్ధరంగంలో ప్రవేశించాడు. వెంటనే అతను రామలక్ష్మణులు యుద్ధసన్నద్ధులై వుంటా రని ఆలోచించి మాయచెయ్యబూనుకున్నాడు. "మాయసీతను రథంమీద కూచోబెట్టుకోడం. వానరులయెదట ఆమాయసీతను చంపడం" ఇదీ ఆమాయ. ఇలా అనుకుని అంతా సిద్ధంచేసుకుని అతను వానరుల కెదురుగా వెళ్లాడు. లంకలోనుంచి ఇంద్రజిత్తు రావడం చూసి రాళ్లూ రప్పలూ పుచ్చుకుని వానరులు

యుద్ధసన్నద్ధు లయినారు. వారి కందరికీ ముందుగా పెద్దపర్వతశృంగం పుచ్చుకుని హనుమంతు డున్నాడు. అతనికి ఇంద్రజిత్తురథంమీద సీత కనపడింది. ఆమె ఏకవేణితో వుంది. ఉపవాసాలు చేసి చిక్కిపోయి వుంది. మాసిపోయిన బట్టకట్టుకునీ, ధూళిధూసరాంగీ అయివుందికి హనుమంతు డామెను గుర్తుపట్టాడు. ఆమె యింద్రజిత్తు రథంమీద వుండడం చూసి అతను చాలా దుఃఖించాడు. "అయితే, వీడు సీత నెందుకు తీసుకువచ్చాడూ," అని ఆలోచించాడు. ఇలా ఆలోచిస్తూనే హనుమంతుడు వానరవీరులతో కలిసి యింద్రజిత్తుమీదికి వెళ్లాడు. వానరుల రాకచూసి ఇంద్రజిత్తు కోపఘూర్ణితుడై వొరలోనుంచి కత్తితీసి సీత నెత్తిమీద రాశాడు. ఆమె రామా రామా అని మాయగా యేడుస్తూ వుండగా వానరులు చూస్తూండగా దెబ్బలు కూడా కొట్టాడు. అది చూసి హనుమంతుడు చాలా దుఃఖించి అంతలో మిక్కిలీ క్రుద్ధుడై ఇంద్రజిత్తును అతిపరుషంగా "దురాత్మా, బ్రహ్మర్షులవంశానికి చెందినీన్ని నువ్వు రాక్షసజాతిలో పుట్టడంవల్ల సీతాదేవి జుట్టుపట్టుకున్నావు; కనక నీకు నాశనంతప్పదు. ఛీ! నువ్వింత నీచుడవా? ఇంత చెడ్డపని చెయ్యడానికి నీకు సిగ్గులేదూ? సీత యింటో నుంచి తరమబడ్డది. రాజ్యంలోనుంచి ప్రవాసశిక్ష పొందింది. రాముణ్ణి బాసింది. ఆమె నీకేమి అపకారం చేసిం దని చంపడానికి చూస్తావూ? సీతను చంపి నువ్వెంతో కాలం బతకవు. నాచేతిలో పడ్డావు, నీకు రక్షణ లేదు. స్త్రీహత్య చేసినవాళ్లు ప్రవేశించే దుర్లోకాలు నీకోసం కనిపెట్టుకునివున్నాయి" అని నిందించి వానరులతో కూడా వాడి మీదికి వెళ్లాడు.

అప్పుడు రాక్షసయోధులు ముందుకి వచ్చి వానరులను అడ్డగించారు. ఇంద్రజిత్తు ముందు వేలకొద్దీ బాణాలతో వానరులను నొప్పించి తరవాత "ఓరీ! నువ్వూ, సుగ్రీవుడూ, రాముడూ ఎవరికోసం యిక్క-

డికి వచ్చారో ఆసీతను నువ్వు చూస్తూవుండగా చంపేస్తాను. ఈమెను చంపాక రాముణ్ణీ, లక్ష్మణుణ్ణీ, నిన్నూ, సుగ్రీవుణ్ణీ, ఆదురాత్ముడు విభీషణుణ్ణీ కూడా చంపేస్తాను. వానరా! నువ్వు స్త్రీలను చంపగూడదంటున్నావు; కాని శత్రువులకు బాధ కలిగించే పని యేమయినా చెయ్యవచ్చు, తప్పులేదు" అంటూనే సీతను జందెప్పొట్టుగా నరికాడు. మాయసీత ముక్కలై పడిపోయింది.

ఇలాగ, స్వయంగా సీతను చంపి ఇంద్రజిత్తు మళ్లీ అందుకుని "ఇదిగో నేను మీరాముని భార్యను చంపేశాను చూసుకో. ఇక మీప్రయాస అంతా వ్యర్థం" అని చెప్పి వికృతంగా సింహానాదం చేశాడు. వానరు లదంతా విన్నారు. ఇలాగ సీతను చంపి ఇంద్రజిత్తు ఉత్సాహభరితుడు కాగా, అది చూసి వానరులు నిరుత్సాహు లయిపోయారు.

## ౮౨

## సీత సంగతి రామునకు చెప్పడానికి హనుమంతుండు వెనక్కి మళ్లడం

ఇంద్రజిత్తు పెడబొబ్బలు విని భయభ్రాంతులై వానరులు పారిపోసాగారు. అది చూసి హనుమంతుడు "వానరయోధులారా! ఎందుకు పారిపోతారూ? మీశౌర్యం అంతా యేమయిపోయిందీ? నేను ముందు వెడతాను. మీరు నావెనకరండి. సద్వంశసంజాతులైన శూరులు యుద్ధరంగంలోనుంచి పారిపోవడం తగనిపని" అంటూ ప్రోత్సాహపరిచాడు. ఇది విని వానరులు వెంటనే శిలలూ, పర్వతశృంగాలూ చెట్లూ పెల్లగించుకుని సిద్ధపడ్డారు. హనుమంతుని వెంట వారు సింహనాదాలు చేస్తూ రాక్షసులమీదికిన్నీ బయలుదేరారు. వారి సాయంతో హనుమంతుడు దావాగ్నిలాగ శత్రువును మాడ్చేశాడు. అత నప్పుడు కాలాంతకుడై పోయాడు. అటు శోకం, ఇటు కోపం —

దీంతో వాళ్లు తెలియక, హనుమంతుడు ఇంద్రజిత్తుమీద వొక పర్వతశిఖరం విసిరేశాడు. అయితే, సూక్ష్మగ్రాహి కనక, ఇంద్రజిత్తు గుర్రాలను గబగబా తోలించి తప్పించుకున్నాడు ; కాని ఆపర్వతశిఖరంకింద పడి అనేకమంది రాక్షసులు పిప్పి అయిపోయారు. మిగిలిన రాక్షసులు భయభ్రాంతు లయిపోయారు. సింహనాదాలు చేస్తూ వానరులు వాళ్లని తరిమారు. రాళ్లూ రప్పలూ వేసి రాక్షసులను కొడుతూ వానరులు అగ్గిబరాటా లయిపోయారు. ఆదెబ్బతో రాక్షసయోధు లనేకులు చచ్చిపోయారు.

తన సేన అంతా యిలా అయిపోడం చూసి యింద్రజిత్తు క్రోధపరవశుడై బాణవర్షం కురిసి వానరులను చీకాకుపరిచాడు. రాక్షసులు కూడా పూనుకుని శూలాలతోనూ, కూటముద్గరాలతోనూ, ఖడ్గాలతోనూ వానరుల ననేకమందిని సంహరించారు. అందుకు కోపించి హనుమంతుడు చెట్లతోనూ, రాళ్ళతోనూ కొడుతూ రాక్షసులమీద విజృంభించాడు. ఈవిధంగా అతను రాక్షసులను మళ్ళించి, వానరులను చూసి "మీరింక వెనక్కి మళ్ళండి. మనపని యీ రాక్షసులను సంహరించడం కాదు. ప్రాణాలకు తెగించి రాముణ్ణి సంతోషపెట్టదలచి ఎవరికోసం మనం యుద్ధం ప్రారంభించామో ఆ సీత హతం అయిపోంది. ఈసంగతి రామునకూ సుగ్రీవునకూ చెప్పి యిక వా రేమి చెయ్యమంటే మనం అదే చేద్దాం" అని చెప్పి, మెల్లి మెల్లిగా — భయపడకుండా — శత్రువులకు దొరక్కుండా వానరులతో వెనక్కి వచ్చేశాడు.

హనుమంతు డిలా రాముని దగ్గిరికి వెళ్ళిపోడం చూసి ఇంద్రజిత్తు మళ్ళీ హోమంచెయ్యడానికి నికుంభిళాచైత్యానికి వెళ్ళిపోయాడు. అక్కడ అతను యథావిధిగా హోమాలు చేశాడు. అందు కానందించి అగ్ని హోత్రుడు చక్కగా ప్రజ్వలించాడు. రాక్షసులలో పండితులైన

వారు ఆ హోమకర్మలో ఎలాంటి లోపాలూ రాకుండా చాలా శ్రద్ధగా చూస్తూ వున్నారు.

## 73

## లక్ష్మణుడు రాముణ్ణి ఓదార్చడం

రాముడు రాక్షసవానరుల యుద్ధఘోష విని జాంబవంతునితో "హనుమంతుడు చాలా గొప్పపని చేస్తున్నాడు. ఆయుధాల ధ్వని చాలా భయంకరంగా వినపడుతోంది చూడూ, కనక, నువ్వు నీ భల్లూకబలం వెంటబెట్టుకువెళ్ళి ఘోరయుద్ధం చేస్తున్న హనుమంతునకు సాయంచెయ్యి" అని చెప్పాడు. సరే అని జాంబవంతుడు పశ్చిమ ద్వారం కేసి బయలుదేరాడు. ఇతనక్కడికి వెళ్ళాటప్పటికి వానరవీరులు వగర్చుకుంటూ వెనక్కి వస్తున్నారు. నీలమేఘమాలిక లాగ వస్తున్న భల్లూక బలం హనుమంతుడు కూడా చూసి వెనక్కి మళ్ళించుకువచ్చి రామునితో "మేము యుద్ధం చేస్తూవుండగా, ఇంద్రజిత్తు మా యెదట రామా రామా అని గోలపెడుతున్న సీతను చంపేశాడు. అది చూసి ఉద్భ్రాంతచిత్తుణ్ణయి నేను యీ సంగతి నీకు చెప్పడానికి వచ్చాను" అని దుఃఖిస్తూ చెప్పాడు.

ఇది వినీవినగానే రాముడు మొదలు నరికేసిన చెట్టులాగ భూమి మీద పడిపోయాడు. రాముడలా పడిపోడం చూసి వానరు లందరూ అక్కడికి పరుగెత్తుకువచ్చారు. వారు చల్లని నీళ్లు తెచ్చి రాముని మొగాన చల్లారు. అప్పుడు లక్ష్మణుడు రాముణ్ణి తన చేతుల్లోకి తీసుకుని యిలా అన్నాడు.

"అన్నా ! నువ్వు సన్మార్గంలో చరిస్తున్నావు. విజితేంద్రియుడవై వున్నావు. అయినా అనర్థాలు తప్పించి ధర్మం నిన్ను రక్షించలేకుండా వుంది. స్థావరజంగమాత్మక మైన భూతకోటి అంతా మన కళ్ళకి

స్పష్టంగా కనపడుతోంది. ధర్మం అలా కనపడ్డం లేదు; కనక, అది లేదని నా నమ్మకం. స్థావరాలూ జంగమాలూ స్పష్టంగా కనపడుతున్నాయి. ధర్మం కూడా అలా వుంటే నీకీ ఆపదలు వచ్చివుండకే పోవును. అధర్మమే వుంటే రావణుడు నరకానికి పోయివుండాలి. ధర్మమే వుంటే నీకీ చిక్కులు వచ్చివుండగూడదు. వాడికి బాధలు లేకపోడమూ, నీకు ఆపదలు కలగడమూ చూస్తే ధర్మమూ అధర్మమూ వ్యతిరేకఫలితాలు కలిగించేవిగా కనపడుతున్నాయి. ధర్మాధర్మాలే వాస్తవాలయితే ధర్మంవల్ల ధర్మమూ, అధర్మంవల్ల అధర్మమూ కలగాలిగదా? ధర్మంగా నడిచేవాళ్ళకి సుఖమూ, అధర్మంగా నడిచేవాళ్ళకి కష్టమూ కలిగితేనే ధర్మాధర్మాలున్నాయని చెప్పాలి. అధర్మపరులకు ఐశ్వర్యం పెరుగుతోంది. ధర్మపరులు క్లేశాలపాలయి పోతున్నారు. కనక, ధర్మమూ అధర్మమూ కూడా నిరర్థకాలు; పైగా క్రియారూపాలైన ధర్మాధర్మాలు క్షణికాలు. కాలాంతరభావిఫలజనకాలు కావు. అదీ కాక మంచికయినా చెడ్డకయినా దైవమే కారయిత. రాజు హత్యచేయిస్తే తత్ఫలం భటునకుండదు. అలాగే కారయితకే గాని కర్త కేమీ లేదు. అంటే దేనికయినా పౌరుషమే ప్రధానం. కనక, ధర్మాధర్మప్రసక్తి వద్దు. పౌరుషమే ఆశ్రయించు. సత్యమే ధర్మం అంటావా? అయితే, నీ మొదల అసత్యంగా ప్రవర్తించిన తండ్రి నెందుకు బంధించావుకావూ? అధర్మం చెయ్యగూడదంటే ఇంద్రుడు విశ్వరూపుణ్ణి చంపి యజ్ఞం చేసివుండడు. ధర్మం త్యాజ్యం అంటే అతను విశ్వరూపుణ్ణి చంపి వూరుకుండును. యజ్ఞంచేసివుండడు. అంటే యేమిటీ? ఏ పనిచెయ్యడానికయినా ధర్మాధర్మాలు ప్రధానం కావు. క్షత్రియుల కసలే కావు. నిజంగా ధర్మాధర్మాలు విధినిషేధాలు కావు. నా నమ్మకం యిదీ. రాజ్యం ధర్మమూలం. నువ్వు రాజ్యం విడిచిపెట్టి ధర్మం విడిచిపెట్టేశావు. పర్వతాలుంటేనే నదులు ప్రవ

హిస్తాయి. అలాగే డబ్బుంటేనే పనులు జరుగుతాయి. గ్రీష్మకాలంలో నదులెండిపోయేటట్టు ద్రవ్యహీనుని పనులన్నీ చెడిపోతాయి. ధనం లేకపోతే సుఖాలు కావాలంటే పాపాలు చెయ్యాలి. దానివల్ల చాలా చెడుఫలం కలుగుతుంది. డబ్బున్నవాడికే మిత్రులుంటారు. డబ్బున్నవాడికే బంధువులుంటారు. డబ్బున్నవాడే మగవాడు. డబ్బున్నవాడే పండితుడు. డబ్బున్నవాడే పరాక్రమశాలి. డబ్బున్నవాడే బుద్ధిమంతుడు. డబ్బున్నవాడే మహాత్ముడు. డబ్బున్నవాడే గుణవంతుడు. డబ్బు లేకపోతే ఏమీ లేదు. అర్థోత్పత్తికి మూలం అయిన రాజ్యం విడిచిపెట్టడంవల్లనే నువ్వాపదలపాలయినావు. డబ్బున్నవాడికి ధర్మకామాలు కూడా సిద్ధిస్తాయి. డబ్బులేనివాడికి శ్రేయస్సు లేదు. హర్షమూ, కామమూ, దర్పమూ, ధర్మమూ, క్రోధమూ, శమ దమాలూ డబ్బుంటేనే సాగుతాయి. డబ్బుంటే అనాదరబుద్ధి కలవాడికి సుఖం లేదు. నీకు సుఖం లేకపోడానికదే కారణం. తండ్రిమాట మీద నువ్వు అడవులకు రావడంవల్లనే నీ భార్య అపహరించబడ్డది. కనక, నీకు ఇంద్రజిత్తు వల్ల దుఃఖం తగ్గే పనిచేసి నేను పోగొడతాను. కనక, నరశార్దూలా! లే. నిన్ను నువ్వు తెలుసుకో. సీత చనిపోయిన దన్న వార్తవిన్నందున రుష్టుణ్ణయి నేనిదంతా చెప్పాను. ఇక మాటలతో పనిలేదు. నా తీక్ష్ణబాణాలతో నిమిషంలో లంకాపట్నం అంతా నేను నాశనం చేసేస్తాను."

## ౮౪

## విభీషణుడు ఇంద్రజిత్తు చేసింది మాయ అని చెప్పడం

రాము డిలాంటి స్థితిలో వుండగా సేనాసమూహాల నెక్కడికక్కడ పరీక్షించి విభీషణుడు అక్కడికి వచ్చాడు. అతనివెంట వివిధాయుధాలు ధరించి వున్న అతని సచివులున్నూ వచ్చాడు. రాముడు శోకిస్తూ వుండ

డమూ, లక్ష్మణు డతన్ని చేతుల్లోకి తీసుకుని వుండడమూ వానరు లందరూ కళ్ళనీళ్ళు పెట్టుకుని వుండడమూ చూసి హృదయం దహిం చుకుపోగా "ఏమిటిదీ?" అని అడిగాడు. అందుకు లక్ష్మణుడు విభీష ణుణ్ణీ, సుగ్రీవుణ్ణీ, వానరులనూ చూసి దుఃఖిస్తూనే "ఇంద్రజిత్తు యుద్ధ రంగంలోకి తీసుకువచ్చి సీతను చంపేశా డని హనుమంతుడు చెప్పాడు. అంచేత రాము డిలా వున్నాడు" అని బదులుచెప్పాడు. ఇది విని విభీషణుడు "ఇక చెప్పవద్దు" అని లక్ష్మణుణ్ణి అడ్డగించి "రామా! సముద్రం యెండిపోయిం దంటే యెలాంటిదో హనుమంతుడు చెప్పిందీ అలాంటిదే. దురాత్ముడైన రావణుని భావం నాకు తెలుసు. వాడు సీతనెంతమాత్రమూ బాధించడు. 'సీతను విడిచిపెట్ట' మని నేననేకవిధాల హితంచెప్పాను; కాని వాడు వినలేదు. చతురుపాయాలతోనూ గూడా సీతను చూడడాని కెవరికీ శక్యంకాదు. ఇంద్రజిత్తు వానరుల నీ విధంగా మోసంచేసి హోమంచెయ్యడానికి నికుంభిళాచైత్యానికి వెళ్ళాడు. అక్కడ వా డది పూర్తిచేసి అగ్నిహోత్రుణ్ణి మెప్పించా డంటే యికవా ణ్ణెవరూ జయించలేరు. ఈ సంగతి తెలిసి వానరులు హోమవిఘ్నం చెయ్యకుండా వుండడానికి వా డీ యెత్తు యెత్తాడు. కనక, మనం వాడది పూర్తిచేసే లోపున సైన్యాలతో అక్కడికి వెళ్ళాలి. రామా! ఇది నీకు అవసరం లేని దుఃఖం. నిన్ను చూసి అందరూ చేతులు వేల వేసుకుని వున్నారు. నువ్వు స్వస్థహృదయుడవై యిక్కడే వుండు. సైన్యం యిచ్చి మాతో కూడా లక్ష్మణుణ్ణి మాత్రం పంపు. లక్ష్మణుడు తన నిశితశరాలతో వాడికి యత్న భంగంచేస్తాడు. దాంతో వాడు వధ్యు డయిపోతాడు. లక్ష్మణుని బాణాలు గద్దలు మొదలైన క్రూరపక్షుల్లాగ వాడి రక్తం తాగుతాయి; కనక, రామా! ఇంద్ర జిత్తుని నాశనంచెయ్యడానికి లక్ష్మణునకు ఆజ్ఞ దయచెయ్యి. శత్రువధ విషయమై ఆలస్యంచెయ్యడం మంచిది కాదు. హోమం పూర్తిచేశా

డంటే యింద్రజిత్తు అదృశ్యం అయిపోతాడు. వాణ్ణి కొట్టడం యిక సురాసురలకున్నూ సాధ్యం కాదు" అని చెప్పాడు.

## ౮౫

## హోమకార్యం పాడుచెయ్యమని రాముడు లక్ష్మణుణ్ణి పంపడం

విభీషణుడు చెప్పినది దుఃఖోద్రేకంవల్ల గుర్తించలేక "విభీషణా! ఏమి చెప్పావో, మళ్లీ చెప్పు" అని అడిగాడు. దానిమీాద విభీషణుడు "రామా! నువ్వు చెప్పిన చొప్పున సైనికులను యథాస్థానంలో కట్టుదిట్టాలు చేశాను. ఇక నేను చెప్పేది విను. నువ్వు అకారణంగా దుఃఖిస్తున్నావు. నీదుఃఖం చూాస్తే మాకూ దుఃఖంవస్తోంది. నీదుఃఖం శత్రువులకు ఉత్సాహం కలిగిస్తుంది. మనవాళ్లని నిరుత్సాహపరుస్తుంది. కనక యికనైనా యిది విడిచిపెట్టు. నువ్వు సీతను పొందాలన్నా, రాక్షసులను సంహరించాలన్నా నామాట విను. లక్ష్మణుడిప్పుడు వానర యోధులను వెంటబెట్టుకుని నికుంభిళాచైత్యానికి బయలుదేరాలి. ఇతను ఇంద్రజిత్తును సంహరించాలి. వీరాధివీరుడైన యింద్రజిత్తు గొప్ప తపస్సుచేసి మెప్పించి బ్రహ్మదేవునివల్ల బ్రహ్మశిరోస్త్రమూా, కామగమనం గల గుర్రాలూ సంపాదించాడు. వాడిప్పుడు తన సైనికులను వెంటబెట్టుకుని నికుంభిళకు వెళ్లాడు. వాడక్కడికి వెళ్లిన పని పూర్తి అయిందంటే మనల నందరినీ చంపేశాడన్నమాటే." ఆయుధాలు ధరించి హోమం చెయ్యడానికి నువ్వు నికుంభిళకు బయలుదేరినప్పుడు, హోమంచెయ్యకుండానూ, నికుంభిళ చేరకుండానూ నిన్నెవ డడ్డగిస్తాడో వాడిచేతిలో నువ్వు చచ్చిపోతావని బ్రహ్మ యింద్రజిత్తుకి చెప్పాడు. వాణ్ణి చంపాలంటే యింతకంటే మరో మార్గంలేదు. కనక, యింద్రజిత్తును సంహరించడానికి ఏర్పాట్లు చెయ్యి. ఇంద్రజిత్తు చచ్చాడంటే

రావణుడు సకలశత్రుపుత్రమిత్ర బాంధవంగా నాశనం అయిపోయా డన్న మాటే" అని చెప్పాడు.

ఇది విని రాముడు "విభీషణా! ఇంద్రజిత్తు మాయ తెలుసుకున్నాను. వాడు బ్రహ్మాస్త్రం తెలిసిన వాడు. ప్రాజ్ఞుడు. మాయావి. మహాబల శాలి. యుద్ధంలో వాడు దేవతలను కూడా సంహరించగలడు. వాడు ఆకాశం ప్రవేశించా డంటే ఎవరికీ కనపడడు. తమ్ముడూ! సుగ్రీవుని సైన్యం అంతా వెంటబెట్టుకుని హనుమంతుడూ జాంబవంతుడూ మొదలైన మహావీరులను తీసుకుని వెళ్ళి నువ్వు మాయావి అయిన ఇంద్రజిత్తును సంహరించిరా. అక్కడి సంగతు లన్నీ తెలిసిన విభీషణుడు నీ వెంటవచ్చి సకలమూ చెబుతూ వుంటాడు" అని చెప్పాడు.

రాము డిలా చెప్పగానే లక్ష్మణుడు లేచి కవచం తొడుక్కున్నాడు. ధనుస్సూ ఖడ్గమూ పుచ్చుకున్నాడు. రాముని పాదాలు ముట్టుకుని "అన్నా! ఇప్పుడే నా బాణాలు ఇంద్రజిత్తు శరీరం ముక్కముక్కలు చేసేస్తాయి" అని చెప్పి మళ్ళీ ప్రదక్షిణనమస్కారాలు చేసి బయలు దేరాడు. హనుమంతుడూ విభీషణుడూ అతనివెంట బయలుదేరారు. వానరసేనా, భల్లూకసేనా అతణ్ణి వెంబడించింది. కొంత దూరం వెళ్ళేటప్పటికి రాక్షససేన అక్కడ మొగ్గరంతీరి వుంది. వెంటనే అతను విభీషణుడూ, అంగదుడూ, హనుమంతుడూ తన వెనక రాగా భయంకర మైన శత్రుసైన్యంలో చొరుచుకుపోయాడు.

## ౨౬

## ఇంద్రజిత్తు హోమంమానేసి యుద్ధంచెయ్యడం

అప్పుడు విభీషణుడు "లక్ష్మణా! అదిగో, నీలమేఘశ్యామంగా రాక్షస సేన. వానరులతో కలిసి నువ్వు దాన్ని సంహరించు. నువ్వు భేదిస్తేవా, ఇంద్రజిత్తు యెదటపడతాడు. వాడు హోమం పూర్తిచెయ్యకపూ

ర్వమే నువ్వు సంహారించాలి" అని చెప్పాడు. ఇది విని లక్ష్మణుడు రాక్షసులమీద బాణవర్షం కురిశాడు. భల్లూకవీరులూ, వానరవీరులూ చెట్లూ, రాళ్లూ పుచ్చుకుని అతణ్ణి అనుసరించారు. రాక్షసులు బాణాలతోనూ, ఖడ్గాలతోనూ, తోమరాలతోనూ, వానరుల నెదిరించారు. పోరు ఘోరం అయింది. ఆధ్వనితో లంక ఊగ్రూగ్త లూగిపోయింది. పర్వతశిఖరాలతోనూ, బండరాళ్లతోనూ, చెట్లతోనూ, బాణాలతోనూ ఆకాశం అంతా నిండిపోయింది.

కొంతసేపటికి రాక్షసయోధులు జంకారు. అది విని ఇంద్రజిత్తు హోమకార్యం పూర్తి కాకముందే లేచి అదివరలోనే యెక్కి వచ్చిన రథం యెక్కాడు. క్షణంలో వాడు యుగాంతాగ్నిలాగ మండిపడుతూ వానరులమీద పడ్డాడు. అప్పుడు హనుమంతుడు మహా పర్వతం అంత చెట్టొకటిపుచ్చుకుని దాంతో అనేకమంది రాక్షసులను సంహారించి మళ్ళీమళ్ళీ చెట్లు పెరికి యుద్ధంచెయ్యసాగాడు. రాక్షసులు వేలకొద్దీ వచ్చి హనుమంతుణ్ణి ముట్టడించారు. హనుమంతుడున్నూ అందరికీ అన్నిరూపులయి వాళ్ళ నందరినీ మర్దించాడు.

అది చూసి ఇంద్రజిత్తు "ఉపేక్షచేస్తే ఆ వానరుడు రాక్షసులను సంహారించేటట్టున్నాడు. రథం అక్కడికి పోనియ్యి" అని సారథి తొందరపెట్టాడు. ఇంద్రజిత్తు హనుమంతుని శిరస్సు మీదని కత్తులు విసిరాడు. పట్టసాలూ, పరశ్వధాలూ గిరవటేశాడు. బాణాలు విడిచాడు. కాని హనుమంతు డవేమీ లక్ష్యపెట్టక "ఇంద్రజిత్తూ! నువ్వు శూరుడవైతే, రా. హనుమంతునియెదట పడ్డావు, నువ్వికబతకవు. నీకు చేతనైతే బాహాబాహీ యుద్ధానికి రా" అని పిలిచాడు. అది సహించక ఇంద్రజిత్తు హనుమంతునిమీద విజృంభించాడు. అది చూసి విభీషణుడు "లక్ష్మణా! అదే రథంమీద

వచ్చి ఇంద్రజిత్తు హనుమంతుణ్ణి పీడిస్తున్నాడు. నీ తీవ్రబాణాలతో వాణ్ణి సంహరించు"! అని లక్ష్మణుణ్ణి ప్రోత్సహించాడు.

## ౮౭

## ఇంద్రజిత్తూ, విభీషణుడూ పరస్పరమూ నిందించుకోడం

ఇలా చెప్పి విభీషణుడు ధనుష్పాణి అయిన లక్ష్మణుణ్ణి తొందరచేసి తీసుకువెళ్ళాడు. కొంతదూరం వెళ్ళాటప్పటికి ఒక వనమూ అందులో ఇంద్రజిత్తు హోమంచేసే స్థలంమూ కనపడింది. అక్కడ నీలజీమూత మండలంలాగ భయంకరమైన పెద్దమర్రిచెట్టు చూపిస్తూ విభీషణుడు "లక్ష్మణా! ఆచెట్టుకిందే భూతబలి చేసి ఇంద్రజిత్తు యుద్ధానికి బయలు దేరతాడు. అక్కడ హోమకార్యం పూర్తిచేశాడంటే వాడు రథంతో కూడా అదృశ్యం అయిపోతాడు. శత్రువులను బంధించేస్తాడు. సంహరించేస్తాడు. ఇక మా ఎవరూ యేమీ చెయ్యలేరు. కనక, వాడా మర్రికిందికి వెళ్ళకుండానే తీవ్రబాణాలువేసి సరథంగానూ, ససారథి కంగానూవాణ్ణి సంహరించెయ్యి" అని చెప్పాడు.

"సరే" అంటూ సిలిచి లక్ష్మణుడు ధనుస్సు ఎక్కుబెట్టి ధనుష్టంకారం చేశాడు. కవచం ధరించి, ధనుర్ధారి అయి ఇంద్రజిత్తు రథం మీద కనబడగా లక్ష్మణుడు వాణ్ణి పిలిచి "ఇదిగో, నిన్ను పిలుస్తున్నాను. నాతో యుద్ధానికి రా" అన్నాడు. దానిమీద మిక్కిలీ క్రుద్ధుడై ఇంద్రజిత్తు విభీషణుణ్ణి పరుషంగా పిలిచి "నువ్వు రాక్షసుడవు. ఇక్కడే పుట్టిపెరిగావు. సాక్షాత్తుగా నాతండ్రికి తమ్ముడవూ, నాకు పినతండ్రివిన్నీ. ఇలాంటి స్థితిలో నాకు ద్రోహంచెయ్యడాని కెలా పూనుకున్నావూ? ధర్మదూరా! జ్ఞాతిత్వమూ, సౌహార్దమూ, జాతీ, సౌదర్యమూ, ధర్మమూ కూడా నీ కక్కరలేదు. నువ్వు స్వజనం

విడిచిపెట్టావు. పరులకు భృత్యుడ వైనావు. ఈ విధంగా నువ్వు సాధువులకు శోచ్యుడవూ, నిందనీయుడవూ అయినావు. స్వజనంలో గొప్పగా బతకడానికీ, నీచులైన పరుల నాశ్రయించి బతకడానికీ యెంత తేడా వుందో బుద్ధిహీనుడ వయినావు కనక, నీకు తెలియదు. పరాయివాడు గుణవంతుడే కానియ్యి. స్వజనుడు దుర్గుణుడే కానియ్యి. ఈ వుభయులలో పరుని కంటే స్వజనుడే శ్రేయస్కరు డవుతాడు. స్వపక్షం విడిచి పరపక్షం అవలంబించినవాడు, స్వపక్షం నశించాక, తానాశ్రయించిన పరునివల్లనే నాశనం అయిపోతాడు. హోమవిఘాతం కలిగించడానికి లక్ష్మణుణ్ణి యిక్కడికి తెచ్చిన నీ నిర్దయను బట్టి చూడగా స్వజనంలో చేరిన నువ్వుతప్ప నావిషయమై యిలాంటి పని మరె వ్వడూ చెయ్యలేడు 'అని నిశ్చయమే" అని చాలా నిందించాడు.

ఇది విని విభీషణు డిలా బదులుచెప్పాడు. "దుష్టుడా! నాస్వభావం తెలిసిన్నీ నువ్వెందు కిలా అంటావూ? ఇప్పుడైనా మృదువుగా మాట్లాడు. నేను క్రూరులైన రాక్షసుల యింట పుట్టడం నిజమే; కాని నాస్వభావం సత్పురుషు లవలంబించే సాత్త్వికమే గాని మరొకటి కాదు. క్రూరకర్మ అనినా, అధర్మం అనినా నాకెప్పుడూ యిష్టంలేదు. లేకపోతే దుశ్శీలుడైన రావణుడు నన్నెందుకు నిరసిస్తాడూ? యోగ్యుడైనవాడు ధర్మభ్రష్టుణ్ణీ పాపచింతకలవాణ్ణీ పామును విడిచినట్టు విడిచి పెట్టేస్తాడు. పరహింసా, పరధనం హరించడమూ, పరస్త్రీగమనమూ గలవాణ్ణి తగలబడుతున్న యింటిని విడిచిపెట్టేసేటట్టు విడిచిపెట్టెయ్యా లని పెద్దల ఉపదేశం. పరద్రవ్యం హరించడమూ, పరస్త్రీలను పొంద డమూ, స్నేహితులను నమ్మకపోవడమూ — ఇవి మూడు నాశనానికి కారణాలు. మహర్షులను వధించడమూ, సర్వదేవతలతోనూ యుద్ధంచె య్యడమూ, గర్వమూ, కోపమూ, బద్ధవైరమూ, ప్రాతికూల్యమూ — ఈదోషాలు జీవితమూ ఐశ్వర్యమూ నశింపచేస్తాయి. నాఅన్నదగ్గిర

యివన్నీ పూర్తిగా వున్నాయి. తక్కిన సుగుణాలెన్ని వుండినా వాటి నివి పర్వాతాలను మేఘాలు కమ్మేసేటట్టు కమ్మేశాయి. నీతండ్రీ నాఅన్నా అయిన రావణుణ్ణి ఈదోషాలున్న వాడనే నేను విడిచిపెట్టాను. దుర్బ్వనీతా! ఇక పదిమాట లెందుకూ? ఇక యీలంకాపట్నం వుండదు. నువ్వూ వుండవు. నీతండ్రీ వుండడు. నువ్వు మృత్యుపాశంలో తగులుకున్నావు. నన్నేమి అనదలుచుకున్నావో అనెయ్యి; కాని నీఅంత్యకాలం సమీపించింది. ఏమన్నా లాభంలేదు. నువ్వీక మఱ్రిచెట్టుదగ్గిరికి వెళ్లలేవు. రామలక్ష్మణులను అవమానించావు, నువ్వీక బతికిబట్టకట్టలేవు. కనక, లక్ష్మణునితో యుద్ధంచెయ్యి. యమలోకంలో నువ్వు దేవతాకార్యం చేసుకోవచ్చు. నీబలం అంతా చూపించుకో. సకలాయుధాలూ వ్యయపరుచుకో. లక్ష్మణుని కంటబడ్డావు, నువ్వూ నీసైన్యమూ కూడా యిక తిరిగివెళ్లలేరు''

## ౮౮

## లక్ష్మణుడూ ఇంద్రజిత్తూ దెప్పుకుంటూ శరయుద్ధంచెయ్యడం

విభీషణుని మాట విని ఇంద్రజిత్తు కాలాంతకుడై గొప్పధనుస్సూ, తీక్ష్ణబాణాలూ పుచ్చుకుని, హనుమంతుని భుజాలమీద కూచునివున్న లక్ష్మణుణ్ణీ, విభీషణుణ్ణీ, వానరులనూ చూసి "ఇక నాపరాక్రమం చూసుకోండి. మీకు చేతనైతే నాబాణవర్షం ఆపుచెయ్యండి. దూదిరాశిలో పడి అగ్ని దుమ్ముచేసేటట్టు నాబాణాలిప్పుడు మిమ్మల్ని బుగ్గిచేసేస్తాయి. శూలాలతోనూ, శక్తులతోనూ, తోమరాలతోనూ, బాణాలతోనూ కొట్టి మిమ్మల్నందరినీ యిప్పుడే యమలోకానికి పంపేస్తాను. నీలజీమూతం ఉరిమినట్టు ఉరుముతూ నేను బాణాలు విడుస్తూ వుంటే నాయెదట యెవడు నిలవగలడో రండి. ఇదివరలో రాత్రిసమయాన నాతో యుద్ధంచేసి మీరిద్దరు నేలమీద పడిపోయారు. మళ్లీ నన్ని

ప్పుడెదిరించడానికి వచ్చావు, ఇదిచూస్తే నువ్వు వెనకటి సంగతి మరచి పోయావో, లేక నీకు మరణమే ఆసన్నం అయిందో మరి” అని గర్జించాడు.

అది విని లక్ష్మణుడు నిర్భయంగా “రాక్షసా! నువ్వెంతెంత పనులో చెప్పావు; కాని పనిచేసి చూపించినవాడే బుద్ధిమంతుడు. చేత కానివాడ వయ్యుండికూడా యేదో వొక మాట డాబుగా అని దాంతోనే కృతకృత్యుడ వైనట్టు నువ్వు పొంగిపోతున్నావు. నువ్వు అదృశ్యం అయి యేదో చేశా నన్నావే? అది దొంగలు చేసేది కాని వీరులు చెయ్యవలసింది కాదు. ఇదిగో, నేను నీ కళ్ళయెదట నీ బాణ మార్గాన నుంచునివున్నాను. ఏదీ, నువ్వు కూడా నాయెదట అలా నుంచో వెందుకూ?” అని బదులు చెప్పాడు.

ఇది వినీవినగానే ఇంద్రజిత్తు బాణాలు విడిచాడు. అవి తాచు పాముల్లాగ లక్ష్మణుని శరీరాన నాటుకున్నాయి. ఇంకా అనేక బాణా లతో కూడా యింద్రజిత్తు కొట్టగా లక్ష్మణుడు రక్తసిక్తాంగుడై పొగ లేని అగ్నిలా వున్నాడు. ఇలా కొట్టి ఇంద్రజిత్తు “లక్ష్మణా! నా బాణా లిప్పుడు నీ ప్రాణాలు తీసేస్తాయి చూసుకో. ఇప్పుడే నక్కలూ, డేగలూ, గద్దలూ నిన్ను తినేస్తాయి, కాసుకో. దురాత్ము డైన రాముడు, క్షత్రియాధముడవూ, భక్తుడవూ, సోదరుడవూ అయిన నువ్వు చచ్చి పడివుండడం చూస్తాడు. నేను నీ కవచం ఛేదిం చేస్తాను. నీ ధనుస్సు ముక్కలు చేసేస్తాను. నీతల యెగరకొడతాను. ఇలాంటి స్థితిలో రాముడు నిన్ను చూస్తాడు” అని గర్జించాడు. దీనిమీద లక్ష్మణుడు “దురాత్మా! నీ వాగ్బలం చాలించు. చెప్పింది చేసిచూపించు. పనిచెయ్యకుండా యెందు కలా డాబులు కొడతావూ? నేను నీ మాట నమ్మా లంటే పనిచేసి చూపించు. నేను పరుషా లాడకుండానూ నిన్ను తూలనాడకుండానూ నిమిషంలో మాడ్చేస్తాను

చూసుకో" అని బదులుచెప్పి అయిదుబాణాలు చెవిదాకా లాగి ఇంద్రజిత్తు గుండెలు బద్దలుకొట్టాడు. అందుకు బదులుగా ఇంద్రజిత్తు లక్ష్మణునిమీద మూడుబాణాలు వేశాడు. అప్పు డానరరాక్షసులకు సంకులసమరం జరిగింది. వారుభయులూ బలసంపన్ను లే. ఉభయులూ విక్రమవంతులే. ఉభయులూ పరాక్రమశాలులే. ఉభయులూ సర్వ శస్త్రాస్త్రకోవిదులే. ఉభయులూ దుర్జయులే. ఉభయులూ అసామాన్య బలతేజశ్శాలులే. అలాంటివా రుభయులూ, అప్పుడు, ఆకాశాన గ్రహాల్లాగా, అడవిలో సింహాల్లాగా, వృత్రాసురుడూ దేవేంద్రుడూ లాగా ఘోరయుద్ధంచేశారు. ఇద్దరూ అత్యుత్సాహంతో జయేచ్ఛ తోనే పోరాడారు. శంబరవాసవుల్లాగ కూడా వారు తీవ్రయుద్ధం చేశారు.

## ౨౯

## లక్ష్మణుడూ ఇంద్రజిత్తూ ఘోరయుద్ధం చెయ్యడం

అప్పుడు లక్ష్మణుడు మిక్కిలీ క్రుద్ధుడై తాచుపాములాగ బుస్సలు కొడుతూ ఇంద్రజిత్తు నొక తీవ్రబాణంతో కొట్టాడు. అతని ధనుష్టం కారం విని ఇంద్రజిత్తు తెల్లమొగంవేశాడు. అది గుర్తించి విభీషణుడు "లక్ష్మణా! వాలకం చూడగా ఇంద్రజిత్తు పని అయిపోయినట్టు కన పడుతోంది" అన్నాడు. దాంతో మిక్కిలీ ఉత్సాహభరితుడై లక్ష్మణుడు ఎన్నో గొప్పబాణాలతో ఇంద్రజిత్తును మళ్లీకొట్టాడు. వాటితో ఇంద్రజిత్తు మూర్ఛితుడైపోయాడు; కాని వొక్క క్షణంలో తేరుకుని లక్ష్మణుణ్ణి చూసి "లక్ష్మణా మొదటియుద్ధంలో నేను కన పరిచిన పరాక్రమం మరిచిపోయావా? అప్పుడు నువ్వూ నీఅన్నా చచ్చి నట్టు భూమిమీద పడిపోయారు జ్ఞాపకంలేదూ? అది నువ్వు చూడక పోయినా, మరిచిపోయినా ఇదిగో యిప్పుడు మళ్లీ చూపిస్తాను న చూ.

అని ఏడుబాణాలతో లక్ష్మణుణ్ణీ, పదిబాణాలతో హనుమంతుణ్ణీ, ద్విగుణసంరంభంతో నూరుబాణాలు వేసి విభీషణుణ్ణీ కొట్టాడు.

అది చూసి లక్ష్మణుడు నవ్వుతూ ఇంద్రజిత్తుమీద భీకరబాణాలు విసిరి "శూరులైనవాళ్లు యుద్ధరంగంలో నిలిచి యింత చిన్నదెబ్బలు కొట్టరు. నీబాణాలు చాలా తేలిగ్గావున్నాయి. అవి చవకబారువి. అవి నాకు స్పర్శసుఖమే కలిగిస్తున్నాయి. జయంకోరే వాళ్లెవళ్లూ యిలాగ అల్లిబిల్లియుద్ధంచెయ్యరు" అని చెప్పి తీక్ష్ణబాణాలతో కొట్టాడు. దాంతో వాడి కవచం బద్దలయి నక్షత్రాలు రాలిపోయినట్టు రథం మీద పడిపోయింది. అందుకు రోషం తెచ్చుకుని తీవ్రబాణాలతో ఇంద్రజిత్తు కూడా లక్ష్మణుని కవచం భేదించేశాడు.

యుద్ధవిశారదులైన వారిద్దరూ యిలాగ చాలాసేపు ఘోరయుద్ధం చేశారు. వారిశరీరాలు రక్త సిక్తాలయిపోయాయి. అలాగ యెంత సేపు పోరినా వారికిద్దరికీ కూడా శ్రమఅన్నది కలగలేదు. విసుపూ పుట్టలేదు. వారు రకరకాల బాణాలు విసురుకున్నారు. ఎన్నోవిధాలైన అస్త్రాలు ప్రయోగించుకున్నారు. వారి ధనుష్టంకారాలు ఇరు వాగులవారికీ పిడుగుపాట్లుగా తోచాయి. వారిబాణాలు ఎదటివారి శరీరంలో నాటి రక్తపానంచేసి భూమిమీద పడిపోతూవచ్చాయి. గాయాలు తగిలి వారి శరీరాలు ఆకులులేని మోదుగుచెట్లలాగా, మోదుగుచెట్లలాగ వున్నాయి. ఇలాంటి సమయాన లక్ష్మణుని ఆయాసం పోగొట్టడానికీ, శ్రేయస్సు సంఘటించడానికీ విభీషణుడు ఎదటికి వచ్చి నుంచున్నాడు.

## ౬౦

## గుఱ్ఱాలతోనూ సారథితోనూ ఇంద్రజిత్తు రథం భగ్నం కావడం.

చ్చీరావడంతోనే విభీషణుడు ధనుష్టంకారంచేసి తీక్ష్ణబాణాలతో [illegible]సులను కొట్టాడు. విభీషణుని అనుచరులుకూడా నలుగురూ వివిధా

యుధాలతో విజృంభించారు. వారి మధ్య విభీషణుడు యేనుగులన్నల మధ్యగా వున్న మత్తేభంలా వున్నాడు. అప్పుడు అతను వానరులను పిలిచి "వానరవీరులారా! ఈ యింద్రజిత్తు వొక్కడే రావణునకు మిగిలివున్నాడు. మీ రెందు కలా చూస్తారూ? రావణుని సైన్యంలో మిగిలినవాడు వీడొక్కడే. వీణ్ణి కొట్టేస్తే రావణుడు తరవాయిగా రాక్షస బలం అంతా రూపుమాసిపోయిం దన్నమాటే. ప్రహస్తుడూ, నికుంభుడూ, కుంభుడూ, కుంభకర్ణుడూ, ధూమ్రాక్షుడూ, జంబుమాలీ, మహామాలీ, తీక్ష్ణవేగుడూ, అశనిప్రభుడూ, సుప్తఘ్నుడూ, యజ్ఞకోపుడూ, వజ్రదంష్ట్రుడూ, సంహ్రాదీ, వికటుడూ, నిఘ్నుడూ, తపనుడూ, దముడూ, ప్రఘనుడూ, జంఘుడూ, ప్రజంఘుడూ, అగ్నికేతుడూ, రశ్మికేతుడూ, విద్యుజ్జిహ్వుడూ, ద్విజిహ్వుడూ, సూర్యశత్రువూ, అకంపనుడూ, సుపార్శ్వుడూ, చక్రమాలీ, కంపనుడూ, దేవాంతకనరాంతకులూ—వీరి నందరినీ మీరు సంహరించారు. సముద్రం అంతా దాటినమీరు, ఇంద్రజిత్తు అనే యీ పిల్లకాలవ దాట లేరుకనకనా? మీరు కొట్టవలసింది వీణ్ణొకణ్ణే. రామునికోసం నేను నా అన్నకొడుకును చంపలేకపోను; కాని కొడదా మనుకుంటే కన్నీరు నా చూపు లడ్డగించేస్తోంది. కనక, వీణ్ణి లక్ష్మణుడే సంహరిస్తాడు. ఇక మీ రందరూ వీడి భృత్యులను సంహరించండి" అని చెప్పాడు.

విభీషణు డిలా చెప్పగానే వానరులు పరమోత్సాహంతో తోకలు జాడిస్తూ, పరవళ్లు తొక్కుతూ సింహనాదాలు చేస్తూ రాక్షసుల మీద పడ్డారు. జాంబవంతుడున్నూ నేరేడుపళ్ళురంగులో వున్న తనభల్లూక సేనను రెచ్చగొట్టి గోళ్ళతోనూ, పళ్లతోనూ, రాళ్లతోనూ రాక్షసులను కొట్టసాగాడు. దానిమీద వివిధాయుధాలతో రాక్షసులు తిరగబడ్డారు. జాంబవంతుణ్ణి ఎక్కువగా కొట్టారు. అప్పుడు వానరులకూ రాక్షసు

లకూ ఘోరయుద్ధంజరిగింది. అది దేవాసురయుద్ధంలాగ మహాభయం కరంగా జరిగింది. హనుమంతుడున్నూ వొక సాలవృక్షం పెరికి వేలకొద్దీ రాక్షసులను రూపుమాపుతూ వీరవిహారం చేశాడు. ఇంద్రజిత్తు కొంత సేపు విభీషణునితో పోరాడి, తరవాత లక్ష్మణునిమీదికి మళ్ళాడు.

వర్షర్తువులో సూర్యచంద్రులు మేఘమాలికలో అంతర్హితు లవుతూ వుండేటట్టు ఒండొరులు ప్రయోగించిన బాణవర్షంలో మరుగు పడుతూవచ్చారు. వారి హస్తలాఘవం యెంత అద్భుతంగా వుందంటే— బాణం అందుకోడం—తొడగడం—లాగడం—గురిచూడ్డం—విడవడం తెలి యడంలేదు. లక్ష్మణు డింద్రజిత్తునే జయించునో, యింద్రజిత్తు లక్ష్మణుణ్ణే జయించునో, యేర్పరించుకోలేక వానరరాక్షసులు బొమ్మలై నిలిచి పోయారు. వార బాణాలతో ఆకాశం నిండిపోయింది. భూమి నిండిపో యింది. దిగ్విభాగం తెలియకుండా పోయింది. సూర్యాస్తమానం అయి చీకటిపడ్డట్టున్నూ అయింది. రక్తనదులు ప్రవహించాయి. గద్దలూ కాకులూ మొదలైన క్రవ్యాదాలూ ఆనందంపట్టంలేక భీషణంగా అరి చాయి. అప్పుడు గాలి స్తంభించిపోయింది. అగ్ని చల్లబడిపోయింది. మహర్షులు ఆకాశాన వుండి "లోకాలకు మంగళం అగుగాక" అన్నారు. గంధర్వులూ, చారణులూ భయభ్రాంతులై దూరంగాపోయారు.

అప్పుడు లక్ష్మణుడు నాలుగుబాణాలు వేసి ఇంద్రజిత్తు ధరించి వున్న సువర్ణభూషణాలు కిందరాలగొట్టాడు. తరవాత, మరోబా ణంతో సూతుని తల నెగరగొట్టాడు. సారథి చచ్చిపోగా తానే సారథ్యమున్నూ నడుపుకుంటూ ఇంద్రజిత్తు మళ్ళీ ధనుస్సు సారిం చాడు. వారి ఉభయుల సామర్థ్యమూ చాలా అద్భుతంగా వుంది. లక్ష్మణుడు, ఇంద్రజిత్తు సారథ్యంచేసేటప్పుడు వాడి బాణాలతో వాడి శరీరం చించిచెండాడాడు. వాడు బాణాలు వేసేటప్పుడు గుర్రాలను చితకగొట్టాడు. ఇలాగ రంధ్రం కనిపెట్టి యుద్ధంచెయ్యడంలో మిక్కిలీ

నేర్పరి అయిన లక్ష్మణుడు ఇంద్రజిత్తును చాలా నొప్పించాడు. కొంత సేపటికి సారథి లేని లోటు కనపడి ఇంద్రజిత్తు తెల్లబోయాడు. అది చూసి వానరులు మిక్కిలీ సంతోషించి లక్ష్మణుణ్ణి పూజించారు. అంతట, ప్రమాథీ, శరభుడూ, రభసుడూ, గంధమాదనుడూ, అనే వానరులు ఇంద్రజిత్తు ఔద్ధత్యం సహించక పరాక్రమించారు. ముందు వారు నలుగురూ నాలుగు గుర్రాలమీదా పడ్డారు. పర్వతాలవంటి ఆ వానరులు మీద యెక్కి కూచోగా భరించలేక గుర్రాలు నాలుగూ రక్తం కక్కుకున్నాయి. చివరికి నడుములు విరిగీ, కాళ్ళు విరిగీ, పేగులు తెగీ కిందపడిపోయాయి. తరవాత ఆ నలుగురు వానరులూ రథం కూడా కూల్చేశారు.

ఇలాగ సారథి చచ్చిపోడమూ, గుర్రాలు నీల్గడమూ, రథం విరిగి పోడమూ-ఏటితో ఇంద్రజిత్తు కింది కురికి లక్ష్మణునిమీద బాణవర్షం కురిశాడు. పదాతి అయిపోయిన ఇంద్రజిత్తును లక్ష్మణుడు మరింత తీవ్రంగా కొట్టాడు.

## ౯౧

## లక్ష్మణుడు ఇంద్రజిత్తును సంహరించడం

ఇలాగ నేలమీద నిలిచి ఇంద్రజిత్తు పరమక్రుద్ధుడై దావాగ్నిలాగ ప్రకాశించాడు. అప్పుడా వీరు లిద్దరూ ఒకరి నొకరు చంపుదా మని మదగజాల్లాగా, ఆబోతుల్లాగా పోరాడారు. అప్పుడు ఇంద్రజిత్తు రాక్షసులను చూసి "గాఢాంధకారం ఆవరించినట్టు ఇప్పుడు దిక్కులు మాసివున్నాయి. ఎదటివాడో మనవాడో శత్రువో తెలిసేటట్టు లేదు. మీరు నేను లంకకు వెళ్ళినట్టు తెలియకుండా వానరులతో ఘోరయుద్ధం చేస్తూవుండండి. ఇంతలో నేను మరో రథంయెక్కి చక్కావస్తాను" అని చెప్పి వానరులను వంచించి లంకలోకి వెళ్ళిపోయాడు.

అక్కడ గుర్రాలు పూన్చి వొక రథం సిద్ధంగా వుంది. దానిమీద సకలాయుధాలూ నిండుగా వున్నాయి. సారథి చాలా సమర్థుడూ, ఉపాయాలూకూడా చెప్పగలవాడున్నూ. అక్కడ పేరుపడ్డ రాక్షస యోధులున్నూ సిద్ధంగా వున్నారు. దాంతో ఇంద్రజిత్తు రథం యెక్కడమూ, రథమూ రాక్షసయోధులూ రణరంగం చేరడమూ ఏక కాలంలో జరిగిపోయాయి. ఇలాగ, కన్ను తెరిచి చూశాటప్పటికి ఇంద్రజిత్తు రథంయెక్కి రావడంచూసి వానరులూ, విభీషణుడూ, లక్ష్మణుడూ చాలా ఆశ్చర్యపడ్డారు. ఇంద్రజిత్తు బాణవర్షం కురిసి వానరులను పీడించసాగాడు. ఆదెబ్బకి ఆగలేక వానరులు లక్ష్మణుణ్ణి శరణుజొచ్చారు. దానిమీద మిక్కిలీ రుష్టుడై లక్ష్మణుడు ఒక గొప్ప బాణంవేసి ఇంద్రజిత్తు ధనుస్సు విరగగొట్టాడు. మరో అయిదు బాణాలతో ఇంద్రజిత్తు గుండెలమీద కూడా కొట్టాడు. అవి ఇంద్రజిత్తు శరీరంలో దూసుకుపోయి ఎర్రతాచులాగ కిందపడిపోయాయి. ఇలాగ, కవచం భిన్నమై, నోట రక్తం కక్కుకుంటూ కూడా ఇంద్రజిత్తు మరో ధనుస్సందుకుని లక్ష్మణునిమీద బాణవర్షం కురిశాడు; కాని లక్ష్మణుడు వాటిని లెక్కచెయ్యకుండా నివారించి తన పరాక్రమం చూపించాడు. అది చాలా అద్భుతంగా వుండింది. తరవాత లక్ష్మణుడు రాక్షసప్రముఖులను మూడేసి బాణాలతోనూ, ఇంద్రజిత్తును ఎన్నో బాణాలతోనూ కొట్టాడు. దానికి కోపించి ఇంద్రజిత్తు లక్ష్మణునిమీద ఎన్నో బాణాలు వేశాడు; కాని అవి దగ్గిరకి రాకముందే లక్ష్మణుడు విరగకొట్టేశాడు. అంతే కాక: మరొక నిశితభల్లంతో అతను ఇంద్రజిత్తు సారథి తల యెగరగొట్టేశాడు. ఇలాగ సూతుడు పడిపోగా గుర్రాలు గిరగిర తిరిగాయి. అది చాలా వింతగా వుండింది. వెంటనే లక్ష్మణుడు దృఢ విక్రముడై గుర్రాలను కొట్టాడు. అందుకు కోపించి ఇంద్రజిత్తు పది బాణాలు వేశాడు; కాని అవి లక్ష్మణుని కవచం భేదించలేక కిందపడి

పోయాయి. దాంతో ఇంద్రజిత్తుకి లక్ష్మణుని కవచం అభేద్యం అని తోచింది. వెంటనే వాడు మూడుబాణాలతో లక్ష్మణుని నొసట కొట్టాడు. ఆబాణాలతో లక్ష్మణుడు మూడుశిఖరాల పర్వతంలా వున్నాడు. ఆదెబ్బతిని లక్ష్మణుడు మిక్కిలీ కోపించి అయిదుబాణాలు ఇంద్రజిత్తు మొగాన కొట్టాడు.

ఇలాగ, వారిద్దరూ ఘోరయుద్ధం సాగించారు. ఇద్దరూ రక్తసిక్తాంగులై విరగబూసిన మోదుగుచెట్లలా వున్నారు. తరవాత కూడా వొకరి శరీరం వొకరు బాణాలతో నింపేసుకున్నారు. ఇలాంటి స్థితిలోనే ఇంద్రజిత్తు మూడుబాణాలతో విభీషణుణ్ణీ, ఒకొ్కక్క బాణంతో వానరప్రముఖులనూ కొట్టాడు. అందుకు మిక్కిలీ కోపించి విభీషణుడు గద పుచ్చుకుని ఇంద్రజిత్తు గుర్రాలను చావమోదాడు. వెంటనే కింది కురికి ఇంద్రజిత్తు రథంమీద వుండిన శక్తిని పినతండ్రిమీద విడిచాడు. అది రావడం చూసి లక్ష్మణుడు నిశితబాణాలతో పదిముక్కలయేటట్టు కొట్టేశాడు. తనమీద శక్తిని ప్రయోగించినందుకు క్రుద్ధుడై విభీషణుడు వజ్రాయుధాలను మించిన అయిదుబాణాలతో ఇంద్రజిత్తు గుండెలమీద కొట్టాడు. అవి ఇంద్రజిత్తు శరీరం దూసుకుపోయి రక్తస్నానంచేసిన తాచుపాముల్లాగ కింద పడిపోయాయి. దానిమీద ఇంద్రజిత్తు యముడిచ్చిన బాణం తొడిగాడు. లక్ష్మణుడు గొప్పబాణం తొడిగాడు. అది కుబేరు డిచ్చినది. దేవాసురులు కూడా దాన్నెదిరించలేరు. ఆ బాణాలు తొడిగి ఇంద్రజిత్తూ లక్ష్మణుడూ చెవులదాకా లాగినప్పుడు ఇద్దరి ధనుస్సులూ క్రౌంచపిట్టల్లాగ కీచుమన్నాయి. మెరుపుల్లాగ మెరిశాయి; కాని బాణాలు రెండూ ఆకాశాన తారసిల్లి గ్రహాల్లాగ పోరి చివరికి కిందపడిపోయాయి.

ఆ బాణాలు రెండూ కిందపడిపోడం జూచి ఇద్దరూ సిగ్గుపడ్డారు. దానిమీద చివరి కిద్దరూ రోషం తెచ్చుకున్నారు. వెంటనే లక్ష్మణుడు

వారుణాస్త్రం తొడిగాడు. ఇంద్రజిత్తు రౌద్రాస్త్రం తీశాడు. రెండూ తారసిల్లాయి ; గాని రౌద్రాస్త్రం నిష్ఫలం అయిపోయింది. వెంటనే ఇంద్రజిత్తు ఆగ్నేయాస్త్రం తొడిగాడు. అది చూసి లక్ష్మణుడు సౌరాస్త్రం విడిచాడు. అప్పుడూ ఇంద్రజిత్తు అస్త్రమే వ్యర్థం అయిపోయింది. దానిమీద రెట్టించిన కోపంతో ఇంద్రజిత్తు మహాఘోర మైన అస్త్రం విడిచాడు. దాని ప్రభావంవల్ల ముద్గరాలూ, శూలాలూ, ముసలాలూ, గదలూ, ఖడ్గాలూ, పరశ్వధాలూ లెక్కలేకుండా పుట్టుకవచ్చాయి ; కాని లక్ష్మణుడు వెంటనే మాహేశ్వరాస్త్రం ప్రయోగించాడు. ఉభయుల అస్త్రాలకూ తుములయుద్ధం జరిగింది. ఆకాశాన వుండిన భూతాలన్నీ లక్ష్మణుణ్ణి పరివేష్టించాయి. ఋషులూ, పితృదేవతలూ, దేవతలూ, గంధర్వులూ, గరుడులూ, నాగులూ, ఇంద్రునితో కూడా వచ్చి, ఆకాశాన, లక్ష్మణునకు రక్షగా నిలిచారు.

అప్పుడు లక్ష్మణుడు అగ్నిహోత్రంవంటి మరొక బాణం తొడిగాడు. దానికి పుంఖాలు చాలా చక్కగా వున్నాయి. చక్కని గుణుపులున్నాయి. బంగారపునగిషీ చేశారు. దాన్నెవరూ నివారించలేరు. సమస్తదేవతలూ దాన్ని పూజించారు. వెనకటి దేవాసురయుద్ధంలో మహేంద్రుడు దానితోనే శత్రువులను జయించాడు. నరశ్రేష్ఠు డైన లక్ష్మణుడు తన ధనుశ్శ్రేష్ఠంలో అలాంటి శ్రేష్ఠాస్త్రం తొడిగి చెవిదాకా లాగి “ రాముడు ధర్మాత్ముడూ, సత్యసంధుడూ అయివుంటే అతని పౌరుషం కూడా అప్రతిమానం అయినట్టయితే, ఓ శరమా ! నువ్వు ఇంద్రజిత్తును సంహరించు ” అని విడిచాడు. అది వెళ్ళి కుండలాలతోనూ, శిరస్త్రాణంతోనూ మెరిసిపోతున్న ఇంద్రజిత్తు తల నరికి కిందపడగొట్టింది.

ఇంద్రజిత్తు శిరస్సు భూమిమీద దొర్లిపోయింది. కవచంతోనూ, ధనుస్సుతోనూ ఇంద్రజిత్తు మొండెం తాటిచెట్టులాగ కూలిపోయింది.

ఇలాగ ఇంద్రజిత్తు చచ్చిపడిపోవడంచూసి వానరులూ విభీషణుడూ ఆనందధ్వానాలు చేస్తూ ఆడిపోయారు. ఆకాశాన, దేవతలూ, మహర్షులూ, గంధర్వులూ, అప్సరసలూ పొంగిపోయారు. రాక్షసయోధులు భయభ్రాంతులయి పారిపోయారు. వారు ఆయుధాలు కింద పారేశారు. కొందరు లంకలోకి పారిపోయారు. కొందరు సముద్రంలో వురికారు. కొందరు కొండలెక్కారు. ఒక్కక్షణంలో, అక్కడ వొక్క రాక్షసప్పురుగయినా లేకుండాపోయింది.

పడిపోయాక ఇంద్రజిత్తు కళేబరం కొంతసేపు కొట్టుకుంది. చివరికి కదలకుండా వుండిపోయింది. అది కిరణాలు లేని సూర్యబింబంలాగా, చల్లారిన అగ్గిలాగా అయిపోయింది. ప్రజల ననేకవిధాల పీడించిన ఇంద్రజిత్తు వధ చూసి లోకం సంతోషించింది. ఇంద్రు డానందించాడు. ఆకాశాన దేవదుందుభులు మోగాయి. అప్సరస లాడారు. గంధర్వులు పాడారు. దేవతలు పూలవాన కురిశారు. ప్రశంసావాక్యాలతో దిక్కులు పిక్కటిల్లిపోయాయి. జలమూ దిశలూ నిర్మలినా లయినాయి. దైత్యులూ దానవులూ ఆనందించారు. దేవగంధర్వదానవానీకాలు "బ్రాహ్మణు లిక స్వేచ్ఛగా వుండవచ్చు" అన్నారు. వానరులు పొంగిపోయారు. విభీషణుడూ, హనుమంతుడూ, జాంబవంతుడూ లక్ష్మణుణ్ణి అనేకవిధాల అభినందించారు. వానరులు ఎగిరారు. దుమికారు. సింహనాదాలు చేశారు. తోకలు ఝాడించారు. తొడలు చరిచారు. చివరికి "లక్ష్మణునకు జయం" అంటూ అతని చుట్టూ మూగారు. ఒకరినొకరు కౌగిలించుకున్నారు.

## ౯౨

## ఇంద్రజిత్తును చంపినందుకు రాముడు లక్ష్మణుణ్ణి మెచ్చుకోడం

తన శరీరం అంతా గాయా లయి రక్తంతో తడిసినా ఇంద్రజిత్తును చంపగలిగినందుకు లక్ష్మణుడు చాలా సంతోషించి జాంబవంతుణ్ణీ

హనుమంతుణ్ణీ తక్కిన వానరులనూ వెంటబెట్టుకుని విభీషణునిమీదా హనుమంతునిమీదా చేతులు వేసుకుని రాముని దగ్గిరికి వచ్చాడు. వచ్చి రావడంతోనే రామునకు నమస్కారం కూడా చేసి, ఇంద్రుని దగ్గిర బృహస్పతి లాగ అతని దగ్గిర నుంచున్నాడు. అసలు నమస్కారం చేస్తూనే " ఇంద్రజిత్తు చచ్చిపోయా " డని చెప్పాడు. " దీంతో రావణునకు శిరచ్ఛేదం అయినట్టే లెక్క " అని విభీషణుడు కూడా రామునితో చెప్పాడు.

ఇది విని రాముడు మిక్కిలీ ఆనందించాడు. " భేషు, లక్ష్మణా, భేషు ! నువ్వు చేసిన పనికి చాలా సంతుష్టు ణ్ణయినాను. నువ్వు మిక్కిలీ అసాధ్య మైన పనిచేశావు. రావణుణ్ణి చంపి మనం విజయం పొందా మని గ్రహించు " అని చెబుతూ అతను శిరస్సు మూర్కొని సిగ్గుపడు తున్న లక్ష్మణుణ్ణి బలాత్కారంగా పట్టుకుని తొడమీద కూచోబెట్టు కుని, గట్టిగా కౌగిలించుకొని, మళ్ళీ మళ్ళీ ప్రశంసించాడు ; గాని అతని గాయాలు చూసి మిక్కిలీ సంతాపం పొంది మళ్ళీమళ్ళీ ఊరడించి " నాయనా ! నువ్వు మహాగొప్పపని చేశావు. ఇప్పుడు కుమారుడు చచ్చిపోడంవల్ల రావణుడు యుద్ధంలో సులభంగా చచ్చిపోతాడు, సందేహం లేదు. నేనిప్పుడే విజయం పొందా నని కూడా చెప్పొచ్చు. వీరాధివీరా ! అదృష్టవశాన నువ్వు రావణుని కుడిభుజం నరి కేశావు. హనుమంతుడూ, విభీషణుడూ నీతో సమానంగా గొప్ప యుద్ధం చేశారు. మొత్తానికి మూడు రాత్రింబగళ్ళకు మీరు ఇంద్ర జిత్తును చంపేశారు. రావణుడు చచ్చిపోడం నిశ్చయం కనక, నేను నిరమిత్రుణ్ణయినా ననే చెప్పవచ్చు. అపార మైన బలగంతో కొడుకు చచ్చిపోయా డంటే రావణుని నవనాడులూ కుంగిపోతాయి. పుత్ర మరణంతో కృశించిపోయే రావణుణ్ణి నేను విలాసగా సంహరించేస్తాను. లక్ష్మణా ! నువ్వు ఇంద్రజిత్తును వధించడంవల్ల నేను రాజ్యమూ,

సీతనూ కూడా తప్పకుండా పొందుతాను" అని చెప్పి మళ్ళీ మళ్ళీ ఆశ్వాసించాడు.

మరినీ్న రాముడు సుషేణుణ్ణి చాలా మర్యాదచేసి "మహాప్రాజ్ఞా! లక్ష్మణుని శరీరం అంతా బాణాలతో నిండివుంది. ఏమిచేస్తే యితను స్వస్థు డవుతాడో అలా చెయ్యి. త్వరగా చెయ్యి. భల్లూకవానర వీరులలో యెవరెవరలా వున్నారో వారిని కూడా విశల్యులను చెయ్యి" అని చెప్పాడు. దానిమీద సుషేణుడు లక్ష్మణునకొక గొప్ప ఓషధి యిచ్చాడు. లక్ష్మణు డది వాసనచూశాడు. వెంటనే అతని శరీరం విశల్యం అయిపోయింది. గాయాలు మానిపోయాయి. శరీరం యథాప్రకారం అయిపోయింది. రాముని ఆజ్ఞవల్ల సుషేణుడు విభీషణాదులకు కూడా ఆలాగ అప్పటికప్పుడే పూర్ణారోగ్యం కలిగించాడు. ఇలాగ లక్ష్మణుడు ఆరోగ్యవంతుడు కావడం చూసి సుగ్రీవుడూ, రాముడూ, విభీషణుడూ జాంబవంతుడూ, హనుమంతుడూ చాలాసేపు ఆనందించారు. రాముడు లక్ష్మణుణ్ణి మళ్ళీమళ్ళీ లాలించి ఆదరించాడు.

## ౬3

## రావణుడు సీతను చంపబోయి సుపార్శ్వుని మాటమీద ఆగిపోవడం

ఇంద్రజిత్తుతో కూడావచ్చి అక్కడక్కడ వానరులతో యుద్ధంచేస్తున్న రావణుని సచివులు ఇంద్రజిత్తు చనిపోయా డన్నవార్త విని కళ్ళతో చూసివెళ్ళి దుఃఖిస్తూ యీసంగతి రావణునకు చెప్పారు. "మహారాజా! విభీషణుని సాయంతో లక్ష్మణుడు నీకొడుకు ఇంద్రజిత్తును సంహరించేశాడు. మేమందరమూ చూస్తూ వుండగానే యిది జరిగింది. శూరుడై ఎలాంటివాళ్ళకీ కూడా లొంగియెరగని నీకొడుకు - ఇంద్రుణ్ణి కూడా జయించిననీకొడుకు శూరుడైన లక్ష్మణునితో ఘోరయుద్ధం చేసి అస్తమించాడు. లక్ష్మణుణ్ణి గొప్పగొప్ప బాణాలతో మిక్కిలి

పీడించిమరీ అతను పరలోకాలకు వెళ్ళిపోయాడు” అని వివరంగా చెప్పారు.

ఈదారుణవార్త వినగానే రావణుడు మూర్ఛిల్లాడు. చాలాసేపటికి గాని అతనికి తెలివిరాలేదు. తెలివివచ్చాకయినా అతను కొంతసేపు దీనంగా వుండి “రాక్షససేనాముఖ్యా! వత్సా! మహారథా! నువ్వు ఇంద్రుణ్ణి జయించావే: యిప్పుడు లక్ష్మణుని చేతిలో పడిపోయావు నాయనా? నీకు కోపం వచ్చిందంటే కాలయముణ్ణి కూడా నువ్వు చీల్చెయ్యగలవు. మందరపర్వతశిఖరాలునూ పెకలించగలవు. లక్ష్మణుడంటే నీకొక్కలెక్క కాదే? కాలధర్మం పొంది నువ్వు యమునిదగ్గిరికి వెళ్ళావు కనక, అతను నాకిప్పుడు ఎంతో కావలసినవాడైనాడు. దేవతల్లో కూడా గొప్పయోధుల కిదే దారి. ప్రభువుకోసం యెవడు ప్రాణా లిస్తాడో వాడు స్వర్గానికి వెళ్ళిపోతాడు. లోకపాలకులూ, మహర్షులూ, దేవతాగణాలూ ఇంద్రజిత్తు చచ్చిపోయా డని హాయిగా నిద్రపోతారు; కాని మూడులోకాలూ, ఈభూమండలమూ కూడా ఒక్క ఇంద్రజిత్తు లేకపోవడంవల్ల నాకు శూన్యంగా కనపడుతున్నాయి. యూథపతి మరణిస్తే పర్వతగుహాలలో ఆడయేనుగులు దుఃఖించేటట్టు, యిప్పుడు, అంతఃపురంలో రాక్షసకన్యలు విలపిస్తారు, అది నేను వింటాను. పరంతపా! యౌవరాజ్యమూ, లంకాపట్నమూ, రాక్షసులనూ, నీతల్లినీ, నన్నూ, భార్యనూ విడిచి ఎక్కడికి వెళ్ళావు, నాయనా? నేను చచ్చిపోతే నువ్వు నాకు ప్రేతకార్యాలుచెయ్యవలసినవాడవు. ఇప్పుడు నేనే నీకు చెయ్యవలసివచ్చింది. సుగ్రీవుడూ, రాముడూ, లక్ష్మణుడూ బతికివుండగా నాహృదయశల్యం తొలగించకుండా నన్ను విడిచి యెక్కడికి వెళ్ళావూ?” అంటూ ఘోరంగా విలపించాడు.

ఇంకా విలపిస్తూనే వుండగా అతనికి మిక్కిలి కోపావేశం వచ్చింది. గ్రీష్మకాలంలో సూర్యుణ్ణి కిరణాలు మరింత చండుణ్ణి చేసేటట్టు సహజంగానే ముక్కోపి అయిన రావణునకు ఇంద్రజిత్తును గురించి శోకం మరింత కోపిష్టిని చేసింది. ప్రళయకాలంలో పెద్దపెద్ద కెరటాలతోనూ, మొసళ్ళు మొదలైన జలజంతువులతోనూ మహాసాగరంలాగ బొమ ముడిపాటుతో అతని ముఖం మరీ భయంకరం అయిపోయింది. అప్పుడతను అంతకోపంతోనూ ఆవులించగా వృత్రాసురుని మొంగలోనుంచిలాగ అతనినోట సధూమమైన అగ్ని ప్రజ్వలించింది. ఇలాగ పుత్రవధవల్ల, క్రోధవశంగతుడైన రావణుడు బాగా ఆలోచించి చివరికి సీతను నరికెయ్యాలనుకున్నాడు. సహజంగానే యెర్రగా వుండే రావణుని కళ్ళు ఈ క్రోధాగ్నివల్ల మరింత యెర్రబడి భీకరంగా వున్నాయి. సహజంగానే ఘోరంగా వుండే అతని రూపం, యీ క్రోధంవల్ల క్రుద్ధుడైన రుద్రుని రూపంలా వుంది. దీపం వెలుగుతున్న వత్తినుంచి మంటలతో తైలబిందువులు రాలేటట్టు క్రుద్ధుడైనరావణుని కళ్ళనుంచి రక్తబిందువులు పడ్డాయి. రావణుడు పళ్ళు పటపటలాడించగా ఆధ్వని దానవులు తిప్పుతున్న యంత్రంలో పుట్టిన ధ్వనిలా వుంది. కాలాగ్నిలాగ మండిపడుతూ రావణు డెటు చూస్తే అటున్న రాక్షసులు భయభ్రాంతులై కదల్లేకపోయారు. ప్రళయకాలంలో చరాచరాలన్నీ మింగడానికి చూస్తే యముడులాగ చూస్తున్న అతనిదగ్గిరకెవరూ వెళ్ళలేకపోయారు.

అప్పుడు రావణుడు రాక్షసులకు యుద్ధోత్సాహం కలిగించడానికి "నేను అనేకవేల సంవత్సరాలు ఘోరతపస్సుచేసి మధ్యమధ్య బ్రహ్మదేవుణ్ణి చాలా మెప్పించాను. ఆతపస్సుకు మెచ్చుకునే స్వయంభువు నాకు అసురులవల్లా దేవతలవల్లా ఏమాత్రమూ భయం కలక్కుండా వుండేటట్టు వరం దయచేశాడు. బ్రహ్మదత్తమైన నాకవచం దేవాసురయు

ద్ధాలలో వజ్రాయుధం దెబ్బలకు కూడా భిన్నం కాలేదు. అది ధరించి నేను యుద్ధానికి బయలుదేరితే ఇంద్రుడైనా నన్నెదిరించి నిలవగలడా? దేవాసురయుద్ధం జరిగినప్పుడు బ్రహ్మదేవుడు నాకిచ్చిన గొప్పధనుస్సు రామలక్ష్మణులను సంహరించడానికి మంగళతూర్యధ్వనులతో తీసుకు రండి" ఇలా చెప్పి క్రోధోద్రిక్తుడై సీతను చంపా లనుకున్నాడు. వెంటనే నిప్పులు కురుస్తూ దీనులై వుండిన రాక్షసులతో " వానరులను వంచించడానికి నాకొడుకు మాయసీతను సంహరించాడు. కాని నేనిప్పుడు నిజంగానే క్షత్రియాధము డైన రాముని కోసం పరితపిస్తున్న సీతను నర్కేస్తాను" అని చెప్పి ఖడ్గంపుచ్చుకున్నాడు.

వెంటనే అతను లేచి భార్యలతోనూ మంత్రులతోనూ కలిసి బయలుదేరాడు. రావణుణ్ణి చూసి రాక్షసులు సింహనాదాలు చేశారు. ఒకళ్లనొకళ్లు కౌగిలించుకుని " రామలక్ష్మణు లిప్పు డీరాక్షసరాజుని చూసి భయభ్రాంతు లయిపోతారు. నలుగురు లోకపాలకులూ, ఇంకా అనేక వీరులూ ఈరాక్షసరాజుచేతిలో కూలిపోయారు. మూడులోకాల్లోనూ వున్న గొప్పరత్నా లన్నీ తెచ్చి మన ప్రభువు స్వేచ్ఛగా అనుభవిస్తున్నాడు. విక్రమంలోనూ, బలంలోనూ, మన ప్రభువుకి చాలినవాడు త్రిలోకాలలోనూ లేడు" అని చెప్పుకుంటూ వెళ్లారు.

చూస్తూవుండగా రావణుడు మిత్రు లెంతవారించినా ఆగక అంగారకుడు రోహిణిమీదికి పోయేటట్టు అశోకవనం చేరి సీతమీదికి బయలుదేరాడు. రాక్షసాంగనల మధ్య కూచుని వున్న సీత రావణుడు కత్తిదూసుకుంటూ రావడం చూసింది. మిత్రు లెంత వారించినా ఆగకుండా వాడు తనమీదికి వస్తున్నట్టామే గ్రహించింది. దాంతో ఆమె " సనాథ నైన నన్ను వీడు అనాథని లాగ స్వయంగా సంహరించడానికి వస్తున్నాడు. రాముణ్ణే నమ్ముకుని వుండిన నన్ను ' భార్యవై నన్ను సుఖపెట్టు' మని చాలా ప్రాధేయపడివున్నాడు; కాని నేను

తిరస్కరించేశాను. దాంతో నిరాశపొంది క్రోధోద్రిక్తుడై నన్ను చంపడానికి వస్తున్నాడు. లేక, నాకోసం ఆరామలక్ష్మణులు పిడిచేతిలో చనిపోయివుంటారు. ఛీ! నాకోసం రామలక్ష్మణులు చనిపోడం యెంత దురదృష్టమూ! లేక, పుత్రశోకంవల్ల రామలక్ష్మణులను సంహరించలేక వీడు నన్ను చంపడానికి వస్తున్నాడేమో? హనుమంతుడు నన్ను భుజాలెక్కి రాముని దగ్గిరికి రమ్మన్నాడు; కాని అవివేకంవల్లా, దురదృష్టంవల్లా నేనప్పుడందు కంగీకరించలేకపోయాను. అప్పుడలా వెళ్లివుంటే నేనిప్పుడిలా దుఃఖించవలసిన అగత్యం లేకపోవును. ఏక పుత్రుడు రాముడు యుద్ధంలో చచ్చిపోయాడని వింటే కౌసల్యగుండెలు పగలి చచ్చిపోతుందనుకుంటాను. ఆమె రాముని పుట్టుకా, బాల్యమూ, యౌవనమూ, ధర్మకార్యాలూ, రూపమూ తలుచుకుతలుచుకు దుఃఖిస్తుంది. ఆమె కొడుకు చచ్చిపోయాడని వింటే శ్రాద్ధకార్యం నిర్వర్తించి తాను నిప్పులోనో నీటిలోనో పడి మరణిస్తుంది, తప్పదు. ఛీ! మంథర దుశ్చింతవల్ల గదా కౌసల్య కీదుఃఖం!" అని విచారించసాగింది.

ఈస్థితిలో శుచీ, బుద్ధిమంతుడూ అయిన అమాత్యుడు సుపార్శ్వుడు రావణుణ్ణి చూసి "దశగ్రీవా! నువ్వు సాక్షాత్తుగా కుబేరుని తమ్ముడవు. క్రోధంవల్ల ధర్మం విడిచి నువ్వు సీతను చంపబోతున్నావు. నువ్వు వేదవిద్యా వ్రతస్నాతుడవు. స్వకర్మనిరతుడవు. రాక్షసేశ్వరా! స్త్రీవధ చెయ్యాలని యెలా అనుకోగలిగావూ? రూపవతి అయిన సీత ముందు ముందు నీఅధీనం అవుతుందేమో ఆలోచించుకో. నువ్వుకూడా మాతో బాటు నీకోపం అంతా రామునిమీద చూపించు. ఇవాళ కృష్ణచతుర్దశి. ఇవాళే బయలుదేరి నువ్వు రేపు అమావాస్యనాడే రామలక్ష్మణులను సంహరించి విజయం సాధించుకో. నువ్వు శూరుడవు. ధీమంతుడవు. రథివీ, ఖడ్గివీ, అయి రాముణ్ణి చంపు. సీత నిన్ను వరిస్తుంది"

అని బోధించాడు. దీనిమీద రావణుడు సాహసించలేక, ముందు ఇంటికీ తరవాత రాజసభకీ వెళ్ళాడు.

## రావణుని మూలబలం రామునిమీద పడి పారిపోవటం

ఇలాగ దీనుడై సభాభవనంలో ప్రవేశించిన రావణుడు క్రుద్ధమైన సింహంలాగ బుస్సలుకొడుతూ సింహాసనంమీద కూచుని సేనాధిపతుల సంకరినీ పిలిచి " మీరు మిగిలివున్న రథాలూ, ఏనుగులూ, గుర్రాలూ, కాల్బలం అంతా తీసుకుని యుద్ధానికి వెళ్లండి. మీరు రాముణ్ణొక్కణ్ణే ముట్టడించి వర్షాకాలమేఘంలాగ శరవర్షం కురిసివిజృంభించండి. మీరు అతణ్ణి సంహరించిలేకపోతే, ఇవాళ మీరుచేసిన గాయాలతో నీరసపడిపోతాడు కనక, రేపు నేను అతిసులభంగా సంహరించేస్తాను " అని చెప్పగా రాక్షసు లందరూ నానావిధాల ఆయుధాలూ పుచ్చుకుని బయలుదేరి వెళ్లారు.

వానరు లెదిరించినిలిచారు. ఇటు సూర్యోదయం అవుతూవుండగా అటు యుద్ధం ప్రారంభం అయింది. అప్పుడు వానరులూ రాక్షసులూ వొకళ్ల నొకళ్లు చిత్రవిచిత్రాలైన గదలతోనూ, ప్రాసలతోనూ, ఖడ్గాలతోనూ, పరశ్వధాలతోనూ కొట్టుకున్నారు. వానర రాక్షసుల పాదఘట్టనలతో ఘట్టిలి దుమ్ము వారి రక్తంతోనే అణిగిపోయింది. ఏనుగుకళేబరాలూ విరిగిపోయిన రథాలూ వొడ్లుగా — గుర్రాలే మత్స్యాలుగా — జెండాలే చెట్లుగా — కళేబరాలే తెప్పలుగా రక్తనదులు ప్రవహించాయి. వానరు లందరూ నెత్తుట మునుగుతూ తేలుతూ రాక్షసుల జెండాలూ, కవచాలూ, రథాలూ, గుర్రాలూ నానావిధాయుధాలూ యెగిరియెగిరి నాశనంచేశారు. రాక్షసుల జుట్టూ, ముక్కులూ చెవులూ పళ్లతో కొరికీ, గోళ్లతో గిల్లీ పీకిపారేశారు. పళ్లచెట్టుమీద వేలకొద్దీ పిట్టలు వాలేటట్టు ఒకొక్క

రాక్షసునిమీద నూరేసిమంది వానరులు పడి చీకాకుపరిచారు. దాని మీద రాక్షసులు గదలతోనూ, ఖడ్గాలతోనూ, పరశ్వధాలతోనూ కొందరు వానరులను కొట్టారు. దాని కోపలేక వానరులు వెళ్ళి రాముణ్ణి శరణుజొచ్చారు.

అప్పుడు రాముడు బయలుదేరి రాక్షసులమీద శరవర్షం ప్రారంభించాడు ; కాని గ్రీష్మకాలంలో మేఘాలు సూర్యుణ్ణి సమీపించలేనట్టు రాక్షసులు రాముణ్ణి సమీపించలేకపోయారు. రాముడప్పుడు హస్తలాఘవంతో అసాధ్యాలయిన పను లనేకాలు చేశాడు. అయితే, రాక్షసులు అది జరిగిపోయాకే గాని జరుగుతున్నప్పుడు కనిపెట్టలేక పోయారు. వాళ్ళు తమ రాక్షసులు పారిపోతూ వుండడమూ రథాలు విరిగిపోతూవుండడమూ వాళ్ళకి కనపడింది గాని వనగత మైన గాలిలాగ రాముడు మాత్రం కనపడ లేదు. కొందరు రాక్షసులు ముక్కలై పోయారు. కొందరు తలపగిలి చచ్చారు. కొందరు మాడిపోయారు. కొందరు బుగ్గి అయిపోయారు. ఇలాగ రక రకాల నాశనమైపోయిన తమవాళ్ళే గాని రాక్షసులకు రాముడు కనపడలేదు. మరిన్నీ వాళ్ళు ప్రజలు ఇంద్రియార్థాల్లో వున్న పరమాత్మను తెలుసుకోలేనట్టు తన శరీరాలమీద అవుతున్న గాయాలే గాని రాక్షసులు రాముణ్ణి కనుక్కోలేకపోయారు. రాముడు అతిలాఘవంగా సంచరిస్తూ రాక్షసులను వధించేటప్పుడు అతను మెరుపులాగ కనపడినప్పుడు రాక్షసులు "ఇడిగో రాముడు ఏనుగులను కూలుస్తున్నాడు. ఇడిగో, రాముడు రథాలు విరిచేస్తున్నాడు. ఇడిగో రాముడు బాణాలతో కాల్బంటులను కాల్చేస్తున్నాడు"అని చెప్పుకుంటూ రాముడనుకుని ఒకనొకళ్ళు కొట్టుకోసాగారు. రాముడు గాంధర్వాస్త్రం ప్రయోగించాడు. అంచేత వాళ్లు తమ్ము నాశనంచేస్తున్న రాముణ్ణి చూడలేకపోయారు. ఒక్కొక్కమాటు వాళ్ళకి వేలకొద్దీ రాములు

కనపడేవారు. ఒక్కొక్కప్పుడు ఒక్క రాముడే కనపడేవాడు. ఎక్కడ చూసినా వాళ్ళకి రామధనురగ్రం మాత్రమే మిలమిల మెరుస్తూ కనపడసాగింది. అప్పుడు రాముడు ప్రజలకు, శరీరమే నాభిగా – సత్తాయే జ్వాలగా – శరాలే ఆకులుగా – ధనుస్సే నేమిగా – జ్యాఘోషమే ధ్వనిగా – తేజస్సూ, బుద్ధీ, గుణమూ ప్రభగా – దివ్యాస్త్రశక్తే ధారగా రాక్షసులను సంహరిస్తున్న సుదర్శన చక్రంలాగ కనపడ్డాడు.

ఇలాగ వీరవిహారంచేసి రాముడు ఏడుగడియలలో వాయువేగాలైన రథాలు ఏడుకోట్ల యిరవై తొమ్మిది లక్షలూ, మదగజాలు పదమూడుకోట్ల పన్నెండులక్షల యిరవై వేలూ, రౌతులతో కూడిన గుర్రాలు పదికోట్ల యిరవై లక్షల అరవై వేలూ, కాల్బంట్లు నూటనల్భై అయిదుకోట్ల యెనభై లక్షలూ నాశనం చేశాడు. హతశేషులు లంకలోకి పారిపోయారు. పడిపోయిన రథాలతోనూ, ఏనుగులతోనూ, గుర్రాలతోనూ, రాక్షసులతోనూ ఆప్రదేశం అంతా కాలరుద్రుని ఆటస్థలంలాగ మహాభయంకరం అయిపోయింది. అది చూసి దేవతలూ, గంధర్వులూ, సిద్ధులూ, మహర్షులూ భేషుభేషు అని రాముణ్ణి మెచ్చుకున్నారు. అప్పుడు రాముడు తన దగ్గిరవున్న సుగ్రీవుణ్ణీ, విభీషణుణ్ణీ, హనుమంతుణ్ణీ, జాంబవంతుణ్ణీ, మైందద్వివిదులనూ పిలిచి "దివ్యమైన ఈఅస్త్రశక్తి నాకూ త్ర్యంబుకునకూమాత్రమే వుంది. మరెవరికీ లేదు" అని చెప్పాడు. ఇదంతా చేశాక అతను దేవేంద్రుడులాగ మెరిసిపోయాడు.

## ౬౫

## జరిగిందంతా తలుచుకుని రాక్షసస్త్రీలు దుఃఖించడం

ఇలాగ లక్షలూ కోట్లూ రథాలూ, గుర్రాలూ, ఏనుగులూ, కాల్బలమూ రాముని చేతిలో నాశనంకావడం చూసీ వినీ హతశేషులైన రాక్షసులూ వారి స్త్రీలూ చేరి యిలా దుఃఖించారు.

"శూర్పణఖ వృద్ధురాలు. వికృతరూపిణి. పెద్దబొజ్జా అదీ నవను మ్మథునివంటి రాము ణ్ణెందుకు సమీపించిందీ? అతన్ని చూసి లోక నింద్యురాలూ రూపహీనురాలూ అయిన అది యెందుకు మోహిం చిందీ? అతను గుణవంతుడు. తాను గుణహీనురాలు. అతను సుము ఖుడు. తాను దుర్ముఖి. అది అత ణ్ణెలా కామించిందీ? దాని శరీరం అంతా ముడతలుపడిపోయింది. తల నెరిసిపోయింది. మన దురదృష్టం వల్ల అది అకార్యమనీ నగుబాట్లపని అనీ, సర్వలోకగర్హిత మనీ గుర్తిం చకుండా రాముణ్ణి కోరి విరోధబీజం నాటింది. దాని మూలంగానే రావణు డీవైరం కోరి తెచ్చుకున్నాడు. రావణుడు సీతను తన చావుకోసం తెచ్చుకున్నాడు. తానామెతో సుఖించడానికి కాదు. రావణుడు సీతను పొందనేలేడు. రామునితో బద్ధవైరం మాత్రం తెచ్చుకున్నాడు. సీతను కోరిన విరాధుణ్ణి రాము డొక్కడే చంపాడు. రాముడే యిప్పుడు జయిస్తా డనడానికి మనకీ నిదర్శనం చాలు. జన స్థానంలో ఒక్క రామునిచేతిలో ఖరుడు చచ్చిపోయాడు. దూషణుడూ త్రిశిరుడూ చచ్చిపోయారు. ఉక్కుతునకలవంటి పధ్నాలుగువేల మంది రాక్షసయోధులు మసిఅయిపోయారు. మనకీ నిదర్శనం చాలు.

ఆమడపొడుగుచేతులు గల కబంధుడు అరుస్తూ రామునిచేతిలో బుగ్గిఅయిపోయాడు. మనకీ నిదర్శనం చాలు. ఇంద్రుని కుమారుడైన వాలిని రాము డొక్కడే చంపాడు. మనకీ నిదర్శనం చాలు. ఋశ్య మూకపర్వతంమీద దీనుడై పడివున్న సుగ్రీవునకు రాముడు వానర రాజ్యపట్టాభిషేకం చేశాడు. మనకి ఇంతకంటే మరో నిదర్శనం అక్కర్లేదు. విభీషణుడు రాక్షసుల అందరి శ్రేయస్సూకోరి ధర్మార్థ సహితమైన మాట చెప్పాడు; కాని రావణున కది నచ్చలేదు. రావణుడు విభీషణుని మాటే విని వుంటే ఈలంకాపట్నం దుఃఖంతో నిండి శ్మశానం అయిపోకుండా వుండును. రాముడు మహాబలవంతు

డైన కుంభకర్ణుణ్ణి చంపడమూ, లక్ష్మణుడు ఇంద్రజిత్తును చంపడమూ చూసి అయినా రావణుడు బుద్ధి తెచ్చుకోకుండా వున్నాడు. ఎక్కడ చూసినా, ఏవీధిచూసినా, ఏయిల్లు చూసినా "నాకొడుకు చచ్చిపోయాడు. నాసోదరుడు చచ్చిపోయాడు. నాపెనిమిటి చచ్చిపోయాడు" అంటూ రాక్షసస్త్రీలు ఏడవడమే వినపడుతోంది. రాముడు వేలూ లక్షలూ రథాలు పడగొట్టాడు. ఏనుగులనూ గుర్రాలనూ నాశనం చేశాడు. కాల్బంటులను చంపేశాడు. అతను రుద్రు డయినా కావాలి విష్ణువయినా అయివుండాలి. ఇంద్రు డయినా ఈరూపాన వచ్చివుండాలి. యముడే యీవిధంగా వచ్చి వుండాలి. మనవాళ్లంతా నశించిపోయారు. మనకి ఇక బతికే యోగంలేదు. ఈభయానికి అంతం కనపడ్డంలేదు. ఏడవడం వొక్కటే మనకి మిగిలింది. తనకి వరా లున్నాయనీ, తానేమో మహామహా వీరుణ్ణనీ గర్విస్తున్నాడేకాని రావణుడు రామునివల్ల వచ్చిన అపాయం గుర్తించుకోలేకుండా వున్నాడు. రాముని బారిబడ్డవాణ్ణి దేవతలూ, గంధర్వులూ, పిశాచులూ, రాక్షసులూ కూడా రక్షించలేరు. రావణునకు ప్రతీక్షణంలోనూ ఉత్పాతాలే కనపడుతున్నాయి. అవి రాముని విజయమే చెబుతున్నాయి. రావణుని చావు ఘోషిస్తున్నాయి. బ్రహ్మ సంతోషించి రావణునకు దేవదానవ రాక్షసులవల్ల అపాయం రాకుండా వరంయిచ్చాడు ; కాని మనుష్యుల వల్ల కూడా తన కపాయం రాకూడ దని రావణుడు కోరుకోనే లేదు. కనక, ఇప్పుడు రాక్షసజాతికి మనుష్యులవల్లనే సర్వనాశం ప్రాప్తించి నట్టుంది. దేవతలు రావణుని బాధలుపడలేక గొప్పగొప్ప తపస్సు చేసి బ్రహ్మను మెప్పించారు. అందుకు సంతుష్టిచెంది బ్రహ్మ "ఇది మొదలు త్రిలోకాల్లోనూ గూడా దానవులూ రాక్షసులూ ప్రాణాలు గుప్పిటవుంచుకుని సంచరిస్తారు" అని అభయం దయచేశాడు. దేవతలు దేవేంద్రుణ్ణి వెంటపెట్టుకువెళ్లి మహాదేవుణ్ణే ప్రార్థించారు.

అంతు కానందించి మహేశ్వరుడు "రాక్షసు లందరూ నశించిపోడానికి కారకురా లైన ఒక స్త్రీ పుడుతుంది. మీకప్పుడు సుఖానందాలు లభిస్తా" యని చెప్పాడు. పూర్వం ఆకలి దానవుల నందరినీ మింగేసింది. సీత యిప్పు డలాగే మనల నందరినీ మింగేస్తుంది. దుర్వినీతు డైన రావణుడు చేసిన దుష్కార్యంమూలాన మన కీదారుణశోకం సంభ వించింది. మన కిప్పుడు రక్షకు డెవడూ కనపడ్డంలేదు. దావాగ్నిలో చిక్కుకున్న ఆడయేనుగుల గతి మన కిప్పుడు తటస్థించింది. విభీషణుడు అదృష్టవంతుడు కనక మన కెవరివల్ల సర్వనాశం కనిపెట్టుకుందో ఆరాముణ్ణే ఆశ్రయించి సుఖంగా వున్నాడు"

## ౯౬
## మహోదర మహాపార్శ్వ విరూపాక్షులతో రావణుడు యుద్ధానికి బయలుదేరడం

చెవులు చిల్లులు పడుతున్న రాక్షసస్త్రీల యేడుపులూ పెడబొబ్బలూ రావణుడు విన్నాడు. ఒక్కసిట్టూర్పు విడిచాడు. ఒక్క క్షణం ధ్యానించాడు. వెంటనే పరమక్రుద్ధుడై ఓష్ఠం కొరుక్కుంటూ కాలాగ్నిలాగ మండిపడుతూ దగ్గిర వున్న మహోదరుణ్ణీ, మహాపార్శ్వుణ్ణీ, విరూపాక్షుణ్ణీ పిలిచి "నా ఆజ్ఞ అని చెప్పి సైన్యాలు వెంటనే బయలుదేరతియ్యండి" అని వురమాడు. తమలో తాము ఏమిటేమిటో గొణుక్కుంటున్న యీ సేనాధిపతులు ముగ్గురూ ఉలిక్కిపడి అది విని వెంటనే రాక్షసులను సిద్ధం చేశారు. ఘోరరూపులైన ఆ రాక్షసు లందరూ 'చిత్తం' అని రావణునకు నమస్కరించి చేతులు మోడ్చుకున్నారు.

అప్పుడు రావణుడు మహోదరుణ్ణీ, మహాపార్శ్వుణ్ణీ, విరూపాక్షుణ్ణీ మళ్ళీ పిలిచి "నేనిప్పుడే ప్రళయాగ్ని వంటి బాణాలతో రామలక్ష్మణులను సంహరించేసి ఖరుణ్ణీ, కుంభకర్ణుణ్ణీ, ప్రహస్తుణ్ణీ, ఇంద్రజిత్తునీ

సంహారించినందుకు పగతీర్చుకుంటాను. మాబాణమేఘాలతో కప్పబడి పోయి యిక అంతరిక్షమూ, దిక్కులూ, నదులూ, సముద్రాలూ కనపడవు. ఇప్పుడే ఒక్కొక్క బాణంతో వానరులను గుంపులుగుంపులుగా కూల్చేస్తాను. ఇప్పుడే వాయువేగమైన రథంమీద వెళ్ళి ధనుస్సనే సముద్రంలో పుట్టిన బాణా లనే కెరటాలతో వానరసైన్యాలను ముంచేస్తాను. వికసిత పంకజాలతో నిండిన తటాకాలు మదగజాలు కలిచివేసేటట్టు వానరసైన్యాల నిప్పుడు కలిచేస్తాను. దాంతో యుద్ధభూమి అంతా కాడలు గల తామరపువ్వులతో లాగ వానరుల ముఖాలతో నిండిపోతుంది. రాళ్ళతోనూ రప్పలతోనూ యుద్ధం చేస్తున్న వానర యోధులను ఒక్కొక్క బాణంతో యిప్పుడే వందలూ వేలూ నాశనంచేసేస్తాను. ఎవరి భర్త చనిపోయాడో, ఎవరి సోదరులు చనిపోయారో, ఎవరి కొడుకులు చనిపోయారో వారి కందరికీ యిప్పుడే శత్రువుల నందరినీ సంహారించి దుఃఖం పోగొడతాను. ఇప్పుడే యుద్ధభూమి అంతా వానరకళేబరాలతో నింపేసి వెతికితే గాని భూమి కనపడకుండా వుండేటట్టు చేసేస్తాను. ఇప్పుడే నేను నక్కలనూ గద్దలనూ ఇంకా యిలాంటి జీవాలనూ శత్రువుల రక్తమాంసాలతో తృప్తిపరుస్తాను. కనక, వెంటనే నారథం రప్పించండి. నాధనుస్సునూ తెప్పించండి మీరందరూ నావెంట బయలుదేరండి'' అని వురిమినట్టు చెప్పాడు.

దానిమీద మహాపార్శ్వుడు అక్కడ వుండిన సేనాధిపతులను "సైన్యాం సిద్ధంచెయ్యండి" అని చెప్పాడు. సేనాధిపతులు ఇంటింటికీ వెళ్ళి రాక్షసులను ప్రోత్సాహించారు. దాంతో రకరకాల క్రూరాయుధాలు పుచ్చుకుని రాక్షసులు చక్కావచ్చారు. ఎనిమిది గుర్రాలు పూన్చిన రథం సూతుడు తీసుకువచ్చాడు. వెంటనే రావణుడు రథం యెక్కి బయలుదేరాడు. మహోదరుడూ, మహాపార్శ్వుడూ, విరూపాక్షుడూ కూడా రథా లెక్కి బయలుదేరారు. వెంటనే భూమి అది

రేటట్టు సింహనాదాలు చేస్తూ రామలక్ష్మణులున్న ఉత్తరద్వారంలో నుంచి యుద్ధరంగంలోప్రవేశించారు. కాని సూర్యుడు నిస్తేజుడయిపోయాడు. దిక్కులన్నీ చీకట్లు కమ్మాయి. పక్షులు ఘోరంగా కూశాయి. భూమి కంపించింది. మేఘాలు నెత్తురువర్షం కురిశాయి. గుర్రాలు తూలిపోయాయి. రావణుని జెండామీద గద్దవాలింది నక్కలు అమంగళకరంగా కూశాయి. ఎడమకన్ను దిరిందీ. ఎడమభుజము న్యూనిసికింది. మొగం తెలతెలబోయింది. స్వరంభ్రంశం అయిపోయింది. ఆకాశంనుంచి పిడుగుల్లాగ ఉల్కలుపడ్డాయి. కాకులతో కూడా గద్దలు వికటంగా కూశాయి.

అయినా, రావణుడీ అశుభనిమిత్తాలు లెక్కచెయ్యకుండా యుద్ధరంగానికి వెళ్లాడు రాక్షసుల రథఘోష విని వానరులుకూడా యుద్ధసన్నద్ధు లయినారు. క్షణంలో సంకులసమరం ప్రారంభం అయింది. రావణుడు వానరులమీద శరవర్షం ప్రారంభించాడు. దాంతో వానరులలో కొందరి తల తెగిరిపోయాయి. కొందరి గుండెలుబద్దలయిపోయాయి. కొందరి చెవు తెగిరిపోయాయి. మాటలేకుండా కొందరు పడి చచ్చారు. కొందరి డొక్కలు చిరిగిపోయాయి. కొందరి శిరస్సులు పగిలాయి. కొందరికి కళ్లు పోయాయి. రావణు డెటు వెడితే అటు వానరులు సహించలేకపోయారు.

## ౯౭

## సుగ్రీవుడు విరూపాక్షుణ్ణి చంపడం

అలాగ, రావణుని బాణాలతో కూలిపోయిన వానరుల కళేబరాలు యుద్ధభూమి అంతటా నిండిపోయాయి. మిడతలు అగ్నిని సహించలేనట్టు వానరులు రావణుని ధాటి సహించలేకపోయారు. దాంతో వారు దావానలం చుట్టుకున్న అడవిలో యేనుగుల్లాగ పారిపోసాగారు.

మహావాతం మేఘాల నెగరగొట్టేటట్టు రావణుడు వానరసైన్యాలను పారద్రోలసాగాడు. ఇలాగ వానరులను పీడించి పీడించి రావణుడు రామునిమీద వ్రకాడు. వానరులు పారిపోతూవుండడం చూసి సుగ్రీవుడు వారిని చూస్తూవుండడానికి సుషేణుణ్ణి నియమించి తా నద్భుతంగా యుద్ధంచెయ్యబూనాడు. ముందు అత నొక చెట్టుపుచ్చుకొని బయలుదేరాడు. అతని కీపక్కనా ఆపక్కనా తక్కిన వానరప్రముఖులు రాళ్లూ రప్పలూ పుచ్చుకొని వెంటబడ్డారు. అతను ఆకాశం బద్దలయ్యేటట్టు సింహనాదం చేసి ముందు సాధారణరాక్షసుల ననేకులను సంహరించి తరవాత రాక్షసప్రముఖులమీదికి పోయాడు. ప్రళయంలో వాయువు పెద్దపెద్ద చెట్లను పెల్లగించివేసేటట్టు అత నెంతోమంది రాక్షసప్రముఖులను సంహరించాడు. అడవిలో మేఘం పక్షులమీద వడగళ్లు కురిసేటట్టు అతను రాక్షసులమీద పర్వతాలకు పర్వతాలే విసిరేశాడు. వాటితో రాక్షసులు వేలూ లక్షలూ బుర్రలు పగిలీ, శరీరాలు పచ్చడి అయీ రూపుమాసిపోయారు.

ఇలాగ సుగ్రీవుడు విజృంభించడమూ, రాక్షసులు కూలిపోతూవుండడమూ పరకాయించి రథంమీద వున్న వాడల్లా యేనుగు మీదికి దుమికి "ఇదిగో, నేను-విరూపాక్షుణ్ణి-మరి కాసుకో" అంటూ వచ్చి సుగ్రీవునిమీద ఘోరశరాలు విడిచి రాక్షసులకు ధైర్యం కలిగించాడు. ఆదెబ్బ తిని సుగ్రీవుడు విరూపాక్షుణ్ణి సంహరించా లని నిశ్చయించుకున్నాడు. చూస్తుండగా అతనొక పెద్దచెట్టు పెరికి విరూపాక్షునియేనుగు మొగాన కొట్టాడు. దాంతో అది గీపెడుతూ ధనుర్మాత్రదూరం వెనక్కి వెళ్ళి కొండ విరిగిపడ్డట్టు పడి ప్రాణాలు విడిచింది.

విరూపాక్షుడు ముందు అతిలాఘవంగా యేనుగుమీదినుంచి కింది కురికాడు. తరవాత కత్తీ డాలూ పుచ్చుకుని సుగ్రీవుని మీది కెగిరి పడ్డాడు. అది చూసి సుగ్రీవుడు పెద్దమేఘం అంత బండరాయి తీసి

వాడిమీద విసిరాడు. విరూపాక్షు డది తప్పించుకోడానికి కొంత పక్క-కొదిగి వెంటనే వచ్చి సుగ్రీవుణ్ణి ఒక్క నరుకు నరికాడు. ఆ నరుకు గాఢంగానే తగిలింది. దాంతో సుగ్రీవు డొక్క క్షణం మూర్ఛిల్లాడు; కాని వెంటనే తేరుకుని విరూపాక్షుని గుండెలు పగిలేటట్టు పిడికిలి బిగించి ఒక్కపోటు పొడిచాడు. దానికి మిక్కిలి కోపించి విరూపాక్షుడు తన ఖడ్గంతో సుగ్రీవుని కవచం చించేసి ఒక్క తన్ను తన్నాడు. ఆ తాపుకి సుగ్రీవుడు పడిపోయాడు గాని వెంటనే లేచి విరూపాక్షుణ్ణి ఒక్క చరుపుచరవబోయాడు. విరూపాక్షు డది సులువుగా తప్పించుకుని సుగ్రీవుణ్ణే గుండెలమీద పొడిచాడు. దీంతో సుగ్రీవుడు ఉడికిపోయాడు. అతనికి చాలా కోపంవచ్చింది. వెంటనే పులిలాగ వురికి విరూపాక్షుని నొసట ఒక్క చరుపు చరిచాడు. ఆదెబ్బతో రక్తం కక్కుకుంటూ అసలే వికృతంగావున్న ముఖం తేలవేసుకుంటూ కింద పడి విలవిల తన్నుకున్నాడు. ఇలాగ ఆబాధ భరించలేక వాడు ఎగిరెగిరి పడడమూ, దొర్లడమూ, దీనంగా యేడవడమూ, ఇలా విరూపాక్షుణ్ణి చూసి వానరులు సింహనాదాలు చేశారు. అటు విరూపాక్షుడు చచ్చిపోవడం చూసి వానరులు సంతోషంతోనూ, రాక్షసులు క్రోధదుఃఖాలతోనూ వొళ్ళు మరిచి ఉప్పొంగిపోయే గంగాప్రవాహంలాగ పరవళ్ళు తొక్కుతూ సింహనాదాలు చేస్తూ కలియబడ్డారు.

## ౬౮
## సుగ్రీవుడు మహోదరుణ్ణి కూడా చంపడం

ఆవానరరాక్షససైన్యాలు అన్యోన్యమూ కొట్టుకుంటూ వేసవికాలంలో తటాకాలలాగ మెల్లిమెల్లిగా క్షీణించసాగాయి. ఇలాగ స్వబలం తరిగిపోతూవుండడమూ, విరూపాక్షుడు చనిపోవడమూ, వానరులింకా తన వాళ్ళని చావగొడుతూ వుండడమూ చూసి, దైవయోగం తలుచుకుని

మిక్కిలీ బాధపడి చివరికి మహోదరుణ్ణి పిలిచి "మహాబాహూ! ఇప్పుడు నాజయాశ నీమీదే వుంది. వెళ్ళి శత్రువులను సంహరించి నీపరాక్రమం చూపించు. ఇంతవరకూ నాఅన్నం తిన్నందుకు ఇప్పుడు నువ్వు నీవిశ్వాసం చూపించవలసిన సమయం వచ్చింది" అని చెప్పాడు.

"సరే" అని మహోదరుడు యుద్ధరంగంలో వురికాడు. అది మిడత వెళ్ళి అగ్నిలో పడ్డట్టుంది. అయినా, తన శక్తికి మించి వాడు ఘోరయుద్ధం చెయ్యసాగాడు. మహాసత్వసంపన్నులైన వానరులున్నూ పెద్దబండరాళ్ళతో రాక్షసులను పచ్చడి చెయ్యసాగారు. అందుకు మండిపడి మహోదరుడు బాణవర్షం కురిసి వానరులను కొందరిని కాళ్ళు నరికీ, కొందరిని జబ్బలు నరికీ, కొందరినీ తొడలు విరగ్గొట్టీ చంపసాగాడు. అది భరించలేక వానరులు కొందరు పారిపోయారు. కొందరు సుగ్రీవుణ్ణి శరణుజొచ్చారు. దానిమీద, 'భయపడకండి' అని వాళ్ళకి ధైర్యం చెప్పి సుగ్రీవుడు పర్వతం అంత రాయితీసి మహోదరునిమీద విసిరాడు. మహోదరుడు బాణంతో అది చూర్ణం చేశాడు. అది ముక్కముక్కలయి గద్దలగుంపులాగ కిందపడిపోయింది.

అందుకు సుగ్రీవునకు చాలా కోపంవచ్చింది. వెంటనే సాలవృక్షం వొకటి పెరికి విసిరాడు. మహోదరుడు అదికూడా ఖండించేశాడు. ఇటూ అటూ చూడగా గొప్ప పరిఘ వొకటి కనపడింది. సుగ్రీవుడు వెంటనే అది పుచ్చుకుని తిప్పి తిప్పి గుర్రాలను చావగొట్టాడు. మహోదరుడు కింది కురికి గదపుచ్చుకున్నాడు. ఇటు పరిఘతో సుగ్రీవుడూ, అటు గదతో మహోదరుడూ ఆబోతుల్లాగ కొంతసేపు పోరాడారు. తరవాత మహోదరుడు గద విసరగా సుగ్రీవుడు పరిఘ విసిరాడు; కాని పరిఘ విరిగిపోయింది. ఇటు చూసి సుగ్రీవుడు బంగారపుకట్లతో వున్న యినపరోకలి పడివుండగా అది పుచ్చుకుని తిప్పితిప్పి మహోద

రునిమీదికి విసిరాడు. మహోదరుడు మరో గద విసిరాడు. రెండూ ఆకాశాన తారసిల్లి పిప్పిపిప్పి అయి పడిపోయాయి.

చేసేది లేక యిద్దరూ కలియబడి కొంతసేపు గుద్దుకున్నారు. చరుచుకున్నారు. తన్నుకున్నారు. గెంటుకున్నారు. దీంతో అలసట రాగా కొంతసేపు వగర్చుకుంటూ నిప్పులు కక్కుతూ చూసుకుంటూ నుంచున్నారు. చూసిచూసి మహోదరుడు పడివున్న వాలూ డాలూ పుచ్చుకున్నాడు. సుగ్రీవునకు కూడా సమయానికి సరిగా అలాంటివే దొరికాయి. వెంటనే శస్త్రవిశారదులైన వారిద్దరూ మళ్ళీ కలియబడ్డారు. కొంతసేపు మండలగతులు చేశాక మహోదరుడు కత్తివిసిరి సుగ్రీవుణ్ణి కొట్టాడు; కాని అది తప్పిపోయి సుగ్రీవుని డాలుకి గుచ్చుకుంది. మహోదరు డాకత్తి తీసుకునేలోపున సుగ్రీవుడు సాచికొట్టాడు. ఆదెబ్బతో శిరస్త్రాణంతోనూ కుండలాలతోనూ మెరిసిపోతున్న మహోదరుని తల యెగిరి నేలమీద పడిపోయింది.

రాక్షసు లది చూసి పారిపోవడం ప్రారంభించారు. రావణు డది చూసి మండిపడ్డాడు. రాముడు చూసి యెగిసిపడ్డాడు. ఆకాశాన చేరివున్న దేవతాగణాలు సుగ్రీవుణ్ణి మిక్కిలీ స్తుతించాయి.

## ౯౯

## అంగదుడు మహాపార్శ్వుణ్ణి చంపడం

సుగ్రీవుడు మహోదరుణ్ణి చంపడం చూసి మహాపార్శ్వుడు అంగదుని మీద పడి వానరసేనను చీకాకుపరిచాడు. వాడు వానరులలో అనేకుల తల లెగరగొట్టాడు. అనేకుల చేతులు కొట్టేశాడు. అనేకుల కాళ్లు నరికేశాడు. అనేకుల డొక్కలు చీల్చేశాడు. ఇది చూసి అంగదుడు రోషతామ్రాక్షుడై పర్వసమయంలో సముద్రంలాగ పొంగి అక్కడ వొక యినపపరిఘ పడివుండగా అది పుచ్చుకుని మహాపార్శ్వుని

మీద విసిరాడు. ఆదెబ్బతో ముందు సూతుడు చచ్చిపడిపోయాడు. తరవాత మహాపార్శ్వుడు కూడా మూర్ఛిల్లి కిందపడిపోయాడు. క్షణం దుబాట్లోపెడబొబ్బలు పెట్టుకుంటూవచ్చి జాంబవంతుడూ గవాక్షుడూ మహాపార్శ్వుని రథం విరిచేసి, గుర్రాలను చంపేశారు. ఇంతలో తేరుకుని లేచి మహాపార్శ్వుడు అంగదునిమీద బాణవర్షం కురిశాడు. మూడుబాణాలతో జాంబవంతుణ్ణి స్తనాలమధ్య కొట్టాడు. గవాక్షుణ్ణి కూడా చాలా బాణాలు విసిరికొట్టాడు.

అప్పుడు అంగదుడు పడివున్న పరిఘ వొకటి పుచ్చుకుని రెండుచేతులతోనూ పట్టుకుని తిప్పితిప్పి మహాపార్శ్వునిమీదికి విసిరేశాడు. ఆదెబ్బతో వాడి శిరస్త్రాణంమాత్రం యెగిరిపోయింది. ధనుస్సుకూడా విరిగిపోయింది. అంతేటితో వూరుకోక అంగదుడు మహాపార్శ్వుణ్ణి సాచి గూబమీద కొట్టాడు. ఆదెబ్బతినీ కూడా మహాపార్శ్వుడు వొక పరిఘ అందుకున్నాడు. దాంతో అంగదుణ్ణి కొట్టాడు; కాని అతిలాఘువంగా అది తప్పించుకుని అంగదుడు పిడికిలి బిగించి మహాపార్శ్వుని వక్షస్థలం మీద స్తనాలమధ్య పొడిచాడు. దాంతో గుండెలు పగిలి, కిందపడి వాడు చచ్చిపోయాడు.

మహాపార్శ్వుని మరణం చూశాటప్పటికి రావణునకు చాలా కోపం వచ్చింది. వానరులు సింహనాదాలు చేస్తూ జబ్బలు చరుచుకోగా ఆధ్వనికి లంక దద్దరిల్లిపోయింది. రావణుడు మళ్ళీ యుద్ధానికి సిద్ధపడ్డాడు.

## ౧౦౦

## రాముడు పావకాస్త్రంతో రావణుని ఆసురాస్త్రం కొట్టెయ్యడం

ఇలాగ మహోదరుడూ, మహాపార్శ్వుడూ, మహాబలశాలి అయిన విరూపాక్షుడూ చచ్చిపోవడం చూసి, మహాక్రోధం ఆవేశించగా

రావణుడు సూతుణ్ణి పిలిచి "అమాత్యులు చచ్చిపోయినందుకూ, నగరం ముట్టడిలో వున్నందుకూ కలిగిన దుఃఖం, రామలక్ష్మణులను సంహరించి నేనొక్కణ్ణే పోగొడతాను. రాము డొక వృక్షం అనుకో. దానికి సుగ్రీవుడూ, జాంబవంతుడూ, కుముదుడూ, నళుడూ, మైంద ద్వివిదులూ, అంగదుడూ, గంధమాదనుడూ, హనుమంతుడూ, సుషేణుడూ మొదలైన వానరప్రముఖులు కొమ్మలు. సీత దానికి పువ్వులూ ఫలాలూను. ఆవృక్షం నేను క్షణంలో నరికేస్తాను, రథం పోనియ్యి" అని చెప్పి దశదిశలూ భేదిల్లేటట్టు సింహనాదాలు చేస్తూ రామునిమీదికి బయలుదేరాడు. ఆధ్వనికి భూమి గడగడ వొణికిపోయింది. అడవిపందులూ పులులూ మొదలైన క్రూరమృగాలు కూడా దద్దరిల్లిపోయాయి.

వెంటనే రావణుడు తామసాస్త్రం ప్రయోగించాడు. దాంతో వానరు లనేకమంది పడిపోయారు. అనేకులు పారిపోయారు. వారి పాదఘట్టనలతో పుష్కలంగా దుమ్ము రేగింది. అది బ్రహ్మ నిర్మించిన అస్త్రం. అంచేత వానరు లది సహించలేకపోయారు. ఇలాగ రావణుని చేతిలో అనేక సైన్యాలు నాశనం కావడంచూసి రాముడు యుద్ధ సన్నద్ధుడైనాడు. రావణుడు మళ్లీ విజృంభించాడు. వానరులు మళ్లీ పారిపోయారు. అప్పుడు రావణునకు రాముడు కనపడ్డాడు. విష్ణువు దగ్గిర మహేంద్రుడు లాగ అనుజయుం మెరగని రాముని దగ్గిర లక్ష్మణుడు నుంచుని వున్నాడు. రామునిచేతిలో వున్న ధనుస్సు ఆకాశం అంటుతోంది. అతని కళ్ళు తామరపూ రేకల్లాగ విశాలంగా వున్నాయి. అతని బాహువులు దీర్ఘంగా వున్నాయి.

మహాతేజశ్శాలి అయిన రాముడు, వానరులు పారిపోతూ వుండడమూ, రావణుడు మీదికి వస్తూవుండడమూ చూసి ధనుస్సు పుచ్చుకున్నాడు. ఎక్కుపెట్టాడు. టంగుటంగున నారి మోగించాడు. ఆ ధ్వనితో

భూమి బద్దలయిపోతున్న ట్టయింది. ఆ ధ్వని వినే రాక్షసు లనేకులు పారిపోయారు. రామలక్ష్మణుల ధనుస్సుల కెదరుగా వుండిన రావణుడు సూర్యచంద్రుల యెదట రాహువులా వున్నాడు. ఈస్థితిలో ముందు తాను యుద్ధంచెయ్యదలిచి లక్ష్మణుడు అగ్నిజ్వాలలవంటి బాణాలు విడిచాడు. కాని రావణుడు వాటిని ఆకాశంలోనే ఛేదించేశాడు. రావణుడు తన హస్తలాఘవం కనపరుస్తూ, లక్ష్మణు డొక బాణం వేస్తే దాన్ని ఒక బాణంతోనే కూలగొట్టాడు. మూడు బాణాలు వేస్తే మూడింటితో కూలగొట్టాడు. పదిబాణాలు వేస్తే పదింటితో కూలగొట్టాడు. ఇలా కొట్టి తృప్తి లేక రావణుడు లక్ష్మణుణ్ణి విడిచి పర్వతంలాగ నుంచునివుండిన రామునిమీదికి తిరిగాడు. నిమిషంలో వేలకొద్దీ బాణాలు వర్షించాడు. ఆ శరధారలు చూసి రాముడు భల్లాగ్రాలైన బాణాలు తొడిగి ఆకాశంలోనే నాశనంచేశాడు. దీనిమీద రావణుడు రామునిమీదా, రాముడు రావణునిమీదా అతివడిగా బాణాలు వేసుకున్నారు. వారు ఆ బాణాలు తప్పించుకుంటూ చాలసేపు సవ్యాపసవ్యాలుగా మండలభ్రమణంచేశారు.

ప్రళయంలో యములు లాగ వారిద్దరూ అలా పోరుతూ వుంటే సమస్తభూతాలూ గడగడలాడిపోయాయి. వర్షాకాలంలో ఆకాశం మెరుములతోనూ ఉరుములతోనూ కూడిన మేఘాలతో నిండిపోయేటట్టు వారి బాణాలతో గగనం నిండిపోయింది. ఆబాణాలతో ఆకాశం వొక గవాక్షం లా వుంది. యుద్ధం ఘోరం అయిపోయింది. అది వృత్రుడూ మహేంద్రుడూ చేసిన యుద్ధం లాగ చూడశక్యం కాకుండా వుంది. చూడగా, వారుభయులూ మహాధానుష్కులే. ఉభయులూ అస్త్రశస్త్రవిశారదులే. ఉభయులూ యుద్ధంలో సమానంగా విహరించగలవారే. కాగా వారిద్దరూ ఎటు తిరిగితే అట్నుంచి సాగర తరంగాల్లాగ బాణపరంపరలు వచ్చిపడసాగాయి.

ఉన్నట్టుండగా రావణుడు బాణంమీద బాణంవేసి రాముని నొసట కొట్టాడు; కాని దానివల్ల రామున కేమీ బాధకలగలేదు. కాని, దాంతో, క్రోధం వహించి రాముడు రౌద్రాస్త్రమంత్రం జపించి రావణునిమీద బాణంమీద బాణం ప్రయోగించాడు. అవన్నీ రావణుని కవచంమీద పడ్డాయి; కాని దాన్నేమీ చెయ్యలేక కిందపడి పోయాయి. అందుకు కినిసి రాముడొక పరమాస్త్రం వేసి రావణుని నుదుట కొట్టాడు. అది కూడా ఏమీ చెయ్యలేకపోయింది. అయినా, అందుకే మిక్కిలీ క్రుద్ధుడై రావణుడు ఆసురాస్త్రం ప్రయోగించాడు. దానివల్ల సింహముఖాలూ, వ్యాఘ్రముఖాలూ, కంకముఖాలూ, కాకముఖాలూ, గృధ్రముఖాలూ, శ్యేనముఖాలూ, సృగాలముఖాలూ అయిదుతలల పాములవంటివీ అనేకబాణాలు బయలుదేరాయి. ఖరముఖాలూ, వరాహముఖాలూ, శ్వానముఖాలూ, కుక్కుటముఖాలూ, మకరముఖాలూ కూడా అనేకబాణాలు బయలుదేరాయి.

అది చూసి రాముడు పావకాస్త్రం ప్రయోగించాడు. దానివల్ల అగ్నిముఖాలూ, సూర్యముఖాలూ, అర్ధచంద్రాలూ, చంద్రముఖాలూ, ధూమకేతుముఖాలూ, గ్రహముఖాలూ, నక్షత్రముఖాలూ, ఉల్కాముఖాలూ, విద్యుజ్జిహ్వాలూ మొదలైన అనేక బాణాలు పుట్టుకు వచ్చాయి. అవీ యివీ ఆకాశాన కలుసుకున్నాయి. ఉత్తరక్షణంలోనే రావణుని బాణాలు వ్యర్థం అయిపోయాయి. ఇలాగ రావణుని ఆసురాస్త్రం రామునివల్ల వ్యర్థం అయిపోవడం చూసి వానరులు సుగ్రీవాదులు రాముని చుట్టూ చేరి సింహనాదాలు చేశారు. ఎగిరెగిరిపడ్డారు. తొడలు చరిచారు. మీసాలు దువ్వారు. రాముణ్ణి అనేకవిధాల కొనియాడారు.

౧౦౧

## రామబాణాలు సహించలేక రావణుడు పారిపోవడం

ఇలాగ అసురాస్త్రం వ్యర్థంకాగా, రావణుడు ముందు మిక్కిలీ కోపించి తరవాత మరో అస్త్రం ప్రయోగించాడు. అది మయుడు నిర్మించిన రౌద్రాస్త్రం. మహాఘోరం. అది వెయ్యగానే శూలాలూ, గదలూ, ముసలాలూ, ముద్గరాలూ, కూటపాశాలూ, పిడుగులూ పుట్టుకువచ్చాయి; కాని రాముడు గాంధర్వాస్త్రం ప్రయోగించి రౌద్రాస్త్రం ప్రతిహతం చేసేశాడు. అందుకు మిక్కిలీ కోపించి రావణుడు సౌరాస్త్రం ప్రయోగించాడు. దానివల్ల ప్రకాశమానాలైన చక్రాలెన్నో పుట్టుకు వచ్చాయి. అవన్నీ ఆకాశం కమ్మేశాయి; కాని ఆచక్రాలు కూడా రాముడు తన తీక్ష్ణ బాణాలతో కొట్టేశాడు.

అది కూడా నిష్ఫలం కాగా రావణుడు పది బాణాలతో రాముణ్ణి మర్మాలు తున్నిపోయేటట్టు కొట్టాడు; కాని వాటివల్ల రాముని కీషణ్మాత్రమూ కూడా బాధ కలగలేదు. పైగా, అతనే మిక్కిలీ క్రుద్ధుడై అనేక బాణాలతో రావణుణ్ణి కొట్టాడు; ఈసందుబాట్లో మహాబలశాలి అయిన లక్ష్మణుడు ఏడుబాణాలు తొడిగి మనుష్యశీర్షం చిత్రించిన రావణుని జెండా ముక్కలుముక్కలు చేశాడు. మరో బాణంతో కుండలాలతో మెరిసిపోతున్న సారథి తల యెగరకొట్టాడు. ఇంకో అయిదు బాణాలు తొడిగి ఏనుగు తొండంవంటి రావణుని ధనస్సే విరగకొట్టాడు. ఇది యిలా జరుగుతూ వుండగా విభీషణుడు వచ్చి గదతో రావణుని గుర్రాలు చావగొట్టాడు.

గుర్రాలమీద దెబ్బపడగానే రావణుడు కింది కురికి ఒకగొప్ప శక్తి విభీషణునిమీద విసిరాడు; కాని అది సమీపించకముందే లక్ష్మణుడు ముక్కలు చేసేశాడు. అందుకు ఆనందించి వానరులు జయధ్వానులు చేశారు. ఆకాశంనుంచి పడ్డ మహోల్క లాగ ఆశక్తి మూడు

ముక్కలై వెలిగిపోతూ కింద పడిపోయింది. అప్పుడు రావణుడు మరో శక్తిని విభీషణునిమీద గురిపెట్టాడు. దాంతో విభీషణుడు చచ్చిపోవలసిందే; కాని లక్ష్మణుడు వెళ్ళి దాని కడ్డంగా నుంచుని రావణుని మీద బాణవర్షం కురిశాడు.

దీంతో రావణుడు నిరుత్సాహపడిపోయాడు. ఆ దెబ్బలుతింటూ ఒక్క క్షణం వూరుకుని చివరికి "లక్ష్మణా! నీ బలగర్వం చూశాను. నువ్వు విభీషణుణ్ణి రక్షించావు; కాని యీశక్తి నీ ప్రాణాలు తీస్తుంది, చూసుకో" అంటూ దాన్ని లక్ష్మణునిమీద ప్రయోగించాడు. దాని కెనిమిది గంటలు కట్టారు. అవి మిక్కిలి ధ్వనిచేస్తున్నాయి. అది వచ్చి లక్ష్మణుని వక్షస్థలం ప్రవేశించింది. అంతకి ముందే "లక్ష్మణునకు మంగళం కావాలి. అస్త్రమా! నువ్వు వ్యర్థం అయిపో" అన్నాడు రాముడు; కాని అప్పటి కప్పుడే లక్ష్మణుడు కిందపడిపోయాడు. సోదరుని అవస్థచూసి రాముడు మిక్కిలి పరితపించాడు. కళ్ళనీళ్ళుపెట్టుకుని ఒక్కక్షణం నిలిచిపోయాడు; కాని అంతలో ఇది విచారించవలసిన సమయం కాదనుకుని ప్రళయాగ్నిలా విజృంభించి రావణుని సంహరించడానికి తుములయుద్ధంచేశాడు. ఒక కంటితో లక్ష్మణుణ్ణి చూస్తూనే అతను రావణునితో యుద్ధంచేశాడు. ఈలోపున వానరప్రముఖులు ఆశక్తిని విడిపిద్దామని చూశారు, గాని లాభం లేకపోయింది. రావణుడా ప్రయత్నంచూసి తీక్షణబాణాలతో వాళ్ళని చీకాకుపరిచాడు.

ఇలాగ ఆశక్తి కొంతసేపు లక్ష్మణుణ్ణి పీడించి కిందపడిపోయింది. ఒకమూల రావణుని మీద బాణవర్షం కురుస్తూనే రాముడాశక్తిని చేత్తో పట్టుకుని వంచి విరిచిపారేశాడు. అతనలా విరుస్తూవుంటే రావణుడెన్నో బాణాలు వేసి బాధించాలని చూశాడు; కాని రాముడు అది లెక్కచెయ్యక లక్ష్మణుణ్ణి కౌగిలించుకుని, హనుమం

తుణ్ణీ సుగ్రీవుణ్ణీ పిలిచి "మీరు లక్ష్మణుని చుట్టూ కనిపెట్టుకుని వుండండి. చాలాకాలంగా నేను పరాక్రమించా లని చూస్తున్న సమయం వచ్చింది. బహుకాలంగా నిరీక్షించే చాతకపక్షికి గ్రీష్మానంతరం మేఘదర్శనం అయేటట్టు ఈ రావణుడు నాకళ్ళబడ్డాడు. నేను శపథం చేస్తున్నాను వినండి. ఈ క్షణంలో జగత్తు అరావణమో అరామమో అయిపోతుంది. రాజ్య నాశమూ, వనవాసమూ, దండకలో వుండడమూ, సీతాపహరణమూ, రాక్షసులతో తగవూ – ఇలాగ నాకు సంభవించిన దుఃఖమూ, లక్ష్మణుని యీ అవస్థవల్ల కలిగిన క్లేశమూ యివన్నీ రావణుణ్ణి సంహరించి యిప్పుడే పోగొట్టుకుంటాను. ఎందుకోసం నేను వానరుల నిక్కడికి తీసుకువచ్చానో, ఎందుకోసం వాలిని చంపి సుగ్రీవునకు రాజ్యాభిషేకంచేశానో, ఎందుకోసం సేతువు కట్టి సాగరం దాటానో ఆ రావణు డిప్పుడు నాకళ్ళబడ్డాడు. ఇక వీడు బతకడానికి వీలులేదు. మీరందరూ నిశ్చలంగా నుంచుని చూస్తూ వుండండి. పర్వతాలమీద కూచునిన్నీ చూడండి. భూమి వున్నంతకాలమూ దేవతలు చెప్పుకునే సంగతులు ఇప్పుడు జరిగిస్తాను" అని చెప్పి పదనైన బాణాలతో రావణుణ్ణి కొట్టాడు. రావణుడున్నూ దీప్తనారాచాలతోనూ, ముసలాలతోనూ రాముణ్ణి కొట్టాడు.

ఇలాగ రామరావణులు ప్రయోగించిన ఆయుధాలు ఆకాశాన తారసిల్లి సంకులసమరం చేశాయి. ఆరామరావణుల ధనుష్టంకారంతో జగత్తంతా గజగజలాడిపోయింది. యుద్ధంచేసిచేసి చివరికి ఆగలేక, గాలి కెగిరిపోయిన మేఘంలాగ రావణుడు లంకలోకి ఎగిరిపోయాడు.

## ౧౦౩
## లక్ష్మణమూర్ఛ

రావణునితో తుములయుద్ధంచేసి, రావణుని శక్తితో పెద్దదెబ్బ తిని, యుద్ధభూమిలో మూర్ఛపడి, రక్తంలో మునుగుతూ తేలుతూ వున్న

లక్ష్మణుణ్ణి చూసి దుఃఖిస్తూనూ, రావణునిమీద తీక్ష్ణబాణాలు వర్షిస్తూనూ సుషేణుణ్ణి పిలిచి రాముడు "ఇదే, రావణుని శక్తికి మూర్ఛిల్లి నాతమ్ముడు పాములాగ మెలికలు తిరుగుతూ నాకు శోకం కలిగిస్తున్నాడు. నా కితను ప్రాణాలకంటె యిష్టమైనవాడు. ఇత నిలా పడివుండగా నేనేమి యుద్ధంచెయ్యగలనూ? సమరశ్లాఘి అయిన నాతమ్ముడే చచ్చిపోతే, నాకిక బతు కేమిటి సుఖంయేమిటి? ఈస్థితి తలుచుకుంటే నాపౌరుషం సిగ్గుతో కుమిలిపోతూవుంది. నాచేతిలో ధనుస్సు జారిపోతున్న ట్టుంది. బాణాలు తొట్రుపడుతున్నాయి. నీళ్లతో కమ్మిచూపు మందగించిపోతోంది. స్వప్నంలాగ నాకాళ్లు వెనక్కి లాగుతున్నాయి. చింత యెక్కువయిపోతోంది. ప్రాణాలమీద ఆశ పోతోంది" అన్నాడు.

ఇలా అని అతను మిక్కిలీ దుఃఖించాడు. "సుషేణా! ఈయుద్ధభూమి దుమ్ములో నాతమ్ముడు పడిపోయివుండగా నాకు యుద్ధంవల్ల ఏమి ప్రయోజనమూ? ప్రాణా లుండియేమి లాభమూ? సీతతో మాత్రం యేమిపనీ? ఏదేశంవెళ్ళినా భార్యలు దొరుకుతారు. ఏదేశం వెళ్ళినా చుట్టాలు ఏర్పడతారు; కాని ఏకగర్భజనితుడైన భ్రాత లభించే దేశం పృథివిమీద లేదు" అంటూ మాటిమాటికీ నిట్టూర్పులు విడిచాడు. అది చూసి సుషేణుడు "మహాబాహూ! లక్ష్మణుడు చని పోలేదు. ఇతని మొగం వికృతంగా లేదు, వివర్ణమూ కాలేదు. కళా పోలేదు. పైగా ప్రసన్నంగా వుంది. వర్చస్సుకి లోటులేదు. కళ్లున్నూ సుప్రసన్నంగా వున్నాయి. అరిచేతులు తామరపూరేకల్లాగ యెఱ్ఱగానే వున్నాయి. చనిపోయినవాళ్ళ రూపం యిలా వుండదు. దీర్ఘాయుష్మంతుల మొగం యెలా వుంటుందో లక్ష్మణుని మొగం అలానే వుంది. ఇతను ప్రేతం కాలేదు. బతికేవున్నాడు, అనవసరంగా దుఃఖించవద్దు. మూర్ఛిల్లి పడివున్నవాని హృదయం ఆగిపోతే దనడానికి

ఈడుచ్ఛ్వాసమే నిదర్శనం" అని రాముణ్ణి ఊరడించి "హనుమా! నీకిదివరలో జాంబవంతుడు చెప్పాడే ఓషధిపర్వతం, దాని దక్షిణశిఖరంమీద వుంది విశల్యకరణీ, సవర్ణకరణీ, సంజీవనీ, సంధానకరణీ అనే ఓషధి. లక్ష్మణుడు బతకాలంటే నువ్వది త్వరగా తీసుకురావాలి" అన్నాడు.

వెంటనే హనుమంతుడు వెళ్ళిపోయాడు; కాని ఆమూలిక గుర్తించలేక "ఇక యీపర్వతశిఖరం పెరుక్కుపోవడమే ఉపాయం. దీనిమీదే వుందని సుషేణుడే చెప్పాడుకదా? నేను ఓషధి తీసుకువెళ్ళకుండా వెడితే అంతా తల్లకిందు లయిపోతుంది" అనుకుని, మూడుమాట్లు వూపి పర్వతశిఖరం పెకలించుకుని వచ్చేశాడు. జరిగిందంతా విని సుషేణుడు ఆఓషధి పెరికి దంచి రసంతీశాడు. హనుమంతుడు చేసిన పనిచూసి వానరు లందరూ చకితులయిపోయారు. ఇంతలో సుషేణుడు ఆరసం లక్ష్మణుని ముక్కులో పోశాడు. వెంటనే పూర్ణారోగ్యవంతుడై లక్ష్మణుడు నిద్రపోయిలేచినట్టులేచాడు. లక్ష్మణుడు లేవడం చూసి భేషు భేషు అని వానరులు సుషేణుణ్ణి మెచ్చుకున్నారు. "నాయనా రా" అంటూ రాముడు లక్ష్మణుణ్ణి గట్టిగా కౌగిలించుకుని "వీరాధివీరా! నేను అదృష్టవంతుణ్ణి. నువ్వు చచ్చిబతికావు. నువ్వు చనిపోయివుంటే నాకు జీవితం అక్కర్లేకపోవును. సీత అక్కర్లేకపోవును. విజయమున్నా అక్కర్లేకపోవును" అన్నాడు. దానికి లక్ష్మణుడు ఖిన్నుడై "నువ్వు అప్పుడు విభీషణునకు మాట యిచ్చి యిప్పు డిలా అనడం ధర్మంకాదు. సజ్జనులు ప్రతిజ్ఞ విడిచిపెట్టుకోరు. ప్రతిజ్ఞ నెరవేర్చుకోడమే గొప్పతనానికి గుర్తు. నాకోసం నువ్వు నిరాశచేసుకోడం చాలు. రావణుణ్ణి చంపుతా నన్నావు, ఆమాట చెల్లించుకో. నీకళ్ళబడ్డాక శత్రువు బతికిపోలేడు. సూర్యుడ స్తమించకముందే నువ్వు రావణుణ్ణి చంపడం నేను చూడాలి. అన్నా! నువ్వు రావణుణ్ణి చంపదలుచుకుంటే — విభీష

ణున కిచ్చిన మాట చెల్లించుకోదలుచుకుంటే — నీకు సీత కావలసి వుంటే నేను చెప్పినట్టు చెయ్యి" అని గట్టిగా చెప్పాడు.

## ౧౦౩
## రామునికోసం మాతలి ఇంద్రరథం తీసుకురావడం

లక్ష్మణు డిలా చెప్పగా రాముడు ధనుస్సందుకుని రావణునిమీద బాణవర్షం కురిశాడు. రథంమీద వుండి రావణుడు మేఘం జలధారలతో కొట్టేటట్టు రాముణ్ణి వజ్రాయుధంవంటి బాణాలతో కొట్టాడు. మండుతున్న అగ్గివంటి బాణాలతో రాముడు మళ్ళీ కొట్టాడు. ఆకాశాన వున్న దేవతలూ దానవులూ గంధర్వులూ "నేలమీద వుండి రాముడూ, రథంమీద వుండి రావణుడూ యుద్ధం చెయ్యడం ధర్మంగా లేదు" అన్నారు. వీరిలా అంటూవుండగానే మాతలి ఇంద్రరథం తీసుకువచ్చాడు. అది బంగారపుపనితనంతో జిగజిగ మెరుస్తోంది. దానికి చిరుగంటలెన్నో కట్టివున్నాయి. బాలసూర్యబింబంలా మెరిసిపోతోంది. పచ్చని గుర్రాలు పూన్చారు. జెండాకర్ర బంగారంతో చేశారు.

కొరడా పట్టుకుని రథంమీదే వుండి మాతలి "ఇక్ష్వాకువంశతిలకా! నీకు విజయం కలగడాని కింద్రుడీరథంపంపాడు. అగ్నిసమానమైన కవచమూ ఐంద్రధనుస్సూ, ఆదిత్యసంకాశాలైన శరాలూ, తీక్ష్ణమైన శక్తి కూడా పంపాడు. కనక, యీరథం అధిష్ఠించి రావణుణ్ణి సంహరించు. నేనే నీకు సారథినై వుంటా" నని చెప్పగా రాముడు సంతోషించి ప్రదక్షిణంచేసి రథంయెక్కాడు.

మళ్లీ పోరు దారుణం అయింది. రావణుడు గాంధర్వాస్త్రం ప్రయోగించాడు. రాముడు కూడా గాంధర్వాస్త్రమే వేసి దాన్ని ధ్వంసంచేశాడు. రావణుడు దైవాస్త్రం వేశాడు. రాముడున్నూ దైవాస్త్రమే

వేసి దాన్ని పడగొట్టాడు. అప్పుడు రావణుడు మహాఘోరమైన రాక్షసాస్త్రం ప్రయోగించాడు. అది తీక్ష్ణాలైన కాలసర్పాలై రామునిమీదికి వచ్చింది. అవి నోరు తెరచుకుని నిప్పులు కక్కుతున్నాయి. వాసుకితో సమానాలైన ఆసర్పాలతో ఆకాశం అంతా నిండిపోయింది. వెంటనే రాముడు గరుడాస్త్రం వేశాడు. అది గరుడపక్షు లయి ఆసర్పాలను నాశనం చేసేసింది.

గొప్ప దనుకున్న తన అస్త్రం యిలాగ వ్యర్థం కాగా రావణుడు మిక్కిలీ రుష్టుడై దారుణమైన బాణవర్షంతో రాముణ్ణి ముంచెత్తేసి, మాతలిని కొట్టాడు. ఒక బాణంతో జెండా పడగొట్టాడు. మళ్లీ బాణవర్షం కురిసి గుర్రాలను కూడా పీడించాడు. అది చూసి దేవతలూ గంధర్వులూ దానవులూ, చారణులూ, సిద్ధులూ, పరమర్షులూ నిర్విణ్ణులయిపోయారు. వానరులు వ్యథపడ్డారు. అప్పుడు బుధుడు రోహిణీనక్షత్రగతుడై ప్రజాపీడాకరుడై వున్నాడు. రావణుడు సధూమమైన సముద్రంలాగ సూర్యునితాకేటట్టు మిక్కిలీ క్రుద్ధుడై వున్నాడు. సూర్యుడు నిస్తేజుడైనాడు. కోసలాధీశ్వరుల విశాఖానక్షత్రం కుజుడాక్రమించాడు. దాంతో రావణుడు పదితలలతోనూ, యిరవై చేతులతోనూ ధనుర్బాణాలతోనూ మైనాకపర్వతంలా కనపడ్డాడు. రామునకు వింట బాణం సంధించడాని కూడా అవకాశం లేకపోయింది. అందుకు మిక్కిలీ రోషించి రాముడు నిప్పులుకక్కుతున్నట్టు చూశాడు.

## ౧౦౪

## రాముడు ఇంద్రశక్తితో రావణుని శూలం పడగొట్టడం

అలాగ మిక్కిలీ క్రుద్ధుడైన రాముని మొగం చూసి సమస్తభూతాలూ భయభ్రాంతాలయినాయి. భూమి గజగజలాడింది. సింహాలతోనూ

పులులతోనూ నిండివున్న పర్వతం వొణికిపోయింది. సముద్రం క్షుభితం అయిపోయింది. మేఘాలు భయంకరంగా ఉరిమాయి. రాముని క్రోధమూ ఈవుత్పాతాలూ చూశాటప్పటికి రావణునకు కూడా భయంపట్టుకుంది. విమానాలమీద వుండిన దేవతలూ గంధర్వులూ నాగులూ ఋషులూ దానవులూ దైత్యులూ, గరుడులూ ఆయుద్ధం ఆత్రంగా చూడసాగారు అసురులు రావణునకు జేజేలు కొట్టగా దేవతలు రామునకు జయధ్వనులు చేశారు.

ఈసందుబాట్లో దురాత్ముడైన రావణుడు రాముణ్ణి కొట్టడానికి వొక గొప్ప శూలం పుచ్చుకున్నాడు. అది వజ్రాయుధంతో సమానమైనది. ఎలాంటి శత్రువు నైనా సంహరించగలది. దాని శిఖరాలు పర్వతశిఖరాల్లా వున్నాయి. దాని పదును పొగలు కక్కుతోంది. అది అతి భయంకరం. యముడు కూడా దాన్ని సహించలేడు. దాన్ని చూస్తేనే యెలాంటివాళ్ళకీ భయంపట్టుకుంటుంది. అది చీల్చేస్తుంది. బద్దలు కొట్టేస్తుంది. రావణుడు, ఆశూలం, మధ్యపట్టుకుని కళ్ళనిప్పులు కక్కుతూ భీకరంగా అరిచాడు. దాంతో భూనభోంతరాలు బొబ్బరించాయి. సమస్త భూతాలూ వొణికిపోయాయి. సముద్రం కలిగిపోయింది. చూసి చూసి వాడు "రామా! ఇదిగో, వజ్రసారమైన యీశూలం నిన్నూ నీతమ్ముణ్ణీ చంపేస్తుంది. ఇప్పుడు నిన్ను చంపి యీయుద్ధంలో చనిపోయిన రాక్షసుల దగ్గరికి పంపేస్తాను, నిలు" అని అది విసిరేశాడు. ఎనిమిది గంటలతో మెరుపులాగ అది ఆకాశానికి వెళ్ళింది. అది చూసి రాముడు తీక్ష్ణబాణాలే ప్రయోగించాడు; కాని అవి ఆశూలాగ్నిలో కాలిపడిపోయాయి. అందుకు మిక్కిలీ కోపించి రాముడు మాతలి తీసుకువచ్చిన యింద్రశక్తి పుచ్చుకుని విసిరాడు. అది ఆకాశం యుగాంతోల్కలాగ వెలుగునింపేసి రావణుని శూలం మీద పడి దాన్ని పిండిపిండిచేసేసింది.

దీనికి సాయం రాముడు తీవ్రబాణాలతో రావణుని గుర్రాలను కొట్టాడు. మరికొన్ని బాణాలతో రావణుని గుండెలమీద కొట్టాడు. మూడుబాణాలతో నొసట కొట్టాడు. ఇలాగ శరీరం అంతా గాయాలు కాగా, రావణుడు విరగబూసిన అశోకవృక్షంలా అయిపోయాడు. అందుకు వాడు మొదట చాలా ఖిన్నుడై తరవాత మిక్కిలీ క్రుద్ధుడైనాడు.

## ౧౦౫

## సారథి రావణుని రథం అవతలికి తోలుకుపోవడం

రావణుడు, నిప్పులు కక్కుతూ చూస్తూ ధనుస్సందుకుని, జలధారలతో మేఘం తటాకం నింపేటట్టు బాణపరంపరతో రాముణ్ణి ముంచేశాడు; కాని ఆబాణా లన్నీ పర్వతంమీద పడ్డ వానచినుకల్లాగ అయిపోయాయి. దాంతో రావణునకు గొప్ప పరాభవం కలిగినట్టుతోచింది. వెంటనే వేలకొద్దీ బాణాలు వేసి రాముని గుండెలమీద కొట్టాడు. ఆ దెబ్బలతో రాముడు విరగబూసిన మోదుగుచెట్టు అయిపోయాడు. రాముడు కూడా మిక్కిలీ రోషించి ప్రళయాగ్నివంటి బాణాలుతో డీసి రావణుణ్ణి కొట్టాడు. ఇద్దరికీ కోపం పెరిగి వేగం రెట్టించింది. ఉభయుల బాణాలూ ఆకాశం కమ్మేయ్యగా చీకటి అవరిస్తున్నట్టయింది.

అప్పుడు రాముడు పళ్ళు పటపటలాడిస్తూ "రావణా! జనస్థానంలో నేను దగ్గిరలేనప్పుడు వంచించి తెలివితక్కువగా నా భార్య అయిన సీతను ఎత్తుకువచ్చి పిరికిపంద అనిపించుకున్నావు; కాని నువ్వు మహాశూరుడ వనుకుంటున్నావు. దిక్కులేని స్త్రీలయెడల నీచులు చేసే పని చేసి శూరు ణ్ణనుకుంటున్నావు. నీకు మర్యాద తెలియదు. సిగ్గులేదు. గర్వించి నీకు నువ్వే మృత్యువు తెచ్చిపెట్టుకున్నావు; కాని శూరుణ్ణను కుంటూ కులుకుతున్నావు. నువ్వు కుబేరుని తమ్ముడవు. తపోబలం చాలా సంపాదించినవాడవు. నువ్వు చేసినపని శ్లాఘనీయంగా వుంది.

దానివల్ల నీకు మిక్కిలీ గొప్ప యశస్సు కూడా సిద్ధించింది. కనక, గర్వాతిరేకంతో నువ్వుచేసిన పని కిప్పుడు తగిన ఫలం అనుభవిస్తావు. నేనున్నప్పుడు నువ్వు సీతజోలికిపోయివుంటే ఖరునిచాళ్లే నీకూ పట్టేవి. దైవానుగ్రహంవల్ల నువ్విప్పుడు నాకళ్ళబడ్డావు, మరి చూసుకో. నిన్ను యమునకు అతిథిగా పంపేస్తాను. కుండలాలతో మెరిసిపోతున్న నీశిరస్సిప్పుడే నా బాణాలతో **యీ దు**మ్ములోపడి నక్కలపాలూ కుక్కలపాలూ అయిపోతుంది. నువ్వు చచ్చిపడిపోగానే గద్దలూ కాకులూ నీ గుండెల మీద వాలి రక్తంపొడుచుకు తాగుతాయి. గరుత్మంతుడు పాములు కరుచుపోయేటట్టు చచ్చిపడివుండే నీ మీద వాలి పక్షులు నీ పేగులు తోడుకుపోతాయి" అంటూ నిందించి బాణాలతో ముంచేశాడు.

శత్రువుని సంహరించితీరా లన్న దీక్షపట్టాటప్పటికి రామునకు బల పరాక్రమాలు రెట్టింపయినాయి. ఉల్లాసం హెచ్చింది. అస్త్రబల మున్నూ ఎక్కువయింది. అతనిచేతుల్లోనుంచి, అప్రయత్నంగా, రకరకాల అస్త్రాలు వెలువడ్డాయి. ఈశుభచిహ్నం గుర్తించి మహోల్లాసంతో రాముడు రావణుణ్ణి మరీమరీ కొట్టాడు. ఇటు వానరుల శిలావర్షం — అటు రాముని శరవర్షం — దీంతో రావణుడు ధైర్యంచెడి విషణ్ణుడయిపోయాడు. అస్త్రం ప్రయోగించలేకపోయాడు. బాణం తొడగలేకపోయాడు. ధనుష్టంకారమున్నూ చెయ్యలేకపోయాడు. తెల్లపోయాడు. అది చూసి వివేకశాలి అయిన సూతుడు రథం అవతలికి తీసుకుపోయాడు.

## ౧౦౬

## **రావణుడు** మళ్ళీ రథం తోలించుకుని **యుద్ధానికి** వెళ్ళడం

చిత్తవిభ్రాంతివల్ల క్రుద్ధుడై రావణుడు సూతుణ్ణి తీక్ష్ణంగా చూస్తూ "దుర్బుద్ధీ! నన్ను హీనవీర్యుణ్ణి చూసినట్టూ, అశక్తుణ్ణి చూసినట్టూ, పౌరుషహీనుణ్ణి చూసినట్టూ, పిరికిపందని చూసి

నట్టూ, సత్తా లేనివాణ్ణి చూసినట్టూ, తేజోహీనుణ్ణి చూసినట్టూ, మాయ తెరగనివాణ్ణి చూసినట్టూ, అస్త్రబలం తొలగిపోయిన వాణ్ణి చూసినట్టూ చూస్తూ నువ్వు నీయిష్టంవచ్చినట్టూ ఆడుతున్నావు. నాఆజ్ఞ పొందకుండా స్వతంత్రించి శత్రువు యెదణ్ణుంచి నన్నెందుకివతలికి తీసుకువచ్చావూ? నువ్విప్పుడు చిరకాలంగా ఆర్జించుకుంటూవచ్చిన నాయశస్సంతా నాశనం చేశావు. నాబలవీర్యపరాక్రమాలకు మచ్చ తెచ్చావు. లోకానికి నామీద వున్న నమ్మకంపోగొట్టావు. నాశత్రువు రాముడు మంచి పరాక్రమవంతుడు. నాబలపరాక్రమాలు చూపించ తగ్గవాడు. అతను చూస్తూండగా పిరికిపందని చేసి నువ్వు నన్ను కించ పరిచేశావు. సంగతి సందర్భాలన్నీ చూడగా నువ్విది స్వబుద్ధితో చేసినపని కాదు. నాశత్రువుదగ్గిర లంచంమేసి నువ్విలాచేశావని నాకు తోస్తోంది. హితైషులైన మిత్రులుచేసేపని కాదిది. ఇది శత్రువులు చెయ్యవలసిన పని. నువ్విలా చెయ్యడం చాలాతప్పు. నువ్వు నాదగ్గిర చాలాకాలంగా వుంటున్న సంగతీ, నేను నీకు చేసిన మహోపకారాలూ జ్ఞాపకం వుంటే శత్రువు వెతుక్కుంటూ యిక్కడికి రాకముందే రథం యుద్ధరంగంలోకి తీసుకుపద ” అంటూ గద్దించాడు.

దానిమీద సారథి “ ప్రభూ! నేను భయపడలేదు. నాకేమీ మౌఢ్యం లేదు. శత్రువు మాటవిని నేను గడ్డితినలేదు. నేను ఏమరివుండ లేదు. నీమీద నాకు స్నేహం లేకపోలేదు. నువ్వు నాకు చేసిన సత్కారాలున్నూ నేను మరిచిపోలేదు. నేను మనస్ఫూర్తిగా నీహితమే కోరి, నీయశస్సే రక్షించదలిచి, స్నిగ్ధమనస్సుతో ఇది నీకు ప్రియం అనుకుని చేశాను; కాని నాదురదృష్టంవల్ల అప్రియం అయిపోయింది. ఈవిష యమై నువ్వు నన్ను హీనుణ్ణి చూసినట్టు చూడవద్దు. నేనిక రథం యెందుకు మళ్ళించుకువచ్చానో చెబుతా విను. నువ్వు యుద్ధంచేసిచేసి అలసిపోయినట్టు నాకు తోచింది. యుద్ధంమీద నీకు శ్రద్ధవున్నట్టు

నాకు కనపడలేదు. నీకు ఉత్సాహం ఉన్నట్టయినా నాకు తోచలేదు. ఇందుకు సాయం గుర్రాలు అలిసిపోయి రథం లాగలేకుండా వున్నాయి. వానలో తడిసిన వృషభాల్లాగ చెమటతో తడిసిముద్ద అయి యిన్నీ వున్నాయి. మనసేనలో పొడచూపిన దుర్నిమిత్తాలు కూడా నేను గుర్తించాను. సారథి అయినవాడు దేశకాలాలు గమనించాలి. లక్షణాలు గుర్తించాలి. ఇంగితం తెలుసుకోవాలి. రథికుని దైన్యమూ ఖేదమూ, ఉల్లాసమూ, బలమూ ఏర్పరించుకోవాలి. భూమి మిట్టపల్లాలూ, సమ విషమాలూ, సమయాసమయాలూ, శత్రువుల లోటుపాట్లూ తెలుసుకోవాలి. శత్రువునకు సూటిగా రథం తోలాలో, పక్కకి తోలాలో, ఒకచోట నిలిపివుంచాలో, శత్రువునకు అభిముఖంగానే వుండి వెనక్కి తగ్గాలో—ఇవన్నీ బాగా తెలిసినవాడై వుండాలి. ఇవన్నీ ఆలోచించీ, నీకు శ్రమ తగ్గాలనీ, గుర్రాలలసట తీర్చుకోవాలనీ, నీ కషాయం రాకుండా వుండాలనీ నేనీ పని చేశాను. నేను స్వతంత్రించి గుడ్డిగా చెయ్యలేదు. నీమీది భయభక్తులవల్లనే చేశాను. అయితే, జరిగిందేదో జరిగి పోయింది. నేనిప్పుడు చెయ్యవలసిందేమిటో ఆజ్ఞాపించు. నీసెలవు చొప్పున ప్రవర్తించి నేను నీరుణం తీర్చుకుంటాను'' అని బదులుచెప్పాడు.

దీనికి రావణుడు తృప్తిపడ్డాడు. అనేకవిధాల మెచ్చుకున్నాడు. చివరికి "వెంటనే రథం తోలుకువెళ్ళి నన్ను రాముని యెదట నిలుపు. శత్రువులను సంహరించకుండా రావణుడు వెనక్కి మళ్ళడు" అని చెప్పి సారథికి మురుగులజోడా బహుమతీచేశాడు. రావణుని మాటమీద సారథి క్షణంలో రథం రాముని యెదటికి తీసుకువెళ్ళాడు.

## ౧౦౭

## అగస్త్యుడు వచ్చి రామునకు ఆదిత్యహృదయం ఉపదేశించడం

యుద్ధం చూద్దామని దేవతలతో కలిసివచ్చివుండిన అగస్త్యమహర్షి రాముడు అలసిపోయి చింతామగ్నుడై వుండడమూ, మళ్లీ యుద్ధంచె

య్యడానికి రావణుడు వచ్చి యెదట వుండడమూ చూసి, మెల్లిగా రాముని దగ్గిరకి వచ్చి "రామా! మహాబహూ! సనాతనమూ పరమ రహస్యమూ అయిన దొకటి చెబుతా విను. దానివల్ల నువ్వు ఎలాంటి శత్రువుతో యుద్ధం చెయ్యవలసివచ్చినా అనాయాసంగా గెలుస్తావు. అది ఆదిత్యహృదయం అనే మంత్రం. అది జయావహం. అక్షయ్యం. పరమమంగళకరం. సమస్తపాపప్రణాశనం. చింతాశోకనాశకం. ఆయు ర్వర్ధనం. దేవాసురులు పూజించి మొక్కుకునే సూర్యుణ్ణి నువ్వూ కూడా ఆరాధనచెయ్యి. "ఇతను సర్వదేవాత్మకుడు. పరాభవనసామర్థ్య వంతుడు. రశ్మిభావనుడు. తన కిరణాలతో యితను దేవాసురులనూ, సమస్త లోకాలూ పాలిస్తున్నాడు. ఇతనే బ్రహ్మ. విష్ణువు. శివుడు. స్కందుడు. ప్రజాపతి. మహేంద్రుడు. ధనదుడు. మృత్యువు. యముడు. సోముడు. అపాంపతి. అగ్నిష్వాత్తాదులైన పితృస్వరూపుడు. అష్టవసు వులూ యితనే. సాధ్యులూ, అశ్వినీదేవతలూ, ఆవహాదివాయువులూ, మనువూ, వాయువూ, వహ్ని, ప్రజా, ప్రాణుడూ, ఋతుకర్తా, ప్రభా కరుడూ ఇతనే. ఆదిత్యుడు. సవిత. సూర్యుడు. ఖగుడు. పూష. గభస్తి మంతుడు. సువర్ణసదృశుడు. భానుడు. హిరణ్యరేతుడు. దివాకరుడు. హరిదశ్వుడు. సహస్రార్చి. సప్తసప్తి. మరీచిమంతుడు. తిమిరోన్మ థనుడు. శంభువు. త్వష్ట. మార్తాండుడు. అంశుమంతుడు. హిరణ్యగ ర్భుడు. శిశిరుడు. తపనుడు. భాస్కరుడు. రవి. అగ్నిగర్భుడు ఆదిత్యుడు. శంఖుడు. శిశిరనాశకుడు. వ్యోమనాథుడు. తమోభేది. ఋగ్యజుస్సా మపారగుడు. ఘనవృష్టి. అపాంమిత్రుడు. వింధ్యవీధి. ప్లవంగముడు. ఆతపి. మండలి. మృత్యువు. పింగళుడు. సర్వతాపనుడు. కవి. విశ్వుడు. మహాతేజుడు. రక్తుడు. సర్వభవోద్భవుడు. నక్షత్రగ్రహతారాధిపతి. విశ్వభావనుడు. తేజస్సులులకుకూడా తేజస్వి. ఇలాంటి విశేష ణాలతో వొప్పుతున్న ఓ ద్వాదశాత్మా! నీకు నమస్కారం.

పూర్వగిరికీ పశ్చిమగిరికీ నమస్కారం. జ్యోతిర్గణపతీ! దినాధిపతీ! జయా! జయ భద్రా! హర్యశ్వా! నీకు నమస్కారం. సహస్రాంశూ! ఆదిత్యా! నమస్కారం. ఉగ్రా! వీరా! సారంగా! నీకు నమస్కారం. పద్మప్రబోధా! మార్తాండా! నీకు నమస్కారం. సృష్టిసంహారస్థితికర్తలైన బ్రహ్మేశానాచ్యుతులకు ఈశ్వరుడా! సూర్యా! ఆదిత్యవర్చశ్శాలీ! భాస్వంతుడా! సర్వభక్షా! రౌద్రవపూ! తమోఘ్నా! హిమఘ్నా! శత్రుఘ్నా! అమితాత్మా! కృతఘ్నఘ్నా! దేవా! జ్యోతిషాంపతీ! నమస్కారం. తప్తచామీకరాభా! వహ్నీ! విశ్వకర్మా! తమోభినిఘ్నా! రుచీ! లోకసాక్షీ! నీకు నమస్కారం" ఇలాగ ఆదిత్యహృదయం ఉపదేశించి అగస్త్యుడు "రామా! ఇతనే జగత్తు నాశనంచేస్తాడు. సృష్టిస్తాడు. పాలిస్తాడు. శోషిల్లచేస్తాడు. తపింపచేస్తాడు వర్షిస్తాడు. సకలప్రాణుల్లోనూ అంతర్యామిఅయివుండి జాగృతి కలిగిస్తాడు. ఇతనే అగ్నిహోత్రం. ఆహితాగ్నులకితనే ఫలం. వేదాలూ క్రతువులూ ఇతనే. తత్ఫలమూ యితనే. లోకంలో జరిగేసమస్త కృత్యాలకూ ఇతనే ప్రభువు. ఈఆదిత్యుణ్ణి కీర్తిస్తే ఎలాంటివాడూ కూడా ఆపత్తులలోనూ, అడవుల్లోనూ, భయాల్లోనూ బాధపడడు. కనక, నువ్వు ఏకాగ్రచిత్తంతో యితణ్ణి పూజించు. ఈమంత్రంమూడు మాట్లు జపిస్తివా సమస్త యుద్ధాలలోనూ నువ్వే జయిస్తావు. రావణుణ్ణి నువ్వు ఈక్షణంలోనే సంహరించివేస్తావు" అని చెప్పి వెళ్లిపోయాడు.

ఇది విని రాముడు చింతవిడిచి స్వస్థచిత్తుడైనాడు. సుప్రీతుడై మూడుమాట్లు ఆచమించి యీ ఆదిత్యహృదయం జపించాడు. తరవాత ధనస్సు పుచ్చుకుని రావణుణ్ణి చూస్తూ యుద్ధానికి సిద్ధపడ్డాడు. "రావణుణ్ణి సంహరించితీరాలి" అని దీక్షపట్టాడు. ఇందు కానందించి ఆదిత్యుడు రాముణ్ణి పిలిచి "రావణుడు నశిస్తాడు, తప్పదు. త్వరపడు" అని ప్రోత్సహించాడు.

## ౧౦౨

## రాముడూ రావణుడూ మళ్ళీ తలపడడం

అప్పుడు సారథి చాలా సంతోషించి రావణుని రథం తోలుకువచ్చాడు. అది శత్రుసైన్యాలకు భయం కలిగిస్తోంది. బంగారు భూషణాలతో అలంకరించిన గుర్రాలు దానికి పూన్చారు. అది ఒక గంధర్వ నగరం లావుంది. దానిమీద ఎత్తుగా జెండావుంది. దానిమీద సకలాయుధాలూ అమర్చారు. అది ఆకాశం వొరుసుకుంటోంది. భూమిని ధ్వనింపచేస్తోంది. శత్రుసైన్యాలకు దైన్యమూ స్వసైన్యాలకు ఉల్లాసమూ కలిగిస్తోంది. రాము డది చూశాడు. వెంటనే నెలవంకలాగ అయ్యేటట్టు ధనస్సు ఎక్కుపెట్టి "మాతలీ! అదే శత్రువు రథం వస్తోంది. రావణు డిప్పుడు అప్రదక్షిణంగా వస్తున్నాడు. కనక, వీ డిప్పుడు తప్పకుండా మృతు డయిపోతాడు. వీణ్ణిప్పుడే నేను నాశనం చేసేస్తాను. కనక మనరథం దాని కెదురుగా నడిపించు. ధైర్యంగా వుండు. భ్రాంతి పడకు. తొందరపడకు. చూపులు చెదిరిపోనివ్వకు. పగ్గాలు సరిగా పట్టుకో. నువ్వు మహేంద్రుని సారథివి. నేనిప్పు డేకాగ్రంగా యుద్ధం చెయ్యవలసివుంది. సర్వమూ నీకే తెలుసు. నేను నీకు జ్ఞాపకం చేస్తున్నానే గాని నేర్పడంలేదు" అని చెప్పాడు. అందుకు సంతోషించి మాతలి రావణుని రథానికి ప్రదక్షిణంగా రథం నడిపించాడు.

అందుకు మిక్కిలీ కోపించి రావణుడు బాణాలువేసి రాముణ్ణి కొట్టాడు. మహాపరాక్రమశాలి అయిన రాముడు దాంతో మండిపడి మాతలి తెచ్చియిచ్చిన ఇంద్రధనుస్సందుకుని సూర్యకిరణాలవంటి తీక్ష్ణ బాణాలు తొడిగాడు. వెంటనే పోతరించిన సింహాల్లాగ పరస్పరజయ కాంక్షతో యిద్దరూ యుద్ధం ప్రారంభించారు. దేవతలూ, గంధర్వులూ, సిద్ధులూ, పరమర్షులూ మొదలైనవారు రావణ వినాశంకోరుతూ

యుద్ధం చూడడానికి వచ్చారు. అప్పుడు రావణుని వినాశమూ రాముని జయమూ స్ఫురింపచేస్తూ ఉత్పాతాలు రేగాయి.

రావణుని రథంమీద రక్తవర్షం కురిసింది. సుడిగాలి అపసవ్యంగా తిరిగింది. రావణుని రథం ఎటుబోతే అటు ఆకాశాన గద్దలగుంపు వెంబడించింది. లంక అంతా ఎర్రని కాంతితో నిండిపోయింది. దాంతో అక్కడి భూమి అంతా మండిపోతున్నట్టుంది. ఉల్కలురాలాయి. రావణు డెక్కడ వుంటే అక్కడ భూమి వొణకసాగింది. యుద్ధం చేస్తున్న రాక్షసయోధులకు, చేతులు పట్టుకుని ఎవరో వెనక్కి లాగేస్తున్నట్టు కాసాగింది. రావణుని శరీరంమీద సూర్యకిరణాలు ఎర్రగానూ, పచ్చగానూ, తెల్లగానూ, నల్లగానూ పడ్డాయి. దాంతో వాడు ధాతుమండితమైన పర్వతంలా వున్నాడు. ఆకాశాన గద్దలతో పాటు కింద నక్కలు రథంవెంట వస్తూ నోటనిప్పులు కక్కుతూ అమంగళకరంగా అరవసాగాయి. ఎదురుగాలి వీచింది. దుమ్ము రేగింది. రాక్షససైన్యంలో పిడుగులుపడ్డాయి. దిక్కులూ విదిక్కులూ చీకట్లు కమ్మాయి. ఆకాశం అంతా ధూళితో నిండిపోయింది. గోరువంకలు దెబ్బలాడుతూ గుంపుగా వచ్చి రావణుని రథంమీద వాలాయి. రావణుని గుర్రాలు జఘనస్థలాలనుంచి అగ్ని కణాలూ కళ్ళనుంచి జలకణాలూ విడిచాయి. ఇంకా యిలాంటి దుర్నిమిత్తాలెన్నో తోచాయి.

ఇందుకు ప్రతిగా రామునకు జయసూచకాలైన సుశకునాలు తోచాయి. అవి చూసి "రావణుడు చచ్చాడన్నమాటే" అనుకున్నాడు. దాంతో మిక్కిలీ ఉల్లాసంతో విజృంభించాడు.

## ౧౦౬

తరవాత రామరావణులకు సర్వలోకభయంకరమైన రథయుద్ధం ప్రారంభమయింది. అప్పుడు ఆయుధాలు ధరించి నరుకోడానికి సిద్ధంగా

వుండిన రాక్షససైన్యమూ, వానరసైన్యమూ కూడా అది చూసి నిశ్చేష్టం అయిపోయాయి. ఆసైనికులు ఎత్తిన ఆయుధాలు ఎత్తినట్టే వుండగా ఆశ్చర్యచకితులై ఉండినవారుండినట్టు నిలిచిపోయారు. రావణుణ్ణి చూస్తున్న రాక్షసులకూ, రాముణ్ణి చూస్తున్న వానరులకూ కూడా విస్మితనేత్రులు కావడంవల్ల యెదిరిసైన్యం బొమ్మలాగ కనపడసాగింది. రామరావణులు ఆ నిమిత్తాలన్నీ చూసి నిర్భీకచిత్తులై కృతనిశ్చయంతో యుద్ధం చెయ్యసాగారు. "జయించితీరాలి" అని రాముడూ "మరణం వచ్చినా సరే" అని రావణుడూ తమసర్వస్వమూ వొడ్డి యుద్ధంచెయ్యసాగారు.

అప్పుడు రాముని జెండా పడగొట్టాలని రావణుడు బాణాలు వేశాడు; కాని అవి కిందపడిపోయాయి. జెండాదాకా వెళ్ళలేకే పోయాయి. దానిమీద రాముడు కూడా బదులుతీర్చదలిచి రావణుని జెండామీద మహాసర్పంవంటి బాణం విడిచాడు. అది రావణుని జెండా పడగొట్టి మరీ కిందపడిపోయింది. అది చూసి రావణుడు మండిపడి తీవ్రబాణాలు కురిసి రాముని రథాశ్వాలను పడగొట్టాలని ప్రయత్నించాడు; కాని ఆ బాణాలు తగిలినా ఆ గుర్రాలు తామరతూళ్ళు తగినట్టు నిశ్చలంగా వుండిపోయాయి. అవి కలగాకుపడకపోవడం రావణునకు రోషం మరింత కెళ్ళించింది. దాంతో వాడు గదలూ, పరిఘలూ, చక్రాలూ, ముసలాలూ, పర్వతశిఖరాలూ, వృక్షాలూ, శూలాలూ, గండ్రగొడ్డళ్ళూ, విసిరాడు. ఈ శస్త్రవర్షం మహాభయంకరంగా వుండింది; కాని అది రథాశ్వాల నేమీ చెయ్యలేక వానరుల మీదికి మళ్ళింది. రావణుడు అపారమైన ఉత్సాహంతో ఆకాశం అంతా బాణాలతో నింపేశాడు. అది చూసి నవ్వుతూ రాముడు తీక్ష్ణ బాణాలు తొడిగాడు. వందలూ వేలూ విడిచాడు. అందుకు రావణుడు కూడా అలాగే లెక్కలేని బాణాలు విసిరాడు. ఉభయుల

బాణాలతోనూ నిండిపోయి ఆకాశం పంజరంలాగ కనపడింది. అయితే, వాటిలో వొక్క-బాణమూ గురితప్పలేదు. ఒకటీ ఎదిరిబాణం కొట్ట కుండా విడిచిపెట్టలేదు. ఒకదాన్నొకటి కొట్టుకుని చివరి కన్నీ నేల మీాద పడిపోయాయి.

మళ్లీ వారు సవ్యాపసవ్యాలుగా బాణాలు విడిచి ఊపిరితీసుకోడాని కయినా వీలులేకుండా ఆకాశం కప్పేశారు. ఒకళ్ల కొకళ్లు బదులు తీర్చుకోడానికి రావణుని గుఱ్ఱాలు రాముడూ, రాముని గుఱ్ఱాలు రావణుడూ కొట్టుకున్నారు. ఇలాగ వొక్క- క్షణకాలం వారు తుముల యుద్ధంచేశారు. అది చూసేవారికి శరీరాలు గరిపొడిచాయి. తనజెండా విరిగిపోయిన కసితో రావణుడు రామునిమీాద చాలా పగబట్టాడు.

## ౧౧౦

## రాముడు నరికినకొద్దీ రావణుని తలలు మళ్లీ మొలవడం

రాముడూ రావణుడూ ఇలాగ ఘోరయుద్ధం చేస్తూ వుంటే సమస్త భూతాలూ వెరగుపడిచూశాయి. రామునకూ రావణునకూ ఇలాగ కసిపెరిగిపోడంవల్ల సారథుల చాతుర్యంతో ఉభయుల రథాలూ మండల భ్రమణంచేశాయి. అటువెళ్లి యిటువచ్చాయి. ఇంకా అనేకవిధాల తిరిగాయి. రాముడు రావణుణ్ణి నొప్పిస్తూనూ, రావణుడు రాముణ్ణి నొప్పిస్తూనూ దూకడంలోనూ, మళ్లడంలోనూ మహావేగం కనపరి చారు. వారిద్దరూ అలాగ ఎడతెగకుండా బాణాలు విడుస్తూవుంటే ఆరథాలు రెండూ జలధారలు విడుస్తున్న మేఘాలలాగ యుద్ధరంగం అంతా తిరిగాయి.

ఇలాగ అవి చాలాసేపు తిరిగితిరిగి చివరికి నొగ నొగతోనూ గుఱ్ఱాలు గుఱ్ఱాలతోనూ తగిలేటట్టు ఒకదానిమీాది కొకటి దూసుకువచ్చాయి. వెంటనే రాముడు నాలుగు తీక్ష్ణబాణాలు వేసి రావణుని గుఱ్ఱాలను

మళ్ళించేశాడు. తన గుర్రాలిలాగ తొలగిపోయినందుకు మిక్కిలీ క్రుద్ధుడై రావణుడు రామునిమీద భయంకరాలైన బాణాలు విడిచాడు. ఆబాణాలు గట్టిగానే తాకాయి; గాని అందుకు రాముడు బాధపడలేదు. చలించనైనా చలించలేదు. దానిమీద మరింత రోషం తెచ్చుకుని రావణుడు మాతలి నయినా చంపుదామని మళ్ళీ బాణవర్షం కురిశాడు; కాని మాతలి కూడా వాటివల్ల లేశమూ చలించలేదు. ఈసందుబాట్లో రాముడు బాణపరంపరతో రావణుడు అవతలికి తొలగిపోయేటట్టు కొట్టాడు. ఒక్కొక్కటి కాదు, రాముడు రావణుని రథంమీద ఇరవయ్యేసీ, ముప్ఫయేసీ, అరవయ్యేసీ, నూరేసీ, వెయ్యేసీ కూడా ఒకొక్కపట్టుకి తీక్ష్ణబాణాలు విడిచాడు. అందుకు అభిమానపడి రావణుడు రథంమీదే రాముణ్ణి గదలతోనూ, ముసలాలతోనూ కొట్టాడు. అది చూసేవారికి శరీరాలు గరిపొడిచాయి. గదల ధ్వనితోనూ, ముసలాల చప్పుడుతోనూ, పరిఘల నిస్వనంతోనూ, శరపుంఖాల విసురులతోనూ సప్తసాగరాలూ ఘూర్ణిల్లిపోయాయి. ఆసముద్రాలలో అడుగున వున్న సర్పాలూ దానవులూ కంగారుపడిపోయారు. అడవులతోనూ, పర్వతాలతోనూ భూమి గడగడలాడిపోయింది. సూర్యుడు నిస్తేజుడయిపోయాడు. గాలి స్తంభించిపోయింది. దేవతలూ గంధర్వులూ, సిద్ధులూ, పరమర్షులూ, కిన్నరులూ, నాగులూ చింతాక్రాంతు లయినారు. వారందరూ "గోబ్రాహ్మణులకు శుభం కలగాలి. లోకాలన్నీ సుఖంగా వుండాలి" అనుకుంటూ రామరావణయుద్ధం చూడసాగారు. అదిచూసిన దేవతలూ, ఋషులూ, గంధర్వులూ "ఆకాశాని కాకాశమే సాటి. సముద్రానికి సముద్రమే సాటి. అలాగే రామరావణయుద్ధానికి రామరావణయుద్ధమే సాటి" అనుకోసాగారు.

అంతట రఘుకులనందను డైన రాముడు మిక్కిలీ క్రుద్ధుడై మహాసర్పంవంటి భయంకరమైన కత్తివాడిబాణం తొడిగి లాగి విడిచి కుండ

లాలతో మెరిసిపోతున్న రావణుని శిరస్సు ఎగరగొట్టాడు. అది నేల మీద పడి దొర్లడం మూడులోకాలూ స్పష్టంగా చూశాయి; గాని, యిటు చూశాటప్పటికి రావణుని మెడమీద అలాంటిదే మరోతల మొలిచివుంది. క్షిప్రకారి అయిన రాముడు క్షిప్రహస్తుడై మరో బాణం తొడిగి అతివేగంగా ఆశిరస్సు మళ్ళీ పడగొట్టాడు; కాని తెగి తెగడంతోటే అది మళ్ళీ మొలిచివూరుకుంది. పిడుగువంటి బాణంతో రాముడు మళ్ళీ నరికాడు. రావణుని తల మళ్ళీ మొలిచింది. ఇలాగ రాముడు నూరుమార్లు నరికాడు; కాని రావణుని తల నూరుమార్లూ మొలిచింది. రావణునకు చావు సంభవించలేదు.

రకరకాల అస్త్రశస్త్రాలు గల రాము డప్పుడు "ఈబాణాలతోనే మారీచుడు చచ్చిపోయాడు. ఖరుడూ దూషణుడూ కూడా యీబాణాలతోనే కూలిపోయారు. క్రౌంచారణ్యంలో విరాధుడూ దండకారణ్యంలో కబంధుడూ యీబాణాలతోనే నాశనం అయిపోయారు; కాని, అవే యిప్పుడు మందతేజస్కాలై రావణుణ్ణి ఏమీ చెయ్యలేక పోయాయి. ఇది యెందుచేత వచ్చిందీ?" అని ఆలోచించి మళ్ళీ నిశిత శరాలు వేసి రావణుని గుండెలమీద కొట్టాడు. రావణుడు కూడా క్రుద్ధుడై గదలతోనూ ముసలాలతోనూ రాముణ్ణి కొట్టాడు.

దేవతలూ, దానవులూ యక్షులూ నాగులూ మొదలైన వారు చూస్తూవుండగా ఆయుద్ధం యిలాగ రాత్రి అంతా జరిగింది. అయితే, రాత్రీ పగలూ కూడా ఆయుద్ధం ముహూర్తకాలం కాదు, క్షణకాలంది అయినా ఆగకుండా జరిగింది.

## ౧౧౧

## బ్రహ్మాస్త్రంతో రాముడు రావణుణ్ణి సంహరించడం

ఇదంతా చూస్తున్న మాతలి "రఘువీరా! ఎరగనివాని లాగ నువ్వు వాణ్ణెందు కుపేక్షిస్తావూ? దేవతలు నిర్దేశించిన రావణుని వినాశకాలం

యుద్దే వచ్చివుంది, బ్రహ్మాస్త్రం ప్రయోగించి వీణ్ణి సంహరించు " అని చెప్పాడు. ఆమాటతో రామునకు జ్ఞాపకంవచ్చింది. వెంటనే అతను మహాసర్పంలాగ బుస్సలుకొడుతున్న ఆశరం సంధించాడు. అది రామున కగ స్త్యమహర్షి అనుగ్రహించింది. ఇంద్రుని కోసం బ్రహ్మ నిర్మించిన అస్త్రం అది. త్రిలోకాలూ జయించకోరినప్పుడు బ్రహ్మ అది ఇంద్రున కిచ్చాడు. అది వాయువేగం గలది. అగ్నిసూర్యులతో సమాన మైన వేడిమి గలది. దాని శరీరం ఆకాశమయం. అది మేరు మందరపర్వతాల లాగ గురుగుణవిశిష్టం. సూర్యుని కాంతి గలది. పొగతో కూడిన ప్రళయాగ్నివంటిది. శత్రువుల ఏనుగులనూ గుర్రాలనూ అది చీల్చేస్తుంది. శత్రుపురగోపురాలూ, పరిఘలూ, పర్వతాలూ కూడా భేదించేస్తుంది. రకరకాల రక్తాలు రుచిచూసింది. దానినిండా కొవ్వు పేరుకునివుంది. వజ్రంకంటే అది దృఢమైనది. అది వెడుతూవుంటే గొప్ప ధ్వని పుడుతుంది. ఎలాంటి యుద్ధాలలోనూ కూడా శత్రువులరు నాశనం చేసేస్తుంది. కంకపక్షులకూ, గద్దలకూ, నక్కలకూ నిత్యమూ ఆహారం సిద్ధంచేస్తూ వుంటుంది. యమునికంటే కూడా అది భయంకరంగా వుంటుంది. అది వానరులకు ఆనందమూ, రాక్షసులకు మరణమూ కలిగిస్తుంది.

ఆ బ్రహ్మాస్త్రం రాముడు వేదోక్తవిధిగా అభిమంత్రించి ధనుస్సులో తొడిగాడు. అప్పుడు సమస్తభూతాలూ వణికిపోయాయి. భూమి అదిరింది. చూసిచూసి రాముడది రావణుని మీద విడిచాడు. అసలే అది వజ్రంవంటిది. దానికిసాయం రాముని వజ్రహస్తంతో విడవబడింది. దాంతో అది అతివేగంగా వెళ్ళి, దురాత్ముడైన రావణుని గుండెలు పగలగొట్టి, రావణుని రక్తంలో తడిపి, రావణుని ప్రాణాలు తీసి, భూమిలో ప్రవేశించి, వెంటనే మళ్ళీ రాముని అమ్ములపొది చేరుకుంది.

ఆ దెబ్బతో మహాతేజశ్శాలి అయిన రావణుడు ప్రాణాలు విడిచి వజ్రాయుధం దెబ్బతిన్న వృత్రాసురుడులాగ రథంమీదనుంచి కిందపడి పోయాడు. రావణుడు పడిపోవడం చూసి హతశేషులైన రాక్షసులు దారీతెన్నూ తోచకుండా పారిపోయారు. రాక్షసుల రప్పలూ పుచ్చి కని సింహనాదాలు చేస్తూ వానరులు వాళ్ళని తరిమితరిమి కొట్టారు. ఇలాగ రాక్షసులు లంకలోకి పారిపోగా వానరులు రాముణ్ణి కీర్తిస్తూ సింహనాదాలు చేశారు. దేవతలు పూలవాన కురిశారు. దేవదుందుభులు మోగాయి. గాలి హాయిగా వీచింది. దేవతలూ గంధర్వులూ మొదలైనవారు ఆకాశాన భేషుభేషు అంటూ రాముణ్ణి వినుతించారు. ఇలాగ రావణుణ్ణి చంపి రాముడు సుగ్రీవుణ్ణీ, అంగదుణ్ణీ ఆనంద పెట్టాడు. దేవతలు మిక్కిలీ ఆనందించారు.

అప్పుడు దేవతలు మెల్లిగా వెళ్ళిపోయారు. దిక్కులు ప్రసన్నాలైనాయి. ఆకాశం నిర్మలం అయింది. భూకంపం ఆగిపోయింది. సూర్యుడు చక్కగా ప్రకాశించాడు. తరవాత సుగ్రీవుడూ విభీషణుడూ మొదలైన స్నేహితులు లక్ష్మణునితో కూడా రాముణ్ణి పూజించారు. స్వజనపరివృతుడై రాముడు దేవతలు చుట్టుకున్న మహేంద్రునిలాగ ప్రకాశించాడు.

## ౧౧౩

## రాముడు విభీషణుణ్ణి ఊరడించడం

రాముని దెబ్బకి పడిపోయి ప్రాణాలు విడిచిన రావణుణ్ణి చూసి విభీషణు డిలా విచారించసాగాడు.

"వీరాధివీరా! నయకోవిదా! విలువలేని శయ్యమీద శయనించి నువ్విప్పుడు ధూళిధూసరితమైన యుద్ధభూమిలో పడివున్నావా? అంగద భూషితాలైన నీ బాహువులు నేలమీద చాచుకునివున్నాయి.

సూర్యమండలంలాగ మెరిసిపోయే కిరీటంతో నీ తల వాలిపోయివుంది. నామాట విన్నావు కావు. అప్పుడు నేనేమి చెప్పానో అదే నీకిప్పుడు సంభవించింది. బలగర్వంతో ప్రహస్తుడూ, ఇంద్రజిత్తూ కుంభకర్ణుడూ, అతికాయుడూ, నరాంతకుడూ, నువ్వూ కూడా నామాట లక్ష్య పెట్టారు కాదు. దానికి ఫలం యిప్పుడు సంభవించింది. సమస్తనీతులూ తెలిసినవాడు గతించాడు. ధర్మం మూర్తీభవించినవాడు గతించాడు. సత్వంయొక్క సంక్షేపరూపం గతించింది. స్తుతిపాత్రుడు గతించాడు. సూర్యుడు భూమిమీద పడిపోయాడు. చంద్రుడు చీకట్లలో మునిగి పోయాడు. అగ్నిహోత్రుడు చల్లారిపోయాడు. ఉత్సాహశక్తి నశించి పోయింది. రాక్షసశార్దూలుడైన రావణుడు రణభూమిమీద దుమ్ములో పడిపోయినప్పుడిక నేమి మిగిలింది? ధైర్యమే చిగురు టాకులుగా — సహనమే పువ్వుగా — తపస్సే దార్ఢ్యంగా — శౌర్యమే కూకటివేరుగా పేరుపొందిన రావణవృక్షం రాము డనే పెనుగాలికి విరిగి పడిపోయింది. పరాక్రమమే కొమ్ములుగా — పితృపితామహ వర్గమే వీపుగా — కోపమే అపరగాత్రంగా — అనుగ్రహమే తొండంగా — వెలిసిన రావణమత్తేభం రాము డనే సింహంవాతబడిపోయింది. పరాక్రమోత్సాహాలే జ్వాలలుగా — నిట్టూర్పే పొగగా — బలమే వేడిమిగా — విజృంభించిన రావణు డనే దావాగ్ని రాము డనే మేఘం వల్ల చల్లారిపోయింది. రాక్షసులే తోకా మూపురమూ కొమ్ములుగా శత్రులను వధించే రావణు డనే వృషభరాజం రాము డనే పులివాత బడిపోయింది ”

ఇలా విచారించే విభీషణుణ్ణి చూసి రాముడు “విభీషణా! నీఅన్న పిరికిపంద అయి చచ్చిపోలేదు, ప్రచండపరాక్రమం చూపించి ఓహో అనిపించుకుని మరీ చచ్చిపోయాడు. క్షత్రియధర్మావలంబకులు యుద్ధంలో హతులయిన పరాక్రమశాలులను తలుచుకుని యిలా విచా

రించరు. దేవతలనూ, సమస్తదేవతలనూ గజగజలాడించిన ధీరుడు కాలధర్మం పొందినప్పుడు దుఃఖించడం మంచిదికాదు. యుద్ధంలో తప్పకుండా జయమే కలుగుతుందన్న నిశ్చయం యెప్పుడూ లేదు. వీరుడైనవాడు ఒకళ్లను చంపనైనా చంపుతాడు. తానయినా చచ్చిపోతాడు. ఇది క్షత్రియసమ్మతమైన మార్గం. యుద్ధంలో చనిపోయిన క్షత్రియుణ్ణిగురించి విచారించడం సుతరామూ ధర్మంకాదు. ఇది తెలుసుకో. మనస్సు నిబ్బరించుకో. ఇక చెయ్యవలసింది చెయ్యి" అని వోదార్చాడు.

దీనిమీద విభీషణుడు "వెనకటికి దేవత లందరినీ వెంటబెట్టుకుని దేవేంద్రుడు దండెత్తివచ్చినా అపజయం యెరగని రావణుడు చెలియకట్ట తాకి సముద్రం భంగపడేటట్టు నిన్నెదిరించి హతుడయినాడు. ఈరావణుడు గొప్పగొప్ప దానా లెన్నో చేశాడు. ఎవరూ యెరగని భోగాలన్నీ అనుభవించాడు. కోట్లకొద్దీ భృత్యులను పోషించాడు. మిత్రులకు అపారధనరాసు లిచ్చాడు. శత్రువులయెడల విరోధం సాధించాడు. ఇతను గొప్ప ఆహితాగ్ని. మహాతపశ్శాలి. వేదవేదాంగ వేత్త. కర్మిష్ఠి. కనక, నీదయవుంటే యితనికి నేను ఉత్తరకర్మ చేస్తాను" అన్నాడు. రాముడు అందుకు సంతోషించి సరే అన్నాడు. "చావుదాకానే విరోధం. మన పని నెరవేరింది. ఇతనికి కిక అగ్నిసంస్కారం జరిగించు. ఇప్పు డితను నీ కెలాంటివాడో నాకూ అలాంటివాడే" అని కూడా చెప్పాడు.

## ౧౧౩

## రావణుని భార్యలు యుద్ధభూమిలో రావణుణ్ణి చూసి దుఃఖించడం

రావణుడు చచ్చిపోయా డని వినగానే అతని భార్యలు గోలుగోలున ఏడుస్తూ అంతఃపురం విడిచి బయలుదేరారు. అనేకులు వారించినా

వారు ఆగలేదు. జుట్టు విరియబోసుకుని, నేలమీద పడి దొర్లిపోతూ లేగలు చచ్చిన ఆవుల్లాగ దుఃఖిస్తూ వారు ఉత్తరద్వారంలోనుంచి యుద్ధభూమిలో ప్రవేశించి "హా రాజేంద్రా!" అంటూనూ "నాథా" అంటూనూ తెగిపోయిన అడవితీగల్లాగ రావణుని కళేబరంమీద పడ్డారు. వారిలో వొకతె ప్రేమాతిశయంతో రావణుణ్ణి కౌగిలించుకుని యేడ్చింది. ఒకతె కాళ్ళు పట్టుకుని యేడ్చింది. ఒకతె మెడ కౌగిలించుకుని యేడ్చింది. ఒకతె చేతులు తనమీద వేసుకుని నేలమీద పడియేడ్చింది. ఒకతె అతని మొగంచూస్తూ యేడ్చింది. ఒకతె రావణుని శిరస్సు తన తొడమీద వుంచుకుని కన్నీటితో మొగం తడుపుతూ యేడ్చింది.

"ఇంద్రుణ్ణి వెరపించినవాడు— యముణ్ణి భయపెట్టినవాడు — కుబేరుణ్ణి జయించి అతని పుష్పకం పుచ్చుకున్నవాడు — గంధర్వులనూ, దేవతలనూ, ఋషులనూ భయకంపితులను చేసినవాడు— ఇప్పుడు ఇలా యుద్ధభూమిలో పడిపోయివున్నాడు. అసురులవల్లా, సురలవల్లా, నాగులవల్లా భయం యెరగనివాడు మానవులచేతిలో చచ్చిపోయాడు. దేవతలు చంపలేనివాణ్ణి— దానవులూ రాక్షసులూ కూడా చంపలేనివాణ్ణి కాల్బంటు అయిన మనుష్యునిచేతిలో చచ్చిపోయాడు" అని యిలాగ బహువిధాల చెప్పుకుంటూ వాళ్లు దుఃఖించారు.

మిత్రులెంత చెప్పినా వినక చావుకోసం సీతను తెచ్చావు. రాక్షసులందరూ నాశనం అయిపోయారు. వాళ్ళతో పాటు మేమూ నాశనం అయిపోయాం. నువ్వు సరేసరి. ఇష్టుడైన నీసోదరుడు కూడా ఎంత చెప్పినా వినకపోతివి. అతన్ని కఠినంగా కూడా నిందిస్తివి. నువ్వు సీతను రామున కిచ్చేసివుంటే మనకీ సర్వనాశనం తటస్థించి వుండకపోను. సీతమ్మొడు తనమాట విన్నందుకు ఆనందించివుండును. రాముడు మనకు స్నేహితుడై వుండును. మేము విధవలము అయిపోకుండా సకల

సుఖాలూ అనుభవిస్తూ వుందుము; కాని నువ్వు సీతను చెరపట్టడంవల్ల నువ్వూ, మేమూ, రాక్షసులూ కూడా బుగ్గిఅయిపోయాం. అయితే, నీస్వబుద్ధితో చేసినపని కాదిది. దైవం నీచేత యిలా చేయించాడు. వానరులకూ రాక్షసులకూ నీకూ యీవినాశం దైవయోగంవల్ల సంభవించింది. దైవాజ్ఞను అర్థబలంతోగాని, పరాక్రమంతోగాని, రాజాజ్ఞతోగాని, తిప్పడానికి వీలులేదు" అనుకుంటూ వాళ్లు దుఃఖార్తలై క్రౌంచపక్షుల్లాగ దీనంగా యేడ్చారు.

## ౧౧౪

## మండోదరి విలాపం

వారందరిలోనూ మండోదరి రావణుని పట్టమహిషి. రాముని చేతిలో చనిపోయిన తన పెనిమిటిని దీనంగా చూస్తూ ఆమె: "మహాభాగా! నీకు కోపంవచ్చిం దంటే ఇంద్రుడు కూడా నీయెదట నుంచోలేడు. నీకు భయపడి మహర్షులూ, బ్రాహ్మలూ, గంధర్వులూ దిగంతాలకు పారిపోయారు. అలాంటి నిన్ను ఒక మనుష్యమాత్రుడు జయించడమా? నీకు సిగ్గుకలగడంలేదూ? త్రిలోకాలూ ఆక్రమించి బలపరాక్రమాల చేతనూ, సౌభాగ్యసంపత్తిచేతనూ ప్రఖ్యాతిగన్న నిన్ను ఎలాంటి వాళ్ళకీ అవధ్యుణ్ణి అడవిమనిషి యెలా చంపగలిగాడో బోధపడకుండా వుంది. మనది మనుష్యుడు కాలుపెట్టలేని దేశం. పైగా నువ్వు కామరూపివి. యుద్ధంలో నిన్ను మనిషి చంపాడంటే నమ్మడానికి వీలులేకుండా వుంది. బలపరాక్రమాలే కాక అపారమైన భృత్యవర్గం కూడా వున్న నిన్ను చంపడం మనిషి అయిన రాముడు చేశాడని నాకు తోచడంలేదు. ఈరాముడే జనస్థానంలో అనేక రాక్షసయోధులతో పరివృతుడైన ఖరుణ్ణి కూడా చంపాడు. దీన్నిబట్టి చూసినా రాముడు మనిషి అని తోచడంలేదు. దేవతలు కూడా

అడుగుపెట్టలేని లంకలో తన పరాక్రమంవల్ల హనుమంతుడు ప్రవేశించి నప్పుడే మేము భయపడ్డాము. భయంకరులైన వానరులు మహాసముద్రంలో సేతువు కట్టినప్పుడే నేను రాముడు మనుష్యమాత్రుడు కాడనుకున్నాను. అలాకాకపోతే, మాయచేసి యముడే రాముని రూపంతో నిన్ను చంపడానికి వచ్చివుంటాడు. ఇంద్రునితో నీకు విరోధం వుంది. కాని నీయెదట నుంచోడానికి ఇంద్రునకు శక్తియేదీ ?

అంచేత, యీ రాముడు, మహాయోగి. మహాత్ముడు. సనాతనుడు. ఆది మధ్యాంతరహితుడు. మహత్తుకంటే గొప్పవాడు. ప్రకృతికి అతీతుడు. సృష్టికర్త. శాశ్వతుడు. అజయ్యుడు. శ్రీవత్సవక్షుడూ, నిత్యశ్రీకుడూ అయిన శంఖచక్రగదాధరుడు అని స్పష్టంకావడంలేదూ ? సత్యపరాక్రముడైన శ్రీ మహావిష్ణువు వానరులై పుట్టిన దేవతలతో కూడి లోకకల్యాణంకోసం సకలరాక్షసపరివృతుడ వైన నిన్ను సంహరించాడు. నువ్వు వెనకటికి ఇంద్రియములను జయించి తద్వారా త్రిలోకాలూ జయించావు; కాని యిప్పు డా యింద్రియాలే పూర్వవైరం తలుచుకుని నిన్ను సంహరించినట్టుంది. "రామునితో విరోధం తెచ్చుకోవద్దు" అని నేనెంత చెప్పినా నువ్వు వినకపోతివి. దాని ఫలం యిప్పు డనుభవానికి వచ్చింది. ఐశ్వర్యమూ, నీ స్వజనమూ, నువ్వూ నాశం కావడానికే అకస్మాత్తుగా నువ్వు సీతను కామించావు. అరుంధతి కంటేనూ, రోహిణి కంటేనూ ఉత్తమురాలైన సీతను చెరపట్టి నువ్వు నీకు తగనిపని చేశావు. సీత భూదేవిని మించిన భూదేవి. లక్ష్మిని మించిన లక్ష్మి. సర్వాంగసుందరి. భర్తృవత్సల. అరణ్యంలో ఏకాకి అయివుండినప్పుడు నువ్వామెను వంచించి తీసుకువచ్చావు; కాని ఆమెను పొందలేకపోయావు. ఆ మహాపతివ్రత తపస్సువల్ల బూడిద మాత్రం అయిపోయావు. ఆమెను ముట్టినప్పుడే నువ్వు దగ్ధం అయిపోయివుండవలసింది. అలా

కానందుకు నిన్ను చూసి దేవతలు భయపడ్డారు. పాపకార్యం చేసిన వాడు సమయం అయినప్పుడు అందుకు తగ్గఫలం తప్పకుండా అనుభవిస్తాడు. మంచిచేసినవాడు మంచే అనుభవిస్తాడు. చెడ్డచేసినవాడు చేడ్డే అనుభవిస్తాడు. విభీషణుడు సుఖంగా వున్నాడు. నువ్వు నాశనం అయిపోయావు. నీ ప్రియురాళ్ళలో సీతను మించిన అందకత్తె లున్నారు; కాని కామాంధకారంవల్లా, మౌఢ్యంవల్లా నువ్వది గుర్తించ లేకపోయావు. కులాన్ని బట్టి చూసినా, రూపాన్ని బట్టి చూసినా, చాతుర్యాన్ని బట్టిచూసినా సీత నాకంటే యెక్కువదికాదు. సమానంఅయినా కాదు; కాని మౌఢ్యంవల్ల నువ్వు తెలుసుకోలేకపోయావు. ప్రాణికోటి కంతకీ మృత్యువు ఏదో వొక నిమిత్తంవల్ల వస్తుంది. నీకు మృత్యువు రావడానికి నిమిత్తం సీత. దూరంగా వున్న మృత్యువును సీత రూపంగా నువ్వు దగ్గిరికి తెచ్చుకున్నావు. సీత రామునితో సుఖంగా విహరిస్తుంది. అల్పభాగ్యనైన నేను శోకసాగరంలో పడిపోయాను. విలువలేని వస్త్రాభరణాలు ధరించి విమానంమీద నీతో కైలాసంమీదా, మందరపర్వతంమీదా, మేరుపర్వతంమీదా, కుబేరుని చైత్రరథంలోనూ, మహేంద్రుని నందనవనంలోనూ, ఇంకా అనేక దేవోద్యానవనాలలోనూ దర్జాగా విహరించి సుఖపడ్డ నేను నీ చావువల్ల యిప్పుడు కామోపభోగాలకు దూరం అయిపోయాను. ఆనేనే యిప్పుడు మరొకతె నయిపోయాను. ధిక్! రాజుల సంపదలు చంచలాలు కదా? మహారాజా! నీ శిరస్సు మిక్కిలీ సుకుమారం, అతిసుందరం. ప్రసన్నతలో చంద్రునకూ, సౌందర్యంలో పద్మానికీ, తేజస్సులో సూర్యునకూ సాటి అయినది. ఎర్రని నీ మొగం కిరీటోజ్వలం. కుండలాలతో మెరిసిపోయేది. పానభూములలో మదలోలాక్షమూ, స్మితమనోహరమూ అయివుండే ఆ శిరస్సు యిప్పుడు రామబాణనిర్భిన్నం అయి, రక్తధారలతో తడిసి, మేదోమాంసాలతో నిండి రూక్షం అయి

దుమ్ములో పొర్లాడుతోంది. కట్టా! స్త్రీకి చిట్టచివరి దైన వైధవ్యదశ నాకిప్పుడు ప్రాప్తించింది. మూఢురాల నైన నాకు ఇలాంటివి తట స్థిస్తుం దని యెప్పుడూ తోచలేదు. నాతండ్రి దానవరాజు. నాభర్త రాక్షసచక్రవర్తి. నాకొడుకు ఇంద్రుణ్ణి జయించినవాడు. ఇలా అను కుంటూ నేనెంతో గర్వించాను. మత్తెక్కిన శత్రువులను జయించి బల పరాక్రమవంతు లని ప్రఖ్యాతి పొంది ఎవరివల్లా అపజయం యెరగని వారు నాకు పెట్టనికోటలై వున్నా రని గట్టిగా నమ్ముకున్నాను. నాథా! అలాంటి నీకు ఈమనిషివల్ల మరణం యెలా వచ్చిందీ?

నీశరీరం స్నిగ్ధేంద్రనీలమణిలా వుంది. నీమూర్తి పర్వతంలా వుంది. కేయూరాలూ, అంగదాలూ, ముత్యాలసరాలూ, పూలదండలూ రత్నాలకాంతులూ — వీటితో మహోజ్జ్వలంగా వుంది. మెరుపులతో మిలమిలలాడే నీలమేఘంలా కన్నులపండువుగా వుంది. అలాంటి నీదివ్య శరీరం యిప్పుడు నిశితబాణాలతో ఖండితం అయివుంది. అంగుళం అంగుళానికీ బాణాలు గుచ్చుకుని కౌగిలించుకోడానికి శక్యం కాకుండా వుంది. నీస్నాయువులు తెగిపోయాయి. నెత్తురుముద్ద అయిపోయింది. వజ్రాయుధం దెబ్బకి విశీర్ణం అయిపోయిన పర్వతంలా వుంది. ఇది స్వప్నం కాదు, సత్యమే; కాని నువ్వు రామునిచేతిలో ఎలా చచ్చిపోయావు? నువ్వు మృత్యువుకే మృత్యుస్వరూపుడవే, మృత్యువశం యెలా అయినావూ?

నువ్వు ముల్లోకాల సంపదా అనుభవించావు. త్రిలోకాలనూ భయ పెట్టగలిగినవాడవు. లోకపాలకులను జయించినవాడవు. కైలాసపర్వతం ఊపేసినవాడవు. బలగర్వితులను అణిచేశావు. మహాపరాక్రమవంతుడ వనిపించుకున్నావు. లోకాలన్నీ గజగజలాడించేశావు. నువ్వు సింహ నాదంచేస్తే భూతాలన్నీ వొణికిపోతాయి. శత్రువులయెదట కూడా దర్పంగా మాట్లాడగలవాడవు. గొప్పగొప్ప పనులు చెయ్యగల కోట్ల

భృత్యులను పోషిస్తున్నావు. లక్షలూ కోట్లూ యక్షులనూ దానవులనూ సంహారించినవాడవు. నివాతకవచులను కూడగట్టుకున్నావు. అనేకయజ్ఞాలు ధ్వంసంచేశావు. స్వజనుల నందర్నీ రక్షిస్తున్నావు. ధర్మవ్యవస్థ తారుమారుచేశావు. యుద్ధరంగంలో యెలాంటి మాయలయినా చెయ్యగలవాడవు. అక్కణ్ణుంచీ అక్కణ్ణుంచీ దేవకన్యలనూ, అసురకన్యలనూ, నరకన్యలనూ లెక్కలేకుండా తీసుకువచ్చినవాడవు. శత్రుస్త్రీల నేడ్పించగలవాడవు. లంకాద్వీపం ఏకచ్ఛత్రంగా ఏలుతున్నావు. ఎవరూ చెయ్యలేని గొప్పపనులు చెయ్యగలవాడవు. మాకందరికీ పుష్కలంగా కామోపభోగాలు సమకూర్చినవాడవు. రథికులలో ఉత్తమోత్తముడవు. ఇలాంటి మహానుడవు, నాపెనిమిటివి, నువ్వు రామునిచేతిలో పడిపోవడం చూసిన్నీ బతికివున్న నేను శిలావిగ్రహాన్ని కాని ప్రాణిని కాదు.

గొప్పగొప్ప రకరకాల శయ్యలమీద శయనించిన నువ్వు యిప్పుడు ఈమట్టిలో పడుకున్నావుగదా? లక్ష్మణుడు నాకొడుకు ఇంద్రజిత్తునెప్పుడు వధించాడో అప్పుడే నాకు దెబ్బ తగిలింది. నువ్వు మృతిపొందడంవల్ల నేనిప్పుడు కూలేపోయాను. నాకు బంధువుల లోటు లేదు. నువ్వే లోటు. దాంతో నా కామోపభోగాలు బుగ్గిఅయిపోయాయి. ఇక నేను బతికివున్నంతకాలమూ ఏడుస్తూ వుండవలసిందే. రాజేంద్రా! ఎవరికీ అందని బహుదూరస్థానానికి నువ్వు బయలుదేరావు. ఇక్కడ నేనిక బతికివుండలేను, నన్ను కూడా నీతో తీసుకువెళ్ళు. నాథా! నన్ను విడిచిపెట్టి యెలా వెడతావూ? నాతో మాట్లాడవేమీ? మేలిముసుగు లేకుండా — పట్నంద్వారం దాటి కాలినడకను నేనిక్కడికి వచ్చానే, నామీద కోపపడవేమీ? భార్యలందరిమీదా నీకెంతో ప్రేమ; కాని వారందరూ సిగ్గువిడిచి యిక్కడికివచ్చారు, చూసి కోప్పడవేమీ? సమస్తక్రీడలయందూ నీకు సముజ్జీలైన మేమందరమూ

కలా దుఃఖిస్తూ వుంటే ఊరడించవేమీ? ఆదరించవేమీ? పతివ్రతలూ, ధర్మపరాయణలూ, గురుశుశ్రూషాపరాయణలూ అయిన కులస్త్రీల నెందరినో నువ్వు విధవలను చేసేశావు. వారి శాపం తగిలి నువ్విప్పుడు శత్రువుచేతిలో నికృష్టంగా పడిపోయావు. వారి శాపం నీ కిన్నాళ్ళకి తగిలింది. "పతివ్రతలకు నిష్కారణంగా కన్నీళ్ళు రావు. వస్తే అవి నాశనంచేస్తాయి కారకుడైనవాణ్ణి" అన్న పెద్దలమాట నీమొడల సత్యమే అయింది. అఖండ తేజశ్శాలివై లోకా లన్నీ ఆక్రమించిన నువ్వు — శూరుణ్ణని గర్వించే నువ్వు క్షుద్రమైన స్త్రీచౌర్యం ఎందుకు చేశావూ? మాయలేడిమిషతో రాముణ్ణి అవతలికి పంపి నువ్వు అతని భార్య నెత్తుకువచ్చావు. దానివల్ల నీకు పిరికితనం పట్టలేదూ? ఎంతెంతలేసి యుద్ధాలు వచ్చినా నువ్వు భయపడ్డం నే నెరగను. అలాంటి నువ్వు సీతను తెచ్చాటప్పుడు భయపడ్డావంటే నీకు వినాశకాలం వచ్చిం దన్నమాటే కాదూ? నామరిది విభీషణుడు అతీతానాగతవేది. వర్తమానవిచక్షణుడు. నువ్వు సీత నెత్తుకురావడం చూసి చేసేదిలేక నిట్టూర్చి అత నేమి చెప్పాడో అదే యిప్పుడు జరిగింది. సర్వరాక్షసనాశం సంభవించింది. నీస్త్రీలౌల్యంవల్ల రాక్షసకులానికి సర్వనాశం తటస్థించింది. నువ్వుప్రఖ్యాతబలపరాక్రమవంతుడవు. కనక, నీకోసం యేడవడం తగదు. అయితే, ఆడదాన్ని కావడంవల్ల నేను సహించలేకుండా వున్నాను. మంచయినా చెడ్డయినా నువ్వు చేసుకున్నది నువ్వు వెంటబెట్టుకునే వెళ్ళిపోయావు. నాకు నీతో వియోగం దుర్భరంగా వుంది. అంచేత నే నేడుస్తున్నాను. నువ్వు స్నేహితుల మాట వినలేదంటే ఏమో అనుకోవచ్చు. గాని చివరకి సోదరులు చెప్పిన హితమయినా నువ్వు వినకపోతివి. విభీషణుడు చెప్పింది పొల్లుమాట కాదు. హేతుబద్ధం అది. మిక్కిలీ శ్రేయస్కరం. అదయినా నువ్వు లక్ష్యపెట్టకపోతివి. బలగర్వంవల్ల నువ్వు మారీచుని

మాట విన్నావుకాను. కుంభకర్ణుని మాటా విన్నావుకాదు. నా తండ్రి మాట అయినా వినలేకపోయావు. దానికి తగిన ఫలం యిది. మహా వీరాధివీరుడూ, మహాసమర్థుడూ, యుద్ధాలలో అపజయం యెరగని వాడూ అయిన మాల్యవంతుని దౌహిత్రిని నేను. నాకేసి చూడ వేమీ? సూర్యకిరణాలప్పుడే లంకలో నిర్భయంగా ప్రవేశించాయి. ఇలాంటి కొత్తపరాభవం జరిగినప్పుడింకా నిద్రలోనైనా లేవే? ఈపరి ఘతో నువ్వనేకలక్షలశత్రువులను సంహరించావు. ఇది సూర్యబింబంలా వెలిగిపోయేది. ఇంద్రునకు వజ్రాయుధం యెలాంటిదో నీకిది అలాంటిది. దీన్ని నువ్వెప్పుడూ పూజిస్తూ వుండేవాడవు. కాంచనాలంకృతమైన ఇదిఎలాంటి శత్రువులనూ పచ్చడిచేసేసేది. అలాంటి నీపరిఘ యిప్పుడు రామబాణాలతో ముక్కముక్కలై పడిపోయి వుంది. భూమిని నువ్వు కౌగిలించుకుని పడుకున్నావే, నీకు భూమే ప్రియురాలా? నేను కానూ? నాతో మాటయినా ఆడవేమీ? ఛీ! నువ్వు చనిపోయినా నాహృద యం బద్దలు కాకుండా వుందిగదా?"

ఇలాగ విచారించివిచారించి స్నేహాతిశయంవల్ల మండోదరి చివరికి మూర్ఛపడిపోయింది. రక్తసిక్తమైన రావణుని వక్షస్థలాన పడివున్న ఆబంగారుబొమ్మ సంధ్యారాగరంజితమైన నీలమేఘంలో మెరిసే మెరుపులా వుంది. తక్కిన రావణభార్యలు వచ్చి ఏడుస్తూ ఆమెను లేవనెత్తారు. "దేవీ! లోకస్థితి శాశ్వతం కాదు. దశమారినప్పుడు రాజుల ఐశ్వర్యం తొలగిపోతుంది" అని వారామెని ఊరడించారు. అయినా కన్నీటితో తన కుచకుంభాలు తడుపుకుంటూ ఆమె దుఃఖి స్తూనే వుంది.

ఈస్థితిలో రాముడు విభీషణుణ్ణిపిలిచి "నీఅన్నకు అగ్నిసంస్కారం చెయ్యి. ఈస్త్రీలను ముందు అంతఃపురం చేర్పించు" అన్నాడు. దాని మీద విభీషణుడు బాగా ఆలోచించి రాముని స్థిరనిశ్చయం తెలుసు

కోదలిచి “ రామా ! ఈరావణుడు ధర్మవ్రతం విడిచినవాడు. క్రూరుడు. ప్రాణిహింసాపరుడు. అసత్యవాది. పరస్త్రీదూషకుడు. ఇలాంటివాడికి నేను సంస్కారం చెయ్యలేను. వీడు నాకు అన్నరూపాన వున్న పరమ శత్రువు. లోకాల కన్నింటికినీ బద్ధశత్రువు. నాకంటే పెద్దకనక పూజ్యుడు కావలసిందే కాని వీడికాయోగ్యత పోయింది. తెలియని వాళ్లు నన్ను నృశంసు డని నిందిస్తే నిందించనీ. వీడి గుణాలు తెలిసిన వాళ్లు మాత్రం నన్ను సుకృతి అంటారు, నాకది చాలు ” అన్నాడు.

ఇది విని మిక్కిలీ సంతోషించి రాముడు “ విభీషణా! రాక్షసేశ్వరా ! నీసాయంవల్లనే నేను జయించాను. కనక, నేను నీకు ప్రియం చెయ్యాలి, ఇది ధర్మం. నేను నీక్షేమం కోరాలి. నిజానికి రావణుడు అధర్మపరుడే. అనృతవాదే. అయితే యితను తేజశ్శాలి. బలవంతుడు. శూరుడు. ఇంద్రాదులవల్ల కూడా యితను అపజయం యెరగ డని వింటున్నాం. ఇతన్ని మహాత్ము డనడాని కేమీ సందేహం లేదు. మన పని నెరవేరింది. కాకపోయినా విరోధం మరణం దాకానే చూపించాలి. కనక, నువ్వితనికి అగ్నిసంస్కారం జరిగించు. నీకెలాంటివాడో యితను నాకూ అలాంటివాడే. నీవల్ల అగ్నిసంస్కారం పొందడానికి రావణునకు అధికారం వుంది. అలా చేస్తే నీకు కీర్తికూడా వస్తుంది ” అని గట్టిగా చెప్పాడు. రాము డిలా చెప్పగా విభీషణుడు వెంటనే రావణునకు యథాయోగ్యంగా అగ్నిసంస్కారం చేశాడు. చితి మంచిగంధపుకర్రలతో సిద్ధంచేశారు. దానిమీద పద్మకమూ, వట్టివేళ్లూ మొదలైన సుగంధద్రవ్యాలు పరిచారు. దానిమీద చిత్రాసనాలు వేశారు. వేదోక్తంగా ఋత్విక్కులు రావణుని శరీరం దానిమీద ఉంపించారు. వేదవిహితంగా రావణునకు అంత్యక్రతువు చేశారు. మరిన్ని ఋత్విక్కులు చితికి ఆగ్నేయంగా వేదిక కల్పించి అగ్నిని ప్రతిష్టించి అక్కడ హోమపాత్రం ఉంచారు. రావణుని పాదాలమీద బండీ, కాళ్ల మధ్య

రోలూ ఉంచారు. సమస్తదారుపాత్రలూ, అరణీ, ఉత్తరారణీ రోకలీ తక్కిన వస్తువులూ యథాస్థానాల్లో చేర్చారు. వేదాలలోనూ స్మృతులలోనూ చెప్పినట్టు పవిత్రమైన కపిలగోవును వధించి హోమంచేసి దాని చర్మం నేతిలోతడిపి రావణునిమీద కప్పారు. రావణునిమీద దుఃఖిస్తూ గంధం చిలికారు. పూలదండలు వేశారు. విభీషణునితో కూడా వారు మొగాలు వంచుకుని వస్త్రాలు కప్పారు. చితిమీద పేలాలు చల్లారు. చివరికి దుఃఖిస్తూ విభీషణుడు యథావిధిగా నిప్పు పెట్టాడు.

తరవాత విభీషణుడు స్నానంచేసి, తడిబట్టలతోనే వుండి, తిలలూ దూర్వాలూ కలిపి నీళ్లతో విడిచి, శిరసా నమస్కరించి వదినలను మళ్లీ మళ్లీ ఓదార్చాడు. "ఇక వెళ్లండి" అని నగళ్లకి పంపించాడు. ఆస్త్రీలందరూ వెళ్లాక అతను రాముని దగ్గిరికి వచ్చి వినయంగా నుంచున్నాడు. రాముడున్నూ అందరితోనూ కలిసి శత్రువును సంహరించిన ఆనందం అందరికీ పంచాడు.

## ౧౧౫

## విభీషణ పట్టాభిషేకం

దేవతలూ, దానవులూ, గంధర్వులూ, రావణవధ అయాక, ఘోరమైన రావణవధా, ఉజ్జ్వలమైన రామపరాక్రమమూ, వానరుల యుద్ధకౌశలమూ, సుగ్రీవుని మంత్రాంగచాతుర్యమూ, లక్ష్మణుని అనురాగ బలపరాక్రమాలూ చెప్పుకుంటూ తమ విమానాలమీద సోల్లాసంగా వెళ్లిపోయారు. రాముడు మాతలిని గౌరవించి అగ్నిలాగ మెరిసిపోతున్న యింద్రదరథం తీసుకువెళ్లమని సెలవిచ్చాడు. మాతలి వెళ్లిపోయాక రాముడు పరమప్రీతితో సుగ్రీవుణ్ణి కౌగలించుకుని, లక్ష్మణుడు సూచించగా వానరుల పూజ లందుకుంటూ శిబిరానికి వెళ్లి లక్ష్మణు

నితో "తమ్ముడూ విభీషణుడు చాలామంచివాడు. అనురక్తుడు. భక్తుడు. నా కనిత్రోపకారం చేసినవాడు. ఇతనికి రాక్షసరాజ్యపట్టాభిషేకం జరిగించు. విభీషణుడు లంకలో రాక్షసరాజై సింహాసనం అధిష్ఠించి వుండగా చూడ్డంకంటే నాకు మరో కోరిక లేదు" అని చెప్పారు.

లక్ష్మణుడు వెంటనే బంగారు కలశం తెప్పించి సముద్రజలం తెండని వానరుల కిచ్చాడు. వానరులు నిముషంలో పట్టుకువచ్చారు. రాముని ఆజ్ఞ పొంది లంకలో విభీషణుణ్ణి సింహాసనంమీద కూచోపెట్టి అభిషేకించాడు. అందుకు విభీషణుని మంత్రులు మిక్కిలీ ఆనందించారు. రామానుగ్రహంతో ఇలాగ రాక్షసరాజై విభీషణుడు ప్రజలనందరినీ మంచిమాటలతో ఊరడించి రాముని దగ్గిరికి వచ్చాడు. అప్పుడు లంకాపురవాసులైన రాక్షసులు మంగళార్థం అక్షతలూ, మోదకాలూ, పేలాలూ, దివ్యకుసుమాలూ విభీషణునకు సమర్పించారు. విభీషణు డవి అందుకుని రామునకూ. లక్ష్మణునకూ మంగళద్రవ్యాలు సమర్పించాడు. రాముడు, కృతకృత్యుడై పూర్ణమనోరథుడై వున్న విభీషణుణ్ణి చూసి అతణ్ణి సంతోషపెట్టడానికే ఆవస్తువులన్నీ పరిగ్రహించాడు.

అప్పుడు రాముడు పెద్దపర్వతంలాగ తన పక్కని చేతులు జోడించుకుని వున్న హనుమంతుణ్ణి చూసి "సౌమ్యా! విభీషణమహారాజు సెలవుపొంది నువ్వు లంకాపురంలోకి వెళ్లు. రావణుని భవనం ప్రవేశించి జయధ్వని చేసి, నేను రావణుణ్ణి చంపా ననీ, నేనూ లక్ష్మణుడూ, సుగ్రీవుడూ కుశలంగా వున్నా మనీ సీతకు చెప్పు. ఇదంతా ఆమెకి వివరంగా చెప్పి ఆమె సందేశం పట్టుకురా" అని చెప్పాడు.

## ౧౧౬

## హనుమంతుడు సీతతో మాట్లాడి తిరిగి రాముణ్ణి కలుసుకోవడం

రాము డిలా చెప్పగా హనుమంతుడు రాక్షసుల పూజ లందుకుంటూ లంకలోకి వెళ్లి రావణుని భవనం ప్రవేశించి సీతను చూశాడు. ఆమె యెప్పటిలాగే చెట్టు మొదట రాక్షసాంగనల మధ్య దీనంగా కూచుని వుంది. ఆనందం అంటే యేమిటో మరిచిపోయి క్రూరగ్రహపీడిత అయిన రోహిణిలా వుంది. హనుమంతు డామె యెదటికి వెళ్లి "నేను హనుమంతుణ్ణి. నమస్కరిస్తున్నా" నని చెప్పుకుంటూ సవినయంగా చేతులు కట్టుకు నుంచున్నాడు.

సీత హనుమంతుణ్ణి చూసి ముందు తూష్ణీంభావంగా వూరుకుంది. తరవాత జ్ఞాపకం తెచ్చుకుని సంతోషించింది. హనుమంతుడు సౌమ్యంగా వున్న ఆమె మొగం చూసి "విదేహరాజనందనా! రాముడు సుగ్రీవునితోనూ, లక్ష్మణునితోనూ కుశలంగా వున్నాడు. విభీషణుని సాయంతోనూ, వానరుల బలపరాక్రమాలతోనూ, లక్ష్మణుని నీతినైపుణ్యంతోనూ రాముడు రావణుణ్ణి సంహరించి కృతకృత్యుడైనాడు. పరాక్రమశాలి అయిన రాముడు పరమప్రీతుడై విజయానందంతో నీక్షేమం కనుక్కురమ్మన్నాడు. "దేవీ! నీకు ప్రియవార్త చెబుతాను. నిన్ను మిక్కిలీ సంతోషపెడతాను. ధర్మం తెలిసినదానవు కనక, నువ్వు అదృష్టంవల్ల బతికివున్నావు. మనకి జయం దొరికింది. విచారం విడిచి నువ్వీక స్వస్థురాలవై వుండు. రావణుడు హతుఁడు అయిపోయాడు. లంక స్వాధీనం అయింది. నేను నిన్ను విడిపించా లని నిద్రాహారాలు విడిచి సముద్రంలో సేతువు కట్టి వచ్చి ప్రతిజ్ఞ నెరవేర్చుకున్నాను. లంకానగరైశ్వర్యం అంతా యిప్పుడు విభీషణుని అధీనంలో వుంది; కనక, రావణుని భవనంలో వున్నందుకు నువ్వేవిధా భయపడ

నక్కర్లేదు. కనక, నువ్వు స్వగృహంలో వున్నట్టే నిశ్చింతగా వుండు. నిన్ను చూడ్డానికి విభీషణుడు వస్తున్నాడు '' అనికూడా చెప్పమన్నాడు'' అని చెప్పాడు.

ఇది విని సీత యెగిసిపడింది; కాని ఆనందాతిశయంవల్ల ఆమె మాట్లాడలేకపోయింది. అది చూసి హనుమంతుడు " దేవీ! ఏమాలో చిస్తున్నావు? నాతో మాట్లాడవేమి?'' అని అడిగాడు. అప్పుడు సీత డగ్గుత్తికతో "నాపెనిమిటి జయించాడన్న ప్రియవార్త విని హర్షాతిశయంవల్ల మాట్లాడలేకపోయాను. వానరవీరా! నాకు ఇలాంటి ప్రియవార్త చెప్పినందుకు నిన్నభినందిద్దామంటే ఎంత వెతికినా నాకు తగినమాట దొరకడంలేదు. ఇంతే కాదు, ఈప్రియవార్తకు తగినట్టు నిన్ను గౌరవిద్దామంటే అందుకు తగిన వస్తువు కూడా కనపడ్డంలేదు. బంగారమూ, రత్నాలూ, చివరికి త్రిలోకాధిపత్యమూ గూడా నువ్వు చెప్పిన వార్తకు సరిరాదు'' అని బదులుచెప్పింది. దీనిమీద హనుమంతుడు మళ్ళీ చేతులు జోడించుకుని "స్నేహబంధురమైన యీ మాట అనడానికి, పెనిమిటికి హితమూ జయమూ కోరే నీకే చెల్లింది. నీమాట చాలా సారవంతంగానూ మిక్కిలీ స్నిగ్ధంగానూ వుంది. ఇది రత్నరాశికంటేనూ, దేవేంద్రపదవి కంటే మిన్నగా వుంది. శత్రువును సంహారించి, విజయం పొంది తేజరిల్లుతూ వున్న రాముణ్ణి చూసుకుంటున్న నాకు దేవరాజ్యాధిపత్యంవల్ల కలిగే సుఖాలన్నీ అనుభవిస్తున్నట్టే వుంది'' అన్నాడు.

అప్పుడు సీత మళ్ళీ అందుకుని "హనుమా! సలక్షణంగా — మధురంగా — ఆనందిస్తూ మాట్లాడ్డానికి నువ్వే తగినవాడవు. వాయుపుత్రుడవైన నువ్వు పరమధార్మికుడవై శ్లాఘనీయుడవై ఉన్నావు. బలమూ, శౌర్యమూ, శ్రుతమూ, సత్త్వా, విక్రమమూ, సామర్థ్యమూ, తేజస్సూ, క్షమా, ధైర్యమూ, స్థైర్యమూ, వినయమూ — ఇవి నిజంగా నీదగ్గిరే

వున్నాయి. నీదగ్గిర వుండడంవల్లనే శోభిస్తున్నాయి కూడాను” అని శ్లాఘించింది. దీనిమీాధ హనుమంతుడు “దేవీ! నువ్వు సెలవిస్తివా, ఇంతవరకూ నిన్ను తర్జనభర్జనలు చేసి పీడించిన యీరాక్షసాంగనల్నను అందరినీ నేను చంపేస్తాను. పతివ్రతవైన నిన్ను ఘోరాకారమూ, విషపుచూపులూ గల యీరాక్షసాంగనలు నీతో అతికఠినంగా మాట్లాడారు. కనక, వీళ్ళని వధించాలి గాని విడిచిపెట్టకూడదు, నాకీ వరం దయచెయ్యి. దేవీ! ఈపాపిష్ఠిస్త్రీలను చూస్తే నాకు వొళ్ళుమండిపోతోంది. పిడికిళ్ళతో గుద్దీ, అరచేతులతో చరిచీ, కాళ్ళతో తన్నీ, మోకాళ్ళతో కుమ్మీ, పళ్ళతో కొరికీ, ముక్కూ చెవులూ చిదిమీ, గోళ్ళతో చీల్చి, ఎగిరెమీాదపడి పిండిచేసీ చంపాలని వుంది” అని అడిగాడు; కాని అందు కామె అంగీకరించలేదు. “హనుమా! వీళ్ళు రావణుని దాసీలు. రాజాజ్ఞ ప్రకారం ప్రవర్తించారు. వీరిమీాద కోపపడడం ధర్మంకాదు. నేను వెనకటిజన్మలో చేసుకున్న పాపం పండీ, ఇప్పుడు నాదౌర్భాగ్యం నిండీ నాకిది అనుభవించవలసివచ్చింది. కనక, దుర్బలనైనా నేను వీళ్ళని క్షమిస్తున్నాను. రావణుడు ఆజ్ఞాపించడం వల్లనే వీళ్ళు నన్ను బాధించారు. వాడు చచ్చిపోయాడు, ఇక వీళ్ళేమి చేస్తారూ? వెనకటికొక భల్లూకం వొకపులికి “ప్రాజ్ఞుడైనవాడు తన కపకారం చేసినవానికి కూడా అపకారం చెయ్యడు. ఇది ధర్మం. సత్పురుషులకు శీలమే అలంకారం” అని హితోపదేశం చేసింది. పాపులైనా శుభులైనా వధించతగ్గవాళ్ళయితే వారియెడల అనుగ్రహామే చూపించాలి. అపరాధాలు చెయ్యనివా రెవరూ లేరు. రాక్షసులు కామరూపులయి లోకహింసచేస్తూ సమస్తపాపాలూ చేస్తారే అనుకో. అయినా వాళ్ళని బాధించడం మంచిదికాదు” అని దృఢంగా చెప్పింది.

ఇది విని హనుమంతుడు “దేవీ! నువ్వు రామునకు తగిన ధర్మపత్నివి. మరి నాకు సందేశం యిచ్చి పంపేసెయ్యి. నేను త్వరగా

రాముని సన్నిధి చేరుకోవాలి ” అని అడిగాడు. “ వానరోత్తమా! చెప్పడాని కేమి వుంది? నేను నాభర్తను చూడాలని కోరుతున్నాను” అని ఆమె బదులు చెప్పగా అతను “ దేవీ? పూర్ణచంద్రాననుడైన రాముణ్ణీ లక్ష్మణుణ్ణీ కూడా నువ్వు త్వరలోనే చూస్తావు ” అని విన్నవించి బయలుదేరి వెళ్ళిపోయాడు.

౧౧౭

## విభీషణుడు సీతను రాముని దగ్గిరికి తీసుకురావడం

హనుమంతుడు రాముని దగ్గిరికి వెళ్ళి “ రామా! యెవరికోసం మన మీ ప్రయత్నం అంతా చేశామో, ఎవరికోసం చేసిన పను లన్నీ నెర వేరాయో, శోకసంతప్త అయివున్న ఆసీతను నువ్వింక చూడాలి. శోక ఘనావిష్ట అయి కళ్లనీళ్లు పెట్టుకుని వుండిన సీత నీవిజయవార్త విని మిక్కిలీ ఆనందించింది. ఆమె యిదివరలో నన్ను చూసివుంది కనకా, నాయెడల నమ్మకంవుంది కనకా “ కృతార్థుడైన నాపెనిమిటినీ, లక్ష్మణుణ్ణీ నేను చూడాలి ” అని నాకు చెప్పింది ” అని చెప్పాడు.

ఇది విని రాముడు కళ్లల్లో నీళ్లు తిరగ్గా ఆలోచనలో పడి పెద్ద టూర్పు విడిచి కిందికి చూస్తూ “ స్నానంచేయించి అంగరాగాలు పూయించి దివ్యాభరణా లలంకరింపించి సీత నిక్కడికి తీసుకురా ” అని విభీషణుణ్ణి ఆజ్ఞాపించాడు. వెంటనే అతను తన ఆడవాళ్లతో కూడా సీత వున్నచోటికి వెళ్ళి, వాళ్లచేత “ సీతా! నీభర్త నిన్ను చూస్తా నంటున్నాడు. కనక అంగరాగాలు పూసుకుని చక్కగా అలంకరించుకుని వచ్చి పాలకీ యెక్కు ” అని చెప్పించాడు. అయితే ఆమె “ నేను స్నానం చెయ్యకుండా ఇలాగే వస్తా ” నంది. దానిమీద విభీషణుడు “ నీభర్త యెలా చెబితే నువ్వలా చెయ్యడమే ధర్మం కదా? ” అని అడిగాడు. దానికి మారు చెప్పకుండా సీత అంగీకరించింది.

వెంటనే పరిచారికలు వచ్చి సీతను మంగళస్నానం చేయించారు. అంగరాగాలు పూశారు. వెలలేని బట్టలు కట్టారు. దివ్యాభరణాలు తొడిగారు. మెత్తని పరుపూ చక్కని దుప్పటీ గల పాలకీ యెక్కించారు. రాక్షసులనేకులు పరివేష్టించి బయలుదేరారు. ఆమె రాక చూసీ కూడా రాముడు ఆలోచనలోనే వున్నాడు. అది చూసి విభీషణుడు "రామా! సీత వచ్చింది" అని చెప్పాడు.

ఈమాట వినగానే రామునకు ఆనందం వెల్లివిరిసింది. దైన్యం అలుముకుంది. రోషం ముంచుకువచ్చింది. రాక్షసుని యింట ఆమె చిరకాలం వుండడంవల్ల యిది యిలా సంభవించింది. దీంతో పక్కని వున్న విభీషణుణ్ణి రాముడు "సీత నిక్కడికి తీసుకురా" అన్నాడు. అప్పటికి వేనవేలు జనులు రాముని చుట్టూ మూగివున్నారు. విభీషణుడు ముందు వారిని తొలగించమన్నాడు. వెంటనే కంచుకాలు తొడుక్కుని, టోపీలు పెట్టుకుని, కర్రలు పట్టుకునివున్న భటులు గుంపులుగుంపులుగా వున్న భల్లూకాలనూ, వానరులనూ, రాక్షసులనూ దూరంగా గెంటుకుపోయారు. దాంతో వాళ్లు గోలపెట్టారు. ఆగోల సముద్రకల్లోలంకంటే మించిపోయింది.

అది చూసీ, వినీ రాముడు రుష్టుడై "వాళ్లందరూ నావాళ్లు. వాళ్ల నేమీ చెయ్యవద్దు. నాసెలవు లేనిదే నువ్వెందుకిలా చేయించావూ? భటులను మళ్లించు. ఇళ్లూ, బట్టలూ, ప్రాకారాలూ, తెరలూ — స్త్రీల కిలాంటి రాజమర్యాదలు అవసరం కాలేవు. ఆపదలు వచ్చినప్పుడూ రాజ్యక్రాంతీ మొదలైన కల్లోలాలలోనూ, యుద్ధాలలోనూ, స్వయంవరాలలోనూ యజ్ఞయాగాలలోనూ, వివాహమహోత్సవాలలోనూ స్త్రీలు అందరికీ కనపడవచ్చు, తప్పేమీ లేదు. దానివల్ల వారి కేమీ దోషం తగలదు. దానికి తగ్గట్టు ఈసీత యిప్పుడు యుద్ధగతురాలై వుంది. రాజ్యక్రాంతిలో కూడా వుంది. నాయెదటనే

కూడా వుంది. ఈస్థితిలో వీళ్లందరూ చూస్తే యీామె దూష్యురా లయిపోదు. కనక, స్నేహితులతోనూ, పరివారంతోనూ కలిసివుండీన నన్ను చూస్తుంది, సీత నిక్కడికే తీసుకురా ” అని చెప్పాడు.

దీనిమీాద విభీషణుడు వినయంగానూ, సాశంకగానూ సీతను రామునిదగ్గిరికి తీసుకువచ్చాడు. అప్పుడు లక్ష్మణుడూ, సుగ్రీవుడూ, హనుమంతుడూ రామునిమాటలు విని చాలా బాధపడ్డారు. “నాకు భార్య అక్కర్లేదు” అన్నట్టున్న రాముని ఇంగితం కనిపెట్టి వారు అతనికి సీతమీాద యిష్టంలేదు అని సందేహించారు. ఈస్థితిలో, సీత, సిగ్గుతో ముడుచుకుపోతూ విభీషణుని వెంట భర్త దగ్గిరికి వచ్చింది. ఆమె పైట కొంగుతో మొగం కప్పుకుని, ఆజనసమూహంలో “ఆర్య పుత్రా!” అంటూ బొరుమంది. చివరి కామె విస్మయంతోనూ, ఆనం దంతోనూ, స్నేహంతోనూ పతివ్రత కనక సౌమ్యంగా పెనిమిటి మొగం చూసింది. ఆమె మొగం ప్రఫుల్లకమలంలాగ వుంది.

## ౧౧౮

## రాముడు సీతను “నువ్వు నాకక్కరలేదు” పొమ్మనడం

తన పక్కని లజ్జతో కుంగిపోయివున్న సీతను చూస్తూ రాముడు, హృదయాంతర్గత మైన కోపం పెల్లుబకగా యిలా అన్నాడు.

“భద్రే! ఇదిగో, శత్రువును సంహరించి నేను నిన్ను జయించాను. పౌరుషంతో చెయ్యవలసిం దేమిటో నేనది చేశాను. నాకు కోపం తీరి పోయింది. తిరస్కారం తుడిచేశాను. అవమానమూ శత్రువూ నాచే తిలో ఒక్కమాటు నిర్మూలం అయిపోయారు. నాపౌరుషం యిప్పుడు కనపడింది. నాప్రయత్నం సఫలం అయింది. నాప్రతిజ్ఞ నెరవేర్చుకోగలి గాను. కనక, నేనిప్పుడు “నేను” అంటూ స్వతంత్రంగా నిలవబడగలి గాను. నిన్ను చిలచిత్తు డైన రాక్షసుడు నేను లేనప్పు డెత్తుకుపో

యాడు. అది దైవికం. ఆదైవికం మనిషి నైన నేను జయించాను. తనకి అవమానం జరిగితే పౌరుషం చూపించి యెవడు అది పోగొట్టు కోడో వాని కేపురుషార్థమూ అంటదు. సముద్రం దాటడం — లంక తగలబెట్టడం — హనుమంతుడు చేసిన యీగొప్ప పనులు రెండూ సఫలం అయినాయి. యుద్ధంలో మంత్రాంగం నిర్వహిస్తూ, తన పరా క్రమం చూపిస్తూ తన వానరబలగంతో సుగ్రీవుడు చేసిన పరిశ్రమ సఫలం అయింది. దుర్గుణు డైన సోదరుణ్ణి విడిచి, భక్తితో నన్ను వచ్చిచేరిన విభీషణుని పరిశ్రమ కూడా సఫలం అయింది"

రాము డిలా అంటూ వుంటే సీత ఆడులేడిలాగ ఉత్సాహంగా చూస్తూనే కళ్లల్లో నీళ్లు పెట్టుకుంది. ఆస్థితిలో ఆమెని చూస్తున్న రామునకు నెయ్యిపోసిన అగ్నికి జ్వాల లెక్కువయినట్టు క్రోధం యెక్కు వయిపోయింది. దాంతో, అతను, కనుబొమలు ముడిచి చురచుర పక్కచూపులు చూస్తూ వానరులూ రాక్షసులూ వింటూనే వుండగా "సీతా! తిరస్కారం జరిగినప్పుడు మనిషి అయినవాడు చెయ్యవల సిన దంతా చేశాను. ఆత్మజ్ఞానసంపన్ను డైన అగస్త్యమహర్షి వాతా పిల్వలుల బారిపడిన దక్షిణదిశను ఆక్రమించునట్టు రావణుని చేతిలో నుంచి నిన్ను సాధించాను. అయితే, సీతా! నేను చేసిన రణపరిశ్రమ అంతా స్నేహితుల బలవీర్యాలు వెల్లడి కావడానికే కాని నీకోసం కాదు సుమా! నాశీలం కాపాడుకోడానికీ — అపకీర్తికర మైన అప వాదు పోగొట్టుకోడానికీ — నావంశప్రతిష్ఠ నిలుపుకోడానికీ మాత్రమే నే నీ రణపరిశ్రమ చేశాను, నువ్వు బాగా గ్రహించుకో. ఇక నీశీలం విషయం యిప్పుడు సందేహాస్పదంగా వుంది. అంచేత, కళ్లు కలిగినవా డికి దీపంలాగ నువ్వు నాకిప్పుడు చాలా బాధాకరంగా వున్నావు. కనక, నేను సెల విచ్చేస్తున్నాను, ఇదిగో పదిదిక్కు లున్నాయి, సీతా! యిక నువ్వు నీయిష్టంవచ్చినచోటికి వెళ్లిపో. సద్వంశంలో పుట్టినవాడు

పౌరుషవంతు డైతే పరగృహంలో వుండిన భార్యను ఆనందంతో యెవడు స్వీకరించగలడూ ? ఇంతకాలానికి నువ్వు రావణుని వొడిలో నుంచి దిగివచ్చావు. వాడు నిన్ను దుశ్చింతతో చూశాడు. ఇక నా కులంపాడుచేసుకుని నిన్నెలా స్వీకరిస్తానూ? పోయిన కీర్తి మళ్లీ తెచ్చుకోడానికే నిన్ను సాధించాను. నాకు నీయెడల ఆసక్తి లేశమూ లేదు. యథేచ్ఛగా వెళ్లిపో. నేనిది దృఢనిశ్చయంతో చెప్పినమాట కాని వేళాకోళం కాదు. కనక, లక్ష్మణుని దగ్గిరికో భరతుని దగ్గిరికో, వానరేంద్రుడైన సుగ్రీవుని దగ్గిరికో, రాక్షసేంద్రు డైన విభీషణుని దగ్గిరికో వెళ్లి కాలం గడుపుకో. నువ్వు చాలా చక్కనిదానవు. నాగరికత కలదానవు. వంటయిల్లు జొచ్చిన కుందేలు లాగ తన యింటో వున్న దానవు. సహజంగా దుష్టు డైన రావణుడు నిన్ను విడిచిపెట్టి వుండడు" అని చాలా కఠినంగా చెప్పాడు. లాలనపాలనలు ఎదురుచూస్తూవున్న సీత యిదివిని ఏనుగుచేత చిక్కిన సల్లకీలత లాగ వడవడ వొణికిపోతూ కన్నీరు విడిచింది.

## ౧౧౯

## సీత అగ్నిప్రవేశం చెయ్యడం

సీత సిగ్గుతో కుంగిపోయింది. శరీరం అంతటా బాణాలు గుచ్చుకున్నట్టు బాధపడింది. తరవాత, కళ్లనీళ్లు తుడుచుకుంటూ డగ్గుత్తికతో మెల్లిగా అందుకుని "వీరాధివీరా! నువ్వు నాచెవులు చిల్లులుపడేటట్టు మాట్లాడుతున్నావు. పామరుడు పామరస్త్రీని అన్నట్టు నన్ను అంటున్నావు. నువ్వనుకున్నట్టు నే నలాంటిదానిని కానుసుమా! నేను నాశీలంమీాద వొట్టుపెట్టుకుని చెబుతున్నాను నమ్ము. ఎవ తెనో దుష్టస్త్రీని చూశావు, నువ్వు స్త్రీజాతి అంతా అలాంటిదే అనుకుంటున్నావు. నాసంగతి నీకు తెలియదూ? రావణుడు నాశరీరం తాకాడు.

నిజమే ; కాని నాకు నేనయి నన్ను తీసుకుపొమ్మని వాడిచంక యెక్క లేదు. అక్కడ దోషం నాది కాదు, దేవునిది. నాహృదయం నాఅధీనంలోనే వుంది. అది నీమీదే లగ్నం అయివుంది. నేను దిక్కులేనిదాని నయిపోయాను. నాశరీరం తాకి పరుడు నన్ను ఎత్తుకుపోయాడు. నే నేమి చెయ్యగలనూ ? నువ్వూ నేనూ కలిసిపెరిగాం. కలిసి తిరిగాం. దానివల్ల నీకు నాసంగతి తెలిసివుండకపోతే నేను చచ్చానన్నమాటే. నేను లంకలో వున్నప్పుడు నాకోసం హనుమంతుణ్ణెందుకు పంపావూ? అప్పుడే యెందుకు విడిచిపెట్టేశావు కావూ ? అథవా హనుమంతుని చేతనైనా నువ్వీ సంగతి నాకు తెలియబరిచివుంటే నేనప్పుడే ప్రాణాలు విడిచివుందునుగాదూ ? ప్రాణాలకు తెగించి నువ్వు యుద్ధంచేశావు. నీకోసం నీస్నేహితులు కూడా ప్రాణాలకు తెగించారు. ఈశ్రమ అంతా నిష్ఫలం గదా ? క్రోధమే ప్రధానంగా చేసుకుని నువ్వు అల్పుడు లాగ నాలో స్త్రీత్వమే గమనించావు. నాశీలం గుర్తించలేకపోయావు. నువ్వు అన్నీ తెలిసినవాడవు. నేను జనకుని కూతురు ననుకోడం అపవాదం కాని సత్యం కాదు. నేను భూమిలోనుంచి పుట్టాను. ఇదైనా నువ్వు గుర్తించలేకపోయావు. చిన్నప్పుడే నువ్వు నాచెయ్యిపట్టడం కూడా నువ్వు నమ్మలేకపోతున్నావు. నాభక్తీ, నాశీలమూ, నాసర్వస్వమూ కూడా నువ్వు వెనకబెట్టేశావు" అని, లక్ష్మణుణ్ణి చూసి "లక్ష్మణా ! ఇంకెందుకూ ? నాకోసం చితి పేర్పించు. ఈవిపత్తుకి అదే మందు. మిథ్యాపవాదానికి పాల్పడి నేనిక బతకలేను. నాగుణాలకైనా ప్రీతిపొందక నాపెనిమిటి నలుగురిలోనూ నన్ననరాని మాటలన్నాడు. ఇక నేను సహించలేను. అగ్గిలో వురుకుతాను" అని చెప్పింది.

సీత యిలా అనగా లక్ష్మణుడు దీనంగా రాముని కేసి చూశాడు. రాముని ఆకారమూ ఇంగితమూ చూసి రాముడందు కంగీకరిస్తున్నట్టు గుర్తించాడు. వెంటనే చితి పేర్పించాడు. అప్పుడు సీత మొగంవంచు

కని రామునకు ప్రదక్షిణంచేసి చితి సమీపించింది. దేవతలకు మొక్కి, బ్రాహ్మణులకు నమస్కరించి చేతులుజోడించుకని ఆమె "నాహృదయం రాముణ్ణెప్పుడూ విడిచివుండకపోయినట్టయితే లోకసాక్షి అయిన అగ్ని నన్ను రక్షించాలి. విశుద్ధచారిత్ర నైన నన్ను రాముడు దుష్టురాలనే అనుకునేటట్టయితే లోకసాక్షి అయిన అగ్ని నన్ను రక్షించాలి. మనసా, వాచా, కర్మణా నేను సర్వధర్మజ్ఞు డైన రాముణ్ణే నమ్మివున్నట్టయితే లోకసాక్షి అయిన అగ్ని నన్ను రక్షించాలి. సూర్యుడూ, వాయుదేవుడూ, దశదిక్కులూ, చంద్రుడూ, రాత్రింబగళ్లూ, ఉభయ సంధ్యలూ, భూదేవీ, తక్కిన దేవతలూ నేను శీలవతి నని తెలుసుకుని వున్నట్టయితే లోకసాక్షి అయిన అగ్ని నన్ను రక్షించాలి" అని చెబుతూ అగ్నిలో ప్రవేశించింది.

అది చూసి ఆబాలగోపాలమూ అక్కడ వున్నవారందరూ భయభ్రాంతు లయిపోయారు. మహాభాగురాలైన సీత, అగ్నిలో ప్రవేశించడం లోకాల కన్నిటికీ ఆజ్యాహుతి లాగ కనపడింది. మంత్రపూత అయిన వసోర్ధార లాగ ఆమె అగ్నిలో పడడం చూసి స్త్రీలందరూ గోలపెట్టేశారు. దేవతలకూ గంధర్వులకూ దానవులకూ, త్రిలోకాలకూ అగ్నిలో పడుతున్న సీత శపించబడి స్వర్గంలోంచి నరకంలో పడిపోతున్న దేవత లాగ కనబడింది. ఆమె అగ్నిలో ప్రవేశించడం చూడలేక వానరులూ, రాక్షసులూ హాహాకారాలు చేశారు.

## ౧౨౦

## బ్రహ్మాదులు వచ్చి రామునితో మాట్లాడడం

ఈమాట లన్నీ వింటూ రాముడు కళ్ళనీళ్ళు పెట్టుకుని మొగంవంచుకున్నాడు. అప్పుడు శత్రుసంహర్త అయిన యముడూ, సహస్రాక్షుడైన మహేంద్రుడూ, పరంతపుడైన వరుణుడూ, ముక్కంటీ, వృషభ

వాహనుడూ అయిన మహేశ్వరుడూ, సమస్తలోకాలకూ కర్తా బ్రహ్మవేత్తలో ఉత్తముడూ అయిన బ్రహ్మ విమానాలమీద లంకకు వచ్చి కలిసి రాముని దగ్గిరికి వచ్చారు. వారిని చూసి రాముడు ప్రాంజలి అయినాడు. అప్పుడు వారు ఆభరణాలంకృతాలైన దీర్ఘబాహువు లెత్తి "రామా! నువ్వు లోకకర్తవు. జ్ఞానవంతులలో ఉత్తముడవు. సీత అగ్నిలో పడుతూ వుంటే అలా చూస్తూ వూరుకుంటావేం? దేవ గణంలో శ్రేష్ఠుడ వయ్యుండిన్నీ నిన్ను నువ్వు తెలుసుకోవేం? నువ్వు అష్టవసువులలో ఋతధాము డనేవాడవు. త్రిలోకాలకూ నువ్వు ఆది కర్తవు. స్వయంప్రభుడవు. ఏకాదశరుద్రులలో ఎనిమిదోవాడవు. సాధ్యులలో అయిదోవాడవు. అశ్వినీదేవతలు నీచెవులు. సూర్యచంద్రులు నీకళ్ళు. నువ్వు సృష్టికి పూర్వమూ, ప్రళయం తరవాతా కనపడతావు. అలాంటి నువ్వు పామరమనిషి లాగ సీతను ఉపేక్షిస్తావేమి?" అని అడిగారు.

దానిమీద రాముడు "నేను మనిషి ననీ, దశరథమహారాజు కొడుకు ననీ అనుకుంటున్నాను. అలాకాకపోతే మరెవణ్ణి? ఎంచేత యెక్కడ పుట్టాను? ఇదంతా నాకు బ్రహ్మదేవుడు చెప్పాలి" అన్నాడు. అందుకు బ్రహ్మ యిలా బదులుచెప్పాడు.

"రామా! నువ్వు చక్రాయుధు డైన శ్రీమన్నారాయణుడవు. ఒక్క కొమ్ము గల ఆదివరాహమూర్తివి. వెనకటి లోకకంటకులను నాశనంచేసినవాడవు. ఇకముందు పుట్టే లోకకంటకులనుకూడా సంహరించేవాడవు. అక్షరమూ, సత్యమూ, సర్వవ్యాపకమూ, ప్రణవస్వరూపమూ అయిన బ్రహ్మవు. లోకాల కన్నిటికీ వ్యాప్యమవు. చతుర్భుజుడవు. శార్ఙ్గధన్వుడవు. హృషీకేశుడవు. పురుషుడవు. పురుషోత్తముడవు. అజితుడవు. నందకఖడ్గధారివి. భూభారం హరించేవాడవు. బృహద్బలుడవు. దేవసేనానివి. గ్రామణివి. అవ్యయుడవు. ఉపేంద్రుడవు.

మధుసూదనుడవు. ఐశ్వర్యవంతుడవు. సకలజగత్కారణభూతుడవు. పద్మనాభుడవు. రణాంతకుడవు. శరణ్యులకు శరణమవు. సహస్రశృంగాలూ శతజిహ్వలూ గల వేదమూర్తివి. త్రిలోకాలకూ నువ్వే ఆది కర్తవు. స్వయంప్రభుడవు. సిద్ధులకూ సాధ్యులకూ ఆశయుడవు. నువ్వే యజ్ఞం. నువ్వే వషట్కారం. నువ్వే ఓంకారం. నీఆద్యంతా లెవరూ యెరగరు. నువ్వెవరో యెవరూ తెలుసుకోలేరు. యోగులు నిన్ను సర్వభూతాల్లోనూ, ముఖ్యంగా బ్రాహ్మలలోనూ, గోవుల లోనూ, సకలదిక్కులయందూ, ఆకాశానా, పర్వతాలమీదా, అడవుల్లోనూచూస్తారు. నువ్వు సహస్రచరణుడవై శతశిరస్కుడవై సహస్ర దృక్కువై సకలభూతాలనూ, భూమండలమూ భరిస్తావు. ప్రళయకాలంలో నువ్వు ఆదిశేషుడవై త్రిలోకాలనూ, దేవగంధర్వదానవులనూ ధరించి జలమధ్యంలో వుంటావు. నేను నీకు హృదయం. సరస్వతి నీకు జిహ్వ. పరబ్రహ్మవైన నీశరీరంలో దేవత లందరూ రోమాలై వున్నారు. నువ్వు కన్ను మూస్తే అదే రాత్రి. కన్ను తెరిస్తే అదే పగలు. నీ నిట్టూర్పులే వేదాలు. నువ్వు లేని దేమీ లేదు. ఈజగత్తంతా నీ శరీరం. నీస్థైర్యమే భూమి. అగ్ని నీకోపం. చంద్రుడు నీఅనుగ్రహం. పూర్వం త్రివిక్రమావతారం ధరించి నువ్వు మూడడుగుల్లో త్రిలోకాలూ ఆక్రమించావు. బలిచక్రవర్తిని బంధించి మహేంద్రుణ్ణి రాజును చేశావు. సీత లక్ష్మి. నువ్వు విష్ణుమూర్తివి. రావణుణ్ణి సంహరించడానికి మానవజన్మ యెత్తావు. నువ్వు ఎందు కవతరించావో ఆరావణవధ అయిపోయింది. అది మాకార్యం. ఇక్కడ కొన్నాళ్ళుండి తరవాత వైకుంఠానికి దయచెయ్యి. నీబలపరాక్రమాలు అమోఘాలు. నీదర్శనమున్నూ అమోఘం. నిన్ను కీర్తించడమున్నూ అమోఘమే. నీయెడల భక్తిగలవా రందరూ అమోఘశక్తు లవుతారు. పురాణపురుషుడవూ, పురుషోత్తముడవూ అయిన నీయెడల భక్తిగలవారు

ఈలోకంలో సకలసుఖాలూ అనుభవించి అంతమందు స్వర్గంలో సకల సుఖాలూ పొందుతారు. వేదప్రోక్తమూ, పురాతనమూ, ఇతిహాస రూపమూ అయిన ఈస్తవం యెవరు నిత్యమూ కీర్తిస్తూ వుంటారో వారి కపజయం వుండదు ”

## ౧౨౧

## రాముడు సీతను పరిగ్రహించడం

బ్రహ్మ చెప్పిన యీమాట విని అగ్నిహోత్రుడు చితిని చెల్లాచెదురు చేసి సీతను చంకనుబెట్టుకుని రాముని దగ్గిరికి వచ్చాడు. సీత అప్పుడు బాలసూర్యబింబంలా వుంది. రత్నాభరణాలూ, ఎర్రని వస్త్రాలూ ధరించి వుంది. బాలాకుమారి అయివుంది. ఆమెను తీసుకు వచ్చి అగ్ని “ రామా! ఇదిగో నీసీత. ఈమె లేశమూ పాపం యెర గదు. వృత్తశౌండీరా! ఈమె వాక్కునా, మనస్సునా, ధ్యానం లోనూ, చూపునా నిన్నుతప్ప మరివొకణ్ణెరగని సువృత్త. అడవిలో, నువ్వు లేనప్పుడు దీనురాలైన యీమెను బలోదగ్రుడైన రావణుడు ఎత్తుకుపోయాడు. అంతఃపురంలో వుంచాడు. వికారస్వరూపంగల రాక్షసాంగనలచేత తర్జనభర్జనలు చేయించాడు; కాని యీమె మనసు నీమీదే వుంది. నిన్నే ధ్యానిస్తూ కాలంగడిపింది. వాడు అనేకవిధాల ప్రలోభపెట్టాడు; కాని యీమె నీమీదే మనస్సుంచుకుని ఆవిషయం ఆలోచించనేలేదు. అమాటలే వినిపించుకోలేదు. ఈమె విశుద్ధస్వభావ. పాపహీన. ఈమెను పరిగ్రహించు. నాకడ్డు చెప్పవద్దు, నిన్ను ఆజ్ఞాపిస్తున్నాను ” అని దృఢంగా చెప్పాడు.

ఇదంతా విని రాముడు ప్రీతచిత్తుడైనాడు. అతని కళ్ళల్లోనీళ్లు తిరిగాయి. ఒక్క క్షణం మాట్టాడలేకపోయాడు. తరవాత దృఢవిక్రముడైన రాముడు బ్రహ్మను చూసి “ మూడులోకాల్లోనూ సీత పాపాత్మురాలు కాదని అందరికీ తెలుసు; కాని యీమె రావణుని అంతఃపు

రంలో చిరకాలం వుంది. ఈమెను వెంటనే నేను స్వీకరిస్తే లోకం "దశరథపుత్రుడైన రాముడు మూర్ఖుడు. కామపరాయణుడు" అని నన్ను నిందిస్తుంది. జానకి మంచిచెడ్డ లెవరూ గుర్తించరు. సీత నన్నే నమ్మివుం దనీ, నన్నే ధ్యానిస్తోం దనీ, నాయెడల భక్తి కల దనీ నాకు తెలుసు; కాని త్రిలోకాలూ ఇది గుర్తించి ఆమెను విశ్వసించడానికే నేనామె అగ్నిలో వురుకుతూ వుంటే చూస్తూ వూరుకున్నాను. సముద్రం చెలియలికట్ట దాటి వెళ్ళలేదు. అలాగే, తన తేజస్సుతో తానే రక్షించుకుంటున్న సీతను రావణుడు ఏమీ చెయ్యలేడు. ఈమె అగ్నిజ్వాలవంటిది. మనసా కూడా వాడు ఏమీ చెయ్యలేడు. కాంతి సూర్యుణ్ణి విడిచివుండదు. అలాగే సీత నన్ను తప్పించి సుఖకల్పన చేసుకోలేదు. రావణుని అంతఃపురంలో ఏమీ ముట్టుకుని వుండదు. వాని ఐశ్వర్యంకేసి చూసి అయినా వుండదు. ఈసీత పరమపవిత్రురాలు. బుద్ధిమంతుడు కీర్తిని విడిచిపెట్టలేడు. మీరందరూ లోకమాన్యులు. నాయెడల స్నిగ్ధహృదయులు కనక మీరు చెప్పినట్టే చేస్తాను"

ఇలా చెప్పి రాముడు సీతను పరిగ్రహించాడు.

## ౧౨౨

## దశరథుడు సీతారామలక్ష్మణులను దీవించడం

రాము డిలా అనగా, మహేశ్వరు డందుకుని "రామా! అదృష్టవశాన నువ్వు రావణుని సంహరించావు. సకలలోకాలకూ నువ్వు రావణునివల్ల భయంలేకుండాచేశావు. ఇక నువ్వు చెయ్యవలసింది విను. అయోధ్యకు వెళ్ళు. దీనుడైన భరతుణ్ణి ఊరడించి, యశస్విని అయిన కౌసల్యనూ, కైకనూ, సుమిత్రనూ చూసి, రాజ్యాభిషిక్తుడవై ప్రజల నానందపెట్టి, ఇక్ష్వాకువంశం నిలిపి, అశ్వమేధయాగం చేసి అసాధారణకీర్తి సంపాదించి, బ్రాహ్మలకు సకలసంప[illegible] సంతుష్టించి

వైకుంఠం చేరుకో. ఇదే విమానంమీద నీతండ్రి దశరథు డున్నాడు చూడు. శ్రీమంతు డైన నీతండ్రి నీవల్ల తరించి స్వర్గంలో వుంటున్నాడు. నువ్వూ లక్ష్మణుడూ ఇతనికి నమస్కారాలు చెయ్యండి” అని చెప్పాడు. దీనిమీద రాముడు విమానంమీదవున్న దశరథునకు లక్ష్మణునితో కూడా ప్రణామం చేశాడు. అందుకు మిక్కిలీ ఆనందించి దశరథుడు తన ప్రాణాలకంటే ప్రియు డైన కొడుకును వొడిలో కూచో బెట్టుకుని గట్టిగా కౌగిలించుకుని “నాయనా! నిజం చెబుతున్నాను. నువ్వు లేని నాకు స్వర్గం రుచించడంలేదు. మహర్షులు సమ్మానిస్తూ వుంటే కూడా తృప్తి లేదు. వనవాసవ్రతం ముగించుకుని శత్రువులను సంహరించి పూర్ణహృదయుడవై వున్న నిన్ను చూశాటప్పటికి నాకెంతో ప్రీతి కలిగింది. నిన్ను అడవులకు పంపవలసిం దని కైక అన్న మాట లన్నీ యింకా నాచెవుల్లో గింగురుమంటూనే వున్నాయి. నిన్నూ లక్ష్మణుణ్ణీ చూసి కౌగలించుకున్నాక మంచువిడిచిన సూర్యుడు లాగ దుఃఖవిముక్తి పొందాను. వెనకటికి అష్టావక్రుడు తన తండ్రిని తరింపజేసినట్టు నువ్వూ నన్ను తరింపజేశావు. అయితే, రావణుని వధకోసం దేవత లిదంతా కల్పించా రని నాకిప్పటికి తెలిసింది. కౌసల్య అదృష్టవంతురాలు కనక, వనవాసం ముగించుకుని యిల్లు చేరుకున్న నిన్ను చూసి ఆనందించగలుగుతుంది. కోసలదేశవాసులూ, అయోధ్యాపౌరులున్నూ కూడా పెట్టిపుట్టారు కనక, అయోధ్య చేరుకుని రాజ్యాభిషిక్తుడవైన నిన్ను చూడగలుగుతారు. భరతుడు నీయెడల మిక్కిలీ అనురక్తుడు. బలవంతుడు. శుచి. ధర్మచారి. అతనూ నువ్వూ కలుసుకుంటే నేనానందిస్తాను. సీతతోనూ, లక్ష్మణునితోనూ నువ్వు వనవాసకాలం పధ్నాలుగేళ్లూ గడిపేశావు. వనవాసం పూర్తి చెయ్యడమే కాదు, నువ్వు, ప్రతిజ్ఞ సఫలంచేసుకున్నావు. రావణుణ్ణి సంహరించావు. ఇందుకు దేవతలు మిక్కిలీ ఆనందిస్తున్నారు. శత్రుం

జయా! నువ్వు గొప్పపని చేశావు. శ్లాఘనీయమైన కీర్తి సంపాదించుకున్నావు. ఇక రాజ్యపాలనం చేస్తూ తమ్ములతో దీర్ఘాయురారోగ్యభాగ్యా లనుభవించు" అన్నాడు.

ఇది విని రాముడు చేతులు జోడించుకుని "ధర్మజ్ఞా! నువ్వు "నీ కొడుకునీ నిన్నూ విడిచిపెట్టేస్తా" నని కైకమ్మని దూషించావు; కాని అది మరిచిపో, కైకమ్మనీ భరతుణ్ణీ అనుగ్రహించు. ఆ శాపం వారికి తలగకుండా వుండేటట్టు చూడు" అని ప్రార్థించాడు. "సరే" అంటూ దశరథుడు లక్ష్మణుణ్ణి కౌగిలించుకుని "నాయనా! సీతకూ రామునకూ శుశ్రూషచేసి నువ్వు నాకు చాలా ప్రీతికలిగించావు. నీకు ధర్మఫలం లభించింది. రాముని అనుగ్రహం వుంటే ధర్మమూ, విపులయశస్సూ, గొప్పతనమూ, చివరికి స్వర్గమూ లభిస్తాయి, రాముడు సమస్తలోకాలకూ శుభం కోరుతూ వుంటాడు, కనక, యిక ముందుకూడా నువ్వు రాముణ్ణి సేవించుకుంటూ వుండు. ఈ త్రిలోకవాసులూ, ఈ దేవేంద్రుడూ, సిద్ధులూ, ఈ పరమర్షులూ మహాత్ముడూ పురుషోత్తముడూ అయిన రాముణ్ణి పూజిస్తున్నారు. సౌమ్యా! అవ్యక్తమూ, నాశరహితమూ, వేదహృదయమూ, గుహ్యమూ అయిన బ్రహ్మమే ఈ రాముడుగా అవతరించినట్టు బ్రహ్మాదులు చెప్పడం విన్నావుకదూ? సీతారాములను సేవించి నువ్వు ధర్మమూ, యశస్సూ పొందావు," అని ప్రశంసించాడు.

తరవాత అతను సీతను చూసి "వైదేహీ! "నిన్ను విడిచిపెట్టేశా" నన్నందుకు నువ్వు రామునిమీద కోపించవద్దు. రాముడిదంతా నీ శీలం పరిశుద్ధం అని వెల్లడి కావడానికే చేశాడు. భర్తకు శుశ్రూష చెయ్యా లని నీకెవరూ చెప్పనక్కరలేదు. ఇక నేను చెప్పే దేమంటే? రాముడే నీకు పరదైవతం" అని విమానంమీద స్వర్గానికి వెళ్ళిపోయాడు.

## ౧౨౩

## వానరుల నందరినీ బతికించి ఇంద్రుడు దేవతలతో కలిసి వెళ్ళిపోడం

దశరథుడు వెళ్ళిపోయాక మహేంద్రుడు ముందుకి వచ్చి "రామా! మా దర్శనం నీకు అమోఘం అయినది. నీమీద మాకు చాలా ప్రీతి కలిగింది. కనక, నీమనస్సులో వున్న కోరిక యేమిటో చెప్పు?" అని అడిగాడు. దానిమీద సీతా, లక్ష్మణుడూ అనుకరించగా రాముడు "సర్వసురేశ్వరా! నీకు నామీద ప్రీతి కలిగిన ట్టయితే మనవిచేస్తా విను. నాకోసం మిక్కిలీ పరాక్రమించి యుద్ధంలో చచ్చి పోయిన వానరు లందరూ మళ్ళీ బతికి లేవాలి. వారందరూ తమ భార్యాపుత్రపుత్రికలతో సుఖంగా వుండేటట్టు అనుగ్రహించు. వానరులూ, భల్లూకవీరులూ, గోలాంగూలవీరులూ కూడా ఇంటి దగ్గిర బయలుదేరినప్పు డెలా వున్నారో నీరుజులై నిర్వ్రణులై బలపరాక్రమ సంపన్నులై మళ్ళీ సరిగా అలాగే వుండాలి. ఇంతేకాక; వాళ్ళెక్కడ వుంటే అక్కడ నదులు సర్వకాలసర్వావస్థల యందూ నిండుగా పారుతూ వుండాలి. కాలమూ అకాలమూ అనకుండా అక్కడి ఫలవృక్షాలన్నీ యెప్పుడూ పళ్ళతో నిండివుండాలి. అక్కడి ప్రదేశాలు కూడా కందమూలాలతో నిండుగా వుండాలి" అని కోరాడు.

ఇందుకు ఇంద్రుడు మిక్కిలీ సంతోషించి "రామా! నేను చెప్పింది ఎప్పుడూ తప్పిపోలేదు. నామాటకి తిరుగున్నా లేదు. నువ్వు కోరిన దంతా అలాగే సమకూడుతుంది. రాక్షసుల చేతిలో చచ్చి పోయిన వానరు లందరూ బతికిలేస్తారు. భల్లూకవీరులూ, గోలాంగూల వీరులూ కూడా బతికి లేస్తారు. వారందరూ సంపూర్ణశరీరులై పూర్ణారోగ్యవంతు లవుతారు. ఇప్పుడే వారు నిద్రపోయి మేలుకున్నట్టు లేస్తారు. వారందరూ తమ బంధువులతోనూ, మిత్రులతోనూ కలిస్తా

యులతోనూ, చేరి సుఖంగా వుంటారు. వారెక్కడ వుంటే అక్కడి నదు లన్నీ యెల్లప్పుడూ కూలంకషంగా వుంటాయి. వృక్షాలు కాలా కాలభేదం లేకుండా ఫలసమృ ద్ధిగలవై వుంటాయి. ప్రదేశా లన్నీ కంద మూలాలతో నిండివుంటాయి " అని చెప్పాడు.

వెంటనే వానరు లందరూ — అప్పటివరకూ చనిపోయినవా రందరూ బతికిలేచారు. వారందరూ "ఏమిటిది ? " అంటూ ఆశ్చర్యచకితు లున్నూ అయినారు. అందరూ వెంటనే రామునకు నమస్కారా లున్నూ చేశారు. అప్పుడు దేవత లందరూ రాముణ్ణి స్తుతిచేసి "వీరాధివీరా ! అయోధ్యకువెళ్ళిపో. వానరులను ఎవరియిళ్ళకు వాళ్ళని పంపేసెయ్యి. సీత నీయెడల మిక్కిలీ అనురాగవతి. ఆమె నూరడించు. శత్రుఘ్నుణ్ణి ఆనందపెట్టు. నీ తల్లుల నందరినీ పూజించు. ముఖ్యంగా, వ్రతంపట్టి నీకోసం యెదురుచూస్తున్న భరతుణ్ణి ఆదరించు. నువ్వు రాజ్యాభిషిక్తుడవై పౌరుల నందరినీ ఆనందపెట్టు " అని చెప్పి యథేచ్ఛగా విమానాలమీద వెళ్ళిపోయారు. రామలక్ష్మణులు దేవతలకు నమస్కరించి సెలవు పొంది వానరులను "విశ్రమించండి " అని ఆజ్ఞాపించారు. ఆసైన్యం అంతా ఆనందముగ్ధం అయిపోయింది.

## ౧౨౪

## రామునికోసం విభీషణుడు పుష్పక విమానం తెప్పించడం

ఆ రాత్రి అందరూ ఆనందంగా గడిపారు. తెల్లవారేక జయంపలుకుతూ వచ్చి విభీషణుడు "రామా ! స్నానాలూ, అంగరాగాలూ, వస్త్రాలూ, ఆభరణాలూ, చందనమూ, దివ్యకుసుమమాలికలూ ఇవే సిద్ధంచేయించాను. అలంకరించడంలో నేర్పుకల సుందరాంగులున్నూ వీరే వచ్చి వున్నారు. కనక, నామీద అనుగ్రహం వుంచి యివన్నీ స్వీకరించు " అని కోరాడు. దానిమీద రాముడు "విభీషణా !

నీ సమయజ్ఞతకు సంతోషించాను. అయితే, సుగ్రీవాదివానరప్రముఖు లకు నువ్వు స్నానాదిసత్కారాలు చెయ్యి. సుఖాలకే తగిన భరతుడు నాకోసం కనిపెట్టుకునివున్నాడు. కైకమ్మ కొడుకూ ధర్మచారీ అయిన భరతుడు లేకుండా నేను స్నానాంగరాదులు అంగీకరించలేను. కనక, నేను వచ్చినదారినే వెంటనే అయోధ్య చేరుకోవాలి. మార్గం బహు దుర్గమం. త్వరగా బయలుదేరాలి" అని తొందరపెట్టాడు. దానికి విభీష ణుడు "రామా! ప్రయాణంకోసం నువ్వు బెంగపెట్టుకోనక్కరలేదు. ఒక్కపూటలో నిన్ను అయోధ్య చేరుస్తాను. పుష్పకం అని కుబేరుని విమానం వుంది. అది సూర్యబింబంలాగ మెరిసిపోతూ వుంటుంది. కుబేరుణ్ణి జయించి నా అన్న రావణుడది అపహరించి తెచ్చాడు. అది కామగం. ఎక్కడికి వెళ్ళాలని తలుచుకుంటే అక్కడికి నిమిషంలో వెళ్ళిపోతుంది. అది నీకోసమే అట్టేపెట్టాను. ఇంతకీ: నీకు నామీద అనుగ్రహం వున్నట్టయితే, నాగుణాలు నువ్వు స్మరిస్తున్నట్టయితే, నాయెడల నీకు స్నేహమే వుంటే ఇక్కడ వుండు. లక్ష్మణునితోనూ సీతతోనూ నా పూజలు అందుకో. సకలసుఖాలూ అనుభవించు. తర వాత వెళ్ళవచ్చు. ప్రీతితో నేను సమర్పించే ఆతిథ్యం నీ సైన్యంతోనూ, నీ స్నేహితులతోనూ స్వీకరించు. ప్రణయంవల్లా, గౌరవభావంవల్లా, స్నేహంవల్లా నేను నిన్ను ప్రార్థిస్తున్నానే గాని ఆజ్ఞాపించడం లేదు. నేను నీ భృత్యుణ్ణిగాని మరివొకటి కాదు" అని మళ్ళీ ప్రార్థించాడు.

ఇది విని రాముడు రాక్షసులూ వానరులూ అందరూ వింటూ వుండగా "విభీషణా! నువ్వు నాకు మంత్రివై సమస్తవిధాలా పూజించావు. తక్కువ చెయ్యలేదు. నీ స్నేహం నాకు తెలుసు. నీమాట నేను కాదనను; కాని నా తమ్ముణ్ణి చూడాలని నాకు చాలా ఆదుర్దాగా వుంది. నన్ను అయోధ్యకు తీసుకువెడదామని అతను చిత్రకూటానికి వచ్చాడు. అనేకవిధాల ప్రార్థించాడు; కాని నేనతని

మాట వినలేదు. ఇంతేకాక : నాతల్లి కౌసల్యనూ, సుమిత్రమ్మనీ, కైకమ్మనీ, గురువులనూ, స్నేహితులనూ, సకళత్రపుత్రమిత్రంగా పౌరులనూ చూడాలని కూడా నాకు చాలా ఆత్రంగా వుంది. మరి నన్నాపకు. నాపని అయిపోయింది, ఇక నేనిక్కడ యెలా వుండనూ ? కనక, విమానం త్వరగా రప్పించు. విభీషణా! నువ్వు సౌమ్యుడవు. నాకనుజ్ఞ ఇయ్యి. కోపపడకు చెయ్యవలసింది నన్ను త్వరపెడుతోంది. మరి సెలవు" అని మళ్ళీ చెప్పాడు.

విభీషణుడు చేసేది లేక వెంటనే పుష్పకవిమానం తీసుకువచ్చాడు. అది చాలా చిత్రవిచిత్రంగా వుంది. చాలా చక్కగా వుంది. చాలా గొప్పగా వుంది. బంగారంతోనూ, నవరత్నాలతోనూ మిలమిల మెరిసిపోతోంది. మేరుపర్వతశిఖరంలా వుంది. అది విశ్వకర్మ నిర్మించాడు. అది రాముని యెదట వుంచి విభీషణుడు పక్కగా నుంచున్నాడు.

## ౧౨౫

## రామాజ్ఞతో విభీషణుడు వానరులను సత్కరించడం

విమానం యెదట వుంచి విభీషణుడు వినయవినమితుడై "రామా! ఇంకేమి సెలవు ?" అని అడిగాడు. దానిమీద, రాముడు, లక్ష్మణుడు వింటూవుండగా "విభీషణా! చాలా విధాల ప్రయత్నించి ఈపని నెరవేర్చినవారు వానరులు. రత్నాలూ, ద్రవ్యమూ, ఆభరణాలూ యిచ్చి వారిని పూజించు. అటు లంక జయించశక్యం కానిది. ఇటు వానరులు ప్రాణాలమీద ఆశవదులుకుని పోరారు. అంచేతనే లంక స్వాధీనం అయింది. కనకనే వారిని పూజించమంటున్నాను. నీకు సాయంచేసినవారు వారు. అదిగుర్తించి నువ్వు సన్మానం చేస్తే వారు ఆనందిస్తారు. అలా చేస్తేవా, త్యాగి వనీ, ధనవంతుడ వనీ, మిత్రులను సంగ్రహించేవాడ వనీ, దయాపరుడ వనీ, యశోవంతుడ వనీ, అం

దరూ నిన్ను గుర్తిస్తారు. ఇంతకీ: నేను నిన్ను ప్రోత్సహిస్తున్నాను; కాని బలవంతపెట్టడంలేదు. రాజయినా క్రోధంతో హింసించేవాణ్ణీ, ఔదార్యం లేనివాణ్ణీ అసహ్యించుకుని సైనికులు విడిచేస్తారు" అనిచెప్పాడు.

వెంటనే విభీషణుడు విలువలేని రత్నాలతోనూ, ఆభరణాలతోనూ వానరుల నందరినీ యథాక్రమంగా గౌరవించాడు. ఈసత్కారం పూర్తి కాగానే రాముడు లక్ష్మణునితో కూడా విమానం యెక్కి సిగ్గుపడుతున్న సీతను వొళ్లో కూచోపెట్టుకున్నాడు. తరవాత వానరుల నందరినీ సాదరంగా చూస్తూ సుగ్రీవుణ్ణీ విభీషణుణ్ణీ పిలిచి "వానరోత్తములారా! మీరు మిత్రకార్యం నెరవేర్చారు. నేను సెలవిస్తున్నా, నికయథేచ్ఛగా మీయిళ్లకి వెళ్లిపొండి. సుగ్రీవుడా! నువ్వు ధర్మభీరుడవు. అంచేత స్నేహితు డేమి చెయ్యాలో నువ్వదంతా చేశావు; కనక, నీసైన్యం వెంటబెట్టుకుని యిక కిష్కింధకు వెళ్లి సుఖంగా వుండు. విభీషణా! నువ్వికనేనిచ్చిన రాజ్యం పాలించుకుంటూ లంకలో సుఖంగా వుండు. దేవతలూ ఇంద్రుడూ వచ్చినా నిన్నేమీ చెయ్యలేరు. మిమ్మల్నందరినీ సెలవడుగుతున్నాను. ఇక నేను మా తండ్రిగారి రాజధాని అయోధ్యకు వెళ్లిపోతాను" అన్నాడు.

దీనిమీద వానరులూ విభీషణుడూ చేతులు దోయిలించుకుని "రామా! మేమయోధ్యకు రావాలని ముచ్చటపడుతున్నాము. అక్కడ మేము నగరాలూ వనాలూ చాలా జాగ్రత్తగా చూస్తాము. నీపట్టాభిషేకం చూసి కౌసల్యకు సాష్టాంగనమస్కారాలు సమర్పించి, తరవాత మాయిళ్లకు మేము వెళ్లిపోతాము" అంటూ ప్రార్థించారు.

## రాముడు పుష్పకంమీద అయోధ్యకు బయలుదేరడం

"సుగ్రీవా! విభీషణా! ఇప్పటికే నేను చాలా గొప్పలాభాలు పొందాను. మీతోకూడా అయోధ్యకు వెళ్లి మరీమరీ ఆనందిస్తాను. కనక, సుగ్రీవా!

త్వరగా విమానంయెక్కు. అని పిలిచాడు. నీవానరయోధులందరితోనూ యెక్కు. విభీషణా! నువ్వు కూడా నీమంత్రులతో త్వరగా యెక్కు" అన్నాడు. అందరూ యెక్కారు. తరవాత కుబేరుని ఆగొప్పవిమానం రాముని ఇంగితం కనిపెట్టి ఆకాశాని కెగిరింది. దానిమీద వెడుతూ రాముడు చాలా సంతోషించాడు. వానరులూ రాక్షసులూ కూడా ఎంతమంది వుండినా అందరూ ఇరుకు అనేదిలేకుండా పుష్పకంలో సుఖంగా కూచున్నారు.

౧౨౯

## రాముడు సీతను స్థలవిశేషాలు చూపిస్తూ అయోధ్యకు బయలుదేరడం

రాముని అనుజ్ఞ కాగానే గాలి కెగిరిన మేఘంలాగ విమానం ఆకాశాని కెగిరి బయలుదేరింది. అప్పుడు రాముడు అటుచూస్తూ సీతను పిలిచి "వైదేహీ! అదే లంకాపట్నం, కైలాసశిఖరంవంటి త్రికూట శిఖరంమీద, చూశావా? అది విశ్వకర్మ నిర్మించాడు. ఇదిగో యిది యుద్ధరంగం, రక్తమాంసాలతో అది బురద అయిపోయివుంది; చూశావా? రావణుడు మహాతపస్సు చేసి గొప్పగొప్ప వరాలనేకాలు సంపాదించాడు. గొప్పవీరు డని చాలా పేరుపొందాడు; కాని నీమూలాన నాచేతిలోకూలిపోయి అక్కడే మసి అయిపోయాడు. కుంభకర్ణు డిక్కడే చచ్చిపోయాడు. ప్రహస్తుడుకూడా ఇక్కడే నీలుని చేతిలో నాశనం అయినాడు. హనుమంతు డిక్కడే ధూమ్రాక్షుణ్ణి సంహరించాడు. సుషేణు డిక్కడే విద్యున్మాలిని చంపాడు. లక్ష్మణుని చేతిలో ఇంద్రజిత్తూ, అంగదుని చేతిలో వికటుడూ ఇక్కడే చచ్చిపోయారు. విరూపాక్షుడూ, మహాపార్శ్వుడూ, మహోదరుడూ, అకంపనుడూ కూడా ఇక్కడే హతం అయిపోయారు. బలపరాక్రమవంతులైన రాక్షసులనేకులు కూడా యిక్కడే బుగ్గి అయిపోయారు. వేలకొద్దీవున్న

సవతులతో వచ్చి మండోదరి యిక్కడే రావణుని కళేబరంమీాదపడి గోల పెట్టింది. ఇదిగో, ఈసముద్రతీరం చూశావా, సముద్రందాటి యిక్కడే మేము ఆరాత్రి నివసించాము. ఇదిగో, యీసేతువు నీకోసం నేను నిర్మించాను. ఇది నిర్మించిన సమర్థుడు నళుడు. మిక్కిలీ గర్జిస్తున్న అపార మైన సముద్రం చూశావా? అదే హిరణ్యనాభం అయిన మైనాక పర్వతం. హనుమంతుడు సముద్రం దాటినప్పుడు అతనికి విశ్రాంతి యివ్వడాని కది సముద్రలోంచి పైకి పొడుచుకువచ్చింది. ఇదిగో, సముద్రానికి మధ్యగా - సేతువుమీాద ఈస్థలంలోనే వానర సేన కొంతసేపు విశ్రమించింది. ఇదిగో సముద్రంలో సేతుబంధం అనే తీర్థం యిది. ఇది త్రిలోకాలచేతనూ పూజింపబడుతోంది. ఇది పరమ పవిత్రమైన స్థలం. ఎలాంటి మహాపాతకా లయినా ఈతీర్థం పోగొట్టు తుంది. ఇక్కడే మహాదేవుడు నామీాద అనుగ్రహం చూపించాడు. రాక్షసరా జయిన విభీషణుడు వచ్చి నన్నిక్కడే కలుసుకున్నాడు. అదిగో, చిత్రవిచిత్రా లైన ఉద్యానాలతో కనపడుతోంది చూడూ. అది కిష్కింధ. సుగ్రీవుని రాజధాని అది. అక్కడే నేను వాలిని సంహ రించాను" అని చెప్పాడు.

కిష్కింధ చూశాడప్పటికి, ప్రణయసాధ్వస అయి సీత "నాథా, తారా మొదలైన సుగ్రీవుని భార్యలనూ తక్కిన వానరుల భార్య లనూ నేను చూడాలి. మన అయోధ్యకు వారిని తీసుకువెళ్ళా లని సరదాగా వుంది" అని అడిగింది. అందుకు రాముడు "అలాగే చేతాం" అంటూ విమానం కిష్కింధకు చేర్చాడు. సుగ్రీవుణ్ణి పిలిచి "వానరరాజేంద్రా" వానరు లందరూ తమ భార్యలలో అయోధ్యకు రావా లని సీత అభిలాష. నువ్వు కూడా నీ భార్యల నందరినీ వెంట బెట్టుకురావా" లని చెప్పాడు. దానిమీాద సుగ్రీవుడు విమానం దిగి అంతఃపురానికి వెళ్ళి తారను పిలిచి "ప్రియా! నువ్వూ నీ సవతులూ

తక్కిన వానరపత్నులూ అయోధ్యకు రావాలి. ఇది సీత కోరికా, రాముని సెలవున్నూ. త్వరగా బయలుదేరండి, కులాసాగా అయోధ్య చూసివత్తాం" అన్నాడు. తార నిమిషంలో వానర స్త్రీల నందరినీ చేర్చి "మన మందరమూ అయోధ్యకు వెళ్ళాలి. ఇది మహారాజు ఆజ్ఞ. అయోధ్య చూడాలని నాకూ వుంది. రాముడయోధ్య ప్రవేశించడమూ, అక్కడి జనుల భోగభాగ్యాలూ చాలా గొప్పగా వుంటాయి. మనం దశరథమహారాజు భార్యలను కూడా చూడవచ్చు. అక్కడి స్త్రీల సొగసూ, నాగరికతా చూసివద్దాం" అని చెప్పింది. వానరాంగన లందరూ ఇందు కంగీకరించారు. చక్కగా అలంకరించుకుని వచ్చి ప్రదక్షిణనమస్కారాలుచేసి విమానం యెక్కారు. విమానం మళ్ళీ బయలుదేరింది. వెంటనే రాముడు మళ్ళీ అందుకున్నాడు.

"సీతా, అదిగో మెరుములతో నిండిన నీలమేఘంలా వుంది, చూడూ, అది ఋశ్యమూకం. దానినిండా కాంచనధాతువు లపారంగా వున్నాయి. ఈపర్వతంమీదే నేనూ సుగ్రీవుడూ కలుసుకుని స్నేహంచేసుకున్నాం. వాలిని చంపుతానని యిక్కడే నేను సుగ్రీవునకు మాట యిచ్చాను. చిత్రవిచిత్రాలైన అడవులతో పరివృతమైన అదే పంపాసరోవరం. అందులో వున్న తామరపువ్వులు చూడూ, ఎంత చక్కగా వున్నాయో ! నీకోసం నేనిక్కడ యేడ్చేశాను, చెప్పవద్దూ ? మరిన్నీ, ధర్మచారిణి అయిన శబరిని నేనిక్కడే చూశాను. ఆమడపొడుగుచేతులతో భయంకరుడయివుండిన కబంధుణ్ణి నేనిక్కడే చంపాను. అదిగో, జనస్థానంలో ఆవటువృక్షం చూశావా ? అక్కడే నీకోసం రావణుణ్ణి యెదిరించి జటాయువు ఘోరయుద్ధంచేశాడు పాపం. అదిగో, మనం నివసించిన ఆశ్రమం. పర్ణశాల అదిగో ! అక్కడే నేను ఖరుణ్ణీ, దూషణుణ్ణీ త్రిశిరుణ్ణీ సంహరించాను. మాయావి అయిన రావణుడు ఇక్కడే బలాత్కారంగా నిన్నెత్తుకుపోయాడు.

ఇదిగో, రమ్యమైన గోదావరి. అదిగో, అగస్త్యమహర్షి ఆశ్రమం. అదిగో సుతీక్ష్ణుని ఆశ్రమం. అదిగో, శరభంగాశ్రమం కూడా కనబడుతోంది. ఇంద్రుడిక్కడికే వచ్చాడు. ఈప్రదేశంలోనే నేను మహాకాయుడైన విరాధుణ్ణి సంహరించాను. అదిగో, అక్కడ మునుల పర్ణకుటీరాలెన్ని వున్నాయో చూశావా? అది అత్రిమహర్షి ఆశ్రమం. అక్కడే నువ్వు మహాతపస్వాలిని అయిన అనసూయదర్శనం చేశావు. ఇదిగో, యిది చిత్రకూటపర్వతం. భరతుడు నన్ను వెనక్కి తీసుకువెళ్ళడానికి ఇక్కడే బతిమలాడాడు. అదిగో. దూరాన యమునానది కనపడుతోంది. అక్కడి అడవు లెంత ముచ్చటగా వున్నాయో! ఇదిగో భరద్వాజాశ్రమం. ఇదిగో త్రిపథగ అయిన గంగ. అందులో విహరించే పిట్టలు చూశావా? అక్కడి అడవుల్లో ఎంత చక్కని పువ్వులున్నాయో చూశావా?

అమ్మయ్యా, అదిగో మానాయనగారి అయోధ్య. సీతా మనం మళ్ళీ అయోధ్యకు వచ్చినందుకు నమస్కరించు"

ఇది విని వానరులూ రాక్షసులూ ఎగిసిపడుతూ అయోధ్య చూశారు. ఆవీధుల వెడల్పూ, తెల్లని ఆమేడల వరసలూ, ఆయేనుగులూ, ఆగుర్రాలూ, ఆరథాలూ చూసి, వానరు లది స్వర్గంలా వుందని ఆనందించారు.

## ౧౨౭
## రాముడు మళ్ళీ భరద్వాజాశ్రమం చూడడం

రాముడు వనవాసదీక్షతో చైత్రశుద్ధపంచమినాడు అయోధ్య విడిచి బయలుదేరాడు. పధ్నాలుగేళ్ళు నిండాక మళ్ళీ చైత్రశుద్ధ పంచమి నాడు మళ్ళీ భరద్వాజుని దర్శనంచేసి యథావిధిగా వందనాదికం చేశాడు. తరవాత "మహర్షీ! అయోధ్యానగరం సుభిక్షంగా

వుంధా? పౌరు లందరూ ఆరోగ్యంగా వున్నారా? భరతుడు ప్రజా పాలనం చక్కగా చేస్తున్నాడా? మాతల్లు లందరూ బతికిబాగా వున్నారా?" అని అడిగాడు. దానికి భరద్వాజుడు చిరునవ్వు నవ్వుతూ "రామా! అందరూ క్షేమంగా వున్నారు. భరతుడు నిద్రాహారాలు లెక్కచెయ్యక ధూళిధూసరిత దేహుడై వున్నాడు. అతని తల అంతా జడలుకట్టిపోయివుంది. నీ పాదుకలను ముందుంచుకుని ప్రజాపాలనం మాత్రం అతను చక్కగానే చేస్తున్నాడు. వెనక నిన్ను చూసినప్పుడు నాకు చాలా దుఃఖం కలిగింది. అప్పుడు నువ్వు వన వాసానికి వెడుతూవచ్చావు. నారచీరలు కట్టుకున్నావు. లక్ష్మణుడూ సీతా మాత్రమే నీవెంటవచ్చారు. రాజ్యం పోగొట్టుకుని కేవలమూ ధర్మకాముడవై కాలినడకను వచ్చావు. పితృవాక్యపరిపాలనాదీక్షలో వున్నావు. సర్వస్వమూ విడిచిపెట్టేశావు. సర్వభోగాలూ పరిత్య జించివున్నావు. కానైతే, స్వర్గభ్రష్టుడైన దేవకుమారుడు లాగే వున్నావు కాని నాకు హృదయం తరుక్కుపోయింది. ఇక యిప్పుడు — నువ్వు ఇప్పుడు సర్వసంపత్సమృద్ధుడవై వున్నావు. మిత్రగణంతోనూ, బంధువర్గంతోనూ కూడుకుని వున్నావు. పరమశత్రువును జయించి వచ్చావు. అంచేత నిన్ను చూస్తే నాకిప్పుడు చాలా ఆనందంగా వుంది. రామా! నీసుఖదుఃఖా లన్నీ నాకు తెలుసు. నువ్వు జన స్థానంలో అనేకమంది రాక్షసులను సంహారించడమూ, బ్రాహ్మణుల కోరకమీాద నువ్వు మునుల నందరినీ రక్షిస్తూ వుండగా పవిత్రురాలైన నీభార్య యీాసీతను వంచించి రావణుడెత్తుకుపోడమూ, మారీచుణ్ణీ కబంధుణ్ణీ సంహారించడమూ, పంపాసరస్సు దగ్గరికి వెళ్ళడమూ, సుగ్రీవునితో సఖ్యంచేసి వాలిని వధించడమూ, సీతను వెతకడానికి వెళ్ళి హనుమంతుడు లంకాదహనం చెయ్యడమూ, సీత సంగతి తెలిశాక నళుడు సేతువునిర్మించడమూ, వానరులు లంకను మళ్ళీ తగలబెట్టడమూ,

పుత్రులతోనూ, బంధువులతోనూ, అమాత్యులతోనూ, సకలచతురంగ బలంతోనూ లోకకంటకుడైన రావణుడు నాశనం అయిపోడమూ, దేవతలు వచ్చి నీకు వరాలివ్వడమూ — ఇదంతా తపోమహిమవల్ల నాకు తెలిసేవుంది. వీరాధివీరా! నేను కూడా నీకిప్పుడు వరం యిస్తాను; ఏమికావాలో కోరుకో! ఇవాళ నా ఆశ్రమంలో యింత చారూ అన్నమూ పుచ్చుకుని రేపు అయోధ్యకు వెడుదువుగాని" అన్నాడు.

అందుకు మిక్కిలీ సంతోషించి రాముడు భరద్వాజుని ఆజ్ఞ శిరసా వహించాడు. అయితే "అకాలంలో కూడా వృక్షా లన్నీ పళ్ళతో నిండివుండేటట్టూ, ఆపళ్ళు తేనెలోడుతూ చాలా మధురంగా వుండేటట్టూ, అవి రకరకాలుగా కూడా వుండేటట్టూ అనుగ్రహించు" అని వరం కోరాడు. భరద్వాజుడు "తథాస్తు" అన్నాడు. వెంటనే అక్కడి చెట్లన్నీ స్వర్గంలో వుండే చెట్లవంటివి అయిపోయాయి. ఎండిపోయిన వన్నీ ఆకుతొడిగాయి. ఆకుతొడిగిన వన్నీ పూశాయి. పూసిన వన్నీ కాసి పండి తేనెలూర సాగాయి. రాముడు వెళ్ళే మార్గంలో మూడామడల పొడుగున యిలా జరిగింది. అది చూసి వానరులు చాలా వింత పడి, కడుపులు బరువెక్కేటట్టు రకరకాల పళ్లు లెక్కలేకుండా తిని గ్రుచ తేన్చి అమందానందకందళితహృదయారవిందులైనారు.

## ౧౨౮

## హనుమంతుడు రామునిసంగతిచెప్పగా భరతుడు ఆనందముగ్ధుడవడం

రాముడు అయోధ్యను తలుచుకుని ఒక్క క్షణం ఆలోచించి, హనుమంతుణ్ణి పిలిచి "వానరవీరా! అయోధ్యకు వెళ్ళి నువ్వు రాజాంతఃపురంలో వున్న మాతల్లులు మొదలైనవా రందరూ కుశలంగా వున్న సంగతి తెలుసుకురావాలి. ముందుగా నువ్వు శృంగిబేరపురం వెళ్ళు. ఆటవికులరాజు

అక్కడ గుహుడున్నాడు. అతణ్ణి కలుసుకో. నేను చెప్పినట్టు నాక్షేమం అతనికి తెలియజెయ్యి. నేనంటే గుహునకు ప్రాణం. నేను ఆరోగ్యవంతుణ్ణాయి నిర్విచారిన్నై కుశలినయి వున్నానని వింటే అతను చాలా ఆనందిస్తాడు. అయోధ్యకు ఎలా వెళ్ళాలో, భరతుని ప్రవృత్తి యెలా వుందో అతను నీకు సక్రుచ్ఛంగా చెబుతాడు. నువ్వు భరతునితో కూడా నేను చెప్పినట్టుగా నాకుశలం తెలియజెప్పు. నేను కృతార్థుణ్ణయి లక్ష్మణునితోనూ, సీతతోనూ కలిసి తిరిగి వచ్చానని చెప్పు. బలవంతుడైన రావణుడు సీత నెత్తుకుపోవడమూ, సుగ్రీవునితో నాకు సఖ్యం సమకూడడమూ, నేను సుగ్రీవునికోసం వాలిని సంహరించడమూ, సీతను వెతకడంకోసం బయలుదేరి నువ్వు సముద్రం దాటడమూ లంకకు వెళ్ళడమూ, అక్కడ నీకు సీత కనపడ్డవైనమూ, మన మందరమూ సముద్రం దగ్గిరికి వెళ్ళడమూ, సముద్రుడు ప్రత్యక్షం కావడమూ, సేతుబంధనమూ, రావణుడెలా చచ్చిపోయాడో ఆవివరాలూ, తరవాత నాకు మహేంద్రుడూ, బ్రహ్మదేవుడూ, వరుణుడూ వరాలివ్వడమూ, మహేశ్వరుని అనుగ్రహంవల్ల నేను నాతండ్రి దశరథమహారాజును చూడడమూ, తిరిగియిక్కడికి నేను చేరుకోడమూ సవిస్తరంగా చెప్పు. చెప్పి ఇదంతా విని భరతుడెలా అవుతాడో ఏమిచేస్తాడో అంతా పరకాయించు. నావిషయమై అతని ఊహాపోహ లెలా వున్నాయో జాగ్రత్తగానూ, స్పష్టంగానూ తెలుసుకోవాలి సుమా! "శత్రువులనందరినీ సంహరించి, రాముడు అపారమైన యశస్సు సంపాదించుకుని, కృతార్థుడై మహాబలపరాక్రమవంతులైన మిత్రులతో కలిసివచ్చా" డని నువ్వు చెబితే అతని భావసరణి యెలా వుంటుందో నువ్వు పూర్తిగా గ్రహించాలి. ఏమంటే? మా పితృపితామహార్జితమైన రాజ్యం సర్వకాలసర్వావస్థల్లోనూ సర్వసమృద్ధంగా వుంటుంది. ఏనుగుల బలమూ, రథబలమూ, అశ్వబలమూ అపారంగా వుంది. అలాంటిది ఎవని మనస్సు

లాగేసుకోకుండా వుంటుందీ? ఒకవేళ, భరతుడు, తానే రాజ్యం పాలించా లనుకుంటూ వుంటా డనుకో. అతనూ రఘునందనుడే. కనక, యీ రాజ్యం అంతా అతనే యేలుకోవచ్చు. అతని బుద్ధి యెలా వుందో తెలుసుకో. అతని ప్రయత్నా లెలావున్నా యో పసికట్టు. మనం ముందుకి దూరం వెళ్ళకుండానే వచ్చి నా కంతా చెప్పు''అని చెప్పాడు.

ఇది వినడమే తడవుగా హనుమంతుడు మనిషి ఆకారంతో అయోధ్యకు ఎగిరివెళ్ళాడు. అతను గరుత్మంతునికంటే వేగంగా వెళ్ళి గంగా యమునా సంగమం దాటి, శృంగిబేరపురంవెళ్ళి, గుహుణ్ణి కలుసుకుని "నిషాదరాజా! నీ సఖు డైన రాముడు సీతతోనూ లక్ష్మణునితోనూ కలిసి నీ క్షేమవార్త లడిగిరమ్మన్నారు. ఇవాళ పంచమి. రాముడు ఇవాళ రాత్రి కూడా భరద్వాజాశ్రమంలో వుంటాడు. రేపు నువ్వి క్కడ కలుసుకుంటావు'' అని చెప్పి మళ్ళీ బయలుదేరాడు.

మార్గంలో అతను పరశురామతీర్థం చూశాడు. వాలుకినీనది చూశాడు. గోమతీనదీ, భయంకర మైన సాలవనమూ చూశాడు. చక్కని గ్రామాలు చూశాడు. ఆ గ్రామాలలో వేలకొద్దీ జనులు ఆనందభరితులై వుండడం చూశాడు. మళ్ళీ బయలుదేరి చాలా దూరం వెళ్ళాడు. అయోధ్య ఒక కోసుదూరాన వుండనగా ఒకచోట మహేంద్రుని నందనవనమూ, కుబేరుని చైత్రరథమూ మించివున్న ఒక వనం చూశాడు. అది నందిగ్రామంలోది. అక్కడి జను లందరూ- స్త్రీలూ పురుషులూ కూడా ఆబాలగోపాలమూ చక్కగా అలంకరించుకుని మహోల్లాసంగా వున్నారు. అక్కడ వాక ఆశ్రమం వుంది. భరతు డందులో వున్నాడు. అతను కృశించి దీనంగా వున్నాడు. తల అంతా జడలుకట్టివుంది. శరీరం అంతా బూడిదబుస్సిన వేషంతో వుంది. ఎంతసేపూ అతను రామునకు వచ్చిన ఆపదలు తలుచుకు కృశిస్తూ వుంటాడు. కందమూలాలూ పళ్ళూ మాత్రమే భుజిస్తాడు. దాంతుడై, ధర్మచారి అయి తపస్సు చేసుకుంటూ వుంటాడు. అతని తల అంతా ఎత్తుగా జడలుకట్టుకుపోయింది.

అతను నారచీరలూ అజినాలూ మాత్రమే ధరిస్తాడు. రాముని పాదుకలు ముందుంచుకుని చాతుర్వర్ణ్యమూ రక్షిస్తూ రాజ్యపాలనం చేస్తూ వుంటాడు. అతని అమాత్యులూ, పురోహితులూ, సేనాధిపతులూ కూడా కాషాయాంబరాలు ధరించి త్రికరణయా శుచు లయి వుంటారు.

ధర్మమే రూపొందినట్టున్న అతణ్ణి చూసి హనుమంతుడు "దేవా! నారచీరలు కట్టుకుని దండకారణ్యంలో వుంటూ వుండే యెవరిని గురించి నువ్విలా కృశిస్తున్నావో ఆరాముడు నీకు తన కుశలం చెప్పమన్నాడు. నీకొక్క ప్రియవార్త చెబుతాను. దాంతో నీశోకం అంతా పోతుంది. అదేమిటంటే? ఈక్షణంలోనే నువ్వు రాముణ్ణి కలుసుకుంటావు. రావణుణ్ణి సంహరించి, సీతను కలుసుకుని రాముడు సమృద్ధార్థుడై మహాబలపరాక్రమవంతులైన మిత్రులతో వస్తున్నాడు. మహాతేజశ్శాలి అయిన లక్ష్మణుడూ, ఇంద్రునితో కూడా శచీదేవి లాగ రామునితో సీతాకూడా వస్తున్నారు" అని చెప్పాడు.

భరతు డిది విన్నాడు. అతనికి ఆనందం తలమునక లయిపోయింది. అది పట్టలేక అతను మూర్ఛిల్లిపడిపోయాడు; కాని ఒక్క క్షణానికి తేరుకున్నాడు. లేచి "హనుమంతుణ్ణి కౌగలించుకుని, ఆనంద బాష్పాలతో అతని శిరస్సు అభిషేకించి "నువ్వు దేవతవో మనిషివో నాకు తెలియడం లేదు. నాయెడల మిక్కిలీ దయవుంది కనక, యిక్కడికి వచ్చావు. ఈసంతోషవార్త చెప్పినందు కానందించి నీకు నేను లక్ష గోవులూ, గొప్పగ్రామాలు నూరూ, సర్వాభరణసంపన్నలూ సద్వంశసంజాతలూ అయిన పదహారుగురు కన్యలను భార్యలుగానూ ఇస్తున్నాను" అని చెప్పాడు.

తరవాత కొంతసేపు అతను మళ్లీ ఆనందముగ్ధు డయిపోయాడు.

## ౧౨౬
## హనుమంతుడు భరతునకు సీతాపహరణాదికం అంతా చెప్పడం

ఇలాగ మిక్కిలీ ఆనందించి భరతుడు "చాలాకాలం వనవాసం చేసిన నాప్రభువు కుశలవార్త మళ్ళీ ఇంతకాలానికి విన్నాను. "మనిషి బతికి

వుంటే నూరేళ్ళకైనా ఆనందం అనుభవిస్తా" డన్న నానుడి సార్థకంగా వుంది. అయితే, రామునకూ వానరులకూ స్నేహం ఎక్కడ, ఎందువల్ల, ఎలా అయిందో అది నాకు వివరంగా చెప్పు" అని అడిగాడు.

తివాసీమీద కూచోబెట్టి భరతు డిలా అడగ్గా హనుమంతుడు ప్రారంభించాడు.

"రఘునందనా! రాముని పాదుకలు పుచ్చుకుని నువ్వు తిరిగివచ్చేదాకా జరిగిం దంతా నీకు తెలిసిందే. ఇక తరవాతి కథ. రాముడు, సీతతోనూ లక్ష్మణునితోనూ తరవాత అడవియేనుగులూ పులులూ సింహాలూ నిండివుండిన దండకారణ్యం ప్రవేశించాడు. వారు వెడుతూ వుండగా పెడబొబ్బలు పెట్టుకుంటూ విరాధు డనే క్రూరరాక్షసు డెదురువచ్చాడు. రామలక్ష్మణులు వాణ్ణి సంహరించి మదపుటేనుగును పూడ్చేటట్టు, ఒకగొయ్యి తవ్వి అధోముఖంగా పూడ్చేశారు. తరవాత వారు సాయంకాలానికి శరభంగాశ్రమం చేరుకున్నారు. రాముణ్ణి చూసేదాకా బతికి వుండి తరవాత శరభంగుడు స్వర్గానికి వెళ్ళిపోగా, వారు ముగ్గురూ అక్కడి మునులకు నమస్కరించి సెలవు పొంది జనస్థానానికి వెళ్ళిపోయారు. అక్కడ వుండగా శూర్పణఖ అనే రాక్షసాంగన రాముని దగ్గిరికి వచ్చింది. రాముడు చెప్పగా లక్ష్మణుడు కత్తి పుచ్చుకుని దాని ముక్కూ చెవులూ కోసేశాడు. దానిమీద వారిమీదికి పధ్నాలుగువేల రాక్షసులు దండెత్తివచ్చారు. రాము డొక్కడే వాళ్ళ నందరినీ సంహరించాడు. పగటిలో నాలుగోవంతు కాలంలోనే వాళ్ళందరూ హతులయిపోయారు. తరవాత రాముడు ఖరుణ్ణి చంపాడు. మరికొందరు రాక్షసప్రముఖులనూ చంపాడు. ముక్కూ చెవులూ తెగిపోయిన శూర్పణఖ రావణుని దగ్గిరికి వెళ్ళి గోలపెట్టింది. రావణానుచరుడూ మాయావీ అయిన మారీచు డనే రాక్షసుడు జనస్థానానికి వచ్చి మాయలేడి అయి సీతను లోభపెట్టాడు. "నాథా! ఆమృగం యెంతో చక్కగా వుంది. అది వుంటే మన ఆశ్ర

మం యెంతో సొగసుగా వుంటుంది. కనక పట్టుకుని తీసుకురా” అని కోరింది. రాముడు ధనుష్పాణి అయి వెళ్లి అది అందకపోగా బాణం వేసి కొట్టి చంపేశాడు. రాముడు లేడికోసం వెళ్ళాక, అంత నెంతకూ తిరిగిరానందుకు భీతిల్లి సీత తొందరపెట్టి లక్ష్మణుణ్ణి పంపింది. ఇలాగ, రాముడూ లక్ష్మణుడూ కూడా ఆశ్రమంలో లేకపోవడం చూసి పొంచివుండిన రావణుడు ఆశ్రమం ప్రవేశించి సీత నెత్తుకుపోయాడు. జటాయువు అనే గృధ్రరాజు రావణుణ్ణి అడ్డుకున్నాడు. ఘోరయుద్ధం జరిగింది. చివరికి రావణుడు జటాయువును చంపి సీత నెత్తుకుని మళ్ళీ ఆకాశమార్గాన బయలుదేరాడు. అప్పుడు ఋశ్యమూక పర్వతంమీద వుండిన వానరులు కొంద రది చూశారు.

రావణుడు సీతను లంకకు తీసుకుపోయి గొప్ప మేడలో వుంచి బతిమాలాడు. సీత ఆ మాటలు వినిపించుకోలేదు. రావణుణ్ణి గడ్డిపరకగా భావించి తిరస్కారం కూడా చేసింది. దాంతో రావణు డామెని అశోకవనంలో వుంచి రాక్షసాంగలను కాపుంచాడు.

ఇక్కడ రాముడు లేడిని చంపి ఆశ్రమానికి వచ్చాడు. జటాయువు వల్ల సంగ తంతా విన్నాడు. తరవాత, చనిపోయిన జటాయువున కగ్నిసంస్కారంచేసి సీతను వెతుక్కుంటూ రామలక్ష్మణులు గోదావరీ ప్రాంతం చేరారు. అక్కడ కబంధుడు కనపడ్డాడు. వాడి మాటమీద రామలక్ష్మణులు ఋశ్యమూకపర్వతం చేరి అక్కడ సుగ్రీవుణ్ణి కలుసుకున్నారు. వారి కిద్దరికీ ఒకరి నొకరు చూసుకోగానే సౌహార్దం కలిగింది. అన్నగా రైన వాలి తరిమివెయ్యగా సుగ్రీవు డప్పు డక్కడ తలదాచుకుని వున్నాడు. కొంతసేపు మాట్లాడుకునేటప్పటికి వారి కిద్దరికీ గాఢస్నేహం యేర్పడింది. రాముడు మహాకాయుడూ మహాబలుడూ అయిన వాలిని సంహరించి సుగ్రీవునకు వానరరాజ్యం పట్టం కట్టాడు. అప్పుడు సీతను వెతికిస్తా నని రామునకు ఇచ్చిన మాటప్రకారం సుగ్రీవుడు పదికోట్లమంది వానరులను దశదిక్కులకూ పంపాడు.

నే నందులో వాకజట్టులో వున్నాను. మాజట్టు వింధ్యపర్వతంమీద వుండగానే సంకేతకాలం గడిచిపోయింది. ఇంతలో జటాయువు సోదరుడైన సంపాతి కనపడి మాకు సీత రావణుని యింటో వుందని చెప్పాడు. నేను నూరామడల వెడల్పుగల సముద్రం దాటి లంకకు వెళ్ళి అశోకవనంలో దీన అయివుండిన సీతను చూశాను. నేనామెతో మాట్లాడి గుర్తుకోసం రాముడిచ్చి పంపిన రత్నాంగుళీయకం ఆమె కిచ్చాను. ఆమె కూడా నాకు ఆనవాలుగా ఒక మణి యిచ్చింది. ఆ మణి నేను రామున కియ్యగా రాముడు మిక్కిలీ ఆనందించి, వానర సేనతో లంకమీదికి బయలు దేరాడు. మాలో నళుడనేవాడు సముద్రంలో సేతువు కట్టాడు. అందరమూ లంకలో ప్రవేశించాం. మాలో నీలుడు ప్రహస్తుణ్ణి చంపాడు. రాముడు కుంభకర్ణుణ్ణి చంపాడు. లక్ష్మణుడు రావణకుమారుడైన ఇంద్రజిత్తుని చంపాడు. చివరికి రాముడు స్వయంగా రావణుణ్ణి సంహరించాడు. తరవాత రాముడు ఇంద్రునితోనూ, యమునితోనూ, వరుణునితోనూ, మహేశ్వరునితోనూ, బ్రహ్మతోనూ, మీతండ్రి అయిన దశరథునితోనూ కలుసుకుని, వారి వల్లా దేవర్షులవల్లా వరాలు పొంది వానరులతో కూడా పుష్పక విమానంమీద కిష్కింధకు వచ్చాడు. అక్కణ్ణుంచి గంగాతీరాన భరద్వాజాశ్రమానికి వచ్చి యిప్పు డక్కడ వున్నాడు. రేపు పుష్యనక్షత్రాన నువ్వతణ్ణి చూడగలవు ”

ఇది విని భరతుడు “ ఇప్పటికి నా చిరమనోరథం తీరింది ” అంటూ మిక్కిలీ ఆనందించాడు.

## ౧౩౦

## రాముడు నందిగ్రామంలో ఆత్మీయులతో కలుసుకోవడం

ఇలా ఆనందిస్తూ భరతుడు శత్రుఘ్నుణ్ణి పిలిచి “ తమ్ముడూ ! పౌరులు శుచిర్భూతులై దేవాలయాలలోనూ, చైత్యగృహాలలోనూ సుగంధాల

తోనూ, పూలమాలికలతోనూ పూజావిధులు నెరవేర్చాలి. స్తుతించడంలో మిక్కిలీ నేర్పరులూ, పురాణాలన్నీ బాగా తెలిసినవారూ అయిన సూతులూ, వైతాళికులందరూ, వాదిత్రకుశలులూ, వేశ్యలూ రాముణ్ణి చూడడానికి బయలుదేరాలి. ఇదంతా నువ్వు ఏర్పాటు చేయించు" అని చెప్పాడు. దానిమీద శత్రుఘ్నుడు వెట్టివాళ్ళను వేలకొద్దీ రప్పించి "ఈనందిగ్రామం మొదలు అయోధ్యదాకా మిట్టపల్లాలు సరిచేసి ఘంటాపథం తయారుచెయ్యండి. చల్లనినీళ్ళు వొత్తుగా చల్లండి. తరవాత, దారిపొడూగునా పేలాలూ పువ్వులూ చల్లండి. మార్గానికి రెండువేపులా జెండాలెత్తండి. ఇళ్ళన్నీ అలంకరించండి. ఈపని అంతా సూర్యోదయం అయేటప్పటికి పూర్తి అయిపోవాలి. ప్రజలందరూ దారిపొడూగునా ప్రతీవీధిలోనూ పంచవన్నెల ముగ్గులు పెట్టేటట్టూ, పువ్వులుచల్లేటట్టూ, అరవిచ్చిన పూలదండలు సిద్ధంచేసి వుంచేటట్టూ ఆజ్ఞాపించండి" అని ఆజ్ఞాపించాడు.

దీనిమీద, రాజభార్యలూ, అమాత్యులూ సైనికులూ, సైనికుల భార్యలూ, బ్రాహ్మణులూ, క్షత్రియులూ, పెత్తనదార్లూ పౌరులూ, ధృష్టి, జయంతుడూ, విజయుడూ, సిద్ధార్థుడూ, అర్థసాధకుడూ, అశోకుడూ, మంత్రపాలుడూ సుమంత్రుడూ — ఈమంత్రులూ ఏనుగుల మీదా, రథాలమీదా, గుర్రాలమీదా, పాలకులమీదా, నడిచీ బయలుదేరారు. ఏనుగులనూ గుర్రాలనూ రత్నాలు పొదిగిన స్వర్ణాభరణాలతోనూ పట్టువస్త్రాలతోనూ అలంకరించారు. శక్తులూ యష్టులూ, ప్రాసలూ, ఖడ్గాలూ, పరశ్వధాలూ ధనుస్సులూ మొదలైన ఆయుధాలు ధరించీ రకరకాల జెండాలు పుచ్చుకునీ వెయ్యోసిమంది కాల్బంటు లొక గణంగా బయలుదేరారు. వారి సేనాధిపతులు గుర్రాలమీద బయలుదేరారు. తరవాత, చతురంతయానా లెక్కి కౌసల్యా, సుమిత్రా, కైకా బయలుదేరారు. మొత్తానికి అయోధ్యా నగరం అంతా అప్పుడు నందిగ్రామంలో వుంది. గుర్రపుడెక్కల

ధ్వనితోనూ, రథచక్రాలధ్వనితోనూ, శంఖదుందుభినిర్ఘోషంతోనూ భూమి గజగజలాడినట్టయింది.

అప్పుడు, ఉపవాసకృశుడూ దీనుడూ చీరకృష్ణాజినాంబరుడూ అయిన భరతుడు రాముని పాదుకలు నెత్తిమీద పెట్టుకుని, శ్వేతచ్ఛత్రమూ, హేమభూషితాలైన వింజామరలూ పుచ్చుకుని సచివులతో బయలుదేరాడు. అతనికి ముందు స్వస్తిచెబుతూ బ్రాహ్మణప్రముఖులు నడిచారు. పూలదండలూ మోదకాలూ పుచ్చుకుని వారివెనక మంత్రులు నడిచారు. భేరీమృదంగాలు ఘోరుకలిగాయి. వందిమాగధులు స్తోత్రాలు చేశారు. తీరా ఊరిబయటికి వెళ్లాటప్పటికేమీలేదు. అది చూసి భరతుడు హనుమంతుణ్ణి పిలిచి "రాముడు కనపడడేమీ ? నువ్వు కోతిగుణాలు విడిచిపెట్టలేకపోయినట్టు కనపడుతుంది. కామరూపులైన వానరులయినా రావడంలేదేమీ ?" అని అడిగాడు. దానికి హనుమంతుడు "పరంతపా ! ఇక్కడ భరద్వాజుడూ, అక్కడ ఇంద్రుడూ చెట్లన్నీ సర్వకాలసర్వావస్థల్లోనూ పళ్లతో నిండివుండేటట్టు వరాలిచ్చారు. వారు వానరసైన్యాని కీవిధంగా విందుచేశారు. ఇందువల్ల భరద్వాజాశ్రమంలో కొంచెం ఆలస్యం అయివుంటుంది ; కాని, గంభీరమైన వానరుల కోలాహలం వినపడుతోంది. దానివల్ల వానరసేన యిప్పుడు గోమతీనది దాటుతోందనుకుంటాను. అదిగో, వాలుకినీ నదిలో దుమారం రేగింది చూడు. వానరులీపాటికి సాలవనంలో చెట్లెక్కుతూ దిగుతూ వస్తూవుంటారు. ఆ, ఆ, అదిగో, దూరాన చంద్రబింబంలాగ కనపడుతోంది చూడూ, అదే బ్రహ్మ మానసికంగా నిర్మించిన పుష్పకవిమానం. సమస్తబంధుమిత్రులతోనూ రావణుణ్ణి సంహరించి రాముడది ఎక్కాడు. అది కుబేరునిది. సీతాదేవితో రామలక్ష్మణులూ, స్వకుటుంబాలతో సుగ్రీవవిభీషణులూ ఆవిమానంలో వున్నారు" అని చెప్పాడు.

అప్పుడు "అదిగో రాముడు" అంటూ ఆబాలగోపాలమూ

అక్కడివా రందరూ కోలాహలంచేశారు. అది ఆకాశం అంటింది. గుర్రాలూ ఏనుగులూ రథాలూ ఎక్కివున్నవా రందరూ కిందికి దిగి నుంచున్నారు. భరతుడు ప్రాంజలి అయి నుంచున్నాడు. విమానంలో రాముడు మహేంద్రుడు లాగ కూచునివున్నాడు. అప్పుడు మేరుశిఖ రాన సూర్యుడులా వున్న రామునకు భరతుడు నమస్కారంచేశాడు. వెంటనే రాముని యింగితం గుర్తించి విమానం నేలమీాద వాలింది. భరతుడు రాముణ్ణి సమీాపించి మళ్లీ నమస్కరించాడు. చిరకాలానికి కళ్లబడిన భరతుణ్ణి తీసుకువెళ్లి రాముడు వొడిలో కూచోబెట్టుకుని గట్టిగా కౌగిలించుకున్నాడు.

తరవాత, భరతుడు లక్ష్మణునకూ సీతకూ సమస్కారాలు చేశాడు. తనపేరు చెప్పుకుంటూ మరీ నమస్కరించాడు. తరవాత అతను సుగ్రీవుణ్ణీ, జాంబవంతుణ్ణీ, అంగదుణ్ణీ, మైందుణ్ణీ, ద్వివిదుణ్ణీ, నీలుణ్ణీ, వృషభుణ్ణీ, సుషేణుణ్ణీ, నళుణ్ణీ, గవాక్షుణ్ణీ, గంధమాదనుణ్ణీ, శరభుణ్ణీ, పనసుణ్ణీ కౌగలించుకుని ఆదరించాడు. మనుష్యరూపంతో వున్న ఆవానరప్రముఖులు మిక్కిలీ ఆనందించి భరతుణ్ణి కుశలప్రశ్న చేశారు. అప్పుడు ధర్మజ్ఞుడైన భరతుడు సుగ్రీవుణ్ణి మళ్ళీ కౌగలించుకుని "సుగ్రీవా! మానలుగురు అన్నదమ్ములతోపాటు నువ్వుఅయిదో సోదరుడవు. సౌహార్దంవల్ల మిత్రుడవుతాడు. అపకారం శత్రులక్షణం" అన్నాడు. తరవాత విభీషణుణ్ణి చూసి "మాఅదృష్టంవల్ల నువ్వు సాయంచేసి గొప్పపని చేయించావు" అని ఆదరించాడు. శత్రుఘ్నుడు కూడా ముందు రామునకూ, తరవాత లక్ష్మణునకూ, చివరికి సీతకూ పాదాభివందనాలు చేశాడు.

అప్పుడు రాముడు వెళ్లి విషణ్ణవదన అయివున్న కౌసల్యా పాదాలంటి నమస్కరించి ఆమె మనస్సు కుల్లాసం కలిగించాడు. తరవాత సుమిత్రకూ, కైకకూ చివరికి పురోహితునకూ గూడ పాదాభివందనాలు చేశాడు. పౌరు లందరూ "కౌసల్యానందవర్ధనా! రామా!

నీకు స్వాగతం" అని పలికారు. లక్షలకొద్దీ వున్న పౌరుల చేమోడ్పులు పొటమరించిన తామర మొగ్గల్లా వున్నాయని భరతు డానందించాడు. ఈ ఆనందంతో అతను పాదుకలు తీసుకువెళ్లి స్వయంగా రాముని పాదాలకు తొడిగి "రామా! నా అధీనంలో వుంచిన నీ రాజ్యాం నువ్వు మళ్లీ స్వీకరించు. నేనది జాగ్రత్తగా వుంచాను. ఇప్పటికి నా కోరిక తీరి నా జన్మ సఫలం అయింది. నువ్వు మళ్లీ అయోధ్యకు వచ్చి రాజ్యస్వీకారం చెయ్యడం కంటే నాకేమి కావాలి? నువ్వు బొక్కసం పరీక్ష చేసుకో. ధాన్యశాలలు కూడా పరిశీలించుకో. సైన్యం చూసుకో. నగరం పరకాయించుకో. నీ తేజస్సువల్ల అంతా నేను పది రెట్లు పెంచగలిగాను" అని నివేదించాడు.

భరతు డిలా అనడంవిని వానరు లందరూ ఆనంద బాష్పాలు విడిచారు. తరవాత మిక్కిలీ ఆనందంతో రాముడు భరతుణ్ణి వొడిలో కూచోబెట్టుకుని విమానంమీద భరతాశ్రమానికి వెళ్ళాడు. సైన్యంతో కూడా అక్కడ విమానం దిగి, అతను "విమానమా! ఇక నువ్వు వెళ్ళిపో. కుబేరుని వాహనమై వుండు" అని సెలవిచ్చాడు. వెంటనే అది ఆకాశమార్గాన ఉత్తరంగా వెళ్ళిపోయింది. అప్పుడు రాముడు ఇంద్రునకు బృహస్పతిలా వున్న తన పురోహితుణ్ణి మళ్ళీ పాదాభివందనం చేసి తన పక్కని ఉన్న ఆసనంమీద కూచోబెట్టుకుని ఆదరించాడు.

## ౧౩౧
## రాముడు మహోత్సవంతో అయోధ్య ప్రవేశించడం

ఆశ్రమానికి వెళ్ళాక భరతుడు శిరస్సుపై అంజలి ఉంచుకుని "రామా! మాతల్లిని నువ్వు చాలా గౌరవించావు. నాకు రాజ్యమున్నా ఇచ్చావు. నువ్వు నాకెలా యిచ్చావో అలాగే నీకు నేను మళ్ళీ రాజ్యం యిస్తున్నాను. బలిష్ఠమైన వృషభం మొయ్యవలసిన బరువు లేగదూడ మొయ్యలేదు. అలాగే నే నీరాజ్యభారం వహించలేను.

ఏటిగట్టు ఎప్పటికప్పడే బలపరుస్తూ వుండకపోతే నీటిప్రవాహం తాకి డికి చెడిపోతుంది. అలాగే బహుచ్ఛిద్రాలు గల రాజ్యం మంత్ర గోపనం మొదలైన సాధనాలతో భద్రపరచకపోతే విచ్ఛిన్నం అయి పోతుంది. అశ్వంలాగ గాడిద నడవలేదు. హంసలాగ కాకి యెగర లేదు. అలాగే నీలాగ నేను రాజ్యభారం వహించలేను. చెట్టుపాతు తారు. అది పెరుగుతుంది. పూస్తుంది; కాని కాయదు. ఫలించదు. దానివల్ల ప్రయోజనం యేమిటి? అలాగే నాయన పుత్రకామేష్ట్యా దులు చేసి నిన్ను కన్నాడు. నువ్వు సమర్థుడ వైనావు. అలాంటి నువ్వు నాయన పాలించిన రాజ్యభారం స్వీకరించి మమ్మల్ని ఏలక పోతే యిక ఫలం యేమిటి? ఇక యిప్పుడు నువ్వు, పట్టాభిషిక్తుడవై మధ్యందిన మార్తాండుడు లా వుండడం లోకం చూసి ఆనందించాలి. తూర్యధ్వనులూ, కాంచీనూపురనిస్వనాలూ, గీతశబ్దాలూ విని యిక మేలుకో. జ్యోతిశ్చక్రం ఎంతకాలం వుంటుందో, భూమికూడా యెంత కాలం వుంటుందో అంతకాలమూ నీభూమి నువ్వేలుకో" అని కోరాడు.

భరతుని మాట విని పరంతపుడైన రాముడు "సరే" అని శుభాసనంమీద ఆసీనుడైనాడు. అప్పుడు శత్రుఘ్నుడు పిలిపించగా సుఖహస్తులూ, నిపుణులూ అయిన మంగళ్ళు వచ్చి రామునకూ, లక్ష్మణునకూ, భరతునకూ చక్కగా క్షౌరంచేశారు. ముందు భర తుడు స్నానం చేశాడు. తరవాత లక్ష్మణుడు. అతని తరవాత వరా సగా వానరేంద్రుడైన సుగ్రీవుడూ, రాక్షసేంద్రుడైన విభీషణుడూ స్నానంచేశారు. అప్పుడు రాముడు జడలు విదిలించుకుని స్నానంచేసి గొప్పగొప్ప వస్త్రాలు కట్టుకున్నాడు. శత్రుఘ్నుడు రామునకూ, లక్ష్మణునకూ, భరతునకూ హారాలూ, కేయూరాలూ, అంగ దాలూ మొదలైన రత్నాభరణాలు కూడా అలంకరింపించాడు. తరవాత దశరథుని భార్యలు ముగ్గురూ సీతాదేవికి సకలాభరణాలూ యంగా అలంకరించారు. పుత్రలాలసురాలైన కౌసల్య మిక్కిలీ

ఉత్సాహంతో వానరభార్యల కందరకూ దగ్గరవుండి అలంకారాలు తొడిగించింది. శత్రుఘ్నుడు చెప్పగా సుమిత్రుడనే సారథి సర్వాంగ సుందరంగా అలంకరించి రథం తీసుకువచ్చాడు. వెంటనే రాముడు సూర్యమండలంలాగ భాసిస్తున్న ఆ రథం యెక్కాడు. సుగ్రీవుడూ హనుమంతుడూ స్నానంచేసి, దివ్యవస్త్రాలూ, చక్కని కుండలాలూ ధరించి మహేంద్రశోభతో బయలుదేరారు. సీతా, సుగ్రీవుని భార్యలూ వరాభరణసంపన్నలై నగరం చూడ్డానికి బయలుదేరారు.

ఇక్కడ యిలా జరుగుతూ వుండగా, అక్కడ అయోధ్యలో దశరథుని సచివులు పురోహితునితో కూడా పట్టాభిషేకంవిషయమై ఆలోచనలు ప్రారంభించారు. అశోకుడూ, విజయుడూ, సుమంత్రుడూ కలిసి రాముని వృద్ధికోసమూ, అయోధ్యవృద్ధికోసమూ తీవ్రంగా ఆలోచనలు సాగించారు. "జయశీలుడైన రాముని పట్టాభిషేకం నిమిత్తం కావలసిన దంతా సిద్ధంచేయించు" అని పురోహితుణ్ణి కోరి మంత్రులు రామునకు ఎదురువెళ్ళారు. పచ్చని గుర్రాల రథంమీద సహస్రాక్షుడైన యింద్రుడు లాగ రాముడు గొప్ప రథంమీద బయలుదేరి నగరంచేరుకున్నాడు. అప్పుడు భరతుడు సారథ్యంచేశాడు. శత్రుఘ్నుడు శ్వేతచ్ఛత్రం పట్టాడు. లక్ష్మణుడూ విభీషణుడూ వింజామరలు వేశారు. ఆకాశాన చేరిన మహర్షులూ దేవతలూ చేస్తున్న రామప్రశంస చల్లగా వినబడింది. సుగ్రీవుడు శత్రుంజయ మనే గొప్ప యేనుగుమీద బయలుదేరాడు. వానరవీరులు మానవాకారం ధరించి సర్వాభరణాలూ అలంకరించుకుని తొమ్మిదివేల యేనుగులమీద వెళ్ళారు. ఇలాంటి పరివారంతో రాముడు శంఖ భేరీఝాంకారాలతో మేడలతో మిలమిల మెరుస్తున్న అయోధ్యకు వెళ్ళాడు. సుమంత్రాది మంత్రులు అయోధ్యనుంచి వచ్చి అతణ్ణి కలుసుకుని అభినందించి మళ్ళీ అతనితో బయలుదేరారు. అమాత్యులతోనూ, బ్రాహ్మణులతోనూ పౌరులప్రముఖులతోనూ పరివృతుడై

వుండిన రాముడు చుక్కల్లో చంద్రుడు లా వున్నాడు. బంగారంలా మెరుస్తున్న అక్షతలు పట్టుకునివున్న కన్యలూ, బ్రాహ్మలూ గోవులూ, మోదకహస్తులైన పురుషులూ రామునకు ముందు నడిచారు. రాముడు తనకు సుగ్రీవునితోనూ, హనుమంతునితోనూ స్నేహం కలగడమూ, వానరులు చేసిన సాయమూ, యుద్ధంలో రాక్షసులు చూపించిన బల పరాక్రమాలూ, విభీషణుడు వచ్చి శరణుపొందడమూ, సకృచ్ఛంగా మంత్రులకు విశదంచేశాడు. అదంతా విని అయోధ్యాపౌరులు అత్యాశ్చర్యభరితులైనారు.

ఇంతలో రాముడు అత్యుల్లాసంగా వానరులతో గూడా అయోధ్య ప్రవేశించాడు. వెంటనే పౌరులందరూ ప్రతీయింటిముందూ జెండాలు పట్టుకుని నుంచున్నారు. రాముడు తండ్రి భవనంలో ప్రవేశించాడు. ఇలాగ అతను తండ్రి భవనంలో ప్రవేశించి కౌసల్యకూ, సుమిత్రకూ, కైకకూ మొక్కి భరతుణ్ణి పిలిచి "తమ్ముడూ? అశోకవనికమూ, ముక్తావైడూర్యసంకీర్ణమూ అయిన నాభవనంలో సుగ్రీవుణ్ణి ప్రవేశ పెట్టు" అని చెప్పాడు. వెంటనే భరతుడు చెయ్యిపట్టుకు తీసుకువెళ్ళి సుగ్రీవుణ్ణి అక్కడ ప్రవేశపెట్టాడు. పరిజనులు సుగంధతైలదీపాలూ, మంచాలూ, ఆసనాలూ తెచ్చి శత్రుఘ్నుని సెలవుచొప్పున ఆభవనం అంతా నింపేశారు.

భరతుడప్పుడు "ప్రభూ! రాముని పట్టాభిషేకం నిమిత్తం దూత లను నియోగించు" అని సుగ్రీవుణ్ణి కోరాడు. వెంటనే సుగ్రీవుడు "తెల్లవారేటప్పటికి నాలుగు సముద్రాల జలమూ తీసుకురండి. మీకోసం యెదురుచూస్తూ వుంటాము" అని చెబుతూ రత్నఖచితాలైన నాలుగు బంగారుఘటాలు నలుగురు వానరప్రముఖుల కిచ్చాడు. ఇది వినీ వినడంతోనే వానరులు గరుత్మంతు డెగిరేటట్టు ఆకాశాని కెగి రారు. జాంబవంతుడూ, హనుమంతుడూ, వేగదర్శీ, ఋషభుడూ వెళ్లి అయిదువందల నదుల జలం చేర్చి నాలుగు ఘటాలు తెచ్చారు. సుషే

ణుడు తూర్పుసముద్రజలమూ, ఋషభుడు దక్షిణసముద్రజలమూ, గవయుడు పడమటిసముద్రజలమూ, నళుడు ఉత్తరసముద్రజలమూ తెచ్చారు. ఈసంగతి విశదంచేసి శత్రుఘ్నుడు "ఇక రామునకు పట్టాభిషేకం జరిగించు" అని పురోహితునితో చెప్పాడు.

## శ్రీరామ పట్టాభిషేకం

అప్పుడు వృద్ధుడైన వసిష్ఠమహర్షి బ్రాహ్మణులతో కలిసి సీతతో కూడా రాముణ్ణి రత్నసింహాసనంమీద కూచోబెట్టాడు. వసిష్ఠుడూ, వామదేవుడూ, జాబాలీ, కాశ్యపుడూ, కాత్యాయనుడూ, సుయజ్ఞుడూ, గౌతముడూ, విజయుడూ, కలిసి, అష్టవసువులూ మహేంద్రుణ్ణి అభిషేకించినట్టు సుగంధజలంతో రాముణ్ణి అభిషేకించారు. వారు, ముందు తాము అభిషేకించిన తరవాత, వరాసగా, ఋత్విక్కులచేతనూ, బ్రాహ్మలచేతనూ, కన్యలచేతనూ, యోధులచేతనూ కూడా రామునకు వేదోక్తంగా అభిషేకంచేయించారు. ఇక్కడ యిలా జరిగాక, ఆకాశాన వుండి లోకపాలకులు నలుగురూ, తక్కిన దేవతలూ సర్వౌషధీరసాలతోనూ రాముణ్ణి అభిషేకించారు.

రామునకు శత్రుఘ్నుడు శ్వేతచ్ఛత్రం పట్టాడు. సుగ్రీవుడూ, విభీషణుడూ వింజామరలు వేశారు. ఇంద్రుడు ప్రోత్సహించగా వాయుదేవుడు వచ్చి నూరు బంగారు తామరపువ్వుల దండ రామునకు వేశాడు. ఇంద్రుని ప్రోత్సాహంతో అతను రామునకు సమస్తరత్నాలతోనూ కలిసిన ముత్యాలహారం కూడా యిచ్చాడు. దేవతలూ గంధర్వులూ పాడారు. అప్సరస లాడారు. ఆసమయాన భూమి సకలసస్యాలతోనూ రాణించింది. చెట్లన్నీ పళ్లతో నిండిపోయాయి. పువ్వు లన్నీ సుగంధభరితాలయినాయి. రాముడు, ముందుగా, లక్షగుర్రాలూ, లక్షపాడి ఆవులూ, నూరు ఆబోతులూ బ్రాహ్మల కిచ్చాడు. ముప్ఫయికోట్ల హిరణ్యం కూడా బ్రాహ్మల కిచ్చాడు. అనేకాభరణాలూ, విలువగల

గొప్పవస్త్రాలూ కూడా యిచ్చాడు. రాముడు సుగ్రీవున కొక రత్న హారం యిచ్చాడు. అది సూర్యకాంతిలాగ ధగధగ మెరిసిపోతుంది. అంగదునకు రెండు బాహుపురు లిచ్చాడు. వాటికి వైడూర్యాలూ, మణులూ, రత్నాలూ, వజ్రాలూ పొదిగారు.

రాముడు సీత కొక ముత్యాలదండ యిచ్చాడు. దానికి నవ రత్నాలూ పొదిగారు. అప్పుడు సీత రాముని కేసి చూస్తూ, అతని యింగితం గుర్తించి రెండు గొప్పవిలువగల వస్త్రాలూ, గొప్పఆభర ణాలూ హనుమంతున కిచ్చింది. తరవాత ఆమె తన మెడలో వున్న ముత్యాలహారం తీసి చేతబట్టుకుని, ఇటు రాముణ్ణీ అటు వాన రులనూ చూడసాగింది. అది చూసి రాముడు "సీతా! బలమూ, పరాక్రమమూ, బుద్ధీ — వుండి నీ కెక్కువ ఆనందం కలిగించినవా రెవరో వారి కది యిమ్మన్నాడు. సీత అది హనుమంతున కిచ్చింది. ఆ హారంతో హనుమంతుడు చంద్రరశ్మి తగిలిన శ్వేతాభ్రంలా వున్నాడు. మైందుణ్ణీ ద్వివిదుణ్ణీ వారు కోరిన కోరిక లన్నీ తీర్చి రాము డానందపెట్టాడు. తరవాత మిగిలిపోయిన వానరుల కందరికీ జామారులూ, రత్నాభరణాలూ యిచ్చి సత్కరించాడు.

ఇలాగ, రాముడు విభీషణుణ్ణీ, జాంబవంతుణ్ణీ, తక్కిన సర్వవానర ముఖ్యులనూ రత్నాభరణాలే కాక, ఏమి కోరితే అవి యిచ్చి సత్క రించాడు. తరవాత రాముని సెలవు పుచ్చుకుని వానరు లందరూ కిష్కింధకు వెళ్ళిపోయారు. విభీషణుడు తన కులదైవ మైన లంకాధి పత్యంతో వెళ్ళిపోయాడు. తరవాత రాముడు శత్రువులను జయిస్తూ అఖండయశస్సు ఆర్జించుకుంటూ సకలరాజ్యమూ యథాన్యాయంగా పరిపాలించసాగాడు. మరిన్ని అతను లక్ష్మణుణ్ణి చూసి "తమ్ముడూ! మన పూర్వులు పాలించిన యీ రాజ్యం నువ్వు కూడా నాతో సమంగా అనుభవించు. ఇందుకు తగ్గట్టు నువ్వు యువరాజువై వుండు" అన్నాడు, కాని, యెన్నివిధాల చెప్పినా లక్ష్మణు డందు కంగీకరించ లేదు. అందుచేత

రాముడు భరతునకు యౌవరాజ్యాభిషేకంచేశాడు. రాముడు పౌండరీకం చేశాడు. అశ్వమేధం చేశాడు. అనేకపర్యాయాలింకా అనేకయజ్ఞాలు చేశాడు. ఆజానుబాహువూ, మహాస్కంధుడూ, మహాప్రతాపశాలీ అయిన రాముడు లక్ష్మణుడు తన కనుగుణంగా నడుచుకుంటూ వుండగా పదివేల సంవత్సరాలు రాజ్యపాలనంచేశాడు. భూరిదక్షిణలతో నూరు అశ్వమేధయాగాలు చేశాడు. రాముడు రాజ్యం పాలించేటప్పుడు స్త్రీలు వైధవ్యదుఃఖం యెరగరు. దుష్టమృగభయమూ రోగభీతీ కూడా యెవరూ యెరగరు. దొంగలు పేరుకయినా లేకుండాపోయారు. ఎవరూ ఆపదల పాలుకాలేదు. వృద్ధు లుండగా పిన్నవాళ్లు చచ్చిపో లేదు. ప్రజలు రాముణ్ణి చూసి నేర్చుకుని వొకరి నొకరు ద్వేషించుకో కుండా అందరూ ధర్మంగా నడుచుకున్నారు. అందరూ ఆనందంగా బతి కారు. రాముడు రాజ్యంచేసేటప్పుడు జనులు ప్రతీవాడూ వెయ్యేసిమంది పుత్రులను కన్నారు. ప్రతీవాడూ జబ్బూ, దుఃఖమూ లేకుండా వెయ్యే ళ్లు బతికారు. రాముడు రాజ్యంచేసేటప్పుడు మాట్లాడితే ప్రతీవాడు రామకథలే చెప్పేవాడు. జగత్తంతా రామమయం అయిపోయింది.

చెట్లన్నీ బాగాపెరిగి నిత్యమూ పుష్పఫలాలతో వంగిపోయి వుండేవి. మేఘాలు సమయం తప్పకుండా వర్షించేవి. గాలి సుఖంగా వీచేది. బ్రాహ్మలూ, క్షత్రియులూ, వైశ్యులూ, శూద్రులూ లోభం విడిచి, తమ కులవృత్తులతోనే తృప్తిపడుతూ తమ విధికృత్యాలు నిర్వర్తించు కుంటూవుండేవారు. అప్పుడు జను లందరూ ధర్మపరాయణులై, సత్య వంతులై, సర్వలక్షణసంపన్నులై వుండినారు. రాముడు, తన తమ్ము లతో కూడా సకలవైభవాలూ అనుభవిస్తూ మొత్తం పదివేల పది వందల సంవత్సరాలు రాజ్యపాలనం చేశాడు.

వాల్మీకి రచించిన యీ ఆదికావ్యం చదివినవారూ విన్నవారూ కూడా ముందు పాపవిముక్తు లవుతారు. ఇది ధనధాన్యసంపద్దలూ కలి గిస్తుంది. కీర్తి ఆయువూ వృద్ధిచేస్తుంది. రాజులకు విజయసిద్ధి కలిగి

స్తుంది. కొడుకులు కావా లనే వాడు కొడుకులూ, ధనం కావలసిన వాడు ధనమూ, ఈ రామపట్టాభిషేకం వింటే పొందుతాడు. క్షత్రియుడు వింటే శత్రువులను జయించి రాజవుతాడు. స్త్రీలందరూ రాముణ్ణి కని కౌసల్యలాగా, లక్ష్మణుణ్ణి కని సుమిత్రలాగా, భరతుణ్ణి కని కైకలాగా జీవపుత్రులై ఆనందిస్తారు. ఈ రామాయణం విన్నవాడు దీర్ఘాయుష్మంతు డవుతాడు. ఆర్షమైన యీ ఆదికావ్యం ఎవడు శ్రద్ధగా వింటాడో కష్టా లన్నీ గడిచి సుఖపడతాడు. విదేశాలపాలయినవాళ్ళు బంధులతో కలుసుకుంటారు. కోరిక లన్నీ తీరి ఆనందం అనుభవిస్తారు. ఈ రామాయణం వింటే దేవత లానందిస్తారు. సకల విఘ్నాలూ తొలగిపోతాయి. రాజు జయం పొందుతాడు. ప్రవాసంలో వున్నవాడు ఇల్లుచేరి సుఖా లనుభవిస్తాడు. రజస్వల లైన స్త్రీలు కొడుకులను కంటారు. ఈ రామాయణం పూజిస్తూ యీ రామాయణం వినేవాళ్ళు సర్వపాపవిముక్తులై దీర్ఘాయుష్మంతు లవుతారు. క్షత్రియులు బ్రాహ్మణులకు శిరసానమస్కరించి వారిచేత చదివించుకని యిది వినాలి. అలా వింటే ఐశ్వర్యం వస్తుంది. పుత్రలాభమున్నూ కలుగుతుంది. ఈ రామాయణం అంతా చదివేవాళ్ళ యెడలా, వినేవాళ్ళ యెడలా రాముడు దయాపరుడై వుంటాడు. స్త్రీ లిది వింటే కుటుంబవృద్ధీ, ఉత్తమసుఖమూ, సకలశుభాలూ పొందుతారు. ఇది ఆయుర్వృద్ధికరం. ఆరోగ్యకరం. యశస్కరం. సౌభ్రాతృకం. బుద్ధికరం. సుఖప్రదం. ఓజస్కరమైన యీ ఆఖ్యానం నియమంగా వినాలి. జనులారా! ఇది పూర్వం జరిగిన కథ. మీకు శుభాలు ప్రాప్తించాలి. మీ రిది శ్రద్ధగా చదవండి. విష్ణుమూర్తి మాహాత్మ్యం వృద్ధిపొందాలి. ఇది విన్నా గ్రహించినా దేవత లందరూ సంతుష్టు లవుతారు. రామాయణం విన్నవాడి పితృదేవతలు కూడా సంతోషిస్తారు. వాల్మీకి మహర్షి రచించిన యీ గొప్పగ్రంథం యెవరు ప్రతిమీద ప్రతిచొప్పున రాయిస్తారో వారు అంతిమందు స్వర్గానికి వెళ్ళిపోతారు.